ఉ॥ ఆ ఋషితోడ వచ్చిన మ-హర్షులు దీవన సేయఁ దోయము
గ్ధారలఁ బోలు దానజల - ధారలఁదోఁగు కరంబుల న్నమ
స్కా-రముచేసి భూఁపుడు వి- శాల మనోహర నేత్రయుగ్మ మొ
ప్పారెడు శాంతతోడ రథ - మందునఁ దోడ్కొ-నివచ్చె నాతనిన్. ౨౪౬

తే॥ రత్నమకుట విరాజచ్ఛి . రస్కు-ఁడంతఁ, గమలవదనలు విజయగీ-తములు చదువఁ
జెవులు వాద్యఘోషములచేఁ - జిల్లులువడ, నగరముం జేరెఁ దా ముని - నాథుతోడ

తే॥ పాపమూలంబులౌ చెడు - పనులుచేయు, దొంగలై దుగురం దుంప-దూల్చినట్టి
మునివరుఁడు వసిష్ఠుఁడు వేద-మూర్తి ఋశ్య,శృంగుఁడును రాట్సభ వెలుంగ-జేరినారు

క॥ ఇహమునఁ బ్రాఁజదువులవలె, మహిమగలుగు ఋశ్యశృంగ-మౌనివరుని దా
బహుమాన పూర్వకంబుగ, మహిపతి యుపచారములఁ గ్ర - మంబుగఁ దేర్చెన్.

తే॥ ధర్మమును తపమ్మును మేను♦దాల్చినట్లు, వెలయు పరిశుద్ధమూర్తి! మీ♦లలితకరుణ
వలనఁ దరతర మెడలేక ♦ వచ్చు రాజ్య, పాలనము నెలకొనె నాత♦పము ఫలించె.

తే॥ అనుడు మునివరుఁ డిట్లను ♦ ననఘ! నీవు, వరతపోధను సాయంబు ♦ వడసినాఁడ
వమల కార్యంబులే చేయ ♦ నరయువాఁడ, విట్టి నిను పోలుదురె రాజు♦లెందతేని?

క॥ గిరి నిభ చాప భుజా! నను, కరమరుదుగఁ బిలువనంపు♦కార్యము శ్రేయ
స్క-రమగు హరిమేధమునకొ, మఱి దేనికొ చెప్పవయ్య ♦ మనుజేంద్ర! యనన్.

క॥ కడగానని పెక్కేఁడులు, పుడమిని పాలించి వినుగుఁ ♦ బొందితి సుతులన్.
బడయనయితి రాచతగవు, తడవి నడపు తనయు నాకు♦దయచేయుము నాన్. ౨౫౩

క॥ భువిమాత్రమె? పదునాలుగు, భువనంబుల నేలఁజాలు ♦ పుత్త్రుల నొనఁగం
దవు మఖము నిప్పుడే యిటఁ, దవిలి నడపు మనుచు ముని ము♦దంబునఁ బలికెన్.

పుత్త్రకామేష్టి.

ఆ॥ జన్నమునకు వలయు సామగ్రు లన్నిటి, నిరివిగాఁగ దెచ్చి ♦ పేర్చినారు
చక్రవర్తి శుద్ధ జలమున నీరాడి, శాస్త్రయుక్తి నమరు ♦ సాలఁజేరె. ౨౫౫

తే॥ విధియుతముగమూఁడగ్నులు♦వేల్చియూహు,తులనొసంగుచుఁ బంన్డెండు♦నెలలుజరప
దేవదుందుభుల్ మ్రోసెను♦దివిజులెల్లఁ, బై నిలిచి తృప్తుల మనుచుఁ♦బలికినారు. ౨౫౬

తే॥ వదనములు వికసింప దే♦వతలు కల్వ, పుష్పముల దూసిచల్ల న- మ్మునివరుండు
సుతుల నొసఁగంగఁ దగిన యా♦హుతులవేల్చె, నగ్నికుండంబునందు శా♦స్త్రానుసరణి

తే॥ అంతఁజుట్టి మండెడు వహ్ని♦యనఁగనొప్పు, వెంట్రుకలు నెఱ్ఱని కనులు♦వెలయు భూత
మొండు సుధఁబోలు నన్నంబు♦నిండుగఁ గల, స్వర్ణ పాత్రముతో నటఁ ♦ బైకి లేచె.

తే॥ లేచి యజ్ఞపాత్రములు నుంచి • లీలతోడ, నందె మఱుఁగయి పోనన • యత్తివరుండు
దశరథుంగాంచి యీపాయసం• బుంబు నీదు, భార్యలకుఁ దగు రీతిగాఁ•బంచు మనియె.

తే॥ అతని యాజ్ఞాప్రకారమా • యవనివిభుఁడు, పేశల వినీల గురు కేశ• పాశమును వె
లుంగు మోము బింబాధర•బంగుమీఱు,చుండు కౌసల్య కొక భాగ•మొసఁగినాఁడు

తే॥ కొలఁకులును నదులును వనములును హంస, పిండుఁగల కోసలమునకు విభుఁడు పిదప
మొదటి పద్ధతినే చేతఁ-మోయు దాన, సగము కైకేయి కొసఁగె ని-ర్జరులు పొగడ.

తే॥ శత్రు భీకర బలయుత - చక్రవర్తి, సగ మొసఁగె సుమిత్రకుఁ దొంటి - చందమునను
శత్రువులు నశించిర యంచు-శచివిభుండు, తన్ను బోలు దివ్యులతోడఁ-దవిలి యార్వ.

క॥ ఎడమ దెస శత్రువితతికిఁ, గుడిభాగము తక్కు జీవ - కోటికి నదరన్
గడమయు సుమిత్రకే పద, పడి యొసఁగెఁ బ్రభుండు ప్రజయుఁ - బరితోషింపన్.

తే॥ తురఁగమేధ యజ్ఞంబుఁ ఋ-త్విజులకుఁ జేయు, జన్నమును సక్రమంబుగా-జరగు పిదప
జగములం గాచు బలశాలి -చక్రవర్తి, జనము స్తుతియింప నయ్యాగ-శాల విడిచె.

చ॥ క్రమముగ శాస్త్రపద్ధతిని - కార్యకలాపము పూర్తి కాఁగఁ గ
ష్టములఁ గలంగు ప్రాణులును - సంతసమందెను వాద్యఘోషముల్
తుములముగాఁ జెలంగె గుణ - ధుర్యుఁడు కోసల భూవిభుం డపా
రముగఁ గృపాతరంగములు - రాజిల నిల్చెడు కొల్వు చేరఁగన్. ౨౬౫

ఉ॥ చేయఁగఁ దగ్గ పద్ధతులు - చెప్పెడు శాస్త్రవిధిన్ విరుద్ధముల్
డాయనిరీతిఁ జేయఁగఁ గ - డంగి రమాపతికిన్ సురాళికిన్
దేయములౌ హవిస్సుల ను - దీర్ణత నిచ్చి మహీసురాళికిన్
పాయక హేమవర్షము న - పారముగాఁ గురియించె నిమ్ముగన్. ౨౬౬

తే॥ రాజులకుఁ బాలనము తోడ - రథ గజాశ్వ, ధన విభూషణాంబరములు - తగినరీతి
నిచ్చి వాద్యంపు మ్రోఁతతో-నేగి సరయు, వందు పెంపార నవభృథ - మాచరించె.

సీ॥ భేరులు శ్రేణులై - విన్నంట మునుమ్రోఁగ, బహువిధ వాద్య రా-వములు చెలఁగ
ముత్యాల గొడుగులు - ముదమొప్పఁ బై నిల్చి, నినుపారఁ జల్లని • నీడ నొసఁగ
పలువురు రాజులు - బలసి నల్వంకలఁ, గొలువ వెలలి రాచ - కొలువుచేరి
బ్రహ్మయు సిగ్గిలు - ప్రాఁజదువులగని, యగు గురుపదములు - తగ భజించి

తే॥ దీవనలుగాని గొప్పకీర్తిని వహించు, మునికి ఋశ్యశృంగునకుఁగే-లు మొగిచి దేవ!
యేఁ గృతార్థుడఁ నింక నా•కేమి వలయు? నంచు నింపుమాటల గౌర-వించి మఱియు.

చ॥ పరమ తపోనిధీ! భవద - పారకృపా మహిమంబుచేత దు
స్తర గురు దుఃఖరాశి కడు - దవ్వులకేగెఁ గృతార్థుఁడైతి నం

చరమరలేక పల్కి_స ధ - రాధ్యున కప్పు వికాసమానసుం
డురు గుణుఁడౌ మునిప్రవరుఁ - డొప్పుగ దీవన లిచ్చెఁ బ్రీతిమై. ౨౬౯

ఉ॥ తక్కుమునీంద్ర సంతతి యు- దారగుణుండగు రాజు భ క్తిమై
మ్రొక్కఁగ దీవనల్ సలిపి - మోదమునొందిన ఋశ్యశృంగుతో
నొక్కటఁ గూడి పైనమయి - రొప్పుగ భూపతి చాలదవ్వు పెం
పెక్కఁగఁ బోయి వీడ్కొలుప - నేగె స్వదేశము ఋశ్యశృంగుఁడుర్. ౨౭౦

తే॥ అవలఁ గొన్నినాళ్లరుగంగ- పతని సతులు, గర్భములు ధరియించి వి-క్లమము నొంద
మోములేకాక తక్కంగ-ములును పొంపు, నూనఁ జంద్రసమానలై -కానఁబడిరి. ౨౭౧

## శ్రీ రా మ జ న న ము.

సీ॥ ఉర్వికి రోమాంచ - మొదవఁ బునర్వసు, కటకముల్ మిన్నంది - గంతు లిడఁగ
మాసరాజము చైత్ర - మాసంబుగాఁగ స, వమి తిథులర్ గౌర-వంబు నొంద
సౌమ్యవారము చాల - సార్థక్య మొందంగ, శుక్లపక్షము మతి - శుద్ధిగాంచ
గరుడ పన్నగ సిద్ధ - గంధర్వ కిన్నర - సాధ్య విద్యాధర - సముదయములు

తే॥ నిత్యసూరులు శ్రేణులై - నిలిచి యుత్స, హించి కోలాహలముసేయ - నెడఁదలోని
కలఁకవిడి ధర్మదేవత - యలరు చుండ, జీవకోటి సంతసమునఁ-జెలఁగుచుండ. ౨౭౨

సీ॥ సకల సద్గుణఖని - సన్నుత చారిత్ర, జనుల మేటి కొ - సల్యగనిరు
నొకకాలమునఁ దన - యుదరంబునందు భు, వనముల నణఁగించి - కొనెడివాని
నాల్గువేదములకు - సలువకు మునులకు, మహానుగా నెఱుఁగంగ - రానివానిఁ
గాటుక క్రొమ్మొగ్గుల్ - నీటు చూపుచును తే,జోరూపుఁడై వెల్గు - సొగసుకాని

తే॥ అఖిల శుభలక్షణంబుల - కాలవాలుఁ, దుది మొదలు లేక యెఱుకకుఁ - దోచుశీలు
రాక్షస కులాంతకుని భ క్తరక్షణాఖ్యు, ధర్మసంస్థాపకుని మహో-దార గుణుని ౨౭౩

ఉ॥ మోదముతోడ నార్వసుర - ముఖ్యులు దిక్కుల మింటనిల్చి యిం
ద్రాది దిగీశులు న్నమితు - లై యొగి దీవనలీయ వాయువా
మోదముతోడ వీవఁ బౌర - పొచ్చెముగాంచని కైకపుష్యమిన్.
గాదిలినూను నొక్కరుని - గాంచెను లగ్నము మీనమొప్పఁగన్. ౨౭౪

మ॥ ఋతుధరోత్థిత వృక్షరాజయుత భూ-భృద్వార దుర్వార ప
క్షతులంద్రుంచిన యింద్ర ముఖ్యదివిజుల్ - కైవారముల్ సేయ భూ
పతి ప్రేమంపుఁ గనిష్ఠదేవి సుతు నొ - ప్పంగాంచె నాశ్లేషతో
జత యయ్యెం గటకంబు పావనముగా - సంపూజ్యమానంబుగన్. ౨౭౫

చ॥ పలుపడగల్ ధరించిన కృ - పాళుఁడు శేషుఁడు మోచు భూమియున్
చెలఁగి నటింప వేదములు - చెచ్చెర నాటకమాఁడ గీర్తి రా
జిల వారిరాశికిన్ మఖకు - శీలగుణాన్విత నీలనేత్ర పెం
పలరు సుమిత్రగాంచె సుగు - ణాకరుఁడౌ మఱియొక్కపుత్త్రికున్. ౨౬౬

ఉ॥ ఆడిరి మేనకాదులను - రావళి నీల్గె నటంచు నుబ్బుచున్
బాడిరి కిన్నరుల్ మధుర - భావములన్ సుధఁబోలు పల్కులన్
దీఁడిరి పెక్కువాద్యములు - దివ్యులు వ్యోమము బూరటిల్లఁగా
వేడిరి దైవమున్ భయము - వీడి చరించిరి దేవమానవుల్ ౨౬౭

చ॥ చెలువలు పాఱివచ్చి ప్రభు - శేఖరుతో సుతజన్మ వృత్తముల్
పలికిరి సంతసంబునను - పాడిరి యాడిరి బ్రాహ్మణోత్తముల్
దెలిపిరి జన్మలగ్నములఁ - దేరిన సత్ఫలముల్ జగంబునన్
గలిగిన కష్టసంతతులు - కష్టములొందెడి నంచు నుబ్బుచున్ [illegible]

తే॥ ధర్మ భాల పట్టముగల - దంతిబోలు, రాముజన్మంబు మేషచై - త్రంబు శుద్ధ
నవమితిథి పునర్వసువు ల - గ్నంబు కటక, ముచ్చగతులు నల్వురు పదు - నొకటవారు

తే॥ తగిన పద్ధతిఁబరికించి - తెక్కుముగుర, రీతి జాతకములు పైడి - రేకులపయి
వ్రాసి దేవగురుండును - ప్రస్తుతింపఁ, జదివినారలు తత్సభా - స్థానమందు. ౨౭౦

తే॥ చక్రవర్తి సంతసమున ♦ సరయువునకు, నరిగి స్నానంబుచేసి ధా ♦న్యంబు ధనము
నమితముగనిచ్చి భవ్యవాద్యములతోడ, గురునితోనేగి కొమరులకొమరుగాంచె.

సీ॥ కాంచియుప్పొంగి రోమాంచుడై యేడేఁడు, లుర్వికిఁబన్ను లే కుండుఁగాక!
బొక్కసంబుల తలు ♦ పులు తీసివేయుఁడు, యుద్ధంబు లింక లే ♦ కుండుఁగాక
భూవిభుల్ తమదేశ ♦ ముల కేగుదురుగాక! ధర్మక్రియావృద్ధి ♦ తనరుఁగాక!
తిరునాళ్లచే దేవ ♦ తృప్తి యొప్పెడుఁగాక!, మూఁడువేళల పూజ ♦ మొనయుఁగాక!

తే॥ అగ్రహారముల్ చదుకములాలయములు, వేడ్కవసములు క్రొత్తవి ♦ వెలయుఁగాక!
అనుచుఁ జాటింపఁ జారుల ♦ కాజ్ఞ నొసఁగె, నెల్ల మిాఱిన మెలమి ని ♦ లేశ్వరుండు. ౨౭౨

తే॥ ప్రభువునాజ్ఞను గొని తల ♦ వరులు మంచి, యేనుఁగులనెక్కి తుడుములు ♦ నీడ్చికొట్టి
దేశమందెల్లఁ జాటించి ♦ తెలిపినారు, పురుషులును స్త్రీలు సంతోష ♦ శరధి మునుఁగ.

చ॥ క్రమముగఁ బ్రేమ మీాఱఁగఁ బ ♦ రంపరలై చెలరేఁగెఁ గేక లొ
క్కమొగిఁ జెమర్చి మేలు పుల ♦ కంబులకుం గులకంబులయ్యె వృ
త్తము వినునెల్లవా రెదురు ♦ దాఁకను వారి కొసంగిరెచ్చు ద్ర
వ్యము; భగవంతుఁడే జనన ♦ మందుట వారియెదల్ గ్రహించెనో? ౨౭౪

చ॥ విరివిగ వీథులొప్ప నల ♦ వీట వెలందులు చేటికల్ చెలుల్
తరుణులు పౌరులుం దమి యె ♦ లర్పఁగ నూనెయుఁ జందనంబుఁ గ
స్తురియును నేయి గందవొడి ♦ చొప్పడ వీథులఁ జల్లి ముగ్గులన్
మురువుగఁ దీర్చి పండుగలు ♦ మోదముతోఁ గొనియాడి ర త్తరిన్. ౨౯౦

తే॥ ఇట్లు పౌరులు మదినిండి♦యెల్ల మీఱి, వెల్లివిరియు మోదముతోడ♦వీఁగి యుబ్బి
తనువు లెఱుఁగక పండ్రెండు♦దినములుండ, శిశువులకుఁ బేరువెట్ట వ♦సిష్ఠుఁ డెంచె.

నా మ క ర ణ ము.

తే॥ మొసలి పోరుటచే డస్సి♦పూర్వ జన్మ, పుణ్యమునఁ గజేంద్రుం డాది♦మూల! యనఁగ
వచ్చి యప్పుడె కాచిన నిత్య♦వస్తువునకు, రాముఁడను పేరువెట్టె దూ♦రంబు చూచి.

తే॥ వ్రతములం దెల్ల వేదశా♦స్త్రములయందు, నిత్యవస్తువు నఱచేతి ♦ నెల్లిఁ బోలె
నెఱిఁగిన మునీంద్రుఁ డవ్వాలి♦చిఱుతవాని, కిడియె భరతుఁడన్ నామంబు♦ నెడఁద నెంచి.

తే॥ పుట్టినప్పుడె వంచకుల్ ♦పొలిసినారు, సురలు బ్రదికిరి దుఃఖంబు ♦ ధరణి నీఁగె
ననుచుఁ గాంతి సొగసు బల♦మమరు బుద్ధత,కమరిచెను లక్ష్మణాఖ్య సా♦ర్థముగ వెలయ

తే॥ ముత్తెములె యొకబిడ్డ రూ♦పును వహింప, నందు చెందామరలు విరి♦యంగ నొప్పు
సొబగు గల్లు నిజ్యోతిచే♦సుక్కు నెల్ల, పగ లటంచు శత్రుఘ్నుఁడన్ ♦ ప్రఖ్యయుంచె.

ఉ॥ పొల్లగు మార్గ మింతయును ♦ పొందని పుణ్యుఁడు వేదపద్ధతిన్
బిల్లల పేరువెట్టఁ బృథ ♦ వీపతి చేతులనుండి దానమున్
వెల్లువ లుప్పతిల్లి తగ ♦ నిర్మల నిర్గుణ నిత్య తత్త్వముం
జల్లగఁ గాంచు మానస వి ♦ శాల తరాబ్ధుల నించె న త్తరిన్. ౨౯౧

ఉ॥ నల్లని కల్వ రెత్తు నలి ♦ నంబులు నోజ లిఖించు తీరునం
జెల్లు మనోజ్ఞతం దనరు ♦ జ్యేష్ఠునియందె మహీశ్వరేశ్వరుం
డెల్లకు మీఱుప్రేమము వ ♦ హించె శరీరము ప్రాణ మెప్పుడే
నొల్లవు వేఱువేఱుగ నొ ♦ క్కొక్కటి నిల్వఁగ నన్న చెన్నునన్. ౨౯౨

మ॥ అమృతం బొల్కెడు తొక్కుపల్కులు బెడం - గొ తప్పటడ్గుల్ క్రమం
బమరంగా సలవాటు గొంచుఁ దమి వా ♦ యం బుట్టు నాదిత్యు చం
దమునన్ శబ్దముచేతనే యెదుఁగు వే - ద ప్రక్రియన్ భూమి దే
వి మనస్సంకటముల్ నశింపఁగ వెసం - బెంపొంది రప్పుత్త్రకుల్. ౨౯౩

క॥ నెలతాల్పుఁ బోల్వసిష్ఠుం, డలరుచుఁ జౌలంబు నుపన - యనము జరపి యీ
కొలఁది యనరాని నిలుకడ, గలుగు శ్రుతులు శాస్త్రములును-క్రమముగ నేర్పెన్.

సీ॥ హారుల నెక్కుటయును - కరుల నెక్కుటయును, తేరుల నెక్కుట- నారనేర్పి

తక్కిన విద్యలం - దగు పద్ధతుల నేర్పి, పగఱ జయింప వీ - లగు శరాస
నాది వివిధ సాధ - నాళిం బ్రయోగించు, పద్ధతు లలవాటు - పఱచుచుండ
నాదిదేవుని యంశ -మగు రాముం డనుజుల, తోడ వర్ధిలుచుండం- దొడరి మునులు.

ఆ॥ భూమిదేవి సురలు ♦ పురవాసులును తమ, వ్యథలు దొలంగెం బుణ్య ♦ పాప రూప
కర్మమెల్లం బోలిసెం ♦ గడంకతో నీ-చోటు, వదల మనుచు నటకు ♦ వచ్చుచుండ్రు

సీ॥ భూదేవి నోచిన ♦ పుణ్య ఫలంబుల, నెల్ల వారలు కాంచి ♦ యెలుంగుపల్కు
శ్రీరామలక్ష్మణుల్ ♦ చిత్తముల్ రంజిల్లం, గ్రోవి తంతువుపోలెం ♦ గూడిమాడి
నదులందు మేఘముల్ ♦ నడయాడు వనముల, విహరించుచుందురు ♦ వేడ్క మెయిని
భరత శత్రుఘ్నులు ♦ వరమైత్రి జతగూడి, కడలేని విద్యలం ♦ గఱచుచుపుడు

తే॥ స్యందనాశ్వగజారోహ ♦ ణాదులందు, విహరణాదులందు భుజించు ♦ వేళలందు
నొక్కక్షణమైన నెడంబాయ ♦ కుందువారు, కడంక మమ్మేలు రామలక్ష్మణులంబోలె

చ॥ పరిమళవాయువుల్ పరవు ♦ ప్రాంత వనంబుల కేగి చల్లనౌ
కరుణవసించు సన్మునులం ♦ గాంచి ప్రమోద మెసంగ సంజలన్
మరలుదు రాయయోధ్యకుం గు ♦ మారులు నల్వురు వారిగాంచి త
త్పురజను లుల్లసిల్లుదురు ♦ పొంగుచు వారును గాంచు పైరునన్. ౨౯౭

చ॥ అబలలు వారి దొడ్డ చను ♦ లల్లు వెలుంగు బలంబుగల్గు వీ
ర బలులు, వారిచుట్టములు ♦ రంగుల వారి యెడంద లందు ప్రే
మ బలియనుండు దైవముల - మాటికి వేడుచునుంద్రు రాఘవుల్
ప్రబల చిరాయు రున్నతుల ♦ వర్ధిలంగాం జలిదంద్రులంబలెన్. ౨౯౮

చ॥ శ్రుతి నికరంబుచే నయినం ♦ జూడంగ నెఱ్ఱంగరాని రాఘవుం
డతనిని వెంట నంటి తిరు ♦ గాడెడు లక్ష్మణుండున్ చరించుచో
రతనపుం జెంకియుల్ మొగులు ♦ రక్తకుశేశయ సంకేంబూచి దే
వతల నగంబుతో నరుగు ♦ నైనము యచ్చముగాం గనంబడున్. ౨౯౯

చ॥ నెఱరుచి మమ్ముగాచు నన ♦ నీనతి రాముండు పద్మమోముతోం
దనకెదురైన పౌరుల ము ♦ దంబుగం గాంచుచుం గృత్యమేది? యెవ
ప్పని చెడుగేదియున్ మఱిని ♦ బాధ యెనర్పదుగా? నపీమణుల్
తనయ గుణాఢ్యుల సుతులు ♦ వేడ్కమెయిన్ సుఖులే కదా యనన్.

ఉ॥ నారాయణక పుణ్యరూప! నిను ♦ మా ప్రభుగాం బడయం గొఱంత యెం
డేమియులేక యుండు టను ♦ దే? వచియింపంగ నేల? మా యను
ష్ఠానము నేడు దీప్తులుగం ♦ జొప్పడు భూతలమెల్ల నేలు మా
స్వామిని సౌఖ్యదాయివయి ♦ సమ్మతింజెక్కగు బ్రహ్మకల్పముల్. ౩౦౧

చ॥ అని యిటు తత్పురీజనము ♦ లక్ష్మిలి నాతని కీర్తి నిండఁ గీ
ర్తనములు సల్పఁ దమ్ములు ప ♦ దమ్ముల చాయ వసించి సంస్తుతుల్
ఘనరుప సర్వలోకులకుఁ ♦ బూజ్యులు నాయకులౌ త్రిమూర్తులన్
దనరఁగ నాజ్ఞ సద్గుణ ♦ ధాముఁడు రాముఁడు భూమి వర్ధిలెన్. ౩౦౨

తే॥ రాజరాజగు దశరథ ♦ రాజమౌళి, ధరణియెల్ల నేకాతప ♦ త్రంబు నీడఁ
దనర జయభేరిస్ఫూర్తరో♦దసియునిండ, మునులు పొగడ నానందాబ్ధి♦ మునుఁగుచుండ

౬. అర్పణ పటలము. (౨౪)

చ॥ సనలుతలిర్చు కల్పక వ ♦ న ప్రభ మించెడు స్వర్గ పత్తనం
బున వసియించు నెల్లరును - పొందికఁ జేరెడు శంక గొల్పి నె
మ్మనమున కూహకందక య - మర్త్య జగంబునకంటె నున్నతిం
దనరిన రత్నమండపము ♦ పొల్పు వహింప నరేంద్రుఁ డుండఁగన్. ౩౦౪

తే॥ అమల మార్దవ భూరి సిం ♦ హాసనమున, రమణ నుండు భూపతిని చా♦రణులుగాంచి
యింద్రుఁడని తొట్టతొలి సంశ ♦ యించి పిదప, వేయికనులు లేవని శంక♦వీడినారు

కౌశికుఁడు దశరథుని గాన వచ్చుట.

చ॥ జగములఁ బ్రాణులన్ సురల ♦ సారసగర్భునితోడ వేఱుగా
నెగడ సృజింప నెమ్మదిని ♦ నిట్టలుకన్ మొనకట్టినట్టి ప
ద్మగలుగువాఁడు బ్రహ్మఋషి ♦ దుర్దమ సింహపరాక్రమాఢ్యుఁ బు
ణ్యగుణ విభూషణున్ దశర ♦ థావని నాథుని గాన వచ్చినన్ ౩౦౬

చ॥ గురుమతిఁ బద్మసంభవుని ♦ కూర్మి నెదుర్కొను నింద్రుపోల్కి, భూ
వరుఁ డురమందు దాల్చిన ప్ర ♦ భా మణి హారము సూర్యుఁబోలె నం
బరమును కాంతిమంతముగ ♦ మార్చఁగ వైళమలేచి, యమ్మునీ
శ్వరు పద పంకజంబులకుఁ ♦ జాఁగిలి మ్రొక్కె సభక్తికంబుగన్. ౩౦౭

ఉ॥ మ్రొక్కి యనామయం బడిగి ♦ భూరిమణీమయ సింహపీఠిఁ బెం
పెక్కఁగ నుంచి పాదముల ♦ నిచ్చ భజించుచుఁ గేలుమోడ్పుతో
స్రుక్కె మదీయ పాపములు ♦ శుద్ధ చరిత్రులు మీరు వచ్చుటన్
నిక్కము నేను ధన్యుఁడ ము ♦ నిప్రవరా! సరివారిలోపలన్. ౩౦౮

ఉ॥ మోదముతోడ నే వలచి ♦ మ్రొక్కుటకున్ దగునట్లు మీర లెం
తో దయనిట్లు రాఁగతము ♦ యోచనచేసిన దేశభాగ్యమా?
కాదు; మదీయసత్కృతులు ♦ కారణమా? యనఁగాదు నాదు; వం
శోదిత పూర్వభూవరుల ♦ యుత్కట పుణ్యఫలంబె యయ్యెదున్. ౩౦౯

సీ॥ అనుచు భూవరుఁడు ప్రి ♦ యంబు లాడిన గాధి, నందనుం డిట్లను ♦ నయము మీఱ
శత్రు విమర్దన ♦ శాత కృపాణ ద, క్షిణహస్త! నను పోలు ♦ మునివరులును
త్రిదివవాసులు నొక ♦ డెప్పరంబును పొంది, రేని నిక్కము వచి ♦ యింతు వినుము
వాసిత సమస్త మ ♦ హాద్రి విలాసంబు, వెల్లని చల్లని ♦ వెండి కొండ

తే॥ పాల సంద్రంబు పద్మజు ♦ పట్టణంబు, కల్పక వికాస భాసి స్వ ♦ ర్గంపు నగరి
యింపు గులుకు మేడలుగల♦యీ యయోధ్య, తక్క వారికి నేఁ బొక్క♦దిక్కు గలదె?

సీ॥ రాజ శిరోమణీ! ♦ రమణీయ కిసలయ, ప్రచయ సుందర సుర ♦ పారిజాత
వృక్షంబు గందంబు ♦ వీచుచు మధుకణం, బులు బొట్లు బొట్లుగా ♦ నొలుకుచుండఁ
జల్లనౌ నీడ వి♦శ్రాంతిఁ జెందుట వీడి, నీ యొక్కటి గొడుగు ♦ నీడఁజేరి
తమ కొఱంతలఁదెల్పి ♦ తగు సాయ మర్థింపఁ, గులగిరి నిభభుజుఁ ♦ గ్రూరచరితు

తే॥ శంబరాసురుఁ గులముతోఁ♦ జావఁ బొడిచి, వశము గావించికొని నాఁడు ♦వాసవునకు
నీ వొసంగినదే కాదె ♦ నేఁడుగూడ, నతఁడు పాలించుచున్నట్టి ♦ యమరజగము.

కౌశికుఁడు యజ్ఞరక్షణార్థము రాముని గోరుట

చ॥ నలువుగ భేరి వాద్యము ల ♦ నారతముం జగడించుచుండు మో
సల గల భూవిభుండు ముని ♦ చంద్రుని వాక్యము లాలకించి ము
జ్జలధి మునింగి పొంగి ఋషి ♦ సత్తమ! రాజుగనుండి పొందు స
త్ఫలమును గంటి నింకఁ జలు ♦ పందగు దాని విధింపుఁ డర్మిలిన్ ౩౧౨

చ॥ అనవుడు మౌని యిట్లను జ ♦ నాధిప! నేనొనరించు జన్నమున్
బనివడి యోగి వర్యుల త ♦ పంబున క య్యరిషట్కముంబలెన్
దనుజులు విఘ్నముల్ చలుపఁ ♦ దారొకను వారలు, దాని మాన్ప నీ
తనయులలోన జ్యేష్ఠుని ము ♦ దంబున నా వెనువెంటఁ బంపుమా. ౩౧౩

సీ॥ అని ప్రార్థించు ♦ యమునికై వడి వేఁడిఁ, తపియింపఁజేసిన ♦ తపసి పలుకు
నెఱుకు నాటఁగ నీఁటె ♦ నెఱివిన పుంటిలోఁ, గొఱవిదూర్చిన యట్లు ♦గ్రుచ్చి చెవులఁ
గాఁడినయంతన ♦ కాలదండముఁ బోలు, నాయుధపాణియై ♦ నవనిభర్త
మనసునఁ బొడమిన ♦ పెనుచింత పట్టి వె, ల్పలికిఁద్రొబ్బఁగ ప్రియ ♦ ప్రాణ వితతి

ఆ॥ ఉదరి వోల కరణి ♦ నూఁగగఁ జనుపొంధుఁ, డెడను నేత్రములను ♦ పడసి మరల
నవియ నవసి కుములు ♦ ననువున మిగుల సం, తాప మొంది కుందెఁ ♦దల్లడిల్లె. ౩౧౪

సీ॥ పెర యూరుక్రియఁదేనె ♦ కురియు సుగంధ మా, లిక ధరించిన ప్రభుఁ♦డొక విధముగఁ
జింతను మది నడం ♦ చి కొని కౌశికుఁ గాంచి, యిట్లను మునివర్య! ♦యితఁడు బాలుఁ
డకృతాస్త్రుఁ డిదియ మీ ♦యాజ్ఞ యేని వినుండు, గంగాధరుండును ♦ కమలభవుండు
నిర్జరేశ్వరుఁడును ♦ నిలిచి యొక్కొక్కరై, గుమి గూడియేనియుఁ ♦ గూర్చునట్టి

ఆ॥ విఘ్నతతికి మాఱు విఘ్నంబుచేసి ని, ర్విఘ్నముగ నొసర్తు ♦ వేల్మి మీఱు
బాలు మాట మాని ♦ బయలు దేఱుండు మీ, వెంట నిపుడ సేస ♦ వెడల వత్తు. ౩౧౫

సీ॥ పరమేష్ఠి సృష్టికిఁ ♦ బ్రతిసృష్టి చేసిన, కౌశికుఁ డతఁడు వా ♦ క్యమ్ము వినుచుఁ
బెను కిన్కతో లేవ ♦ విబుధులు ప్రళయము మం, చును కాదనుచు శంకఁ ♦ జొచ్చినారు
రవి మండలం బంబ ♦ రంబున మఱుఁగయ్యెఁ, గలఁతనొందినవి జ ♦ గంబులెల్ల
దిక్కులఁ దిమిరంబు ♦ నిక్కి-కావులు గప్పెఁ, గుల పర్వతంబులు ♦ చలనమొందె.

తే॥ మునికిఁ గనుబొమల్ నొసటిపై ♦ ముడుఁగుపడియెఁ, బెదవు లదరెను జేగుఱు ♦ బెరసి కనుల
నిప్పుకలు రాలె సభయెల్ల ♦ నిలుకడ చెడె, తోడనే సర్వ సైతము ♦ దోఁచెనంత.

తే॥ ఇంతయును వసిష్ఠుఁడుగాంచి ♦ శాంతిఁబొందుఁ, డనుచు గాధేయువేఁడి జ ♦ నాధుతోడఁ
బలుకు సుతుఁబుపుఁ బొందింప ♦ సలసికాసి, మేల్గు వచ్చుకాలము నాఁప ♦ మేరయగునె?

తే॥ వానరురియంగ వెల్లువల్ ♦ పసుపులెత్తి, యంబునిధిఁ జేరుచందాన ♦ నలవిలేని
యఖిలవిద్యలు తమయంత ♦ సరుగుదెంచి, నీకుమారుఁ జేరెడి వేళ ♦ నేఁడు కలిగె.

తే॥ అనుడు కులగురు వాక్యంబు ♦ లాలకించి, యాజి విజయశీలుం డాజి ♦ యరిగి రాముఁ
బిలువుఁడన భటు లేతెంచి పిలుచునంత, బుద్ధిమద్వర్యుఁ డరుదెంచి ♦ పొంత నిలిచె.

రామలక్ష్మణులు కౌశికు వెంటఁ జనుట.

ఉ॥ తమ్ముని తోడ వచ్చు గుణ ♦ ధాముని రాముని చూపి మాని ర
త్నమ్మ! మదీయ పుత్త్రులకుఁ ♦ దండ్రివి మేలగు తల్లివీవె ప్రే
మమ్మున నొప్పగించితిని ♦ మానుగఁ గావుఁడు వీరిచేత మీ
కెమ్మెయి కార్యముల్ వలయు ♦ నెల్లను గైకొనుఁ డంచు నిచ్చినన్. ౩౨౦

చ॥ విమలచరిత్రుఁడైన ముని ♦ వీరుఁడు భూవరుఁ డొప్పగించు నా
సుమతులఁ గాంచి మున్ను మదిఁ ♦ జొన్పిన కోపము వీడి ప్రేమతోఁ
దమిఁగొని దీవనల్ సలిపి ♦ దగ్గఱి పుత్త్రకులార! మేటి జ
న్నము మన మూని పూరితి యౌ ♦ నర్థమ? యంచుఁ జనం దొడంగినన్.

చ॥ జగములఁ గాచు రాముఁడు ని ♦ శాత కృపాణము సవ్యపార్శ్వమం
దు గడఁకఁ దాల్చి గొప్ప మల ♦ దోయిని పోలిన యున్నతంపు దో
ర్యుగమున సత్యధర్మముల ♦ యొప్పు వహించి కొలంతకాని యా
శుగ యుత తూణముల్ చెరివి ♦ నూటిగఁ దాల్చె జయిష్ణు చాపమున్.

తే॥ తన్ను పోలిన తమ్ముఁడుఁ ♦ దాను జనకు, తీపిప్రాణముల్ వెలిబైలు ♦ దేఱు కరణి
నియతు గాధేయు వెన్నంటు ♦ నీడ వోలెఁ, గాంచనమయ దుర్గంబులఁ ♦ గడచి చనిరి.

చ॥ వరములు వెల్తిపోవక త ♦ పం బొనరించెడు వారు చేరు ని
ర్జర నగరంబులుంగ నవతు ♦ రాని పురంబును దాఁటి నృత్య మం
దిర నట దంగనా పద వ ♦ నేజ రట ద్వర కింకిణీ సమా
భ్యరు రుత హంసయుక్త సర ♦ యూనదిఁ జేరిరి వార లంతటన్. ౩౨౪

సీ॥ చెఱకులు గాలికి ♦ నొరయఁ దగిలి పోఁక, మ్రాకులఁ గాఁచిన ♦ మధురసంబు
గనిమలఁ బారలు పరా ♦ గానులఁ దిరుగాడు, హరిణాక్షులును కృశో♦ దరలునైన
పొలఁతులు పొలుపార♦ముడిచి యల్లిన దీర్ఘ, కుంతలములఁ బోలు♦కొమరుఁ దేఁట్లు
పసియింప నిరవైన ♦ వనమొందు గని యందు, నడసి యారాతిరి♦ విడిసి యవలఁ.

తే॥ బెను మొగుళ్ల తండములు కొ♦మ్మునను గలిగి, ముఖపటము గల దంతినా♦ మొనయు నుదయ
శిఖరి శిఖరంబు మీఁదికిఁ ♦ జిలుకరంగు, వాజు లేడెక్క నది దాఁటి ♦ పయన మైరి.

చ॥ క్రతుభుజులెప్పు నాలుకలఁ - గ్రొను నాహుతిసేయ నిమ్ముగాఁ
గ్రతుముఖమందు లేచు పొగ - క్రమ్మిన యొక్క వనంబుఁ గాంచి స
న్మతిఁ బురుషోత్తమోత్తముఁడు - నృపతి పుత్త్రుఁడు రామచంద్రుఁ డో
యతివర! యీవనం బెవరి - దర్శిలి నాకు నెఱుంగఁ జెప్పవే. ౩౨౬

## ౭. తాటకవధ పటలము. (౨౬)

కవిరాజ విరాజితము.

అనవుడుఁ గౌశికుఁ డిట్లను మారుఁ డొ - కప్పుడు మోహనబాణము నీ
శుని పయి నేయఁగ నాతని నిప్పులు - జొబ్బిలు నేత్రమునుండి మహా
శని క్రియ లేచిన యగ్నిదహింపఁగ - సొరగు వాని శరీరము మం
డిప యదికోలె ననంగుఁడె యయ్యెఁ గ - డింది మగండగు కంతుఁ డిటన్. ౩౨౭

తే॥ భవుఁడు మదనుని దహియింప♦వానియొడలు, బూదియై యుటఁ జిందుటఁ♦బొలిచె నిద్ది
యంగదేశంబనెడిపేర ♦ సార్థకముగ, విశ్వవినుత సుగుణచయ! ♦ వేదనిలయ! ౩౨౮

ఉ॥ ఆశయుఁ బాశముల్ మొదలి - కంట నశింపఁగ జన్మదుఃఖముల్
నాశమునొంద దత్త్వము న - నారత చింతనసేయు జ్ఞానులే
యీశు భజింతు రట్టి యగ .. జేశుఁడె యిందు తపించె నన్న నీ
దేశ మహాత్త్వసంపద ను - తింపఁగ నెవ్వారికేని శక్యమే? ౩౨౯

చ॥ అని ముని పల్కనచ్చటికి ♦ నచ్చెరువందుచు నేగి సంతసం
బున నెదురైన సచ్చరిత ♦ ముఖ్యధనంబుగఁ గల్గు మానులన్
గని మది సంతసించి గుణ ♦ గణ్యులతో నట నాఁడు వుచ్చి వే
ఁగునుఁ దుదయాద్రి నెక్కుతతి ♦ నేగి మరుస్థలిఁ జేరి రొక్కటన్, ౩౩౦

## మరుభూమి వర్ణనము.

మానిని॥ భానుఁడు మేదిని సారము పూర్తిగ - బాగుగ లాగఁ దలంచి పనిం
బూని జయధ్వజమెత్తి చరించెడు ♦ పోఁడిమి గ్రీష్మమె కాక మఱే
దేని ఋతుస్థితి లేమి నిటన్ జ్వాలి ♦ యించు మహాతాపనుఁడే మొగి నా
హీన పరిస్థితిఁగాంచ నెదం దపి - యించును నిర్వ్రీడుచుం గనులన్. ౩౩౧

కవిరాజ॥ ఉడుకును జిహ్వయు నచ్చటి వేఁడిమి ♦ నొయ్యనఁ బూర్తిగఁ జెప్పినచో
నుడుకును పర్విన చీఁకటి, యండము - లుప్పర మారట మొందును వే
యుడుకును సూర్యుఁడు పుట్టినచో మఱి - యుష్ణను మించులు పిడ్గులు పై
నుడుకు సమస్తము సన్న మతెయ్యది ♦ యుత్తల మందక యుండు మహిన్?

చ॥ కదనమునందు శౌర్యమున - ఖడ్గ శరాదిక సాధనంబులం
బొదలుచు బాణ వర్షమునఁ - బోరెడి నేరుపు లేని వంచకుల్
గనురుచు నుఁటచేఁ బరువు ♦ గర్వముఁ గోల్పడు నీరవర్ష్య నె
మ్మది బలెఁ దాప మారుకయె ♦ మండుచునుండు సరంబు నచ్చటన్ ౩౩౩

ఉ॥ అవ్వన భాగమందరయ ♦ నాకులు రాలి మొవళ్లు, భూతముల్
నవ్వడి నోరు విప్పుకొను ♦ చాడ్పునఁ జీలిన వృక్షరాజముల్
చివ్వన వంశముల్ ప్రికులఁ - జిందిన ముత్తెములున్ ఫణిస్ఫటల్
నెవ్వడి ప్రీల నివ్వటిలి ♦ నిండిన కెంపులు నుండు దండిగన్ ౩౩౪

మ॥ ధరణీదేవియుఁ బోవఁజాల దెటులున్ ♦ దత్తాసనమున్ వీడుచుం
బరువుల్ వాఱ దరణ్యదేవతయు నా - భంగంబులంబొందు సం
చర వీథిన్ రవితేరు పాఱ దటఁ బ - ర్వం జాలవున్ మేఘముల్
నెరయంజాలదు చల్లగాలియు సనం ♦ జిత్రంబు కాదయ్యెడన్ ౩౩౫

ఉ॥ ధారణి బీఁటవోఁ గనుల - వంప్టలనుండి విషాగ్నిఁ గ్రక్కు శే
షోరగ శీర్ష రత్న కలి -కోత్కర కాంతులు బీఁటనుండి తో
ల్కారు మెఱుంగు లట్లు నెడ - లం గనుపట్టు ధరిత్రి దేవికిం
దీఱని మేనిపుండ్ల వలె - దేవడి యుట్టని నీచులై వడిన్ ౩౩౬

చ॥ అడఁపఁగరాని యాఁకట మ - హావ్యథనొందెడు పెద్దపాము తా
నెడముగ నోరువిప్పఁగ, ది - నేశుని తీక్ష్ణ మయూఖపాళిచే
నుడికిన దంతియొండు తల - నొక్కట దాఁచుకొనం దలంచి పే
రడలున గీఁకవెట్టుచుఁ ద - నంతఁ జొరంబడు నీడ యన్మతిన్ ౩౩౭

చ॥ అనుపమ తీక్ష్ణ మూర్తియగు - నగ్ని మహాశయుఁడేలు నయ్యెడా
రిని గల కాకముల్ కరులు - ప్రేలుచు నాశిలి నల్లబొగ్గులై

పానుపడి యుండుటల్ గనఁగఁ - బోలు సభస్థ్సల మెల్లఁ బర్వి యే
ర్చిన బడబాగ్నిఁ గాలి యిలఁ - ద్రెళ్లిన మబ్బుల తున్కలో యనన్ 33౮

ఉ॥ అమ్మరుభూమి సంచరిలు - సట్టి మరీచిక గుంపు లారయన్
గ్రమ్మిన వేఁడి యందదరి - గ్రాసి సభస్థల మంటునేని స్వ
ర్గమ్మును మాఁడునంచు నను - కంప సురావళిపైఁ గదించి తా
నిమ్మగఁ బశ్చిమాధిపతి - యొప్పుప డిగ్గిప రీతిఁగన్పడున్ 33౯

ఉ॥ వేఁడిమి నుండి తోఁచి పెను - వీఁకను పర్విన యెండమావు లా
పాడరి మండుచున్న వన - పాలుఁడు నేసఁగిఁ గూరుచుంటకై
పోఁడిమిఁ జర్చచేసి వడిఁ - బూన్చిప బంగరు కోడు లెత్తుగాఁ
గూడిన స్ఫాటికాసనము - కోరిక నిల్పిన శేవ దోఁచెడున్. 3౪౦

చ॥ కడు వగ నింప సేతువగు - కర్మములం దిగఁద్రోచి యవ్వలం
గడవఁగరాని ముప్పగలు - గండగు కోటలదాఁటి మోక్షముం
బడయఁగ నెంచువాని మది - భాతిఁ బసిండి పణంబు గోరు రో
పడఁతుల శూన్య మానసము - వైఖరి ధారణి సారహీనమౌ. 3౪౧

ఉ॥ ప్రేలిన పక్కటా ళ్లనసి - బీఁటలు వాఱిన యూయెడారి పా
తాళము దాఁక ద్రోవవడి - తక్కక పెద్దగఁ గానవచ్చుటన్
వాలిన యెండఁ దాళుకొన - భారము దోఁపఁగ రాగరత్న భో
గాలి చెలంగు శేషు నిల - యంబు చొరం దగియుండు నెప్పుడున్. 3౪౨

ఆ॥ ఇట్లు సెగలు లేచి - యొడరిచ్చు మరుభూమిఁ, జేరినంత వాని - పేరు గొప్ప
శక్తిమంతు లయ్యు - సౌకుమార్యము గల, వారు గానఁ గష్టపడుదు రనుచు.

ఆ॥ ఎంచి వారిఁ గాంచ - నింగితజ్ఞులు ముని, యంఘ్రి పంకజముల - నాశ్రయింప
బ్రహ్మసృష్టియొప ♦ పరమవిద్యలరెంటి, వారి కపుడు నేర్పె ♦ వాంఛతోడ. 3౪౪

క॥ మనమున వానిని వారలు, మననం బొనరించు నంత ♦ మరుభూమియుఁ జ
ల్లని తేటనీట నడచిన, యనువయ్యెను రాముఁడిట్టు ♦ లను సన్మునితోన్. 3౪౫

ఉ॥ కౌశిక మౌనిచంద్రమ! త్రి ♦ కాల విదుండవు తెల్పుమయ్య యీ
దేశము శేలపూవులను - దివ్యనదిన్ జటఁ జుట్టినట్టి గౌ
రీశుని యగ్ని నేత్రమున ♦ నిట్టులు పాడగునేమి? దుష్ట భూ
మీశుని నేల కన్న నిది ♦ యెక్కువ నాశిల హేతువేదొకో?. 3౪౬

## తాటక వృత్తాంతము.

ఉ॥ నావుడుఁ గౌశికుండు రఘు - నాథుని ప్రేమను గాంచి యిట్లనున్
భూవరపుత్త్రి! సత్పురుష! ♦ ముఖ్యులఁ జంపి భుజించి వేయు నా

గావళి చేవగల్గి యము • కంటె భయంకర రూపమొంది దు
ర్భావముతోఁ జరించు నొక పాపపు టింతి చరిత్ర చెప్పెదన్. ౩౪౭

చ॥ జగములు వింతనొందు బల • శాలి కుబేరు కులంబువాఁడు మ
త్తు గలుగ కుండువాఁడు గజ • దోర్బల యుక్తుఁడు వహ్నివంటి కి
న్క గలుగువాఁడు జంతు వయి • నం బనుకంప యొకింతయేని లో
నగపడకుండువాఁడు భువి - యందు సుకేతుఁడనం బ్రసిద్ధుఁడౌ. ౩౪౮

ఆ॥ సంతులేని చింత • మంతనమ్మున సుకే, తునకు నలము కొనఁగ • మొనసి మూఁడు
మూర్తులందు మొదటి • మూర్తిఁ బద్మాసను, గూర్చి చేసెఁ దపము • కోరి తడవు

తే॥ శాస్త్రవిశ్రుత సంపన్న! • సజ్జనాభి, రామ! ప్రాఁ జదువులగని • బ్రహ్మ యతని
యెదుటి కేతెంచి సకోర్కి • యేది యనిన, బుత్రహీన దుఃఖమును దీర్పుమని వేఁడె.

చ॥ కొమరులు నీకుఁ గల్గ రొక • కూఁతురు గల్గును లేఁతనెమ్మి మై
కొమరు వహించి లక్ష్మివలె • గోముసనొప్పుచు వేయి మత్తనా
గముల బలంబుగల్గి త్రిజ • గంబులఁ బేరువహించు నంచు నా
కమలభవుం డొసంగి మఱుఁ - గం జనియెన్ దన యిమ్ము చేరఁగన్. ౩౪౯

చ॥ వనజభవ ప్రసాదమున - వానికిఁ గల్గిన పుత్త్రి లక్ష్మితే
వను క్రమరీతి గోముగను - వర్ధిలి పెండిలి యీడు నొంద నొ
ప్పిన వరుఁడెవ్వఁ డబ్బునని - పేరిమి నారసి తండ్రి, సుందుఁడన్
తనకులమందు మేటి గుణ - ధన్యున కచ్చెలిఁ బెండ్లి సేసినన్. ౩౫౦

తే॥ మేటి రతి మన్మథులఁ బోలు-మిథున మద్ది, యనఁగ సుందుఁడు మోహిని-సెవయుసుశతి
తాటకయు రేయుఁ బవలు మొ-దలు తుదియును, లేదనఁగఁ గూడి తేలిరి-మోద జలధి.

తే॥ చాల దినములు గడవ నా-చామయంతఁ, గాంచె మారీచు బలుమాయ-కాని సత్త్వుఁ
బడసె గిరి నిభ బాహు సు-బాహు మల్ల, వీరు జగముల ప్రాణులు - భీతి నొందఁ.

ఉ॥ వారలు మేటి మాయయును - వంచనయున్ దులలేని యుద్ధనం
చార చణత్వమున్ గలిగి - చాతురిఁ దల్లికిఁ దొమ్మిదంతలై
మీఱినవారికే నెఱుఁగ - మేవడి చాఁ సరిరీతి వర్ధిలన్
దేఱిన మేటి సుందుఁడు మ - దించెను సంతసమంది యుబ్బుచున్. ౩౫౧

చ॥ చెడుగులు మేరమీఱి వెసఁ - జేయు సురారుల యోర్వరాని దుం
దుడుకులు మూలముట్టుగను - దోరఁగ నంబుధి తోయమంతయుం
బుడిసిటఁ బట్టి త్రావిన త - పోధను నాశ్రమవాటిఁ జేరి య
క్కడి తరుజాలము ల్వెఱికి - కాసట బీసట చేసి యంతటన్.

మ॥ రమణీయ స్థితిఁగూర్చి వాటికి మునీం - ద్ర ప్రేమకరం బూర్ణపా
త్రములై యొప్పెడు కృష్ణసార రురు నా - రంగాదులన్ సాధు జీ
వములం జంపి భుజించి సుందర తరు - వ్రాతంబు భంజింపఁ గో
పమునం గుంభజుఁడట్లు చూడ నతఁడున్ - భస్మంబయ్యె నాశిలెన్. ౩౫౭

తే॥ సుందుఁ డీల్గుట యూతని- సుదతియైన, తాటక యెఱింగి యగ్ని వి - ధాన మండి
యమ్మునిని వినాశమొనరింతు-ననుచుసుతుల, గలుచుకొంచుఁదదాశ్రమ-స్థలికిఁజనియె

చ॥ పిడుగుల తోలయాగ్నియును - భీకరవాయువు బెగడిల్లఁగా
వడఁకి సురాళి మోములును - వాడ రవీందులు త్రోవఁదప్ప మిం
చడరు మొగుళ్లు సంచలన - మంద ధమీా యని యండగోళముల్
బెడియుచు బీటలెత్త వడిఁ - బేర్చుచు నార్చుచు డాయునంతటన్. ౩౫౮

ఉ॥ ద్రావిడమన్ సముద్రము సు ♦ దారమతిం దయచేసి నాతఁడా
పావక సన్నిభుండు నిడు - పాటు క్రుధాగ్ని మిడుంగుఱుల్ వెసన్
గ్రోవుల పోల్కి వెల్వఱచి - క్రూరులు మీరలు దైత్యులై చెడం
జావుఁ డటంచు వజ్రనిభ- శాప వచస్సుల నాడినంతటన్. ౩౬౦

ఉ॥ రాగి కరంగి వెల్వడిన - రాణ బయల్వడు కోపవహ్నితో
నేగి జగంబులం గలఁచి - యేర్చి నరాసురకోటిఁ గూల్చుచున్
సాగి సమస్తజీవులను - చంపి భుజించుచుఁ గ్రూరకర్ములై
క్రాఁగి చరించు నీచులగు ♦ రక్క-సులైరి రయమున ముప్పురున్. ౩౬౧

తే॥ అట్టు లమ్మునిశాపంబు ♦ నధిగమించి, క్రీడనుఁ బతియొనరించు శ ♦ క్తియును లేమి
నేగి వారు సుమాలితో - నేము సేసుఁ, జెలఁగ కొడుకు లమర వాస ♦ చేసికొనిరి.

ఉ॥ తప్పుడు చెయ్వులం జలుపు ♦ తాటకపుత్రులు వారితోడఁ దా
నొప్పు రసాతలంబునన ♦ యుండి, దశాస్యుఁడు గాంచి కూరిమిం
గుప్పుచు మామ లంచుఁ దము - గొప్పగ మిక్కిలి గారవింప, వా
రెప్పటి హింసతోడ భ్రమి - యించిరి పెన్ సుడిగాలి పోలికన్. ౩౬౩

తే॥ గొప్ప బలవంతులగు కొడు - కులను పీడి, ముని కినుక నెంచి మండెడు♦మనసుగలిగి
త్రోవలెల్ల జ్వాలాగ్నికి - తావులైన, యివ్వనముఁ జేరెఁ దాటక ♦ యేపుతోడ. ౩౬౪

సీ॥ ఇలయెల్లఁ గినుకతో ♦ నేలంగ వలసిన, జలధి నీటిని చల్ల - వలసిన యెడఁ
గోరి స్వర్గముఁ జీలఁ ♦ గొట్టంగవలసినఁ, జేసి ముగించు నా - చెఱుగు జో
ఎన్న నలవికాని - హింసలు పుట్టగా, యురు గొండె నన నో - నుచదమేను
రెండుకొండల తోడ ♦ మండేడు విషముతోఁ, బిడుగుల విడుచు ని - ల్కు-డులతోడఁ

తే॥ బ్రళయ వహ్నితో నర్ధ చంద్ర ద్వయంబు, నొంది నడతెంచు కడలి యొండుండునేని
బెడిదముంగూర్చు సద్దాని యొడలితీరు, కొంత యూహింపఁబోలు నీ కువలయమున

సీ॥ కాంచిన పురుషులుం - గామిసెత్వముఁగోరు, భుజ సుందరత్వంబు- పొసఁగు రామ!
బెడిదంపు శూలంబు - పెనుపాప కడియంబు, చేఁబాల్చియుండు నా- చెడుగుజోటి
యివ్వనంబున వసి - యించుచు నుండు నా, టకటాంకనెరు తా - టక యటంద్రు
మనసున బంధ మింఁగని లోభ మొక్కటి, మాత్రముండిన లెక్క- మాలినట్టి

తే॥ సద్గుణావళి నాశంబు - సలుపుకరణి, నలఁగి యిడరాని కోడిమ బు ద్ధుల వలంతి
చెడని పంటలుగలుగు నీ క్షేత్రభూమి, వట్టి మరుభూమిగా మార్చి పాడుచేసె

తే॥ నీలమేఘ సుందర దేహ! నీరజాక్ష!, రావణాజ్ఞ చే నాచేయు - క్రతువు నెపుడు
పర్వత బలంబుతో వచ్చి - పాడుచేయు, నంగదేశ వంశంబు ల - డంగఁ దిరుగు. ౩౬౭

చ॥ జగములఁగాచి ధర్మమునుఁ - జాఁగెడి జీవులఁదన్ను పోలెఁ బెం
పుగఁ దలపోయు భూపసుత! - బూటక తాటకఁ గూర్చి నీకుఁ బె
క్కుగఁ బలుకంగనేల? యిటు - కొన్ని దినంబులు సాఁగెనేని యీ
జగతి సమస్త జీవులను - చంపును నింపును పొట్టలోపలన్. ౩౬౮

## తాటకవధ.

తే॥ ముని యిటులు పల్కి విని శంఖమున్ ధరించు,చేత విల్లుదాల్చినవాఁడు-చిందుతేనె
గంద మలరు మాలిక సిగఁ-గదలుచుండ, నెట వసించు నయ్యాది వచి-యింపుఁ డనిరు

చ॥ అనపుడు నాఁని మాలి నిజ - తాక్షముఁ డిట్లను హస్తయుగ్మమున్
గొనిన గిరీంద్రమున్ వడిసు - కోఁతను పోలిన రాముఁగాంచి యీ
వనమగు దానికెల్ల యని - పల్కియుఁ బల్కక మున్నె మండుచున్
దనుజయు నంజనాచల ని ధంబున వచ్చె ధరిత్రి దద్దఱన్. ౩౭౦

ఉ॥ కొండలు గజ్జెలం జొనిపి కూర్చిన కోళ్ళ ధరన్ దిగంబడన్
గండుగఁ ద్రొక్కి త్రొక్కివడు గాతపు లందు పయోధి తోయముల్
పొండఁగ నిప్పుకల్ చెరుగు - నేత్రముం ప్ప జముండు భీతిమైఁ
గొండ గుహల్ చొరన్ గిరుల - కూటమి పన్నెయిదన్ గదున్ పడిన్.

చ॥ ఎలయుచు నిక్కి కొంత చలి యించు బొమల్ నెలవంకఁబోలు దం
ష్ట్రలు పెనుమూఁతిగల్గు గుహ చాద్పున నొప్పిన బొకి నోటితోఁ
బొలఁతుక నిండు సంద్రమునఁ బొల్చిన వార్వపుటగ్గి రెండు పా
యలు గొని నిర్గమించు క్రియ నగ్గి బయల్వెడ విచ్చెఁగన్నులన్. ౩౭౨

ఉ॥ తోరపు మత్త దంతులను ♦ తొండము తొండముతో ముడించి మేల్
పేఱుగఁ దాల్చుటం గదలు ♦ పెన్నదుముం గల దైత్య గట్టిగా
నాఱిచె నన్ని లోకములు ♦ నన్ని దిశల్ మఱి యన్నిచోట్లు దా
ర్మాఱయి కాడ్పడన్ బిడుగు ♦ రావముసైతము పుల్లగిల్లఁగన్. ౩౨౩

తే॥ పిడుగు వానలఁ బోలిన ♦ బెడిదు రాలు, గర్జనముచేసి వారిని ♦ గాంచి నగుచు
వాఁడి శూలమున్ కాలుని ♦ పాఱఁజూచి, పండ్లు గీటుచు గుహఁబోలు ♦ వాయి దెఱచి.

చ॥ కడిమి నజేయమహా బలము ♦ గల్గిన నా యురు రక్షణ స్థలిన్
గడక సమస్త జీవులను ♦ గ్రచ్చఱఁ జంపితి నోర! మీరలే
కడుకొని వచ్చినార లిటఁ ♦ గమ్మని మాంసము నాకు లేమినో?
చెడువిధి త్రోవఁ జావనొకొ? ♦ చెచ్చెర నం చదలించి నవ్వుచున్. ౩౨౫

ఉ॥ అంబుద సంఘముల్ నుఱుము ♦ లై పడఁ గన్నులు విచ్చి చూచి యు
ల్లంబును మండ గొప్పమల ♦ లం బొడిమై పడఁ గాలఁ దన్నుచున్
డంబగు బాలచంద్రు మొన ♦ డాల్గల కోఱలఁ గీటు చార్చుచున్
బంబిన కిన్క బొమ్మలను ♦ బ్రవ్వెద నంచుఁ ద్రిశూలముం గొనన్. ౩౨౬

చ॥ అరిది తపోధికుండు ముని ♦ కద్ది యభీష్టమయయ్యె సద్గుణా
కరుఁడగు రాముఁడా వనిత ♦ కంఠము ద్రుంచెద నంచు వింటవే
శరమును పూన్పఁడయ్యెఁ దమ ♦ చంపుటకే బెడిదంపుఁ జెయ్వులన్
జరపుచునున్న దయ్యె నది - చానగదా యని యెంచె జాలిమై. ౩౨౭

ఉ॥ వెల్లని పండ్లు నెట్టనగు ♦ వెంద్రుకలుంగల తాటకాఖ్య త
న్నెల్ల విధంబులం బొడువ ♦ నెంచి త్రిశూలము గొన్నఁ జంపఁగా
నొల్లకయున్న రాఘవుని ♦ యుల్లము దిట్టమొఱంగి వేదవి
త్తల్లజుఁ డిట్లనున్ మదిని ♦ తత్తఱ మందుచు రామచంద్రుతోన్. ౩౨౮

చ॥ ఇలఁగల పాప సంఘముల ♦ నెల్ల నొనర్చి రసంబులేని ప్రా
ణుల మని నిశ్చయించి మము ♦ నుగ్గుల నూచముచేసి మ్రింగఁగాఁ
దలఁచిన కుండ వీడినది ♦ తా నొనరింపక వెలిమై యిదే
కల దిఁక నేమనం గలదు ♦ కామిని యే యన దీనిఁ జెల్లునే? ౩౨౯

మ॥ త్రపయే ముఖ్య గుణంబుగాఁగలుగు కాం ♦ తా మాత్రముం జంపఁగా
నపహాస్యంబగుఁగాని వీర్యబల శౌ ♦ ర్య స్థైర్య తేజోయుతుల్
విపరీతస్థితి నొందువా రతివ పే ♦ ర్విన్నంతనే భీతులై
చెపుమా యెచ్చట పౌరుషంబు నిలువం ♦ జేకూడు నీమీఁదటన్? ౩౩౦

తే॥ మఘవ్రుఁడోడె సైన్యంబులు ♦ మడియ దేవ, దైత్యులోడిరి దీని దో ♦ర్దండయుగము
మందరముఁ బోలువన నీక ♦ మగలనము, మగలయందు దీనికి భేద ♦ మగునదేమి?

క॥ ఇఁక నీకుఁ జెప్పవలసిన, దొకటిగలదు వినుము ♦ రఘుకు ♦ లోత్తంసమ! ము
న్నొక కాలంబున నడచిన, ప్రకటక్రమ మిద్ధియనుచుఁ ♦బలికెఁ మరలన్. ౩౭౨

చ॥ భృగుముని భార్య ఖ్యాతియను ♦ పేర్గల వాఁలుగకంటి మానసం
బుఁ గరఁచు ప్రేమనూని దివి ♦ పుత్త్రుల కొక్కఁడ గొప్పసాయ మొ
ప్పుగ నొనరింపఁగా నెఱిఁగి ♦ పూర్ణమతిం దన చక్రధారచేఁ
దెగఁ గొనె నామె ప్రాణములు ♦ తెంపున దైత్య విరోధి యయ్యెడన్. ౩౭౩

తే॥ దేవ భూలోకములఁగల ♦ జీవసమితి, నెల్లఁదనకు నోరెంబని ♦ యెంచు కుమతి
కుమతియనుపేరిదాని నా♦ య్యమరవిభుఁడు, కులిశధారచేఁదలఁద్రెంచి ♦ కూలఁద్రోచె.

తే॥ అఖిల జగదభిరామ! క ♦ ల్యాణధామ!, రామ! విష్ణువునకు దేవ ♦ రాజునకును
వర్ణనీయమా రీరితి ♦ వచ్చెఁగాక, దాన నొకనింద గలిగెనే ♦ తలఁచిచూడు. ౩౭౫

ఉ॥ నీరజలోచనా! విమల ♦ నీరజమిత్ర కులాబ్ధిచంద్రమా!
సారమతిన్ నిజంబుగ ని ♦ చారణసేయ బుధాళితో మహా
వైరమునూని ప్రాణివధ ♦ పాటిగఁ జేయుచు ధర్మనాశమున్
దారుచు దానికిన్ మగత ♦ నంబును గావలెనే వచింపుమా? ౩౭౬

చ॥ అరులకుఁ గాలుఁబోలు నసి - హ స్తమునం గల వీర! బ్రహ్మ యే
ర్పఱచిన నాయువ్రుం దెలిసి - పాడి యెఱింగి సమీరుతోఁ గృతం
బరయుచు జీవనంతతుల - నావలి లోకము చేర్చువాఁడు గా
కెఱచికి దీనిఁబోలెఁ బసి- యొద్దినఁ జంపెడు కాలుఁడుండునే? ౩౭౭

తే॥ పెక్కుప్రాణులఁదనపొట్టఁ - బెట్టుకొనెడి, దుర్గుణముకంటెఁజెడుగేది _ దొరయఁగలదు
జడగలది మీసలేనిది - మడఁతి యనుచు, దీనిఁ దలఁచుట యవివేక - మే నిజంబు.

ఉ॥ న్యూనత నాశముం గనని - యుద్ధృత ధర్మము చెప్పినాఁడ నే
దీని వయిం జలంబుగొని - తీరుగఁ జెప్పెడివాఁడఁగాను నీ
మానసమందు జాలిపని - మానుము చక్కటికాదు రక్కసిన్
మానిని నాక యింకఁ బరి - మార్పుమ యంచు మునీశ్వరుం డనన్. ౩౭౯

చ॥ మునివచనంబు విన్న రఘు- ముఖ్యుఁడు వాకొను సత్యరూప! మీ
మనమున సందియంబు లేక - మానుఁడు ధర్మ విరుద్ధ కృత్యమై
నను తగఁజేయ నాజ్ఞ యిడ - నర్మిలి మీ నుడి వేదమంచు మే
ల్మిని పొనరించుటేకద చ - లింపని ధర్మపథంబు మాకగున్. ౩౮౦

కులమువారల యనుఉల నాస భయపడి, సిగ్గిలి మఱి యాస - చిగురులెత్త
భ్రమయుచు నుండిన- జముండును నాఁడొకఁ, మాత్ర చొక్కపు రుచి -మరఁగినాఁడు

తే॥ మా నివాసంబులు మరల - మాకుఁ దక్కె, , క్రతువు నీకగు దివ్యాస్త్ర - తతులితని
కిమ్మనుచు మునితో వచి - యించి సురలు, దండి గురిసిరి విరులు కో - దండిపైని.

## ౮. యాగపటలము. (౩౯)

ఉ॥ తీరగు నీవఁల్ సలిపి - దేవత లేగఁగఁ బుష్పవృష్టిచే
మీఱి ప్రశాంతమౌ మరు - మేదిని దాఁటుచు లేమి నుందనం
శేరు వహించు*దానగుణ - పీరు ప్రమోఘ మహార్థయుక్త వా
గ్దారకు దీటుగల్గు విశి - ఖంబు లొసంగెను మౌని వారికిన్    ౩౯౯

ఉ॥ శాంతుఁడు జ్ఞాని కౌశికుఁడు - సన్మతినిచ్చిన దివ్యబాణముల్
సంతత శుద్ధ మానసుఁడు - చక్కటిఁజేసిన సత్కృతంబు జ
న్మాంతరమందు రోసి తన - యంతట వానిని చేరునట్లు సు
స్వాంతుని రాఘవుంగదిసెఁ - జయ్యన వేడ్కమదించి పైకొనన్.    ౪౦౦

శా॥ వీరాగ్రేసర! నిన్ను చేరితిమి నీ - స్నేహంగలే మెప్పుడున్
గారామార విధించు కార్యములు చ - క్కంజేసి నీయొద్దకే
చేరన్ వచ్చెదు నీదు తిమ్మని క్రియన్ - జేయంగ నూల్కొందు మం
చారం బల్కు- మహాస్త్రసంతతుల శ్యా-మాంగుండు నెమ్మింగొనెన్. ౪౦౧

తే॥ అంత రెండామడలు వార - లరుగ నచట, గొప్పశబ్దంబు వినబడ - గురు గుణుండు
రాముఁడిది యేమి యనఁగఁ గ-ర్మములు నీఁగఁ,దప మొనర్చిన మునిపల్కు-దానిగూర్చి

తే॥ మానసమునఁ బడమి సర-యూపె యన, నొప్పి నిర్జరపినుతుల - నొందు దానఁ
గలియు గోమతి రవమని-పలికె యవలఁ, బడచి భవహారియగు నొక -నదిని చేర. ౪౦౩

## —:కౌశికీనది వృత్తాంతము:—

సీ॥ దేవతాస్తుత్యమౌ - తెలివొందు నపడ, వృత్తమేమని రఘు - పరుఁ డడుగఁ
గౌశికుం డిట్లనుఁ -గమలగర్భుఁడు తొల్లి, పొందిన గౌరవం - బును జయంబు
గొనిన రారాజగు-కుశుఁడు స్వపత్నియం, దమరంగ నల్వురు - కొమరులఁగనె
వారు కుశాంబుఁడు - ప్రథితుఁడౌ కుశనాభుఁ, డా ధూర్తరజుఁడు వసు - వనెడువారు

తే॥ అందుకౌశాంబయందుకు-శాంబుఁడుండె,నమరెఁగుశనాభుఁడుమహోద-యంబునందు
అలరె నాధూర్తరజుండు ధ - ర్మాటవిని గి, రివ్రజంబున వసువు కో - రికను నిలిచె

సీ॥ ఆ భూపతులఁ గుశ - నాభునకుంగల్గి, రలరెడు లలితవా - క్కులు ప్రవాళ
సుందరాధరములు - పొందిన సద్గుణ, వతులు నూర్గురు ప్రియ - సుతలువారు

* తిరువెణ్ణెయ్ నల్లూరి శడైయప్ప వాక్యములను పోలిన యస్త్రములను - అని మూలము.

గోముగా వర్ధిల్లి - కొమరు ప్రాయమునొంది, యొకనాఁడు విహరించు - నుత్సుకతను
చెలులతోడ వనంబుఁ - జేరి క్రీడింప వా, యుప్పు వారిఁగని మోహా - మొంది కుంది

**తే॥** మావి పిండె బోల్కన్నుల - మగువలార!, మరుని గుదుసుపడిన యింటి ♦ మార్గణంబు
మదిని గాఁడి నొప్పించె నేఁ◆మఱుఁగు చుంటిఁ, బెండ్లి యాడుఁడి మిమ్ము నే◆వేఁడుచుంటి

**సీ॥** అని వేఁడఁగా వార ♦ లా సమీరణుఁగాంచి, మాతండ్రి వేఁడుము ♦ మమ్ముఁ దాను
దానపూర్వకముగా ♦ దయచేసెనేని సీ, కోరిక యప్పుడొదుఁ ♦ బార మనఁగ
గంధవహుండంతఁ ♦ గడఁకతో వారి వీఁ, పుల గూను గావించి ♦ పోవుటయును
కర కంకణ స్ఫుట ♦ కాంతులొలయ నడ, వఁగలేక వారలు ♦ పడుచు లేచి

**తే॥** తండ్రికడ కేగి యమృతంబుఁ ♦ దన్నునట్టి, గొనబు పలుకులతో నోరు◆కొతుకువడఁగఁ
బోలఁజెప్పఁగ నోదార్చి ♦ చూళి కొడుకు, బ్రహ్మదత్తున కతఁడు వా◆రల నొసంగె.

**మ॥** చెలులకా వేదిక బ్రహ్మదత్తుఁ డెలమిం ♦ జేపట్ట నక్కన్నికల్
లలితాకారము దాల్చి రాతని తపో ♦ లాభ ప్రభావంబునన్
జెలఁగన్ సూనుఁడు లేమి కిన్క ప్రభుఁడెదం ♦ జింతించి పుత్రేష్టి మా
నులచే వేల్వఁగ నందు గాధి కలిగెన్ ♦ బ్రోద్యత్తురంగాళితో. ౮౦౭

**చ॥** సలువుగ రాజ్యమెల్లఁ గుశ ♦ నాభుఁడు గాధికి నప్పగించి యు
క్కలల నిధి నాకలోకమున ♦ కుం జన గాధి మహోదయంబు స
ద్బలయుతుఁడై ప్రపాలన ము ♦ దారమతిన్ జరుపంగ గాధికిం
గలిగితి మంతఁ గౌశికియు ♦ గాదిలి పుత్త్రుఁడు నేఁ గ్రమంబునన్. ౮౦౮

**తే॥** అవలమాతండ్రి భృగుపుత్త్రుఁ◆డైన ఋచికు, నకుఁ బొసంగఁ గుమారిఁ గౌ◆శికనొసంగఁ
గొన్ని యేండ్లు త్రివర్గముం◆గొని తనిసి, తపముచే సత్యలోకం ◆ బందు చేరె. ౮౦౯

**చ॥** పతి గగనంబు త్రోవ నడు ♦ వన్ విరహంబు సహింపలేక త
త్పతి పదరూపుగొంచు భువి ♦ దారిసి వెన్నవులంగఁ గాంచి త
త్పతి ఋచికుండు భూ జనుల ♦ బాధలఁ దోలుచునుండు మాపగా
కృతిఁగొని యంచు నాజ్ఞయిడి ♦ యేగె విరించిపదంబు చేరఁగన్. ౮౧౦

**ఉ॥** సోదరి నిమ్నగాకృతి వ ♦ సుంధరయందె వసించె నంచు నా
త్మోదర మొప్పఁ గౌశిక ము ♦ హాముని పల్కఁగ విస్మయంబు స
మ్మోదము నెంది రాఘవులు ♦ ముచ్చటఁ గొంత పథంబుపోయి యం
భోదముఁ గ్రమ్మియుండు వప ♦ నుం గని యెవ్వరి దంచు వారనన్. ౮౧౧

## వామనచరిత్రము.

**సీ॥** మాని యిట్లను భువి ♦ లోన మానినులకుఁ, బతికంటె గొప్ప దై ♦ వంబు లేద
యనెడు పతివ్రత ♦ మనసుఁబోలిన పరి, శుద్ధ విషయమిది ♦ శ్రద్ధవినుము

వేద సంతతికిని ♦ విబుధుల బుద్ధికి దక్క-నివారి కం ♦ దకయె యుండుఁ
గమల నాభుఁడు కొంత ♦ కాలంబు దుష్కర, లప మొనరించిన ♦ తానమిద్ది

తే॥ అమరులునుభూజనములుబం♦ధములనీఁగ, వాని శ్రీనామమే నోటఁ♦బలుకుచుండ్రు
వాని కపటనాటక మెన్న♦ వశముగాదు, అతని నుతియించు ఫలము శ♦క్యంబె తెలియ.

తే॥ కడకఁ దపియించె నూఱు య♦గంబు లిచట, నాదినంబుల భూగోళ♦మమరు దంత
ములనుగల పోత్రిఁబోలిన ♦ బలియుఁడైన, బలి♦వశము చేసికొనియె ది♦వంబు భువము

తే॥ శంక యొక్కింత మదిలేక ♦ జరగు దాత, యురు తపశ్శాలి సురలకు ♦ సరిది యైన
సుఖము నెఱవేర్పఁబూని స♦మస్త భూమి, నేల వేలుపులకు నీయ ♦ నిశ్చయించె. ౪౧౪

తే॥ జరుగుచున్నది యెఱిఁగి ని♦ర్జరులు హరిని, గలిసికే లోడ్చి ప్రార్థించి♦బలి యొనర్చు
కొడిమెలం దొలఁగించి చే♦కూర్చు సుఖము, గొంతి యను నతఁడటుచేయ♦సమ్మతించె.

ఉ॥ శ్యామల వర్ణుఁడుఁ మహాత - సాత్త్వికుఁడైన రమేశుఁ డంతఁ ద
త్త్వామలవేది మూఁడు సమ - యంబుల చర్య లెఱుంగువాఁడు దై
త్యామర తాత కశ్యపున - కర్మిలి పుత్త్రకుఁడై జనించి తా
వామనుఁ డయ్యెఁ బెంపు వలఁ-పన్ వటబీజము న్యాయ మొప్పఁగన్. ౪౧౫

సీ॥ ఒప్పారుచేష్టలు - ముప్పూరి జందెంబు, మొలయందు మౌంజియుఁ - గలుగువాఁడు
వేదముల్ విస్పష్ట - విధిఁ బల్కు నాల్కయుఁ, గరమునం దగ్నియుఁ -గలుగువాఁడు
జ్ఞానులకే యెఱుఁ - గం దగ్గ విసపుచి, బ్రహ్మచారి మహానొక - రూపుదాల్చి
యరుదెంచు వామను - నాగమనంబును, త్రిభువన జేతయు - ధీరుఁడు బలి

తే॥ యెఱిఁగి యచ్చెరువంది ము-న్నెదురువచ్చి, కొంచుఁ బోయి పూజించి సద్గుణగరిష్ఠ!
నిన్ను బోలు విప్రులును లేరు - నన్ను బోలు, ధన్యులును భువి లేరని - యనియెఁ బలికె.

తే॥ అంత నమిత వివేకియై - యలరు గుజ్జు, యాచకులు కోరుకంటు న - త్యధిక మొసఁగు
దీర్ఘభుజ! నీకడకు నేగు - దెంచునట్టి, వారె భాగ్యయుక్తులు; రాని - వారు కారు.

తే॥ అనుచు వచియింప నలరి యా-దనుజరాజు, వలసినది యేది తెలియఁగఁ-బలుకుఁడనిన
నెనరు కలదేని ముయ్యడుగు - నేల వలయు, ననినయంత నిచ్చితి నని - యనుట తోడ

చ॥ కవి కొడు కిట్లు పల్కెనిది ♦ కైతవ వేషము నమ్మఁబోకు దా
నవ కుల చంద్ర! భూసురుఁడు - వల్లని మేఘముఁ బోలు నొక్క మా
నవుఁడని గుజ్జురూపని య - నం జన దెల్ల యజాండ గోళముల్
తవిలి యొకప్డు తుందము - దాల్చిన యాతఁ డెఱుంగుమా యనన్. ౪౨౦

తరల॥ దనుజదేశిక! మత్కరంబది - తద్దయుం బయిఁ గ్రాలఁగాఁ
దనకు నొప్పనిరీతి మిక్కిలి ♦ తాటి యుండున దెన్నఁగా

నెన యెఱుంగని నీలవర్ణుని ♦ యిందిరేశుని శ్రీకరం
బనఁగ నాకిఁక నంతకంటె మ - హాత్మ! మేలెది చూడుమా! ౪౨౧

తే॥ వలయువారలు వలవని - వారటంచుఁ, గనక నిర్ణయించిన యావి-ఘనుల కొసఁగఁ
దగినదని ధర్మ తత్త్వవే - త్తలు వచింతు, రితనికి సమాను లధికు లెం - దేని గలరె?

ఉ॥ ఒత్తుగ మేన వెల్లఁదన - మొందిన వాఁడవు గాన నంటి వి
ట్టుత్తములైన దాతలకు - నొప్పుగ నీయఁగరాని వంచునే
పాత్రమునందు గల్గునెవి! - బొందిని తీయని ప్రాణమైనఁ దా
నెత్తిడి వేఁడు టెగ్గు మఱి - యిచ్చుట లగ్గు తలంచి చూడుమా! ౪౨౩

ఉ॥ చచ్చినవారు లోకమునఁ - జచ్చిన వారలుకారు ప్రాణముల్
నొచ్చి సగంబు చచ్చి కయి - నూక్కొనఁ జాఁచుచు వేఁడువారలే
చచ్చినవారు నిక్కముగఁ - జచ్చినవారలు లేచిరారు పై
నిచ్చినవారు గాక యిల - నెవ్వరు సుస్థిరులో వచింపుమా. ౪౨౪

ఉ॥ పెచ్చు నిరాపనిందలను ♦ పెంచెడువారలు కారు శాత్రవుల్
ఇచ్చెడు వారిఁజేరి తగ ♦ నీయకుఁడీ యను వారె శాత్రవుల్
నిచ్చలునట్టిరే తమకె ♦ నిక్కము చేకొనరిఁచు కొన్న వా
రిచ్చుట మాపుకంటె మఱి ♦ హెచ్చగు పాపములేదు ధారణిన్. ౪౨౫

ఉ॥ పెద్దల వాక్యముం దలఁచి ♦ పెచ్చుగ ద్రవ్యము చేత నుండఁగా
నెద్దడి నొచ్చువారలకు ♦ నిచ్చి యశంబు గడించి ధర్మముం
దద్దయు నాచరించి భవ ♦ ధన్యతఁగాంచెడు వారిఁ జేరి పె
రొద్దిక లోభమున్ విడకుఁ ♦ డో యను మష్టులె దొడ్డశాత్రవుల్ ౪౨౬

తే॥ నయములేని యాచార్య!దా♦నమును చెఱచు,కృపణ!యొక్క రొకరికె త్తి♦యిచ్చుచుండ
భంగపఱచుట దగునె? నీ♦బంధు సమితి, కూడు గుడ్డయులేక య ♦ ల్లాడుఁగాక! ౪౨౭

తే॥ అని పలికి మంత్రిదుర్గుణుఁ♦డనుచు నెంచి, యంతనిని లెక్కగొనక మూఁడడుగులిలను
నీవె కొలుచుకొమ్మని చెప్పి ♦ నీటిధార, బలి త్రివిక్రము చిన్ని చే ♦ తులను విడిచె.

చ॥ విమల సరోజలంబు బలి ♦ పీడిన ధార బిరాన చిన్నిహ
స్తములను పడ్డమాత్రఁ దలి ♦ దండ్రులె వ్వాఁగఁదగ గుజ్జు త
న్నమరఁగఁ జూచువారలు భ ♦ యంబును విస్మయమున్ భజింప ను
త్తములకుఁ బ్రేమతో నొసఁగు ♦ దాన ఫలంబు విధాన వర్ధిల్లెన్. ౪౨౮

ఉ॥ ఊనిన పాదమొండు విపు ♦ లోర్విని నిండుచుఁ బిన్నదిద్దియం
చే నిజ మవ్వలం గడచి ♦ యేగదు; మిన్ను సమస్త మొక్క టన్

బూని యడంచి స్వర్గ పద • ముం గొని దానిని దాటి యువ్వలన్
మానిత రీతి నేగుటలు • మానెను సుంతయుఁ జోటు లేమిచేన్. ౪౩౦

ఉ॥ రెండు పదమ్ములన్ గెలువ • రించి సమస్త జగమ్ముఁ గొల్చి బ్ర
హ్మాండమునందు మూఁడవ ప • దాశ్రయమెచ్చట లేమి దానికిన్
నిండు ప్రియంబు గల్గు బలి • నెత్తియె తావలమయ్యె వింతొకో
దండధరాగ్రణీ! ప్రథిత • దైత్యవిరోధియుఁ బిన్నవాఁడెకా! ౪౩౧

ఉ॥ నల్లనిసామి యింద్రునకు • నల్వగుఁ గాకని యీ జగత్త్రియిన్
జల్లఁగఁ జేటి గోలుబడి • నల్వనొనంగి జగంబుఁ గొల్చి రా
జిల్లి శ్రమించు పాదములు • చేత రమాసతి తాఁకు రక్తిమన్
జెల్ల మహాగభీరిమము • చెందిన పాల్కడలిన్ బరుండెఁ దాన్. ౪౩౨

చ॥ అరుదగు కర్మపాప్తి మొద • లంట నశింపఁగఁజేయు రామ! యీ
పరమపవిత్రమౌ వనము • బాధ రతిం గను వారు జన్మదుః
ఖ రహితులై చెలంగుదురు • కాంచుమ వేద వచోనుయుక్తి నా
కిరవుగ యాగముం జలుప • నిద్దియె యిమ్ము మఱొండు లేదిఁకన్• ౪౩౩

శా॥ ప్రారంభించెద జన్న మివ్వనమునన్ • రండంచు సిద్ధాశ్రమం
బారం జేరుచు విఘ్నముల్ దొలఁచి తె • ద్యజ్ఞంబుఁ గాపాడఁగా
మారాకారుల రామలక్ష్మణులఁ బ్రే • మన్నిల్పి యజ్ఞీయ సం
భారంబుల్ సమకూర్చి కొంచుఁ దొడఁగెన్ • గాధేంద్రుఁ డుద్యద్గతిన్

## యాగరక్షణము.

ఆ॥ మన్నుమిన్నుఁగాచు • మన్నీని కొమరులు, విన్నువారిఁగూర్చి • యెన్నఁజేయ
నరిదియైన వేల్మ • నాఱు నాళ్ళరసిరి, గన్నుగాచు ఱెప్ప • కరణిఁ గాచి. ౪౩౫

తే॥ తిరుగుచున్న నగంబుల • తెఱఁగుఁ దెలుపు, రాఘవులలోనఁ బెద్ద, స • ర్వజ్ఞుఁడైన
గాధిజుం గాంచి యాగవిఘ్న • కారులైన, యసుర తెప్పు డిటకు వత్తు • రనుచు నడిగె.

తే॥ మౌనియై జటి మాటాడఁ•బూనఁడయ్యె, వీరవరుఁడు రాముఁడు మ్రొక్కి•వినతితోడ
వెనుదిరిగి మిన్ను చూడంగఁ • బిడుగు మ్రోఁతె, బిడియపడ వినవచ్చెను•వికటరవము.

తే॥ గుప్పిరేసిరి విసరిరి • నిప్పునీరు, గురిసి రద్రులఁ బొరలించి • దొరలవైచి
రఱచి రదలించి తిట్టిరి • మొఱకులపుడు, పరశువులవైచి మాయలు • పఱపినారు.

తే॥ ఏచి కోపించి యేయఁగా• నెఱచి కఱచు, కొనినమాయాయుధములుకాగ్నో•గుఖ్యగురియు
కరణి వనమెల్ల విరియ రా - కాసు లంతఁ, గడలి మింటిఁగప్పె ననఁగఁ - గ్రమ్మినారు.

చ॥ మొఱసెడి కత్తులుం గదలు - మిక్కిలి వైచుచుఁ బెక్కువాద్యముల్
మొరయఁగఁ జేయుచున్ బిడుగు - మొత్తములంబలెఁ గంటగింపుగా
నఱచుచు దైత్యులేచుట యు - గాంతమునన్ మహి ముంచ నెంచి మి
న్నొరసి పగిల్చి కొంచుఁ దగు - నుద్ధతివచ్చు మొగిళ్లు నాఁ దగన్. ౪౪౦

ఉ॥ కోఱల జంటలొప్ప మిడి - గ్రుడ్లను ద్రిప్పుచు రక్తరోమముల్
మీఱి వెలుంగ నోడు బిగి - మేకొన నిప్పులు గ్రక్కఁజూచుచున్
బాఱుచు వచ్చువారు ముని - వందృుఁడు పల్కిన వారె యంచు నా
మోఱకులన్ రఘూత్తముఁడు - మున్నొకని తమ్మున కొందఁ జూపఁగన్.

ఉ॥ కాంచిన లక్ష్మణుండు కడ - కన్నుల నిప్పులు రాల మింట ని
గ్రాంచిత రీతిఁజూచి తన - హస్త శరాసముఁ గాంచి రాఘవా!
మించిన క్రూరరాక్షసుల - మేనులు కండల తుండ్లు గండ్లు గా
న్పించఁగఁ గొండలై పడుట - నిక్కము చూచెదుగాక యిద్యేడన్. ౪౪౧

తే॥ అనుడు నీఱలఁ బట్టిన - యసురవరులు, వైచు రక్తమాంసమ్ములు - పడఁగనీక
కాండముల నేసి పైకప్పు - గప్పివైచె, నిందుగా రాముఁడా హోమ - కుండమునకు.

ఉ॥ హాలహాలంబు పొంగి జగ - మంతట మూఁపఁగ రేగునంతలోఁ
జాల వడంకి నిర్జరులు - చంద్రధరున్ శరణంబు నొందు నా
పోలిక మానులెల్ల భయ - ముం గొని సద్గుణధాముఁ జేరి యో
నీలశరీర! యెట్టులును - నీవె శరణ్యము వేఱు లేదనన్. ౪౪౪

చ॥ మదిని కలంక నొందకుఁడు - మానిజనోత్తములార! యిట్టె యి
య్యది తొలఁగింతు నంచభయ - హస్త మొసంగి గుణంబు కర్ణమున్
గదియఁగ లాగి రక్తమయ - కంథిగ భూమి నొనర్చి వీరతన్
గుదులుగఁ గూర్చి రాఘవుఁడు - కూల్చె నిశాచర మూర్ధ శైలముల్. ౪౪౫

తే॥ కమలనేత్రుం దివ్యాస్త్రంబు - కఱకు వేడిమ, రాలు తాటకగన్న పుత్రికులలోన
నొకని సంభోధిలోవైచె - నొకనిఁబట్టి, విందుగాఁగఁ గాలాంతకు - వీటి కనిపె. ౪౪౬

మ॥ వనమాలాధరుఁడైన రాముఁడు వడిన్ - బాణావలిన్ దక్కియు
న్న నరాశి ప్రకరంబుపై విడువ నా - నారాచముల్ మిన్నుగ
ప్పినఁ గాకుత్థ్సులు మీన్గు కొండలపయిన్ - వేమెక్కి చంపం గలా
రని చెల్లాచెదరయ్యె దైత్యబలముల్ - ప్రాణంబులం గాచుకోన్. ౪౪౭

తే॥ పిడుగుల వలె బెడిదములై, విడువఁ రామాస్త్రవితతి - వెన్నంటంగా
మిడియుచు మొండెము లాడెను, గడుకొని గ్రద్దలు పిశాచ - గణము నుతించెన్.

ఉ॥ ప్రబ్బిన పుష్పవృష్టియట - గ్రద్దల పందిరిఁ జీల్చి కొంచు బ
ల్గొబ్బిన రాలె నంబునిధి - ఘోషణముంబలెఁ దూర్యరావముల్
మబ్బులు మ్రోఁగెఁ గౌశికబల _ మర్దన ముఖ్యులు గుంపుగూడి పే
రుబ్బున వచ్చి రామునకు - నున్నతి నిచ్చిరి మేటి దీవనల్. ౨౪౯

చ॥ పరమ పునీతులైన ముని ♦ వర్యులు గంధ సుమాక్షతంబులన్
శిరములఁ జల్లి దీవనలు ♦ చేసిరి తద్వన వృక్షజాలముల్
విరులను రాల్చె మాని జన ♦ వీరుఁడు కౌశికుఁ డంత యజ్ఞమున్
సురుతర శాస్త్రపద్ధతిని ♦ గోరిక దీర ముగించి యిట్లనున్. ౨౫౦

చ॥ అఖిల జగంబులన్ మొదట ♦ నాదరమొప్ప సృజించి పిమ్మటన్
నిఖిలము కడుపులోపలనె ♦ నించుచుఁ గొంచెదు నీవు పూని యీ
సుఖమును గాచు టెచ్చగునె? ♦ మున్ననతో నిటకేగు దేర నా
సుఖతర భాగధేయ మది ♦ చొక్కము గొప్పది యంచు నెంచితిన్. ౨౫౧

చ॥ అనవ్రుడుఁ బుష్పముల్ ఫలము ♦ లందము గూర్పఁగ వృద్ధిఁ బొందు వృ
క్ష నికరముల్ చెలంగి కడుఁ ♦ జలనయోగ వనంబునన్ మహా
మునులను గూడియున్న గుణ ♦ పూర్ణుఁడు రాముఁడు మాని కౌశికుం
గని యిఁకఁ జేయఁగాఁ దగిన ♦ కర్జము మాకెది తెల్పుఁడీ యనన్. ౨౫౨

ఉ॥ నేనరుదన్న నే యయిన ♦ నీ కరుడై నది యొండు భూమి లే
దైనను గొన్ని యున్న యవి ♦ యావలఁ జూతము నీటియోర్వ మా
గానిదొ చూడ నెల్లెడలఁ ♦ గ్రమ్మిన యమ్మిథిలా పురావనీ
జాని యజించువాఁ డతని ♦ జన్నము చూతము రండు లెండనన్. ౨౫౩

## ౯. అహల్యా పటలము. (రాఁ)

సీ॥ మంచి దనఁగా వార ♦ లంచిత గతి ముప్ప, రును మిథిలాపురి ♦ త్రోవఁ జనుచు
నమల రత్నశ్రేణి ♦ యగురు చందనము గం, దంబొప్పు పులిన త ♦ లంబు లనెడి
వక్షోజములును లేఁ ♦ బ్రబ్బలి తీఁగలన్, మధ్యంబు నూత్న ను ♦ మప్రతాన
మనుమేఖలయు గొన ♦ బగునల్ల యిసుకయన్, కొమ్ముడి శైలంబుఁ ♦ బమ్మివచ్చు

తే॥ కాల్వలను గజ్జెల రొదలు ♦ గలుగు కాళ్ళు, చెలఁగి చెలువంబుచేత న ♦ చ్చెరువు గొలుపు
శోణనదియను తెఱవను ♦ చూచివారు, మేరమీఱిన రహి దరిఁ ♦ జేరినారు; ౨౫౪

సీ॥ అంత భాస్కరుఁ డుద ♦ యాన నిచ్చిన చల్లఁ, దనము జగతి కిచ్చు ♦ తలపు గలిగి
జీవులఁ దపియింపఁ ♦ జేసెడి తనమేని, వేఁడిమి తగ్గించు ♦ వాఁడపోలె
నరుణుని నయనంబు ♦ లరుగుట కంటెను, ముందంజ వైచుచుఁ బోవు హారులఁ
గట్టిన యొంటి చ ♦ క్రపుఁ దేరితో నేగి, పడమటి కడలిలో ♦ పల మునింగె.

తే॥ జల్లనగు నీటిపట్టుల ♦ జలజగృహము, దళములను తలుపులు మూయఁ ♦ దలరి గండుఁ
దేంట్లు పెంట్లతోఁగూడి దమే ♦ తేర ననువు, వెలయు నొక శాఖి వనము న ♦ విడిసినారు

ఇంద్రునకు దుర్వాస శాపము

తే॥ ఈ వనం జేరిదని రాముఁ ♦ డెలమి నడుగఁ, గడఁగి గురు తపోధనుల దగ్ధ ♦ కర్ముఁడనియె
మున్ను దితియును కశ్యపు ♦ ముదిత యుచటఁ, దన కుమారులకై కుంది ♦ తప మొనర్చె

శా॥ ఈ లోకంబుల కావలన్ వెలసి మ ♦ ద్యుత్కంపారఁగా నేలు మా
లోలుం డున్నెడఁ జేరి సన్నియతిమై ♦ లోలాక్షి విద్యాధర
స్త్రీలం దోర్తు భజింపఁగా వలరుచున్ ♦ శ్రీలక్ష్మ ప్రత్యక్షమై
రోలంబ ధ్వని యొప్పు పుష్పసరమా ♦ ప్రోత్సాహి కిచ్చెన్ రహిన్. ౪౫౭

ఉ॥ ఆ సుమమాల విడియకు ♦ నాదటఁ జుట్టి నిరించి లోకపుం
బాసిఁగఁ గాంచి కట్టెదుట ♦ వెయ్యాని కిన్కఁ దావలంబు దు
ర్వాసుఁడు లక్ష్మ సన్నిధిని ♦ శ్రావ్యసుగీతము లాలపించు నం
చాపకి కంజలిం జలిపి ♦ హర్షముతో వినుతించి నామెయున్. ౪౫౮

ఉ॥ లోకములన్ సృజించి కృప ♦ లోఁ గొని కాచుచు వెల్వరించు నా
శ్రీకరు వక్షమందు నివ ♦ సించి సమస్తముఁ గాంచు తల్లి యా
స్తోక ముదంబునన్ జడను ♦ చుట్టిన మాలిక నా లతాంగి వే
కైకొనుమంచు నామునికి ♦ గారవ మార నొసంగి నంతటన్. ౪౫౯

ఉ॥ వేడుక లోకమాత తన ♦ వేణిని దాల్చిన మాలఁగాంచి నా
పోడిమి దొడ్డదంచుఁ గొని ♦ మోదముచే గరుపాఱు మేనితోఁ
బోడ జటన్ ధరించి భవ ♦ ముల్ వెసనుఁగొంది విముక్తిగాంచు మే
ల్జాడ యిదంచు వేడ్కమెయి ♦ స్వర్గపురంబును దాయఁబోవుచో. ౪౬౦

సీ॥ రజతమయంబయి ♦ రాజిల్లు సుందర, నగముపైఁ గురియు కా ♦ ర్మొగులు వెలసి
చెందామరలు వేయి ♦ చెలువుగా వికసింప, నెఱ్ఱని వెలుఁగుల ♦ నెనయు నినుని
కాంతి నొందినరీతిఁ ♦ గ్రాలుచుఁ బొలుపారు, తనువుతో నైరావ ♦ తంబు నెక్కి
చెలఁగు రుచిని నేని ♦ చేదుగా నొనరించు, లలితవాక్కులుగల ♦ లలనలైన

తే॥ రంభ మేనక మున్నగు ♦ కుంభకుచలు, చిత్తజుని శరావళుల వ ♦ ర్షించు తూణ
ముల నెనయు పదకిసల నూ ♦ పురములులియ, నాడుచును పాడుచును ముందల ♦ నరుగుచుండ

సీ॥ బలు నీలగిరి కిరు ♦ వలఁకుల విలసిల్లు, జ్యోత్స్నకనా నొప్పారు ♦ సురఁటు లోలయ
జాబిల్లి దిగివచ్చి ♦ జానొందె ననఁజెల్లు, ధవళాతపత్త్రంబు ♦ తనరుచుండ

పటహాకాహళ శంఖ ♦ పణవాది రవములు, నెఱచయి వంది గీ ♦ తముల ముంప
వేద చతుష్టయ ♦ నాద ముప్పొంగెడి, యంబుధి ఘోషంబు ♦ ననుకరింప.

తే॥ జగములను గ్రమింగ వచ్చెడు ♦ పగిదిఁ దోఁచు, నుత్సవ ప్రాభవముఁ గాంచి ♦ యుబ్బి యబ్బు
రంబు గొని తానుదెచ్చిన ♦ ప్రసవమాల, కేలఁగొని హరికీయ నుం ♦ కించునంత. ౪౬౨

తే॥ దాని దోఁటితోఁ గొనుచుఁ జో ♦ దంతి మెడను, నగవిభేది వైచుటను పు ♦ న్నాగమంతఁ
దాడిఁ బోలిన కరముతో ♦ దాని లాగి, కాలితోఁ ద్రొక్కి పేడయగా ♦ కరణి నలఁచె.

ఉ॥ మున్న కటూగ్రకోపితుఁ ♦ డుందటనే యటు తోటఁ గాంచి తాఁ
గన్నుల నిప్పుకల్ వెడలఁ ♦ గ్రక్కఁ బ్రజాండచయంబు బూదియై
చెన్నఱు నంచు నిచ్చి పఱ ♦ చెన్ సురసంఘము సూర్య చంద్రులుం
దెన్నులు దప్పఁ గప్పెఁ దమి ♦ దిక్కులఁ దల్లడ మందె లోకముల్. ౪౬౪

ఉ॥ ఊరుఘనాంబునుండి పొగ ♦ లొక్కట లేవఁ బురారి యట్ల హా
సారవ మీల నార్చి నగె, ♦ యాననమందు బొమ లుబ్బదు ల్వడన్
బారలుగాఁగ నాలుకలు ♦ పర్వెడి యుజ్జ్వలితాగ్నిఁ గ్రక్కు నా
ఘ్రోణ కరాళ నేత్రముల ♦ తోఁ బురుహూతుని గాంచి యిట్లనెన్. ౪౬౫

శా॥ ఓరీ క్రూర! సురాధమా! తులువ! నీ ♦ యుద్వైభవం బెంత? లో
కారాధ్యుండును లోకనాయకుఁడు లో ♦ కాధారుఁడౌ విష్ణు వ
క్షోరంగంబుననుండు లక్ష్మి జడలో ♦ నుంపొందు నిమ్మాల నే
నారంభించి యొసంగఁ బూవె జగ్గ్రహింతు దుష్ట ♦ ణ్యప్రాప్తి గర్వాంధుఁడా! ౪౬౬

ఉ॥ నీ యురు వైభవంబు గని ♦ నీకెది తగ్గది యంచు నేఁడు మో
దాయత బుద్ధినై యొసఁగ ♦ నంత యలక్ష్యము చేసినాఁడవే
మాయురె! నీదు సన్నిధులు ♦ మంగళ సంపద లెల్ల నంబుధిన్
మాయును గాతఁ బొందెదు ♦ మల్లడు నొందుదు గాక దుర్మతీ! ౪౬౭

మ॥ అని దుర్వాసుఁడు శాప మిచ్చెడును రం ♦ భాద్యప్సరోవర్గముల్
వెను లిబ్బల్ వెలి మావు కామగవియుల్ ♦ వేగంటి చౌదంతి స్వ
ర్వాసి భూజాదికముల్ సమస్తమును సం ♦ రంభంబుతోఁ జేరెఁ బో
ఘన విస్తార తరంగ ఘోష యుతమౌ ♦ గంభీర వారాన్నిధిన్. ౪౬౮

మ॥ కడు కిక్కుంగల పూనిశాపమున స్వ ♦ ర్గంబాద లోకంబు ల
ట్లుడికెన్ లేవడి చీడ పట్టినటులై ♦ యుగ్రత్వముం జూప న
ప్పుడు నాకౌకసు లద్రిజారమణు నం ♦ భోజాసనుం గూడి పా
ల్కడలిం జేరిరి మాధవుం గని మొఱ ♦ ల్గావింప దైన్యంబులో. ౪౬౯

తే॥ కమలజుండును త్రిదశులు ♦ కఠినుఁడైన, మునివలననైన కష్టముల్ ♦ వినిచి మాకు
నీచరణము లే శరణముల్ ♦ నీరజాక్ష!, యనుచు వేఁడఁ ద్రివిక్రముఁ ♦ డనియె నిట్లు.

## క్షీరసాగరమథనము.

చ॥ కలఁగక మందరంబు తగు ♦ కవ్వము వాసుకి త్రాడు నిండు జా
బిలి తరిగంబమై తనర ♦ వేలుఁగ వేలుఁగ దేవ దానవా
వలి యిరు ప్రక్కల న్నిలిచి ♦ పాల్కడలిన్ జిలుకుండి యోషధుల్
దళముగ వైచి వెన్నపడు ♦ దాఁకను పూనిక వీడకుండఁగన్. ౪౭౧

ఉ॥ మేమును వత్తు మచ్చటికి ♦ మీరు బిరానఁ బదండి యంచు ల
క్ష్మీమహిళా మనోహరుఁడు ♦ మేకొని పల్కఁగ నింక నెవ్వ వే
యామడ లోడి పాఱెనని ♦ యానిన నమ్మికచే ముదంబు న
మ్మోములఁ దోఁప వేలుపులు ♦ పోయిరి పాడుచు నాడుచున్ రహిన్. ౪౭౨

ఉ॥ లీలగ మందరంబుఁ బెక ♦ లించిరి వాసుకిఁ జుట్టినారు జే
జేల పసాదము న్నిలువఁ ♦ జేసిరి కంబముగా మహౌషధుల్
కేలను గ్లల్గించు కడ ♦ లిం బడవైచిరి చిల్కరంబుధిన్
నేల చలించె శేషుఁడును ♦ నెమ్మెయిఁ గుంచె సహించలేమిచే. ౪౭౩

చ॥ అరయుగ ధర్మహీన హృద ♦ యంబులఁ జేరని కేశవుండు మం
దరమును వీఁపుపైఁ దిరుగఁ ♦ దాల్చి బలిష్ఠ ధులేంద్ర రూపుఁడై
గిరి నిలువంగ మోచి వెయి ♦ కేలు గడల్కొనఁ జేసి పూని యొం
టరమునఁ బోయిపట్టి పిక ♦ డంక ఫలింపఁగఁ జేసె నత్తఱిన్ ౪౭౪

చ॥ మఱిఁగిన సంపదల్ మరల ♦ మమ్ము కృపామతి నేలువానిచే
దొరకెఁ బరస్పరంబు పగ ♦ దోఁచె సురాసురకోటి కంత శ్రీ
వరుఁ డొక మోహిని రమణి ♦ వాలక మూని సురారులన్ భ్రమం
పఱుపుచు మోసపుచ్చి సుధ ♦ వారక మెక్కిరి వేల్పు లంతటన్. ౪౭౫

చ॥ బెడిదపు టాలమున్ శశిని ♦ భీమునకున్ సురభూరుహంబులోఁ
బెడఁగగు వస్తువుల్ శిఖరి ♦ భేదికిఁ దక్కిన సంపదల్ ప్రియం
బడర సురాళి కిచ్చి కమ ♦ లాలయ లక్ష్మిని కౌస్తుభంబు మె
వడిఁ గయికొంచు మాధవుఁడు ♦ పైనము చేసెను వైనతేయుపై. ౪౭౬

ఉ॥ అంత దురంత చింత దితి ♦ యందుచు నెమ్మది లేక భర్తనే
కాంతమునందు గాంచి తన ♦ హస్తము [illegible] ముకుళించి నా సుతుల్

వంతల నొంది కుంది వసి ♦ వాడి సశించిరి దేవవంచనన్
బంతముతోడ వారిఁ జెఱు ♦ పం దగు పుత్త్రుని నాకొసంగవే. ౪౭౭

చ॥ అనవుడు కశ్యపుం డను ద ♦ యామతి నీకొక సూనునిచ్చితిన్
జనిగొని భూమి కేగి వెయి ♦ వత్సరముల్ తపమాచరింపు మ
ట్లొనరిచితేని నీదు వర ♦ ముత్కటరీతి ఫలించునన్నఁ జ
త్యనుమతి నామె భూమిని మ ♦ హాతపముం బొనరించె నిష్ఠమై. ౪౭౮

చ॥ అది విని వాసవుం డడలి ♦ యామెకు సేవ యొనర్ప నేగి వే
కుదిరి తదీయకార్యమునఁ ♦ గొండొక దోసము గాంచి మెల్లఁగా
నుదరము చొచ్చి యాకరువు ♦ హాయను 'మారుద' యంచు నేడు తుం
డ్లు దయతెఁ ద్రుంచి తున్కలకు ♦ నౌల మరుత్తు లనంగఁ బేరిడెన్. ౪౭౯

తే॥ ఈ స్థలం బిట్టి దచట మ ♦ హేశ్వరునకుఁ, బార్వతికిఁ గల్గి వాయువు ♦ వలన గంగ
వలన భరియింపఁగా రాని♦బలియుఁడు గుహుఁడు,డడరు శరవణ మది యని♦నుడువుచుండ

చ॥ యమ తను కాంతులం బెగడు - నచ్చపుఁ జీఁకటులం దొలంచి లో
కములను గాచు వేవెలుఁగు - కాంచనచేలుని నాభియందు మొ
ట్టమొదట బ్రహ్మ యుప్పతిల - డంబుగఁ బుట్టిన తమ్మివోలె సం
దము గల తేరితో విలస - నంబుగఁ బుట్టెను నిల సిరద్ధిన్. ౪౮౦

సీ॥ పొసఁగఁ ద్రిమూర్తులఁ - బోలెడు గాధజ, రామలక్ష్మణు లంతె - రయము మీఱఁ
గదలి యొక్తిని కనుల్ - గల స్పృహఫేశ్వరు, నెక్కరింతిగ మంతి - బెక్కు మగను
పడసిన శంభుక - పర్ణంబునుండి నిం, డిన మకరందంబు - చినుకు రేల
పూల నీడ్చుకొనుచుఁ - మోఁచుచు నిరుపిరుల్, వృద్ధి గాంచి తనఁ గా - వేరిఁ బోవ

తే॥ విమల జలపూర్ణ మైన యా - సింధువాఁటఁ, గాంచి దీని చరిత్ర సా - కల్యముగను
దెల్పవే యని రాముఁ డ - డ్గించి, నిట్టులని విశ్వామిత్రుఁ - డింపు నింప. ౪౮౧

## గంగా వృత్తాంతము.

సీ॥ మీఁవంశమునఁ బుట్టి - మేదినిఁ బాలించి, తగ నయోధ్యా మహా - నగరమందు
నెగడు విజయశీలుఁ - డగు సగరునకు వై, దర్భియాతలి కళ - త్రంబునందు
జనియించు నసమంజ - సుస కంశుమంతుండు, కలిగె రెండవ భార్య - ఖగ కులేంద్ర
సోదరి సుమతి యన్ - సుదతికి నుదయించి, రఱువది వేవుర - త్యధిక బలులు

తే॥ తండ్రి కొడుకుల కడిమికిఁ - దనిసి పూని, గొప్ప యశ్వమేధంబు బా - గొప్పఁ జేయఁ
గినిసి సుమనసుల్ దాని జిష్ణుకుఁ దెలుపఁ,గపిలు వెనుక యాగాశ్వంబుఁ-గట్టెనతఁడు

తే॥ హయము వెంటఁ బోవుచు నున్న - యంశుమంతుఁ,
డదఁ గలఁగి యింద్రుడు మోసంబు - నెఱుఁగలేక

వెదకి భువి యెల్ల గాలించి - విసిగి మరలి
తాత కా సంభవము నిశ - దముగఁ జెలిపె. ౪౮౪

తే॥ అతఁడు కొడుకులతోఁ జెప్పి - కుతిలపడఁగ, బాడబము చాడుపుల నుండి పడుచువారు
తడయ కిలయెల్లఁ దడవి పా - తాళ జగము, కానఁబడు దాఁకఁ ద్రవ్విరి - కడఁక విడక.

చ॥ పొడవు వెడల్పు లోఁతు పరి - పూర్తిగ నాముడ నొక్క నూఱు పెం
పెడలక త్రవ్వి యీాను దెస - నేగి రసాతలమందు మానముం
దొడరి తపించు కర్దమ సు - తుం గని చెంగటఁ దేజి యుండుటల్
మిడుఁగుఱు లుర్లఁ జూచి కడు - మిట్టిరి తిట్టిరి చుట్టి రాతనిన్. ౪౮౬

చ॥ తలఁగని కిన్కతోఁ డ ముని - తెల్లఁ జూఁ దుగ్రత రేక్షణంబులన్
జూఱచుఁ జూడ మున్ను శశి - జూటుని క్రోంజిఱువవ్వ చేతనే
పురములు బూదియైన క్రియ - భూప కుమారులు బూదియై ధరం
దెరలిరి వేగు లంతఁ జను - దెంచి వచించిరి చక్రవర్తికిన్

క॥ విని కుములి చింత కంపము, గనక పృథ్వి యంశుమంతుఁ - గని జన్నంబున్
బొవరుచుటా? నిలుపుట యూ?, యన నాతఁడుఁ జనియె యజ్ఞ - హయమును వెదకన్.

క॥ చని కపిలు నాశ్రమమునకుఁ, గని జనకులు బూదియైన - గతికిఁ దలరి య
మ్మునిఁ వేడ వారివృత్తము, వినిచి యతఁడు హయముఁ గొనుచు - నే పొమ్మనియెన్.

చ॥ అమలిన లేఖ్యవర్తి కర! - యట్టు లకల్మషచిత్తుఁడౌ ముని
ప్రముఖుఁడు దెల్ప మ్రొక్కి సగ - ర ప్రభు పౌత్త్రుఁడు వారువంబుఁ దే
ర మఖము పూర్తి చేసి యమ - ర పురంబులకున్ హవి స్సానం
గి మనుజ శేఖరుండు ధర - [illegible] పౌత్త్రున కిచ్చి యవ్వలన్. ౪౯౦

సీ॥ సగర సార్వభౌముఁడేగె - స్వర్గమునకు, సాగరులు త్రవ్వటం జేసి - సాగర మను
పేర నీరధి మహిమతో - వెలసె నంత, మంతుఁ డేలుచునుండె న - మ్మహీతలంబు.

చ॥ అతని కులంబునందె యమ - లయతంత్రి భగీరథుండు సం
స్తుతమతి పుట్టి రాజ్యమును - శోభిలు రీతుల నేలుచుండఁగా
గతము వసిష్ఠుని [illegible] - [illegible] కొండలమంది మేదినీ
పతి తిలకంబు చాఁగి గురు ♦ వర్యునితో నొకమాట యిట్లనెన్. ౪౯౨

చ॥ [illegible] తా [illegible] - గ్రాఁగిన మాతృ పూర్వులెల్లరున్
విపులతరార్తిమై నరక - వేదన నొందుచు నున్నవారె? వా
రు పడిన దుర్గతుల్ తొలఁగ - రూఢ యశః స్థితి నాకుఁ దక్కఁగాఁ
గృప నొక మార్గముం దెలుపుఁ - డీ యని వేడిన మౌని యంతటన్. ౪౯౩

తే॥ ధరణివర! వార లొక్క స ♦ ద్గతిని బొంద, నీవు కమలాసనుని గూర్చి - నిష్ఠ మెయిని
గొప్ప తపము కావింపు చే - కుఱు ఫలంబు, చింత వలదని యకలంక - శీలుఁ డనియె.

తే॥ ఉర్వి యెల్ల సుమంత్రున - కొప్పగించి, తలఁపునకు ననుపగు హిమ - ధరణిధరముఁ
జేరి పదివేలయేండ్లు భ - గీరథుండు, తపము సేయ విరించి ప్ర - త్యక్షమగుచు. ౪౯౧

చ॥ అరుదగు నీతపంబునకు - నందితి సంతస మింక సన్మ్రని
శ్వరు కినుకన్ గడించి చెడు - చావును బొందిన నీ పితామహుల్
నరకము దాఁటి సద్గతి గ - నన్ దలఁపొందిన వారి యస్థులన్
దీరఁ బ్రవహించు దేవనదిఁ - దప్పక గల్గును కోర్కి - యయ్యెడున్. ౪౯౨

చ॥ సుర తటినీ ప్రవాహము వ - సుంధరపైఁ బడ దాని వేగమున్
గిరిశుఁ డొకండె సైఁచు నిఁక - నేకి మెడం గల చాయ నొప్పు భూ
ధరసుత సర్ధదేహముఁ - దాల్చిన యంధకవైరిఁ గూర్చి నీ
వురు తప మాచరింపు - మని యొప్పుగఁ జెప్పి విధాత యేగినన్. ౪౯౩

తే॥ నృపుని పదివేల యేండ్లు సు - స్థిర తపంబు, సల్పి మెప్పింప నతఁడు ప్ర - సన్నుఁ డగుచు
నిష్టముం గోరు మని పల్క - నృపుఁడు పిదప, గడపె నైదు వేలేండ్లు గం - గను నుతింప

ఉ॥ గంగ వతాంగి రూపమునఁ - గాంచగ వచ్చి మహీంద్ర! యీ తపం
బుం గయికొంటి వేల? నడిఁ - బోంగెడు గంగ ధరం దిగంబడన్
బ్రుంగక సైఁచువారెవరు? - రుద్రుఁడు పల్కిన దక్కసక్కెమౌఁ
జెంగక ఘోరమౌ తపము - సేయుము నివరముల్ ఫలించెడున్. ౪౯౪

సీ॥ అని పల్కి యరుగఁగా - నా నరపాలుండు, చింతించి తనపట్టు - చెదరనీక
కేల జిల్లేడు మా - కేను నుమ్మెత్తయు, నిండి పసిండి వ - న్నియు మెఱుంగు
జడ గల్గి నిర్మల జాతవేదో జ్వాల, జ్వాలాకృతుండైన - శంభుఁ గూర్చి
ధ్యానించి రెండువే - లైదు వందల యేండ్లు, కడు నుగ్ర తపము పెం - పడరఁ జేయ

తే॥ మెచ్చి కైలాసవాసుండు - వచ్చి యిచ్చె, మోది యపరాజితుండయి - నృపవరుండు
గంగ పొంగుచుఁ బల్కు వా - క్యముల నుడువ, నగుచు నగధన్వియిటుల నె - నరవరునకు

సీ॥ ఇనవంశ్య! యొకచుక్క - యేని చిందఁగనీక, పట్టి కాచెద శంక - వలదు నీకు
నని సాక్షాత్కరించి తా - నరుగఁగ రెండు వే, లైదు వందల యేండు - లధిక ఘోర
తపము గావించి యం - తటఁ బత్రములును పు, వ్వాడి యోడిగిలు నీరు - కడకు గాలి
దినకరు కిరణముల్ - తిండిగాఁ గుదకది, పీడియు ముప్పది - వేల యేండ్లు

తే॥ కరుణచేత జగంబులు ♦ కరఁగి సురుఁగ, గాఢ తప మొనరించె గం - గయును దిగియె
మర్త్యలోకంబు స్వర్గంబు ♦ సంఘలింప, మొరయుచు ధరిత్రి తల్లడం ♦ బును వహింప

చ॥ హరుఁడును గాంచి మేటి జట ♦ యందునఁ జిందఁగనీక చుట్టె న
వ్వర నది తచ్చిరోగ్రమున, వర్తిలె నొక్క తృణాగ్రమందునన్
మెఱసెడు వారికణంబు క్రియ ♦ నిక్కలి దిగ్భ్రమ నొంద పోఁడు, శం
కరుఁ డడలంగ నేల యని ♦ కాఱఁగ జాతిచె నల్ప భాగమున్. ౧౦౨

సీ॥ గంగ యయ్యంగంబు ♦ రంగార భూరంగ, మునకు దిగుడు రాజు ముందు నడచె
నమసిన సాగరుల్ ♦ సద్గతి వడయుదు, రను సంతసంబున ♦ నతి రయమున
నట ధ్యాన మగ్నుఁడై ♦ యమరు జహ్నుని యాగ, శాల నవ్వంక ముంచంగఁ గాంచి
నాల్కలు చాచుచు ♦ నూల్కొను కోపాగ్ని, చెంది యూతం డఱ ♦ చేత వారి

తే॥ త్రావివైచె గంగను శిష్య ♦ తతులు వెలఁగ, రాఁ బ్రణతుఁడై యాతనిఁ ♦ బ్రస్తుతించి
జరుగువృత్తంబువివరింపఁ♦గరుణతోడఁ, గొనుచుఁబాన్మనిచెవినుండి- మునియువదలె.

చ॥ సురనది దూఁకుచుం గదలి ♦ చూఁడిన సాగర భూతిరాశిపైఁ
బరవఁగ దుర్గతుల్ దొలఁగె ♦ వారికి, దివ్యులు భద్రరావముల్
మొరయఁగ సన్నుతించి లలిఁ ♦ బువ్వుల సోనలు రాల్చి రమ్మహీ
వరుఁడు కృతార్థుఁడై మరలెఁ ♦ బ్రబ్బిన మోదముతో నయోధ్యకున్

చ॥ అలమిన యండగోళముల ♦ కావలిదై కమలాక్షు లోకముల్
గొలిచిన కాలఁ బద్మజుఁడు ♦ గొన్న శుభంకర పాదతీర్థమై
తెలిసి భగీరథుండు గొని ♦ తేర హరుండు శిరంబునం గొనన్
బొలసి యిలాతలంబుఁ బరి ♦ పూత మొనర్చెను గంగ యిప్పుడిన్. ౧౦౫

తే॥ కడఁగి సాగరులకు మేలి ♦ గతులు గూర్పఁ, దపము సేసి భగీరథ ♦ నృపుఁడు దేర
గంగ భాగీరథి యను నా ♦ ఖ్యం దనర్చె, జహ్నుచెవినుండి రాఁ జనె♦జాహ్నవియన

చ॥ అని ముని పల్క నచ్చెరువు - నందుచు వందన మాచరించి గం
గను తరియించి యవ్వలఁ ద - గం జనుచుండ విశాల పట్టనం
బున వసియించు ధర్మ పరి - పూత చరిత్రుఁడు పార్థివుండు క
న్గొని శుభ వార్త లాడి తమ - కుం గురుపూజ లొనర్చి పంపఁగన్. ౧౦౭

విదేహ దేశ వర్ణనము.

సీ॥ నిద్దుర వీడిన ♦ నీరజంబులు గ్రాలు, పొలముల నారణ ♦ పులుఁగు లలరి
కలుపులు దీసెడి ♦ కలుకుల తళుకుల, బెళుకుల కనుల నీ ♦ డలను గాంచి
బేడిన విరాలించు ♦ వేగ వచ్చి పొడిచి, బ్రమ పాటునకు బిడె ♦ పదుచు నుండు
నురు కౌల తోట ♦ పరివేష్టితంబయి. యింభా విదేహదే♦ శంబు చేరి

తే॥ కలుపుగా నూడ్చు కలువలు ♦ కంజములును, కన్నులం బోలెఁ గానరాఁ ♦ గలుకు లుదరి
చూపులం ద్రిప్పికొనఁ బ్రియుల్ ♦ సూచి విసుగు, చుండు పొలములు విలసిల్లు ♦ చుంటఁ గాంచి

సీ॥ అందలి తోఁటలం ♦ దనకట్ట తూఁముల, ధ్వనులు మృదంగని ♦ స్వనము గాఁగ
నరవిరి నంకేళి ♦ విరు లంద మొప్పారు, ప్రపమల లసిత దీ ♦ పములు గాఁగ
నరములఁ బోలి సో ♦ నలు కాఱు తేనియ, పరఁగు పుష్పమాలె వి ♦ పంచిగాఁగ
విరి దమ్ములం జెవి ♦ విందులుగా మధు, పము లొనర్చు రొదలె ♦ పాట గాఁగ

తే॥ సతత ఝిల్లీ రవంబులు ♦ శ్రుతులు గాఁగ, సకల పక్షులు గను సభా ♦ సదులు గాఁగ
నెగడఁ బురి విప్పి నెమళులు ♦ నృత్యలీల, నలుపుచుండుట గాంచు ♦ యవ్వలికిఁ జనుచు

సీ॥ కొలఁకుల యందు ని ♦ క్కలి మన మలరించు, సంచయాల నడ ♦ యందము గని
తమ చుట్ట లనుచు హం ♦ సములు వెంబడి రాఁగఁ, గలకంఠకంఠులు ♦ జలములందు
పొంకంబుగా నాడఁ ♦ గుంకుమ పంకంబు, రహి యాండల్లంటఁ బ ♦ రస్వరంబు
కలహించు ఖగములఁ ♦ గాంచి నదులయందు, నెనుముల పొదుఁగుల ♦ నెసయు రసము

తే॥ తరువులఁ గామాపఫలములు ♦ గురియు రసము, చెఱకు గానుఁగులందుండి ♦ తొరఁగు రసము
తేనె పెరలఁ గాఱెడి తాప ♦ సోన రసము, తొక్కఁ దెలినీరు సేకుంట ♦ చొక్కఁ గనుచు.

సీ॥ కొండ కొమ్ములఁ బోలు ♦ గురు కుచమ్ముల ప్రేఁగు, మోవఁజాలక నూలి ♦ పోఁగు కంటె
సన్ననౌ నడుములు ♦ చలియింప వర్షంబు, వంటి చూపు లొలయఁ బడఁ - తులాడు
నాట్యశాలల మృదం ♦ గ ధ్వని కులికి లే, బత్త్రాలు మడుగులఁ ♦ జాఱి కలఁప
వాలుగల్ దరిఁ బోక ♦ పాళల కుఱుకుట, కఱకు చూపు కటారు ♦ లొఱల నడఁగ

తే॥ మునిఁగి క్షీరాబ్ధిఁ దోఁచు ల - క్ష్మిని దలంపఁ, జేసి నీటి పిట్టలతోడఁ - జేతి బిగువు
తెల్లగాజులు మొరయ మ - దించి నీట, నాడు తలిరుఁబోఁడుల జల - క్రీడఁ గాంచి.

## అహల్యా శాపముక్తి.

సీ॥ హర్ష మొందుచు విదే - హారామములఁ జూచి, వెలలి ప్రాకార సం - వేష్టితమగు
మిథిలా నగరి కొక్క - మేటి యలంకార, మై పొడవైన ధ్వ - జాళి వెలయు
బయటి ప్రహారికి వె - ల్వల వచ్చి నిల్వ గా, ర్హస్థ్యోచితము పతి - వ్రత గుణంబు
పదరి పాడొనరించి - భర్తృ శాపంబున, రాయియై పడియున్న - రామ యపుడు

తే॥ రాము పద ధూళి సోఁకఁ బూ - ర్వంబు మనసు, నలము సజ్ఞాస మత్తత - దొలఁగ నెఱుక
దేఱ రూపాంతరం బొంది - దేవు నెదుటఁ, బొలుచు జని పోల్కిఁ దొలి రూపు - తొలఁక నిలిచె

ఉ॥ క్రిందికి గంగఁ దెచ్చిన భ - గీరథు వంశమునం జనించు నో
సుందర! తృప్తిమై మెఱుపు - చొప్పునఁ గ్రేవ నొదింగి నిల్చు నీ

రని వేఁడఁ జ్వాలల - నార్చు రుద్రుని - పోలెఁ, గ్రుద్ధుఁడై కను మునీ - ద్రుండు నంత
సతియెడ దయతోఁ బ్ర - సన్నుఁడై వనమాలి, రాముని శ్రీపాద - రజము సోఁక
తే॥ నీయథారూపమొందుదో-నెలఁతయనియె,నింద్రుఁగోని నిలింపులుముని-యెడకువచ్చి
వేఁడ నతని యోనుల మార్చి-వేయి కనుల,నిచ్చి పంపె నహల్య రా-యిగను పడియె

సీ॥ ఇది గత వృత్తాంత - మిఁక లోకమున నెల్ల, ప్రాణులు సుఖముగా - బ్రతుకుఁ గాక
దుఃఖ కారణమును - దొరయునే? జగములు, నీవు చే విల్లూని -నిలిచి యుండ
కర మహిమంబును - గంటి నచ్చట నంజ, నాద్రిఁబోల్ తాటక - నడఁచి నపుడు
శిల యగుచు దిక్కులే - కిలఁ బడిన యహల్యల,మనుప నిచ్చట సంస్థి - మహిమ గంటి
తే॥ అనుచు నిర్మల గుణుఁడు కౌ ♦ శికనది వినుచుఁ,దల్లి!పతి కిరుణింప నా ♦ తని భజింపు
గతముదలఁచిచింతింపక♦బ్రతుకుమనుచు, నామెకెఱఁగెరాముఁడు,వార ♦ లవలఁదరలి.

సీ॥ ఘన తపోధనుఁడగు - గౌతము నాశ్రమ, స్థలిఁ జేరఁ ద త్త్వజ్ఞ - జ్ఞాని యంత
నతిథులఁ గని కని - సితి మానస్సుఁడయి, యెదురేగి తెచ్చి స - మ్మదముతోడఁ
గావింపఁ దగిన స - త్కారమ్ము గావింప, గాధేయుఁ జూతని - గాంచి పలికె
నంజనాచల లీల - రంజిల్లు మొగల, శ్రీరాము పద రజ - శ్రీ వహించి
తే॥ మాలతీ లతఁ బోలెను - మధ్య మొప్పు, నా యహల్య పూర్వాకృతి - సందె నీవు
నెద దోసఁగుఁ జేసె నతిని గ్ర - హింపు మనఁగ,బమ్మఁ బోలిన యమ్మని - నమ్మతించె.

చ॥ తమి గొను సద్గుణాళియుతు - నారతయుం గల రాముఁ డంత గౌ
తము పదాబ్జములు శిరము - దాఁకఁగ మ్రొక్కి - ప్రదక్షిణించి యు
త్తమసతి నా యహల్య ముని - తల్లజు కై వసమ్ముం బొనర్చి మో
దము యతీంద్రు సేయఁ బని - తమ్ముని తో నటనుండి పోవఁగన్. ౫౨౪

౧౦. మిథిలాప్రవేశ పటలము. (౧౫౭)

ఉ॥ లక్షణం లక్ష్యమైన నిమ ♦ లాసతి రంజము విడి నా తలం
బక్షయమై ఫలించ నటు ♦ నిర్మల పచ్చి జనించెఁ గాంచు మా
రాక్షసవైరి!చేకొనఁగ ♦ రమ్మని యమ్మిథిలా పురంధ్రి సం
శిక్షిత రీతిఁ జాఁచు గతి ♦ చేతులఁ బిలిచెఁ పతాకములు ౫౨౫

చ॥ ఇతరు లనర్హు లంచుఁ దగి ♦ నే తగ దాక్ష్యము సేయ లోక సం
స్తుతి సుగుణాకరన్ భువన ♦ సుందరి జానకిఁ బెండ్లియాడ నం
చితి గుణుఁడై న రాముఁ డిటు ♦ వచ్చెర వచ్చెడి నంచు నచ్చరల్
జతపడుచున్ నటించు క్రియ ♦ సౌధములందు ధ్వజంబు లాడెడిన్. ౫౨౬

చ॥ హరి కిరణంబులన్ మఱుఁగు - లై గగనంబును క్షీరవార్ధి యన్
పరుసున గొనరా నుపరి ♦ భాగములందు పటంబు లొత్తుగాఁ

గొఱలుచుఁ దెల్లనై మొగులు ♦ గుంపులఁ దాఁకుచు నాని తేమయై
హారువగు ధూపసంతతుల ♦ నాఱుట వారలు గాంచి రయ్యెడన్. ౫౨౭

చ॥ అమృతముఁ గుంచె నద్దుకొని ♦ యంగజుఁ డంగములన్ లిఖించు నే
ర్పమరఁగ చూచి చూచి భ్రమ ♦ మందుట దక్కఁగ నెగ్గలేని సౌ
రమరిన జానకిం బడసి ♦ నందున లక్ష్మి వసించు తమ్మి చం
దమున వెలుంగు నమ్మిథిల ♦ దాసిరి లోనికిఁ జొచ్చి రంతటన్. ౫౨౮

చ॥ నుడువుల లీ రెక్కింగిన ఘ - నుండగు కుంభజుచేతఁ ద్రావఁగాఁ
బడిన మహాబ్ధి చందమున - భంబులు పర్వ నభంబు చాడ్పునన్
బెడఁగు శశాంకఫాలలును - వీరులు వేసటఁ బాఱవై వఁగాఁ
గెడసిన భూమిణాళి గల - గీముల వీదులఁ బోయి రంతటన్. ౫౨౯

చ॥ నడచిరి యంకుశంబున క ♦ ణంగని కొండలఁ బోలు నేనుఁగుల్
విడుచు మదాంబుధార లొక ♦ వెల్లువయై తురగాల నుర్వుచే
వడి నొక మార్పు చెంది రథ ♦ వర్గము లెప్పుడు సంచరింపఁగా
నడునయి దుక్కయై బహు ద ♦ శాంతరము ల్గొను రాజవీథులన్. ౫౩౦

చ॥ నడచిరి రెండు ప్రక్కల ఘ ♦ నంబగు ప్రేమ మొకింత త్రెంపు లే
కడరి యనంగసంగరము ♦ నందు పెనంగి యలంగు బోట్లకె
వడిన వియోగ బాధ గల ♦ పల్లవపాణులు కిన్కఁ ద్రెంచు ఫ్రా
వడములఁ దేస యోడిగిల ♦ పంకము నొందిన రాచవీదులన్. ౫౩౧

సీ॥ కర పల్లవాంగుళు - లొరయ జనించిన, వీణారవము చెవి - విందు సేయ
శ్రావ్యంబుగాఁ బాడు - సరసిజాక్షుల గీతి, కా భావములు మదిఁ - గరఁచు చుండ
గంభీరమగు మృదం - గ ధ్వనుల్ పొందికఁ, జెలఁగి మిక్కిలిగ ఘో-షించుచుండ
హాస్తాభినయమున - కనువుగా నయనాభిఁ, నయము నయంబుగ- నడచుచుండ
తే॥ నయన నటన కుద్దిగను మ ♦ నంబు వోవ, భావ గతులును వెన్వెంటఁ ♦ బరుగులాడ
నున్నవో లేవో యను కౌనులూఁగి యాడ, లలన లాడెడు నాట్యశాలలను గనిరి.

సీ॥ పగడాలఁ బోలిన - జగడాలు గెలులును, మరకతచ్ఛాయల - వఱలు బోదె
లలరిన పోక ప్రమాఁ - కులలోనఁ బొడవుగా, వ్రేలాడుచుండు ను- య్యాలలందు
పాపజన్మముఁ బోలె - వచ్చుట పోవుట, మెడ తెగ కుండఁగా - నడరు చుండ
బడతుల సన్నని - నడుములకో యన, భ్రమరముల్ ముసరుచుఁ-బరితపింప
తే॥ యువకుల మనస్సు లల్లల యు - ల్లూఁత లూఁగ, నాకవనితలఁ గాల్దన్నివ్వ-నయముదోఁప
మింటికిం గాళ్లు చాఁచుచు - మీఱి మొగసి, యూఁగు వారల బాగోగు - లోలిఁ గనిరి

ఉ॥ మేరకు మీఱు రత్నములు - మేలి కడానియు నాణి ముత్తెముల్
వారణ దంతిముల్ చమర - వాలము వీలియుఁ దావి కట్టెలున్
వారి కృషీవలుల్ గనిమ - వారక పోయు దరుల్ గలట్టి కా.
వేరిని పోలు నంగళులు - పెక్కులు గాంచిరి వారు ముందరన్. ౫౩౪

ఉ॥ కామశరంబు కవ్వము ర - కంబునఁ గాఢ నసూత్కరంబుఁ బోల్
ప్రేమ గలట్టి కాముకుల - రీతిని భూమిధర ద్వయం బనన్
సామజముల్ పరస్పరము - సంధిలి తొండము లెత్తి కిన్కతో
దీమస మొప్పఁ బోరుటలు - తేఁకువఁ గాంచిరి వార లంతటన్. ౫౩౫

సీ॥ పడుచులు వాఁడి గో - ళ్ళ దరు చిగురుఁ గేలు, నొవ్వులఁగ వీణియ - చెవులఁ బట్టి
యొడిసిప కిల్లు నా - నొప్పు నరమ్ములు, చాఁగఁ దంత్రుల శ్రుతి - చక్కఁ గూర్చి
హస్తాంగుళుల త్రోవ - నఖులు గోవఁగ, నఖుల దరి హృద - యంబు చనఁగ
వెలిదంతముల కాంతి - వెలునడ శ్రవణపే, యంబుగఁ దేట భా - వంబుతోడ

తే॥ జిలికి గానామృతంబు వ ♦ ర్షించుచుండ, వశము దప్పి యొదలు పర ♦ వశత నొంద
గర్ణ పుటముల సంతృప్తి ♦ గనక త్రావి, నడచి ర మ్మువ్వురును రాచ ♦ నగరి వీథి

సీ॥ కుమ్మరిచే వడి ♦ సమ్ముగాఁ దిరుగు చ, క్రము బోలె గుండ్రన ♦ గాఁగఁ దిరిగి
పెద్దలతోఁ జేయు ♦ పెరిమి చెలిమి నా, నడుమంతరంబునఁ ♦ గడఁక విడక
జ్ఞానుల తలఁపుల - చందమ్ముగా గురు, మతి నిశ్చలత్వ మే ♦ మఱక గలిగి
బ్రహ్మాంబుభాతిఁ జ - ర్మంపుఁ బతుపులకు, నిట్టిట్టిదని సుంత ♦ యెఱుఁగ రాక

తే॥ పైఁడి కల్లముల్ మొగముప్పు - పట్టు జీను, పగిలి కుచ్చులుమున్నగు - బాగనులొప్ప
నురుగులు వచ్చుచు నేడెఁ ♦ బరుగువాఱు, పటివారువములఁగాంచి♦మించిచనుచు

ఉ॥ కోచిన యాఁకులున్ వలపు - రాయని విండ్లు శిలీముఖ ధ్వనుల్
మోఁచిన సీల కుంభలము - లున్ నులి కొనులు దాల్చి యప్పుడున్
సైఁచిన కందు నీఁగి మణి - సౌధ గవాక్షములందు సొంపుగాఁ
దోఁచిన చంద్ర బింబములఁ - దూకొని కాంచిరి వార లత్తఱిన్. ౫౩౬

కవిరాజ॥ పటికపు గిన్నెలఁ బోసిన క్రొత్త ను - వాసన వీచెడు తేట కలున్
దిటవుగఁ ద్రావి బయల్పడు నవ్వునఁ-దీరు తడంబడు పల్కులతో
స్ఫుటమయి డాఁగిని నెయ్యపు టల్కను -పొల్పుగఁ దెల్పెడి మూఢ్కి వగల్
పటువగు కైపు వెలార్చు బెడంగగు - పద్మనికాయముఁ గాంచి రొగిన్.

మానిని॥ కాయ సుఖంబు సమంబుగఁ జెందియుఁ ♦ గాముక పాళి పిమోహితులన్
జేయుచుఁ బై వెలయుం గొను వేశ్యల ♦ చిత్త మునన్ స్ఫటికం బనఁగా

నా మెలనాఁగల కాటుక చూపుల ♦ నచ్చను నల్లనివై కయిఁ గొం
జాయఁ దనర్చుచు రంగుల మార్పుల ♦ జాసగు బంతులఁ గాంచి రొగిన్.

కవిరాజ॥ కడియము లుంగరముల్ మణి చేరులు ♦ కమ్మలు వీణలు వస్త్రముల్
బడలుగఁ బందెము లుంచి సువాసిని ♦ పాశము లూఁగఁగఁ గుక్కమొగం
బడరెడు స్ఫాటిక శారులు రక్తిమ ♦ నందఁ గరంబులఁ బట్టుచు ను
క్కడమగు నీఁటెలఁ బోలిన కన్నుల ♦ కిన్నెక లాడుట గాంచి రొగిన్.

చ॥ నలినము లుత్పలంబులును ♦ నాఁచును తీవియ లాకు లెట్టినో
ఫలములు సైకతంబులును ♦ వాలుగ బేడిస మీలుఁ గోకముల్
వెలవెల పోవఁగా దమకు ♦ వే యుపమల్ తగ లేని యంగముల్
గల చెలు లీదు డిగ్గియలఁ ♦ గాంచిరి పెక్కులు వారల త్తటిన్ ౫౪౨

చ॥ అతి చపల స్వభావమయి ♦ యచ్చటి కిచ్చటి కద్దు నింద్రియ
ప్రతతికి లోఁగి పర్విడు ♦ భావము భాతిఁ జలించి చింతల
గతులఁ జరించి మై సలఁదు ♦ గందపుఁ బూఁత రవంత రోని సం
చ్యుతి గనినట్టి కత్తు లను ♦ పొందఁగఁ ద్రిప్పెడి వారిఁ గాంచుచున్. ౫౪౩

చ॥ ఇన సమ తేజులన్ గొతుక ♦ కిచ్చెడి వారల భర్గు నింటి ని
ప్పూఁ బడి లక్కయై కరఁగి ♦ పోవని మారుల విల్లు దాల్చు న
ట్టని కరముల్ గలారి నుదు ♦ రాజ నిభాస్యల యల్కఁ దీర్చు చ
ట్టుపఁ గపు నెట్టనో పలము ♦ డుల్ గల వారలఁ గాంచి రంతటన్ ౫౪౪

ఉ॥ చక్కెర పాగుఁ బోలిన వ ♦ చస్సుల చిల్కలతోఁ బల్కుచున్
బొక్కలి సిగ్గు నొందిరి ♦ మొల్లలు పెద్దగఁ బోలు సూనముల్
చొక్కటెఁ గోయుఁ గేకి మరి ♦ చాంపా లతాంగుల కంచ లోడి లో
స్రుక్కఁగఁ జూచి తేఁటి గమి ♦ క్రోల్చు వనంబులఁ గాంచి రొక్కెడన్ ౫౪౫

చ॥ అమరులకున్ వసింపఁ దగు ♦ హారి పురమ్ము సౌధపాళి యా
చ్చమరిన నీడలో దివము ♦ నందము నచ్చొరఁ జూపి గంగ చం
దమున గభీర మై యరిని ♦ దారుని యంబిపురంబు చుట్టు క
ద్యముఁ బరి గొన్న కందకము ♦ నంతటఁ గాంచిరి వారు డాయుచున్ ౫౪౬

ఉ॥ పూవుల తావి పేర్మి నవురు ♦ పొన్నుల మెఱుంగును తేనె తీపు సం
భావిత సత్కవిత్వ పరి ♦ పక్వ రసం బుపమిల్లు రాజక
న్యావలి యున్న యోవరుల ♦ హంసలు గుంపులుగా చరింప సొం
పై విలసిల్లు ముంగిళుల ♦ నంతటఁ గాంచిరి వారు డాయుచున్ ౫౪౭

## సీతారాముల పరస్పర వీక్షణము

చ॥ పొగడఁ దొడంగు-చో బలుకు ♦ బోటి మగండగు బ్రహ్మయాదిఁగా
నెగిలిన సత్య పీంద్రు లుప ♦ మించి నచించెడు లక్ష్మియే స్వయం
బుగ విజయంబు చేయఁ దఁ ♦ పోలిమిఁ బల్కఁగ నామె దక్క వే
ఱుగ నుపమాన సారసి దొ ♦ ఱుంగఁ దరంబె? నుతింప సాధ్యమే? ౫౭౭

సు॥ గిరిజాద్యుత్తమ సాధ్వులుꣳ దలలు కే ♦ లీలించి మొక్కంగఁ ద
గ్గ రహిꣳ సద్గుణరాశియౌ జనక రా ♦ ట్కన్యా విలాసంబు ని
ర్జర వర్యుల్ బులకించి సౌరు సొలిసే ♦ రం గాంచఁ గాంక్షించియే
తెఱగం ద్రిత్తి వేయి రెండు కన్నులును బ్రాఁ ♦ తిం గాంచి లేవంద్రుడు సూ ౫౭౮

సీ॥ హరిణంబుఁ గూర్చి పే ♦ రందిన కుంతంబు, కొల యలవాట్లైన ♦ యలుఁగు వాలు
వెనుదీయ నాలుగల్ ♦ వెఱగొందఁ జలియించు, కను గొందు జానకి ♦ కవ్వపు మల
తిరుగఁ గో యని యూర్చు ♦ వర దుగ్ధ వార్ధిలోఁ, గాక యా శుద్ధాంత♦కాంత లచటఁ
గాంచిన యమృతంబు ♦ కరణి నొప్పినయది, యిక్కన్యఁ బోలు వే ♦ ఱొక్క కన్య

తే॥ నొనరుపు మటంచు సురలు వేఁ♦డినను బ్రహ్మ,వలన నిక నైన సృష్టింప♦వలనుపడునొ?
అమృతభుక్కులు బలిమాల♦నబ్ధియొని, యిచ్చు సుధ దక్క వేఱెద్ది♦యీయఁజాలు?

తే॥ వలచి వేల్పులు తడవు ప♦ప్సరస లెల్ల, సీత మేనియందము గాంచి ♦ సిగ్గుపడుచుఁ
కంది కుందిరి వారి మొ♦గంబు లనెడి, యబ్జ మండలములకు నె ♦ ల్లపుడు పగలె ౫౭౦

తే॥ ఇమ్మగువ పంకజమునుండి ♦ యిలకు రాఁగ, ఘోర తపమాచరించిన♦వారు సురలొ?
జగమొ? విప్రులో? స్వర్గమో?♦నగమొ?యెదియొ?,దీనినిజము నిజంబుగ♦దెలియలేము

చ॥ అరయఁగ వేఱు వేఱు నను ♦ లందని సుందరు లండ నిల్చి యో
వర మృగనేత్రి! తల్లి! మధు ♦ వా! యరుదౌ సమృతంబ! యంచు నం
బరమున దూరపుం బుపులఁ ♦ బజ్జను హార్వఁగఁ జల్లి నిల్వ న
వ్వరులపయిꣳ గమించు నలి ♦ వేణి సుఖంబుగ మెల్ల మెల్లనꣳ ౫౫౩

చ॥ మృదులపదంబులꣳ బసిఁడి ♦ మించులు గజ్జెలు దాల్చి కొనునꣳ
వదులుగ మేఖలꣳ మెడను ♦ నాఁడెపుఁజేరులు పూల మాలలుꣳ
ముదితలు కూర్చి కాంచ మెఱు ♦ ముల్ శతకోటులు సేవ సేయ నొ
ప్పిదముగ మించు రాణి ప్రభ ♦ నించె ననం దగి సీత యొప్పెదుꣳ ౫౫౪

ఉ॥ చంపెడి కుంతముꣳ శమనుఁ ♦ జక్కఁగఁ గెల్చును గెల్చునంచు బీ
రంపు నుడుల్ వచింపఁ దగు ♦ రాణ వెలింగెడి కన్నులొందె వ
ర్ణింపఁగ వీలు కాని నవి ♦ నిల్వనఁ గాంచిన పర్వతంబులుꣳ
బెంపగు గుండ్లు గోడలును ♦ పిల్లుఁ గరంగి ద్రవంబుగా నగుꣳ ౫౫౫

శా॥ ప్రేమానందము గూర్చు నేత్రములకున్ ♦ వీక్షింపఁగాఁ బండువై
యామోదంబును పెంప నెల్లరు జగలే ♦ జాతుల్ గనం గౌతుకం
బీమాడ్కిం గలిగించుటన్ జెలులకే ♦ యింపౌ సుధం బోలు కాం
తామతల్లిక సీత రామునకు ♦ నే తాత్పర్యముం గూర్చునో? ౫౫౭

ఉ॥ భూషలు కుండలాదు లని - మున్ను సువర్ణముఁ బోలి శైత్యముం
బోషణ చేయు చూపు గల - పొల్తులకెల్ల నలంకృతంబులై
యోషలమిన్న ధాత్రిసుత - యుప్పతిలన్ భువి సోమరత్నయు
గ్భూషలు మేటి భూషణముఁ - బొందినవై విలసిల్లె నెంతయున్ ౫౫౮

తే॥ ఊహ కరుదైన సౌందర్య - మొందు సీత, యిట్లు నిలుచున్న నిర్వుర కన్ను - లెనసి యొకటఁ
గలిసి యిర్వుర తెలువులు - కలఁకవాఱ, గాంచె రాముఁడు సీతయుఁ - గాంచె నతని

చ॥ జనకజ చూచు చూపులను - శాణ విఘర్షణ కుంఠ యుగ్మమా
ఘన బలుడైన రాము భుజ - కాండములన్ దగ వ్రాలె ఘల్లనన్
ధ్వనిగొను వీర మద్దియలు - దాల్చిన రాముని చూపుఁ దేట్లు వ్రా
లెను జలజాత సద్మ లవ - లీ లలితాంగి ముఖాంబుజంబుపై ౫౫౯

చ॥ వలపు వహించు చూపు లను - పాశముచే నిరు మానసంబులున్
బలముగ లోఁగి లాగఁబడ - భాను కులాంబుధి సోము మానసం
బల జనకాత్మజాత యెద - యందు వసించెను సీత మానసం
బల రఘురామచంద్రు నెద - యందు దగుల్కొనెఁ జిత్రవైఖరిన్ ౫౬౦

చ॥ కన నడు మింత లేని జన - కప్రభు పుత్త్రియు శుద్ధ మానసుం
డనఘుఁడు రాముఁడుం గలిసి - యంచితమైన తను ద్వయంబునం
దునిచిన యొక్క ప్రాణమన - నొప్పిరి; మున్ను సుధాబ్ధి శేష శ
య్యను జత వీడి యిప్పు డరు - దందఁగఁ జేరుటఁ జెప్ప శక్యమే? ౫౬౧

ఉ॥ అంతము లేని సుందరత - నందిన రాముని గూడలేని వ్యా
చ్చింతను గుంది సీత యొక - చిత్రపటంబును బోలి యుండెఁ జే
ర్వంతఁ దలంపు బెట్టు చెలు - వంబును దార్ఢ్యము వెస్బడన్ మహీ
కాంతుని పుత్త్రుఁడున్ దపసి - కౌశికు వెంటఁ జనెన్ మఱుంగుగాన్ ౫౬౨

## సీతాసంతాపము.

తే॥ అట్లు వనమాలి కనుమఱుఁ - గై నయంత, నెడఁదయును మదద్విరదంబు - దృఢత యనెడి
యంకుశముఁ ద్రోచివైచె స్వేచ్ఛానువృత్తి, సిత యాఁడుఁదనం బెట్టి - స్థితి భజించె?

చ॥ తనకు రఘూత్తముం డెదురు - దార్కొన సీత మనంబు మేను ప
ల్చనిదగు పోఁగు వంటి తన - జానగు కౌనును బోలె నూఁగఁగాఁ

దనుకుచుఁ గాల్వవంటి కను - దమ్ములఁ ద్రోవను లోనికేగి ప
ర్వెను మరుబాధ దుగ్ధమున - పడిన చేమిరి పర్వు కైవడిన్ ౫౬౪

ఉ॥ నొచ్చును రానురాను గడు - నూల్కొని వర్ధిలు కామవేదనం
బచ్చుగఁ జెప్పలేక యెద - యంచ తలంచి కలంగ, మారుఁడున్
హెచ్చుగ మండు కుండమున - నింధనముల్ మఱి వైచు పోలికన్
బుచ్చెను వాఁడి పుంములికి - పూర్తిగ నామె మనంబు గాఁడఁగన్ ౫౬౫

తే॥ నేయి పూయక నిప్పున - నేయకుండు, వాఁడి యూఁచెను పోలి శ్ర - వములఁ దాఁకు
కనులు గల సీత వలువతో - మనసు నలఁగ, వహ్నిఁ బడిన పూలతవోలె -వాడి పోయె

తే॥ ఉలియు మేఖలను ధృతిని - వలయములను, నాడు మనసును తెలిపిని - వపువన్నెఁ
దొరఁగి జానకి, వేల్పులు - తరవ నెల్ల, విడిచినట్టి కడలిఁ బోలి - పేద యయ్యె ౫౬౬

చ॥ నగలునుపీడ నాడుసుగ - నానయునూడ నొయ్యార మందముం
దొలగడుగఁ బూఁడ మూరు పిరి - తూష్ప స్తనాంతర మందుగ్గాఁడఁ దీ
పగు నసువుల్ తపించి యురి - యూడ మొగంబును వాడఁ గాంచి వే
మగువలు జానకిం గొని శ్రి - మాపడి లోనికి నేగి రంతటన్ ౫౬౭

ఉ॥ కమ్మలఁ బట్టి మ్రింగు గవు - కంబుక వచ్చిన వీరాలఁ బోలు నే
త్రమ్ములు గల్గు జానకి ప - దమ్ములఁ గలను పో ల్చివుళ్ళ మొ
త్తమ్ముల నొత్తుగాఁ బఱపి - దండిగ గొజ్జఁగి నీరు చల్లి శై
త్య మ్మొకింతొట్టు పానుపున - నల్లఁ జేరిచి రంత మైథిలిన్ ౫౬౮

సీ॥ గిరిసెనఁ బోలి మంచుసకుఁ - గీడ్పడు తూంట్లు గలట్టి క్రొత్త తా
మర కొలఁకున్, గటారి కెస - మూఱని రాహువు మ్రింగినట్టి చం
దురు సరి పోల్పఁగాఁ దగిన - తోయలి మైథిలి తాని విచ్చు క్రొం
వ్విరి తలిమంబునం దొడలు - వేసటఁ జేర్చెను నెచ్చ నూర్చుచున్ ౫౭౦

సీ॥ చినుకులు పర్వతాగ్రమునఁ - జిందిన సంచునఁ జూచుకద్వయిన్
గనుఁగవనుండి ముత్తెముల - కైవడి బొట్టుగ నశ్రు బిందువుల్
చినికెను;వింటి కోపు లలిఁ - జెన్నగు నెన్నుదుటన్ జెమర్చి క్రాఁ
గు నెసటినుండి లేచు పొగ - కోపగు నూర్పుల మాసెఁ బిమ్మటన్ ౫౭౧

సీ॥ నిలుకడయై బలిష్ఠమగు - నెమ్మది గల్గియు వేఁటకాని తూ
పుల నిలఁ గూలు నమ్మిలిని - పోలిన యాయమ క్రాఁగుచున్న లో
పలి మదనాగ్ని మండి పొగ - వాఱఁగ మిక్కిలి వాడి వత్తలై.
మలఁగెడు పూలతంబలె శ్ర - మంబున గ్రుంగి యొఱంగెఁ బాన్పుపై ౫౭౨

చ॥ పొటుతునఁ బాన్పు క్రొవ్విరులు - బొందిని గ్రుచ్చుకొనెం జుఱుక్కనన్
జిటపటఁ దక్కలాహపును - చిట్లి మిడుంగులు లట్లు రాలె ను
త్కట మదనాగ్ని చే సరుల - దారము తాఁకి తెగెం బటాలునన్
బొటపొట నశ్రుపుల్ చెదరి - బొగ్గులె యయ్యెఁ బ్రసూన దామముల్.

తే॥ దాదులును తలులును చెలుల్ - సోదరులును, మిగులఁ జింతించి మనసులు - నొగుల నేమి
వేంద్రఁ మిది యని తెలియక - విరి వసంత, ముసను వృష్టి తీసిరి మీఁదు - మొనసి కట్టి.

క॥ ఆలావర్తము విసరు, గాలియుఁ గామాగ్ని వృద్ధి - గావింపఁగ భూ
పాలి విరిసరులు మాఁడఁగ, బాలికయుం గరఁగుఁ బైఁడి - ప్రతిమం బోలెన్. ౫౭౫

చ॥ విరివడముల్ ధరించి విరి ♦ విం గొను చీఁకటి కాన యొక్కొ? సుం
దరతర మైన స్తంభములొ? తద్భుజ యుగ్మమొ? కాకయున్న పెన్
మరకత పర్వతంబులొకొ? మంజుల పద్మయుగంబొ? కన్నులో?
యురువు వహించి విల్లు గొని ♦ యుర్వికి డిగ్గిన మేఘమో? యనున్ ౫౭౬

ఆ॥ మదిని చొచ్చి దిటవు ♦ మానినీత్వంబును, కరఁచి జీవములను ♦ గలఁచు వాని
మలల మాఱు మసలఁగ ♦ భుజంబున నొప్పు, విల్లు చూడఁ జెఱకు ♦ విల్లుకాదు

ఆ॥ స్త్రీస్వభావమైన ♦ సిగ్గు వదంబు నా, మనసులోని తెలివి - మఱచి పోయెఁ
గాల్లు నొవ్వ నేలఁ ♦ గదలఁ యాతఁడు, కనుల త్రోవఁ జొచ్చు ♦ కన్నగాఁడు ౫౭౭

తే॥ ఇంద్రనీలంబులంబోలి ♦ యురులు గ్రమ్మ, కురులు నాజానుబాహువుల్ ♦ కొమరు మోము
కప్పు కాల భుజమ్ములే ♦ కావు; స్మితము, మొనసి నాజీవముల లాగి ♦ కొనుచుఁబోయె

తే॥ చూచు వారల యసువులఁ ♦ జూఱలాడు, పరపువశుమ్ము డుగుఁదా ♦ మరలె కావు
మదపు టేన్గు పోలెఁ జనిన ♦ మంద గతులె, నాయెడఁదఁ జొచ్చి నెలవుకొ ♦ నిన్న వి నిజంబు

తే॥ అరసి పలుకుచో సనమేషుఁ ♦ డతఁడు కాఁడు, విరియు చెందమ్మి కన్నులు ♦ కెఱుకువాఁడు
కట్లు గల విల్లు దాల్చెప ♦ ఘన భుజుండు, జన్మిదమ్ముండె నిజము రా ♦ జన్యసుతుఁడె.

తే॥ సహజ సద్గుణములు దీమ ♦ సంబుద్ధృథత, యంత్రములుగాఁ గదిరుగుక ♦ న్యాత్మ వనెడి
ప్రవహించఁబడగ సాల్చు సుందర ♦ బాహువులను, మరల జీవముల్ విడుము న్న - యరయఁగలనె?

## సూర్యాస్తమయము.

తే॥ అనుచు నిటువంటి వేపెక్కు - లనుచు నిదిగొ, యెదుటఁ దోఁ తెం చె నదిగొ పో - యనె యటంచు
ఉడుకు మదిని వలపుచేత - నొకటిగాక, పెక్కు దలఁచుచు మలయుచు - వేఁగుచుండ.

ఆ॥ హంసయాన కైన - యంగజ తాపాగ్ని, తన్ను గాల్ప నోర్వఁ - దలఁకు కరణి
పొడవు కరము లడఁగ - ముడిచి వేఁడి వెలుంగు, పరుగు వాఱి మునిఁగెఁ - బశ్చిమాబ్ధి

చ॥ విరిసిన పూలపైఁ బడుచు - వీచెడు పయ్యరఁ ద్రాడు, సంజయు
ప్పరమను నెట్టి వెంద్రుకలు - మైకము చేసి స్మరాగ్నిలోపలన్
బెరుఁగఁగఁ జేయు మబ్బనెడి - పేరిన నల్పుమెయిన్ వహించి యు
ద్ధురగతి రాత్రియన్ జముఁడు - తోఁచె విదేహనృపాల కన్యకున్. ౫౮౫

ఉ॥ పైప ధ్వనించు పక్షుల ర - వంబులు వాద్యముగాఁగ ఘోషముం
బూనిన యబ్ధియే యడుగు - మువ్వలుగా నెఱ మిన్నె రక్తపుం
బానముగాఁగఁ జీఁకటిరు - బ్బిన కంచెలగాఁగ సంజ యన్
చాను మహోద్ధతిం బరఁగు - శాకిని భూతము వోలె వర్ధిలెన్. ౫౮౬

సీ॥ కోలఁకు లనెడి యగ్ని - కుండంబులంబడి, విరియు పువ్వులనుండి - విసము గొనుచుఁ
బచరించు దక్షిణ - పవనుండు మారుండు, ప్రయ్యనేయఁగ నైన - ప్రణములందు
తూఁటి లో నేగఁగా - దూపిలు తెలివియు, మెత్తైన స్త్రీత్వంబు - నేలఁ గలియ
సంభ్రమించెదు సీత .. సంజను గని యిది యూ? మన్నిగొన వచ్చు - యముని రూపు!

తే॥ కడలియో! కాలమేఘమో! కప్పు మలయొ! యెడరు గలిగించి కన్నుల - నేడిపించి
మూవిగీయు మఱేదియో-యను పునామె, మలయ పసురవన్ని యు ముని-మాపువచ్చె

సీ॥ గగన నీలిమయు బుు♦ క్షములను విను దంష్ట్ర,లును తెమ్మెరను నూర్పు♦లును విశాల
మగు జేవు ఆకస ♦ మను నిమధృతి యొప్పు, జగ నోరు గలిగిన ♦ సంజ పామ!
నాలుకతో లాగి ♦ జాలిఁ బూన్చుట-యేల? ఆ గ్మయు నిం పి ల♦ల్ల మరువాఁడు
కొంచెమైను చేయి ♦క్రిందికి దింపఁడె, ఉన్నది నా కొక్క ♦ యును సుమ్ము

తే॥ తప్పి బ్రదుకఁగ నేనుండ ♦ గొప్పరట్టు, ప్రాన్చి యిట్టులు న న్నాడి ♦ పోసికొనఁగ
నేమి యపరాధ మొదనె నా ♦ యెడ? నిదేల, పెర భావంబు నవ్వలవంత పలుప?

ఉ॥ క్రిమ్మెన మబ్బురూపు నిటు ♦ గైకొని హాలహాలంబు పొంగెనో?
యిమ్మెయి నబ్ధిపొంగెనో? ర ♦ మెశ్వరు మేని హూంకారంగు నెల్లప
రిమ్ముగ నెంచుచుంట నది ♦ యే యిటుపర్వెనో? కాలునల్పు తో
రమ్ముగఁ గాటుకన్ మెదిపి ♦ రాచిరో మింటికి మంట కెవ్వరేన్. ౫౮౯

చ॥ అరుదుగఁ గానవచ్చి పతిఁ ♦ డా మలఁగె చనె పడు పెట్ట నో
క్కరును గనంగ లేర యొకె ♦ కన్నకి యెల్లిద మైన దంచు లో
నరయుకి మబ్బు న్నిలిచి ♦ యమ్ములనేయు నరంగుఁ డిట్లు నీ
కిరవుగ నెగ్నెనో? యిదియు ♦ నే నొనరించిన పాప రూపమో? ౫౯౦

ఉ॥ ంకిలి నొంది సీత యిటు ♦ లంగదఁ గ్రుంగుచు నెమ్మఁ గాంచ న
భ్రంకిష సౌధమందు నెల ♦ ఆ జగ తిన్నియ చుట్టు నాజ్య దీ

పాంసురముల్ మహోష్మమని • యవ్వలఁ ద్రోయుచు రత్నదీపముల్
పొంకముగా నిశిం బవలు • పోలికగా నొనరించి రా సఖుల్. ౫౯౧

## చంద్రోదయము.

చ॥ వలమగు మందరంబు ఫణి • పాశమునన్ బిగియించి సంద్రమున్
జిలుకఁగ లేచు రత్నములు • చిన్కులు రిక్కలకంటె మిక్కిలిన్
వెలుఁగ సురాసురుల్ తరచు • వేళ సుధామయ హేమ పాత్రవే
నెలలిన లీలఁ దోఁచెఁ గడు • వెల్లని జాబిలి సల్లయంబుధిన్ ౫౯౨

చ॥ అజుఁ డొకి తేఁటియై చదువు - లంగముతోఁ బఠియింప విచ్చె నం
బుజ మొకఁ డద్ది మున్ను పట • భూజ దళంబున బండి యాఁకటన్
గిజిబిజి గొన్న కైవడి జ • గంబుల లోఁగొను వాని నాభియం
దు జనన మందె నంచుఁ బాగఁ • గోయధి యబ్జుని గాంచె నాఁదగెన్

ఉ॥ చుక్కల గుర్తులుంచు క్రియఁ • జుక్కలు మిక్కిలి పిక్కటిల్లె న
ల్దిక్కుల • గ్రమ్మ నిర్లఁ గబ • ళించిన వెన్నెల గుంపు లప్పుతో
ల్చక్కి నెసంగు వెండి కల • శంబున ప్రక్కను పోఁక పాళ నా
నిక్కను సీత కియ్యదియు • నంజలి నెంతగఁ గూర్చునో కదా? ౫౯౪

తే॥ రక్తి గల సంజ యను చేయి • రమణ జాఁచి, యిరుల ప్రమింగి వెన్నెలలెల్ల • యెడలఁ బర్వె
*దళిత పాపుఁడై నిరతాన్న • దాత యైన, విభుని విలసిత సత్కీర్తి • విధము నంది ౫౯౫

చ॥ కడలి తరంగిలం బొడము • కల్వల తేఁడను శిల్పి వెల్గులన్
పొడవగు కేలు సాఁచి మును • పోషణ చేసెడు వెన్నునాభిలోఁ
బొడమిన యండగోళములు • పోయెను ప్రాఁతగ నంచు జ్యోత్స్న యన్
దడమగు నెల్ల వేయు క్రియఁ • దాఁకెను నెల్లెడఁ గౌముదీ తతుల్ ౫౯౬

చ॥ విడక వసించు లక్ష్మియును • పేరలివ్రం గల తేంట్లు వీడఁగా
ముడిఁగెను వాడి జేకులును • మూఁత వడంగ సరోజ షండముల్
విడిగెఁ దొగల్ మహా ప్రభువు • పృథ్వి నయంబుగ నేలి స్వర్గముం
బడసిన యంత నల్ప నర • పాలకు లౌదల లెత్తుకైవడిన్. ౫౯౭

తే॥ ఇరులుగా వచ్చి లోకంబు • లెల్ల మ్రింగి, వఱలు నల్ల నిప్పున లేచు • బొడబంబ!
మాయియగు వనమాలి మై • చాయ కోడి, యడలు కడలికి నాకును • చెడుగవైతే?

తే॥ కడలిలోఁ బుట్టితివి చెడు • గరిని కావ, అంబుజాలయతో నమ్మ • తంబు తోడ
జనన మొందితి వెవరిని • చంపకుండి, నన్ను కాల్తువే యని సొలె • నలిననేత్ర. ౫౯౮

---

*తిరు వెణ్ణెయ్ నల్లూరి జటప్ప కీర్తింబోలె అనిమూలము.

తే॥ వెన్నెలనెడి సమ్మెట నీల ♦ వేణిచనుల, పైఁబడఁగ వేడి నిప్పునఁ ♦ బడిన హొంసె
వోలె నొర్వక చెందమ్మి♦పూల పాన్పు, మీఁదఁ బడి పొరలుచు నుండె♦మోదము చెడి

తే॥ దొండడిగఁ గ్రమ్మ వెన్నెలల్♦తూఁటి తాఁకఁ, దల్లడిల్లి యుడికి సొమ్మ♦సిల్లెఁ బాన్పు
వాడి చెందమ్మి జేకులు ♦ మాఁడిపోయెఁ, గీరవాణి దేహము చాల ♦ మాఱిపోయె.

తే॥ చెలులు చలి కలపంబు పైఁ♦జేర్చునంత, సీత మఱి యింత యుడుకుచుఁ♦జీఁదఱ గొనె
వీవ వీవఁ గుచంబుల♦వేఁడి యెక్కె; మదిని మదన వేదన కేది♦మందు మహిని?. ౬౦౨

తే॥ ఒడలి నుడికించి కామాగ్ని - యుబుకుచుండఁ, గిసలయములు పుష్పాది చిందు -
వేసివాడఁగా వానిని-దీసివైచి,మార్చుచుండిరి తల్లి ప్రే-మంపుఁ జెలులు.[ప్రసవములును

తే॥ సుందరంబైన శుద్ధాంత ♦ మందు విరుల, శయ్యపై సీత యీరీతి ♦ శ్రమల నొందఁ
గలికి మించు మైసంచును ♦ గాంచినట్టి, రాముఁడెటులుండెఁజూతము ♦ రండుపాదము

తే॥ అట్లువారుముప్పరుచని♦యధిపుఁగాంచ, నతఁడు సత్కృతు లొవరించి♦ యమరనాథు
సదనముం బోలు చాంపేయ ♦ సౌధమందు, విడిది చూపఁగ ముదముతో♦విడిసిరచట

తే॥ అచటి కేతెంచె నతి బలుఁ ♦ డైన రాము, పాదధూళిచేఁ దొలిరూపు ♦ వడసినట్టి
మడఁతుక యహల్యకొడుకుస♦మస్త తపము, లొక్కరూపొందెననిచెప్ప♦నొప్పువాఁడు

ఆ॥ కానిపించు మునిని ♦ గని మహోదారుండు, బ్రెుక్కసుగుణధనుఁడు ♦ పెక్కుశుభము
లొనర దీవనలు స ♦ మున్నతి గావించి, గాధిజునకు నెఱఁగి ♦ గారవమున. ౬౦౭

క॥ గౌతమ పుత్త్రుఁడు కౌశికుఁ, గౌతుకమునఁ గాంచి మీరు - కడఁక నిటకు రా
నే తపము చేసె నీపురి, నా తరమా తెలుప మాని - నాథా! యనఁగన్. ౬౦౮

క॥ చల్లని పద్మాసనమున, నుల్లసిలు పితామహుండె - యుపమకుఁ దగి రా
జిల్లు శతానందుని ముని, తల్లజుఁడగు కౌశికుఁడు ము - దంబునఁ బలికెన్. ౬౦౯

క॥ ధీరచరిత! వినుము - మహో, దారుండీ దారకుండె - తాటక యసుఱుల్
పేరుగ నా యాగము పెం, పారఁగ నీతల్లి శాప - మరిదిగఁ దీర్చెన్. ౬౧౦

క॥ అరసి యిటు పల్కు కౌశికు, నరసి శతానందుఁడిట్లు ♦ లను మునిచంద్రా!
అరుదగు నీ దయ గలుగఁగ, నరు దెయ్యది విజయ శీలుఁ - డగు రామునకున్. ౬౧౧

తే॥ కడలి నీలంబు మబ్బుల - గమియు నల్ల, గలువ లుపమగా నొప్పిన - కప్పుటొడలు
గలుగు రాముని వదన మండలముఁగాంచి, యిట్టులను నహల్యా పుత్త్రుఁ-డింపునింప.

విశ్వామిత్ర చరిత్రము.

క॥ వనమాలీ! యిమ్మని మును, జనపాలుం డగుచు పెక్కు - సంవత్సరముల్
మను నీతి దప్ప కేలెను, దన కెదు రెద్దియును లేని - తాత్పర్యమునన్. ౬౧౩

తే॥ ధర్మమార్గానుసారియై - ధరణి నేలు, చుండి యొకనాఁడు వేఁటాడ - నుల్లమందు
కడఁక జనియింప దట్టంపు - టడవి కేగి, పూజ్యమగు వసిష్ఠాశ్రమ - మునకుఁ జనియె

సీ॥ అమ్మునిని యంత న - త్యధికాదరంబున, నాతిథ్య మొసఁగి జ - నాధినాథ!
ఇచట నేఁటికి వసి - యింపు మనఁగ నీతఁ, డట్లే యనుడు నాతఁ - డలరి సురభిఁ
బిలిచి యిప్పుడు రాచ - వీరుల కింపైన, యమృతముం బోలు నా - హార వస్తు
నిచయంబుఁ బిడుకుము - నీవని నియమింప, నదియు నవ్వారిగా - నపుడ కురిసె.

తే॥ షడ్రుచులతోడి యోగరంబు - సైన్య సమితి
తోడఁ దృప్తిమైఁ గొనుము మ - న్నీఁడ! యనిన
నందఱు భుజించి విరిసరుల్ - చందనంబు
తమ్ములము గొని శ్రమదీఱి - తనిసి యుండ.

సీ॥ కౌశికుండు వసిష్ఠుఁ - గాంచి యిట్లను ముని, జనగణ్య! నీవు లే - చినది లేద
యీ ధేనువే మాకు - నెల్ల సైన్యములకు, నిష్ట మృష్టాన్నంబు - లిచ్చె కతన
కలుష దూరులు శాస్త్ర ♦ కర్తలు మును 'రత్న, హారితు పార్థివ' ♦ యనుట కతన
నీ కామధేనువు ♦ నీకుఁ దగ్గది కాదు, నా కిమ్మనవుడు మా ♦ నంబు గొనుచు

తే॥ ఈ ఘనము నేఁపుండి యమ్ముని ♦ చంద్రుఁడనియె, దారుణ కృపాణ దీర్ఘ హ ♦ స్తా! తపస్వి
వల్కలిని పేద నే నీయ ♦ వలఁతిఁ గాను, ఈవ కొనిపొమ్ము వచ్చు న ♦ ట్లేని దీని.

తే॥ అనినఁ గౌశికుఁ డట్లులే ♦ యనుచు లేచి, పసిని బంధించి యీడ్వ న ♦ ప్పశువు కట్లు
త్రెంచికొని మునిఁ జేరి న ♦ న్నృపవరునకు, నిచ్చినాఁడవే యన నతఁ ♦ డిట్టు లనియె. ౯౧౭

సీ॥ నేన యొసంగలే ♦ దీ నరపతి జయ, చ్ఛత్రంబు గలవాఁడు ♦ సరభసముగ
బలిమిమైఁ గొనిపోవు ♦ వాఁడన నందిని, యితని బలంబు నే ♦ నిపుడ చెఱుతు
నని కోపమున దేహ ♦ మల్లార్ప రోమ కూ, పంబుల బోయలు ♦ బర్బరులును
చీనులు జోనకుల్ ♦ వేనవేలుగఁ బుట్టి, జననాథు బలము నా ♦ శంబు సేయ

తే॥ రాజపుత్త్రులు మునిరాజుఁ ♦ గ్రమ్మి కినుకఁ, బశుబలమ్ము గాదిది వీని ♦ వంచనమ్మ
పొడువుఁడనియార్వ నాఋషి ♦ పుంగవుండు, నుఱిమిచూడ వారలు మండి ♦ యుర్విఁ బడిరి

మ॥ తన పుత్త్రుల్ మడియంగఁ గౌశికుఁడు క్రు ♦ ద్ధస్ఫూర్తి దుర్వ్యత్యుఁడై
ధనువుం గొంచు గుణంబుఁ గూర్చి శరముల్ ♦ దంభోళి దోస్సారతన్
మునిపై నేయ వసిష్ఠ పావనియును వే ♦ భూపాలుపై వైచె జే
తను దాఁ దాల్చిన బ్రహ్మదండమును త ♦ ద్ధాత్రీశుఁడు న్నవ్వఁగన్. ౯౧౮

మ॥ వర దివ్యాస్త్రచయంబుఁ దొట్టి తన యు ♦ ద్యాస ప్రవృష్టంబు తా
శరముల్ వీడుచునుండ ద డము మహా ♦ శ్చర్యక్రియన్ క్రమింగ భూ

వరుఁడంతం. గనకాద్రి ధన్విని మదిం ♦ బ్రార్థింపఁగా మెచ్చి యా
స్మరశత్రుం డొసఁగెన్ నరేంద్రున కసా ♦ మాన్యంబులౌ నస్త్రముల్.

చ॥ అతఁ డవి యేసె నప్పు డమ్మృ ♦ తోంధను లవ్వడి సూచి లోకముల్
హాలతవహాలు నోటఁ బడ్డవని ♦ యుత్తలమంది వడంకి రెప్పటిన్
యతిపతి హాలుమ్మటం చతని ♦ యస్త్రము లెల్లను మ్రింగి యుగ్ర తే
జిత తనుఁడయ్యె నిట్లు శశి ♦ శేఖరు నస్త్రము లెల్ల వమ్ముగాన్.

చ॥ కుశికసుతుండు కాంచుచు న ♦ కుంఠిత తేజము సత్తపస్వికే
వశమగుఁగాని తక్కఁగల ♦ వారికి నుండుట కల్ల; లోకముల్
యశమున నేలు శక్తి యది ♦ యచ్చపు సత్త్వము గాద యంచుఁ దో
ర్బిశరుఁ జనెన్ మహాతపము ♦ తేఁకువఁ జల్ప వినిశ్చితాత్ముఁడై. ౬౨౨

ఉ॥ రాజగు కౌశికుండు ముని ♦ రాజు వసిష్ఠు జయ్యంబు తీరు తా
నోజఁ దలంచి యంతఁ గడు ♦ నుగ్రముగాఁ దపియించి నిష్ఠమై
రాజిత శక్తినొంద సమ ♦ రావతి నాథుఁ డెదన్ భయంబునన్
*దేజు దొలంగి యచ్చరలఁ ♦ దేజు తిలోత్తమ నంపెఁ బెంపునన్. ౬౨౩

చ॥ నృపతి తిలోత్తమా తను వి ♦ నిర్మల సౌష్ఠవ మొప్పఁ గాంచి తాఁ
జపల మనస్కుఁడై మరుని ♦ సాయకముల్ హృదయానఁ గాడఁగాఁ
దపము కృశింప నాచెలికిఁ ♦ దద్ద వశుండయి చాలకాల మ
ట్లు పటువ మేలెఱింగి వెగ ♦ టుం గొని నవ్వె మనంబులోపలన్. ౬౨౪

తే॥ ఇంద్రు వంచన మిదియని ♦ యెఱిఁగి కినుక, నవని మానిసివై పుట్టు ♦ మనుచు దానిఁ
దిట్టి యచ్చోటు వీడుచు ♦ దిగధిపతుల, సత్త్వవంతుఁడా జము దెస ♦ సరగఁ జేరె.

తే॥ ఇచ్ఛమెయి నటఁ దపము వ♦హించుచుండ, శక్తిమ దయోధ్యయందు త్రి♦శంకువనెడు
ప్రభువు పాలించుచుండి త♦ద్వంశ గురుని, ముని వసిష్ఠుని గాంచి యి ♦ ట్లనుచు నడిగె.

మ॥ మయితో స్వర్గముఁజేరఁ గాంక్ష వొడమెన్ ♦ మన్నించి యిక్కార్యమె
మ్మెయినైనం బొనరింపుఁ డన్న నతఁడున్ ♦ మేకొమియుం గాంచి యా
పయి నేనెవ్వరిచేతనైన నొనరిం ♦ పం జూతు నన్నంతనే
సయిరా! నాకపచారముం దలఁచి యా ♦ చార్యుం బరుం దెత్తువే? ౬౨౭

ఉ॥ ఆలము చేసియిట్లు మరి ♦ యాద దొలంగితి గాన నీవు చం
డాలుఁడ వౌదు వంచు ముని ♦ నాథుఁడు తిట్టుడు సూర్యుఁడుం బ్రకా
శాలి రహింప హేతువగు ♦ నట్టి నృపాలక తేజ మాఱఁగా
గేలి యొవర్పఁగాఁ దగిన ♦ కీడ్పడు రూపము దాని కేర్పడెన్. ౬౨౮

---

*తిలోత్తమ యని మూలము.

ఉ॥ హారములుం గిరీటమును ♦ హారి విభూషలు లోహభూషలై
జారు పటంబులుం మెడను ♦ జందెము తోల్గఁగ మాఱి దేహముం
బేరిన నల్లనై చెడఁగ ♦ వీడని చింత నృపాలుఁ డింటికిం
జేరఁగ నెల్లవారచట ♦ సీయని రోయఁగఁ బోయెఁ గానకున్. ౬౨౯

తే॥ ఒక్కనాఁడు విశ్వామిత్రుఁ ♦ డురు తపంబొ, నర్చు వనమున కేగఁ జం ♦ డాలుఁడవగు
నీవెవండ విటకువచ్చి ♦ తెలయన్న, మునికిఁ దన వృత్తమెల్ల భూ ♦ పుఁడు వచించె.

చ॥ అదివిని గాధిపుత్రుఁ డిది ♦ యా కథ! యంచు హసించి యజ్ఞముం
వదలక చేసి పంపెదను ♦ స్వర్భువికంచు వచించి మానులన్
ముదమునఁ బిల్వనంప భయ ♦ ముంగొని వచ్చిరి వారలెల్లరున్
బదరి వసిష్ఠ సూను లిటు ♦ పల్కిరి గర్వము కందళింపఁగన్.

ఉ॥ మాలఁడు యజ్వయంట! మఱి ♦ మాల పురోహితుఁ డంట రాజు! చా
ల్చాలును సమ్మతింప మన ♦ సన్ముని కౌశికుఁ డంత నుగ్రుఁడై
యాలముచేయు కట్టిఁడి దు ♦ రాత్ములు నీచపథానువర్తులై
మాలుదు రంచు శాపమిడి ♦ మానక యాగము పూర్తి చేయుచున్. ౬౩౨

ఉ॥ వేలుపు లార! రండనుచుఁ - బిల్వఁగ వారలు మింట నిల్చి యీ
మాలని కగ్ని కార్యము క్ర - మంబుగఁ జేయుచు మమ్ము పిల్చు నీ
శీలము వోలదంచుఁ బ్రహ - సింపఁగ నిమ్ముని కిన్కనూని దా
మేలితపంబుచే నమర ♦ మేదినిఁ జేరుమ యంచుఁ బంపఁగన్. ౬౩౩

చ॥ మనుజవిభుండు వే చని వి ♦ మానమునన్ దివిఁ జేర నిర్జరుల్
చను మిటరాకు మాలఁడవు ♦ చక్కటి యే యిది యంచుఁ ద్రోవ, నో
మునివర! కావుకావు మని ♦ భూపుఁ డధోముఖుఁడై పడంగ రా
ముని నిలునిల్వుమం చశనిఁ ♦ బోలె నొనర్చె మహాట్టహాసమున్. ౬౩౪

సీ॥ నన్ను లెక్కింప కి ♦ ట్లున్నత గర్వులై, యవమతి గావించు ♦ నమరవరుల
పెను వైభవముకంటెఁ ♦ బేరిమిగాఁగ రెం, డవ త్రిదివంబు క ♦ డంగి యిపుడ
కావింతుఁ గమలాప్త ♦ కమలారులును ఋక్ష, తతియును గ్రహములు ♦ తవిలి పొడుపు
వలదెస యందును ♦ వడకడఁ గ్రుంకును, గలిగి సంచారంబు ♦ గాంచుఁగాక

తే॥ అనుచు నానతి యొసఁగి తా ♦ నంతఁబోక, సురల దిక్పతులను చరా ♦ చర వితాన
ములను సృష్టింపఁ బూనె ని ♦ మ్ముని వరుండు, భువన సముదయములు భీతిఁ ♦ బొందివడఁక

సీ॥ కల్పకవనమునఁ ♦ గాంక్షమై విహరించు, నెఱదంట నలువయు ♦ నీలగళుఁడు
తక్కనిలింపులు ♦ తండంబులై వచ్చి, శాంతింపు మునివరా! సైఁపు మిపుడు

శరణ మందినవాని ♦ కరము వీడక కాచు, తగవు నీకమరుట ♦ మిగులలెస్స
ఈత్రిశంకుండు న ♦ క్షత్రసంఘము తోడ, నుస్వరంబునఁగూడి ♦ యుండుఁగాక
తే॥ ఐదురిక్కలు వలదెస - యందునిలిచి, నీమహా మహిమను చాటి - నెగడుచుండు
నీవురాజర్షివై యొప్పు -దిది మొదలుగ, ననుచు వారలు నెలవుల - కరుగు నంత. ౨౩౮

## శునశ్శేపునివృత్తాంతము.

సీ॥ కదలి రాయనిదెస - నడరు నడవికేగి, కౌశికముని సల్పె - ఘనతపంబు
ఆకాలమునఁ జతు - రంగ బలాధిపుఁ, డంబరీషుండను - నవని విభుఁడు
ప్రాణివర్గములకుఁ - బ్రాణసమానుండు, సుధఁబోలు పలుకుల - చొప్పువాఁడు
కొలచేసి జన్నంబు - సలిపెడు నరమేధ, మొనరింపఁ బిన్నవాఁ - డొనరకునికి
తే॥నరయుచుంబోయి ఋచికుని-యాశ్రమంబు,చొచ్చి యడుగంగ మువ్వురు-సుతులలోనఁ
బిన్న నీఁజాల ననియెను - కన్నతల్లి, తనకు జ్యేష్ఠుండు కూర్చువాఁ - డనియెఁదండ్రి.
తే॥ మధ్యముఁడు నవ్వి విభుఁగాంచి-మానవేంద్ర!,ప్రేమఁ గని యెత్తిపెంచిన-పితరులొందు
పేదఱిమిపోవ ద్రవ్యమ్ము - వేఁడినంత, యిమ్మనుచు వారలకుమ్రొక్కి-యెక్కెఁదేరు.
తే॥ ఇనుఁడునడుమింటికెక్కంగ-మనుజనాథుఁ, డొక్కచోటమాధ్యాహ్నిక-మొనరుపంగ
నిలువ నాశునశ్శేపుఁడు - నియత కృత్య, ములను దీర్పఁగ మఱియొక - కెలని కరిగి ౨౩౯

ఉ॥ అచ్చట సన్మునీంద్రుఁ గుశి - కాత్మజుఁ గాంచి యడల్ గడల్కొనన్
జెచ్చెర పాదపద్మముల - శీర్షముఁ జేరిచి మ్రొక్కి యేడ్వఁగా
ముచ్చట నక్కుమారుఁగని - మూఁడిన యాపద చెప్పుమన్న వాఁ
డచ్చముగాఁగఁ దెల్పెఁ దన -యమ్మయు నయ్యయుఁ జేయుకార్యముల్. ౨౪౦
తే॥అక్కయును బావయును సుతు-నమ్మికొనుట,దెలిసి చింతించియతఁడు చిం-తింపవలదు
నీదుప్రాణముల్ గాచెద - నేనటంచుఁ, దనకుమారుల నతనికై - చనఁగఁ బనుప. ౨౪౧

చ॥ కొడుకులు సమ్మతింపమికిఁ - గోపమునం గను లెఱ్ఱఁజేసి దుం
దుడుకున రోమకూపముల - దూఁకఁగఁ బ్రస్ఫుట విస్ఫులింగముల్
వెడమతులార! నాపలుకు - వెడ్డఱికంబున మీఱినారు మీ
రడవులలోఁ బుళిందులయి - యారట మందుఁడి యంచుఁ దిట్టుచున్. ౨౪౨
చ॥ మునుపు వసిష్ఠుకోపమున - బ్రుంగని నల్వురు శాపయుక్తులై
చనఁ దనయల్లునే పిలిచి - చక్కన నేరిపి రెండు మంత్రముల్
మొనసి పఠించితేనియుఁ ద్రి - మూర్తులు వేల్పులు వచ్చి జన్నముల్
ఘనతురు నిన్ను గాతురని - మన్ననతోఁ దగ నంపె నాతనిన్. ౨౪౩

చ॥ ముని వచియించిన ట్లతఁడు - మున్కొని మంత్రములం బఠింపఁగా
వనజజ విష్ణుశంభులు సు - పర్వులతో నట కేగి యక్కుమా
రుని యసువుల్, విధిక్రమత - రూఢిగఁ జల్పిన రాజువేలిమిన్,
గొనకొనఁ గాచి రంతఁ జనెఁ - గోరిక గాధిసుతుం డుదీచికిన్. ౬౪౪

సీ॥ అచట విశ్వామిత్రుఁ ♦ డధిక నిష్ఠను హస్త, పద్మాంగుళుల ముక్కు ♦ పైన నునిచి
ఇడను పింగళతోడ - నొనయించి మనమునఁ, బ్రణవజపము బహు - వత్సరములు
నియతితో నొనరించి - నిశ్చలుండై నిల్వ, మూలాగ్నివలనఁ గ - పాల మంత
భేదిల్లి తమసంబు - విరిసిన యనువున, ధూమంబు లోకముల్ - తూలునట్లు

తే॥ త్రిపురదహనుండు గజము వ♦ధించితోలు,గప్పుకొన్న చెన్నున మొగుల్-కమ్మురహిని
జగములం బర్వ భానుతే - జంబు మాసె, దిగిభ దిక్పాల నేత్రముల్ - మొగిచికొనియె

తే॥ మొగులు నిండు గగనమెల్లఁ ♦ బొగలునిండ, జంగమ స్థావరంబులు ♦ సంచలించె
దిక్కు లెల్లెడఁ గావులు ♦ తివిరి కప్పె, దివ్యులును వెఱగందిరి ♦ తేటచూడ. ౬౪౬

తే॥ పద్మజుఁడు పద్మనేత్రుండు - పద్మబాణ, వైరి కులిశియుఁ దక్కు గీ - ర్వాణసమితి
యచ్చటికి వేఱువేఱుగా - వచ్చిచేతి, ఘన తపోధనుఁ గౌశికుఁ - గలిసికొనిరి.

తే॥ చంద్రచూళియు వనమాలి - జలజభవుఁడు, గాధిజుం గాంచి పరమ త ♦ పోధనాఢ్య!
వేదపారగుల్ నిను మించి - వేఱులేర, అని వచించిరి మొద నంది _ యమ్ము లేక.

తే॥ అన్నదువుల వీనులువిచ్చి - విన్న యతఁడు,శిరమువంచి కేల్ మొగిచివాం-ఛితఫలమ్ము
లొనరె నేఁటికి నేను ధ - న్యుండ నైతిఁ,ననుడు వారు స్వస్థలముల - కరిగినారు. ౬౪౯

క॥ గతమైన చరిత్రంబిది,యితనికి సములైన తపసు - లిలలేరు మహో
న్నత నియతుఁ డితని కనికర, మతులితముగఁ బడయు మీరు - నరిదియుఁ గలదే?

క॥ అని గౌతమ పుత్త్రుఁడు చె, ప్పిన రాఘవు లచ్చెరువును ♦ వేడ్కయుఁ గొని య
మ్మునికిం బ్రణమిల్లఁగ దీ, వనలిడి మరలెన్ స్వకీయ ♦ భవవంబునకున్. ౬౫౦

క॥ మునియుం దమ్ముఁడుఁ దమతమ, కనువగు సెజ్జలఁ బరుండి ♦ రంత నిరులు పం
డును పోలు రాముఁ డును రే,యును శశియును దాను సీత♦యునుగా నొప్పెన్ ౬౫౧

క.। జీమూతంబును వీడిన, యామెఱపే యిట్లు నెలఁత ♦ యంగముఁ గొనెనో?
యేమో? మెఱుఁగఁగ రాదిది, నామదిఁ గన్నులనుదాని ♦ నవ్వురే తోఁచెన్. ౬౫౨

క॥ విమలౌదార్య కరాబ్జము, లమరిన వెన్నుఁడు పరుండు ♦ నబ్ధి నెనయు నే
త్రములు గల రమణి నాహా, త్కమలంబున నిలిచెఁగానఁ ♦ గమలయె యగునో ౬౫౪

చ॥ నెన రెద లేని దయ్యెఁ దమి ♦ నెక్కొనఁగాఁ గడు బేడిదంపు వే
దన మిడు నంజుగల్లు కను ♦ దమ్ములచే నను లోఁగొనంగ నా

కనులకుఁ గానవచ్చెడు జ ♦ గంబునఁ గల్గు చరాచరంబు లె
ల్లను వనితా సువర్ణమయ ♦ లాలిత సుందర రూపమే గొనెన్

చ॥ పరవి నగల్ చలింపఁదగు ♦ బంగరుకుండలు పేర్మిలేని నా
యురమున నాటకుండినను ♦ జ్యోత్స్నను బోలిన మందహాసముల్
బొరపలు మోవి దొండయును ♦ భూషలుగాఁ బెనుపొందు నా మనో
హారి ముఖచంద్రమండలము ♦ నారయ నింకొకసారి గల్గునే? ౬౯౬

ఉ॥ అంచిత మేఖలంగలుగు ♦ స్యందనమొక్కటి వాలుఁబోలు నే
త్రాంచల యుగ్మముల్ గనుల ♦ కబ్బని పీనకుచద్వయంబు లోఁ
గ్రుంచెడు మందహాసము న ♦ కుంఠితరీతి వహించుచుండు లె
క్కించగ నిన్నికావలయు ♦ నే సమవర్తికి నాయుధావళుల్?

తే॥ తావిగల పైడిబొమ్మయా-తలిరుఁబోడిఁ, దలఁచు మాత్ర నాపై నించు-విలుతుఁడిట్లు
బాణవర్షంబు గురియించి - పతిచె ననఁగ, బలమనెడి యాగుణంబేరి - వలన నిలుచు?

తే॥ పుడమిఁ గొల్ల వెట్టుటకయి-పొంగిలేచు, పాలకడలి వెల్లువవోలెఁ - బరవు చంద్ర
కాంతి నాయుసులుఁ దీయఁ - గడఁగు కతపఁ, దెలి పిసంబొందు కలదను-తీరుదోఁచు.

॥ చరియింపఁదగని త్రోవను, జరుగదు నామనము నిజము - చక్కెర పలుకుల్
పరఁగునది పడుచెయగునని, పరితాపం బగ్గలముగఁ - బడుచుండు నెడన్

తే॥ చెల్లఁ గాలంబు రేతేని - తెల్ల గొడుగు, పడుటఁబోలెఁ బశ్చిమ దిశా - వనిత నొసల
నడరు గుండ్రని పతకంబు - వడిన లీలఁ, జంద్రమండల మంత న - స్తమయ మందె

తే॥ ప్రేమపతి చంద్రుఁడేగ నా - శామృగాక్షు, లెల్ల వల్లభుఁ డలఁదిన - తెల్లకలప
మునుమనోవ్యథఁదుడిచిరో-యనఁగ మున్ను, పరవియుండిన వెన్నెలల్-మఱుఁగుపడియె

సీ॥ పొడవైన తోమాల - పొలుపుగాఁ దాల్చిన, రాముఁ డివ్విధమునఁ - గామబాధ
నివ్వటిలఁగ నొచ్చి - నిద్దుర లేకయె, సంతాప మొందుచు - జరపె రాత్రి
చెదరిన మదిలోనఁ - జింతించు చెందామ, రలను చెల్వాల మొగ - మ్ములను చెలంగ
విరివిగాఁ దఱుచుగాఁ - బరవిన యిరులును, గుహాలకుఁ జేరి మై - కుదుచు కొనఁగ

తే॥ ఎఱ్ఱచుక్కల మొగమొప్పు - నెన్ను చర్మ, మొనరఁగప్పినయుదయాద్రి-యనెడు రుద్రు
నొసటిపై నగ్నిమయమయి-మెసక మెసఁగు, మూఁడవదియగు కన్ను నా-మొలచె నినుఁడు

సీ॥ వడియు సత్త్వముగల్గు-పచ్చనిగుఱ్ఱాల, గిట్టల తాఁకునఁ-గెరలుధూళి
విప్రుల యర్ఘ్యంపు-విరులఁగూడిన నీటి, చేఁ దెమ్మగాఁ బూర్వ-శిఖరి మీఁదఁ
బూర్వదిగ్దంతి మో - మున నుంచు సిందూర, తిలకంబు నా నొప్పు - జలజహితుఁడు

తే॥ తహతహంగల్గు ట్రొత్తడి-తరుణుల ముఖ, కమలములు విచ్చుక్రియను వి-కాసమందె
సరసిజాకర ముఖసరో-జంబులెల్ల, సూర్యకిరణంబు లెల్లెడఁ-జొచ్చినిండ. ౬౬౪

సీ॥ కిన్నరుల్ గానంబు - తిన్నగాఁ గావింప, జనములు భక్తిమై - సంస్తుతింప
మునులు విప్రులువేలు-పులు కరములు మోడ్చఁ,గడలియు మద్దెలఁ - గా ధ్వనింప
గగనరంగమ్మునఁ-దగిలి నర్తించు భా, స్కరుఁడను రుద్రు బం - గారు జడలు
విరిసి భూతలమునఁ - బరసిన యనిపోలెఁ, కిరణ జాలంబు క్రి_క్కి_రిసి పరవ

తే॥ విల్లుపూని చక్రంబు చే- విడిచి నతఁడు, పాలకడలి వీడి విచార - వనధి మునిఁగి
తరణి లేఁగరంబులఁ బాద-తలము లొత్త, రాత్రియును వార్ధితీరంబు-రమణనొందె.

ఉ॥ కల్పము దోరినట్టులొక - కైవడి రాతిరి యేగ దంతి నాఁ
దల్పము వీడి ప్రాత రుచి - తక్రియల న్నెఱవేర్చి మేటి సం
కల్పముతో మునీంద్రునకుఁ - గై ముకుళించి యనుంగుఁదమ్ముతోఁ
బొల్పుగఁజేరె నాజనకు - పుణ్యాసుపేటికి యజ్ఞవాటికిన్. ౬౬౬

ఉ॥ అమ్మిథిలాధినాథుఁ డట - యజ్ఞము సాంగముగా ముగించి క
ర్ణమ్ములు దిమ్మలెత్తు శుభ - రావములొప్పఁగ రత్నమంటప
మ్మిమ్ముగఁజేరి యింద్రుని వ - హిన్ మునితో ననుజన్ముతోడ వి
ల్లమ్ములుదాల్చుమేటి సుగు - ణాకరుఁడున్ వసియింప నొప్పుచున్. ౬౬౭

మత్త॥ కూరుచుండిన రాకుమారులఁ - గూర్మిమోముల యంద మిం
పారఁగ్రోలెడు పోల్కిఁగాంచి మ - హాత్మ! యెవ్వరు వీరనన్
వీరు నీమఖమున్ గిరీశున - భేద్య చాపముఁ జూడఁగాఁ
గోరి వచ్చిరి మేరుధీరులు - కోసలేంద్రు కుమారకుల్. ౬౬౮

౧౧. వంశమహిమాను వర్ణన పటలము. (౨౯)

సీ॥ జలజాప్త కులజుండు - తొలి చక్రవర్తియా, మనువు నెఱుంగని - జనులు ఘనులె?
ప్రాణివర్గము గొద - వడి చెడకుండఁ బృ, థ్విం బిదికిన పృథు - వినవె నీవు?
వ్యాధులూడఁగ శత్రు - బాధలు మాఁడఁగఁ, బెద్దకాలంబు త - పించి శేష
శయను వెలుఁగు రూపు - జనులెల్లఁ గాంచ శ్రీ, రంగవిమాన ము - ర్వరకుఁదెచ్చు

తే॥ ప్రభువు నిక్ష్వాకు నెఱుఁగని - వారలెవరు? ఇంద్రుఁడెద్దయి తనుమోవ - నేగి యసుర
వరుని తలఁద్రుంచి స్వర్గంబు - బలవిరోధి,కొసఁగినకకుత్స్థుఁదెలియని-యొకఁడుగలఁడె?

తే॥ నరపు ముడుతలు వృద్ధత్వ - మరణములును, వఱలకుండ క్షీరాబ్ధిని - తరచి సుధను
వేల్పుల కొసంగి తనకీర్తి - విశ్రుతముగఁ, బరపి నాతఁడీ వంశసం - భవుఁడొకండు.

చ॥ కదనమునందు గెల్చి యొఱఁ - గాంచెడి ఖడ్గము దాల్చుభూప! యొ
ప్పిదముగ మూఁడులోకములు - వీరత నేలిన సద్గుణాకరుల్
పొదలిన వీరివంశమున - భూపుఁడె జింకలు బెబ్బులుల్ పగల్
వదలుచు నొక్కరేవునన - పానము సేయఁగ నేలె నొక్కటన్ ౬౭౧

చ॥ అరి నరపాల పూజిత ప ♦ దాబ్జ! సురాసురు లొక్కయుద్ధ సం
గర మొనరింప నాకులకు ♦ ఖడ్గము విల్లును దాల్చి పాడి దే
వర వలె బాసటై నిలిచి ♦ పట్టుగ రక్కసులన్ జయించి యా
సురపురిఁ గాచినాఁ డతఁడె ♦ సూ ముచికుందుఁడు వీరివంశ్యుఁడే. ౬౭౨

చ॥ మెఱపును నవ్వు కాంతిగల ♦ మేటి నరాజిని దాల్చురాజ! కా
ళ్లొఱసెడు వీరమద్దియల ♦ నూనిన సూర్యకులంబువారు పెన్
డెఱకువ జీవరాసులకుఁ ♦ దియ్యని జీవమువోలె నేలి ర
త్తెఱఁగు శిబీంద్రుఁ డండజముఁ ♦ దేఁకువఁ గావ శరీర మీయఁడే? ౬౭౩

చ॥ రిపుల శరీరముల్ దొలువ ♦ రేఁగు కరాసి ధరించుభూప! యీ
విపులకులంబువారు పృథి ♦ వీధరముల్ కొనకాలఁద్రోయు చి
ప్పపగిది దొర్లఁజేసి మఖ ♦ వాజికినై జలరాశిఁద్రవ్వి ర
స్నపు డీఁకఁ జెప్పఁగావలెనె ♦ యానృపవర్యుల వీర్యసంపదల్. ౬౭౪

చ॥ పగఱ దశల్ గ్రహించు కర ♦ వాలము గల్గినఱేఁడ! శేషుఁడే
తగ వివరింపలేఁడనఁ బ ♦ దంపడి నేఁ బలుకన్ వలంతినే?
సిగముడి రేలపూల నెలఁ ♦ జేర్చిన శంభునిపొందు నిర్జరా
పగ నిల కానయించిన నృ ♦ పాలుఁడు వీరల వంశజుండెకా! ౬౭౫

ఉ॥ కుందెటి మచ్చలేని నెల ♦ కున్ సరివచ్చెడి యెల్లిగల్గు రా
జేందుఁడ! వీరిపూర్వుఁడొకఁ ♦ డే ద్వైఱ వార్ధిపరీత భూతలం
బంది జయేందిరన్ గరత - లామలకంబుగఁ జేసికొంచుఁ బే
రొందఁగ నశ్వమేధ శత - మూని యొనర్చె సురేంద్రుఁ డంజఁగన్. ౬౭౬

ఉ॥ చందురు గెల్చి నాతఁడును - శర్వు జయించినవాఁడు దూపుచే
దుందుభుఁ గూల్చి నాతఁడును - తోఁచిన భాస్కర వంశమందె పు
ట్టొంది రఘుండు దేవవిభు - నోరిచి యెన్మిది దిక్కులన్ జయం
బంది యనర్గళంబగు ప - రాక్రమ మొప్పఁగ నేలె లోకమున్. ౬౭౭

చ॥ ధనువను మందరంబు గొని - దర్పిత శాత్రవ రాజులన్ సుధా
వననిధిఁ ద్రచ్చి జ్యోతి మయు - బంధుర సుందర మందహాసముల్

ననుచుచు నుండు నింపుమతి - నాఁజను నిందిరఁగాంచి పద్మనా
భునిబలెఁ దద్భుజాళి నజ - భూపతి భూమిఁ దాల్చెఁ బెంపుమై. ౬౪౮

చ॥ మంగళ రావముల్ సతము - మానుగ మ్రోఁగు నజార మొప్పు భూ
పాంగ! జగంబునన్ దశర - థావని నాథు నెఱుంగకుండు వా
రుంగలరేమి? వారి కొమ - రుల్ గుణపీరులు వీరి నేరు పా
రంగ వచింప నల్వకుఁ ద - రంబె? యెఱింగిన యంత పల్కెదన్. ౬౪౯

చ॥ సిలుగులు లేక ప్రాణి తతి - శ్రేయము లొంది భువిన్ సుఖింప వే
వెలుఁ గివముంబలెన్ విమత - వీరుల దూల్చి జగంబుఁ గాచు వాఁ
డిల మనువు న్నయంబున జ - యించినవాఁడు ధనుస్సహాయుఁడు
జ్వలిత సుధర్మవర్ముఁ డజు - పట్టి కుమారులు లేని చింతచే. ౬౫౦

సీ॥ వింటికోపుల వంటి - వెడఁద నొసళ్లును, తొక్కుపల్కులఁ బోలి - నిక్కునుడులు
నింబైన బింబాధ - రంబులు నీలవి, శాల నేత్రంబులు - సంకుమెడలు
నులియు మధ్యంబులు - వెలకిచ్చు భోగంబు, లలరు పణ్యస్త్రీల - సరసి కుచము
లను కొమ్మలను గల్గు - నడవిమెకంబులు, గానెంచి వారితోఁ - గదలివచ్చు

తే॥ ఋశ్యశృంగునిచే చింత ♦ లీఁగఁ దలచెఁ, దుర్భగుఁడ నాకుఁగొమరులు ♦ దోఁపరైరి
నేల మొత్తము నావెన్క ♦ నేలఁదగిన, తనయుల నొసంగుమనుచు నా ♦ తనికి మ్రొక్కె.

తే॥ మ్రొక్కనమ్ముని యుత్సాహ - మున వచించె, భూమిమాత్రమే యననేల- భువనమెల్ల
నేలుపుత్త్రుల నీకిత్తు - వేలిమికిని, వలయు వాసిని సమకూర్పు - పార్థివేంద్ర! ౬౫౨

తే॥ అనుడు వస్తువుల్ సమకూర్చ ♦ ననఘుఁడంత, బుత్త్రకామేష్టి సాగించి ♦ పూర్తిచేసెఁ
గనక కలశంబునన్ సుధా ♦ కల్పమైన, యన్నముంగొని భూతమొం ♦ డందు వెడలె

తే॥ అన్నముం గొని మునివరు ♦ ననుమతమున, తన్ను తాఁబోలు దశరథ ♦ ధరణిధవుఁడు
ముప్ప రర్ధేందు నిటలల ♦ ముదముతోడఁ, బిలిచి నాలుగుపాళ్లు గా ♦ వించి యిచ్చె.

శా॥ పండంబాటి పగుల్లు పుట్టిన మహా ♦ పాపక్రియాసిద్ధిచే
నిండంబాఱిన వేదచోదిత లస ♦ న్నీతిక్రియాసిద్ధిచే
దొండంబోలిన నోరుగల్గిన సదా ♦ తుష్టాత్మ కౌసల్య యా
దండ న్నిల్చు నలేఖ్యసుందరు జగ ♦ త్కల్యాణ దాయిం గనెన్. ౬౫౪

చ॥ త్రోయఁగరాని నీతులను ♦ తోరపు ఠీవులు వచ్చిచేర లోఁ
తై యులరాకు సద్గుణచ ♦ యంబను నబ్ధి ననింద్య సద్గుణా
మేయ మనోహరత్వముల ♦ మేలుగ నీతనిఁబోలు పుత్త్రుఁ గై
కేయి గనెన్ మహామృదుల ♦ కీర్తిరతున్ భరతున్ సుధీరతున్. ౬౫౬

చ॥ అరుదగు చేవచే గెలుపు ♦ నందుచు ధర్మము పాదొనర్చు నే
ర్పరులగు దానవేంద్రుల భ ♦ రంబగు భీతిని ముంచు శూరులన్
వరధనువుల్ ధరించి నిలు ♦ వం గనకాద్రిని రౌప్యశైలమున్
స్ఫురణకుఁ దెచ్చువారి నిరు ♦ బోట్టెలఁ గాంచెఁ దగన్ సుమిత్రయున్. ౬౮

మానిని॥ నాలుగు వేదములం బలె నొప్పిన ♦ నల్వురు పుత్త్రులు సూక్ష్మమతిన్
జాలి సరస్వతికిం బయివారయి ♦ చక్కటి నాలవ వేదమొగిన్
దాళక లోంగిన శాత్రవులై వడి ♦ దాస్యము సేయఁగఁ బూర్ణనిశా
పాలుఁడు పుట్ట ధ్వనించుచుఁ బొంగెడు ♦ వార్ధులకై వడి వర్ధిల్లఁగాన్

సీ॥ ఒఱలోనె నిద్రించు ♦ చుండెడు ఖడ్గంబు, గల మిథిలాధీశ! ♦ తెలియ వినుము
కాన్కలతోఁ గూడఁ ♦ గడఁగి రాజన్యులు, వచ్చి మ్రొక్కులిడఁగఁ ♦ బాత్రమగుచు
వీరమద్దియలచే ♦ వెలుగొందు పాద ప, ద్మంబు లొప్పారిన ♦ దశరథేశు
కొడుకు లనెడు పేరొ ♦ కొండు మాత్రమె యుప, నయనంబు గావించి ♦ నయము నేర్పి

గీ॥ శ్రుతులు చదివించి శాస్త్రసం ♦ తతులఁ దెలిపి, యెల్ల కర్జంబులెల్లప్పు ♦ డెల్లవిధుల
జరపి పోషించి నాతఁడు ♦ గురుతపస్వి, చూళి బ్రహ్మనిభుఁడు వసి ♦ ష్ఠుండె చుమ్ము.

ఉ॥ ఏనొనరించు జన్నము స ♦ హింపక పాడొనరించు క్రూరులన్
బూనికతో వధించు తలఁ ♦ పుం గొని యీసుకుమారపాదులన్
దోనడపించుకొంచు గుణ ♦ తోయధి! నావనమందు చేరితిన్
బూనితిఁ బూనిపూనకయె ♦ ముందుగఁ దాటక మమ్మ దార్కొనెన్

చ॥ జడనిధిఁ బోలు రాఘవుని ♦ శౌర్యము సుస్థిర శీలమందమై
పొడవగు దోర్యుగంబు బల ♦ మున్ గనఁ జాలెదు గాకఁ యమ్మొకం
డడరుచు మండు కన్నుగవ ♦ నార్చెడు తాటక బొమ్మఁ దొల్చి వెన్
దొడరి మహీధ్రముల్ తరులు ♦ దొల్చుచుఁ దూలెను భూమిలోపలన్.

చ॥ ఎఱుపగు మిన్ను వన్నెయయి ♦ యేరుపుఁ బోలిన కేశమూర్ధముల్
గుటికొని గుప్పతిప్పలుగఁ ♦ గూలె నొకమ్మనఁ గాలు ప్రోలికిన్
బఱచె సుబాహు, వింకొకఁడు ♦ పడ్డసలం బె యెఱుంగ వేలిమిం
గొఱఁతలు లేక చేసికొని ♦ కూరిమితో నిటకేగుదెంచితిన్. ౭౨

చ॥ నృపవర! బ్రహ్మయే నెఱుఁగ ♦ నేరని రామ మహత్త్వసత్త్వమీ
విపుడె గ్రహింతుగాక! జగ ♦ మెల్లను కాలిచి బూదిసేయు నే
రుపుఁ గల తూపులన్ మునుపు ♦ రూఢతపంబునఁ బొందియిచ్చె నేఁ
డ్రదపగొన నయ్యవీతనికి ♦ దాస్యము చేయుచునుండె నిచ్చలున్. ౭౩

ఉ॥ ఈతని వీరమద్దెలు వ ♦ హించిన పాదసరోజ ధూళియే
గౌతముపత్నికిన్ మొదలి ♦ కాంతిని రూపము నిచ్చెఁ బ్రేమ నం
గాతము మెండు ప్రాణముల ♦ కంతెను రామునియందు నాకు ను
ర్వీతలనాథ! యంచతని ♦ వృత్తము వీనుల విందుచేయఁగన్. ౬౯౪

౧౨ కార్ముకపటలము. (౬౬)

చ॥ ఉరుతర చిత్ర కార్ముకము ♦ నుంకువ చేయుటచేఁ దలంపు పెం
పొరయ ఫలింప కుండఁగ మ ♦ ఱొండు వచింపఁగ నేమి యుండు? నీ
వరగుణుఁ డీశు చాపమును ♦ వారక యెక్కిడి లాగెనేని నా
వరము ఫలించు జానకి త ♦ పంబు ఫలంబు కరంబు నింబగున్. ౬౯౫

శివధనువును గని పలువురు పలువిధములఁ దలఁచుట

క॥ అనిపలికి మునియు నిక్కొన ♦ జనకుఁడు తన భటులఁ గాంచి ♦ శంకరు ధనువున్
గొని తెండు వేగ పొండన ♦ ధను ర్గృహము చొచ్చి వారు ♦ దానిం గనుచున్. ౬౯౬

చ॥ కలభముఁ బోలు దొడ్డ దృఢ ♦ కాయులు కొండలఁ బోలు బాహువుల్
వెలి మెలి వడ్డ వా రయిదు ♦ వేల జనంబులు మధ్య మధ్య దం
డెల నెలకొల్పి క్రిందుగ వ ♦ డిన్ భుజ మూర్ధము లాన్చి మోచి పా
టల గతి తప్ప కద్దులు శ ♦ డంబడకుండఁగఁ దెచ్చుచుండఁగన్. ౬౯౭

సీ॥ విపులయా ధర తన ♦ వీఁపు నొప్పిని మాన, మేరువు లజ్జను ♦ మించి పూన
వచ్చుచుండఁగ వార్ధి ♦ వంటి విశాలమౌ, పురమున జనులు గుం ♦ పులుగఁ గూడి
కలకలమంచు లో♦కంబునం దెల్లెడఁ, జోటు లేదన వచ్చి ♦ చొచ్చి చూచి
శంఖ చక్రమ్ములు ♦ జానుగఁ దాలిచి, మగ సింగముం బోలు ♦ మాధవుండు
తే॥ గాక వేఱెవ్వరీ వింటిఁ ♦ దాఁకు వారు!, నేఁడు రాముఁ డీ ధనువు గు ♦ ణీకృతంబు
చేసెనేని శుభాంతమై ♦ సీతపెండ్లి, పొసఁగు నని యొక రొకరితో ♦ ననెడివారు.

సీ॥ కార్ముకం బనుకొల్లఁ ♦ గైతవమే యగుఁ, గనకపర్వత మిది ♦ యనెడివారు
ధాత చేతుల తోడఁ ♦ దాఁకి చేయఁగలేదు, ఘన తపోబలముచే ♦ ననెడివారు
మును దీని నెక్కిడి ♦ తన కుపయోగించు, కొనినవాఁ డెట్టిఁడో ♦ యనెదువారు
మేరువునే యిట్లు ♦ మెదిపి చేసిరో వార్ధి, మునుచిల్కు కొండయో ♦ యనెదువారు.
తే॥ చిలువతోఁ డిది యంచు వ ♦ చించువారు, వారిదమునుండి యింద్ర చా♦పంబు జాఱి
పడెనో మేని కయి నని♦పలుకువారు, పడుచు చూచెనే యిదియని♦నొడువువారు.

సీ॥ పెను వింటి నిటకుఁ దె ♦ ప్పింపుఁ డనుచుఁ బ్రభుఁ, డాజ్ఞ యొందులకిచ్చె ♦ ననెడివారు
ఘుత్తి ఛేది వచ్చిన ♦ మన్నీ౦ద్ర దేవం ద్రేని, కలరె యింథని వగఁ ♦ బలుకువారు

చ॥ తలిరులవంటి హస్తములఁ ♦ దాల్చిన కంకణముల్ శిలీముఖం
బుల రొదతోడ నార్వ జల ♦ పూరమునం బొరఁబొలు హేమమే
ఖలలు తునింగి కాళ్లఁ బెనఁ ♦ గన్ భుజగంబులు చుట్టె నంచు వె
ల్వెల గొని కంప మొందిరి వి ♦ భీత మృగాక్షులు కొంద ఱత్తఱిన్. ౯౪౦

చ॥ తొలి కలశాబ్ధిఁ ద్రచ్చునెడ ♦ దుర్ఘటచక్ర సుధతోడఁ దోఁచు వే
ల్పుల జవరాండ్రు చుట్టుకొనఁ ♦ బొల్పగు మందరమట్టు లంగదం
బులు కడియంబులున్ వెలయు ♦ పుష్ట భుజాండగు నొక్క రాజు తన్
గలుకులు చుట్టి నిల్వ జల ♦ కంబుల నాడుచునుండె వేడ్కమై. ౯౪౧

ఉ॥ కంకణముల్ ధరించు కర ♦ కంజములున్ జిఱునవ్వు కవ్వ రా
గాంకితమైన మోవులు ధ్వ ♦ జాంచలలీలఁ జలించు మధ్యముల్
పొంకముగాఁగ నొప్పు పువుఁ ♦ బోఁడులలోనఁ జెలంగు రాజ మీ
నాంకుఁడు తోఁచె నిర్ఝరిణి ♦ హస్తినులం గల హస్తికై వడిన్. ౯౪౨

ఉ॥ కారు నెమిళ్ల క్రొవ్వు లడఁ ♦ గం దగు చాయలు గల్గి మబ్బులం
గేరిన కేశపాశములు ♦ గీల్కొను చిల్కల కొల్కి కూటముం
జేరిన యొక్కతేఁడు విల ♦ సిల్లె సురాపగ తీరమందు పెం
పారిన ఋక్ష సంచయస ♦ మాశ్రిత పూర్ణ శశాంకుకై వడిన్. ౯౪౩

చ॥ అరుదగు తుంట వింటి యస ♦ మాస్త్రునకున్ వల పొందె కాక యం
పఱయు నొసంగు దృష్టి గల ♦ మానిని యొర్తు సఖీ జనం బలం
కరణము గూర్పఁ జెల్వల ని ♦ కాయమునన్ వెలసెన్ మనోజ్ఞయై
విరుల తటాకమందు కడుఁ ♦ బెద్ద జలేజము విచ్చు మచ్చునన్ ౯౪౪

తే॥ చెలులు పలువురు తన చుట్టు ♦ నిలిచియుండఁ, బ్రమద యొక్కర్తు విరిసిన ♦ ప్రసవనికర
వల్లు లొకకొన్ని యొలయఁగా ♦ బాల వెల్లిఁ, బొడమినట్టి కల్పకవల్లి ♦ పొడవు సూపె.

సీ॥ గురు రథంబుల నుండి ♦ కొన్న నితంబముల్, కొబ్బరి మ్రాకులఁ ♦ గొన్న కుచము
లేరి యొద్దను గొన ♦ నేరని యనవద్య, సౌందర్య మొప్పారు ♦ నన్ను తాంగి
కంచెలలోన బి ♦ గించిన వక్షోజ, ములును వెలికి దూఁక ♦ మునిఁగినంత
విమల జలంబుల ♦ వెలుఁగు రాకా చంద్రు, ప్రతిబింబ మన మోము ♦ పరిఢవిల్లె.

తే॥ వలుఁద భుజములు వలువల ♦ వెలికి నుఱుకు, నుఱిదిపిఱుఁదులుకుంభప ♦ యోధరమ్ము
లొండొకటి మీఱి క్రమ్మంచు ♦ నుంటఁ జేసి, వెల్లువలు తటములఁ మీఱి ♦ విరియఁబాఱె

తే॥ ఎఱ్ఱనోరు తెల్లఁగ గను ♦ లెఱ్ఱగాఁగఁ, దావి గందము తొలఁగ వ ♦ స్త్రములు నలఁగ
జలజ వదనలు మునిఁగిన ♦ కొలఁకు చూడఁ, బ్రేమ మీఱఁగఁ గవిసిన ♦ ప్రియునిపోలె.

తే॥ మాన్యులంగూడితిరుగు సా♦మాన్యులేని, మాన్యులౌట యుక్తమకదా? మత్స్యములును
దరుణుల యొడళ్ల తావులఁ ♦ బరిమళించెఁ, బెర నిదర్శన మిఁక దీని ♦ కరయ వలెనె?

క॥ తరుణుల చందనములతోఁ, దరుణుల కుంకుమము గలిసి ♦ తగ నిండిన యా
సరసి నొకచోటు నీలపు, శరదమ్మున నెఱ్ఱ మొగులు ♦ చంద మ్మయ్యెన్. ౯౪౯

క॥ అలఁదిన యొడలి యగురుతోఁ, గలిసిన కలపంబు నీటఁ ♦ గడుగం బడఁగాఁ
దులకించు మెఱుఁగుఁబోణులు, విలసిల్లిరి సానఁ దేఱు ♦ పెను మణు లనఁగన్. ౯౫౦

క॥ చెలువుని భుజమున నంగన, చెలువుగ గందమున వ్రాయు ♦ చిత్రము సరసీ
జలములఁ దుడువఁబడుటం దాఁ, దెలియక కను లెఱ్ఱఁజేసి ♦ తీక్ష్ణతఁ జూచెన్. ౯౫౧

తే॥ వలుఁద పిఱుఁదులు దర్పక ♦ జ్వరము కలుగు, నతివ యొక్కతె కలపంబు ♦ లలఁదేనె
క్రొవ్విరులు పుప్పొడియుఁ గొలఁ ♦ కున జలంబు, తోడ సలసలనుడికెను ♦ ధూమమెగయ

క॥ వనజ నివాసిని భ్రాంతిని, దన కరమున జలక మార్చు ♦ దంతిం బోలెన్
వనమాలా భుజుఁ డొక్కఁడు, తన కరముల నీర మెత్తి ♦ తరుణిం దడిపెన్. ౯౫౩

తే॥ మెల్లని నడక నోడింప ♦ మెలఁత లుంచు, మృదు పదములఁ బోలిన వన♦నెదలఁ గనలి
త్రొక్కులాడుచున్నదియన ♦ దొట్రుకొనియె, నలినములమీఁదియంచపి♦ల్లలు నయారె

తే॥ చందనము వోవఁ దేటయై ♦ సొరు గొనుచు, హేమ కుంభంబులంబోలి ♦ యెనక మెసఁగు
గబ్బి గుబ్బలఁ గని దర్ప ♦ క జ్వరమున, నడలు కాముకు లెందఱో ♦ నుడువఁదరమె?

క॥ ఏలిక విరిసిన తామరఁ, బోలిన కేల్సాఁచి జాడ ♦ పొలపము దెలుపన్
లోలాక్షి చేటి కన్నుల ♦ మూలముగఁ గటాక్ష సంజ్ఞఁ ♦ బోఁడిమిఁ జేసెన్. ౯౫౬

తే॥ అలలు త్రోయుచుఁ బరువిడి ♦ యలముకొనఁగ, నురలు నీట మునుంగు ర ♦ క్తోత్పలములు
హరిణనేత్రల మోమంద ♦ మంద లేమి, మదిని సిగ్గిలి డాఁగిన ♦ మాడ్కి నొప్పె. ౯౫౭

క॥ ఈరీతిం గ్రీడించిన, వీరులు మానినులు సరసి ♦ వీడుచు దరులం
జేరుచు దువ్వలువ లలం, కారంబులు దాల్చి రెల్లఁ ♦ గాంచిన తనివిన్. ౯౫౮

ఉ॥ కోరిన వట్టు నీరములఁ ♦ గ్రుంకి పదంపడి వీడినట్టి కా
సారము లొప్పె రిక్కలును ♦ చంద్రుఁడు వీడిన మిన్నువోలె నిం
డారఁగ విచ్చియున్న జల ♦ జావళి యొల్లఁ దొలంగి దోపు వో
గారము దక్కి కుంది మదిఁ ♦ గంది యలందురు వేద చందమై ౯౫౯

క॥ హరిణాక్షులతోఁ బురుషులు, బెరసి జలము లాడుచుంట ♦ వీక్షించిన యా
తరణి యటులాడఁ గోరిన, కరణిం జని చాయతోడఁ ♦ గడలిఁ గ్రుంకెన్. ౯౬౦

క॥ బలహీనుఁ డగుచు నోడియుఁ, జలమున మఱి యరులపైకిఁ ♦ జను నృపుఁ బోలెన్
వెలఁదుల మొగ్గముల కోడిన, నెలయు మరలఁ బెకి నెక్కె ♦ నెలకొను కడిమిన్.

## ౧౭. మధుపానపటలము. (౬౭)

ఉ॥ తెల్లని కల్లు వెల్లువనఁ ♦ దేటగు పాటలు రూపుతో నిటుల్
చెల్లె ననంగ, నుల్లమునఁ ♦ జిక్కని మోహము నిండిపొర్లి యా
వెల్లువ యయ్యె నా వెలసి ♦ పెల్లుగ వెన్నెల లెల్ల నేత్రముల్
చల్లన గాఁగ నెల్లెడల ♦ సాంద్రముగాఁ బరవెన్ జగంబునన్.

చ॥ కలిసినవారి చేఁతలకుఁ ♦ గల్లునుపోలి వియోగ మొందు వా
రల యుసు ఱాను దుర్విష వ ♦ రంబయి నెయ్యపు టల్కఁ బూను క
ల్కులకును గూర్చు దూతియయి ♦ గ్రొప్పగ విప్పగ వెన్నెలల్ జగం
బులఁ బరవెన్ మరుండు తన ♦ పూన్కికి బాసట గోర వచ్చె నాన్. ౯౬౩

ఆ॥ నదులు గంగలయ్యె ♦ నుదధులు పాల సం, దరములయ్యెఁ బర్వ ♦ తంబులెల్ల
వెండి కొండలయ్యె వెన్నెల పెల్లిద, మంగవించు కేమ ♦ నంగవచ్చు? ౯౬౪

ఉ॥ ఎల్లరు నెల్ల దిక్చిచయ ♦ మెల్ల పదార్థము లుల్లసిల్లి క్రొం
దెల్లని వాటచేత జగ ♦ తీ తల మెల్ల వెలింగెఁ దొల్లి యు
త్ఫుల్ల సరోజ బాణుఁడిలఁ ♦ బుట్టిన నాఁడు రమా సుమాంగి లో
వెల్లిగఁ బొఱు సమ్మదము ♦ పేరిమిఁ గప్పిన వెల్ల యెల్లె నాన్. ౯౬౫

మ॥ పొలఁతుల్ చేరిరి చుక్కలల్లెసఁగు మే ♦ ల్ముత్యాల పందిళ్లనీ
డల సంచార పయోదముల్ దిగెడు ద ♦ ట్టంబౌ వనాంతంబులన్
జెలమం దేటిన నీరువోలు స్ఫటిక ♦ స్ఫీత స్ఫుర ద్వేదికా
స్థలులం బుష్పిత కాయమానముల ని ♦ ష్ఠాగోష్ఠిఁ గ్రీడింపఁగన్. ౯౬౬

తే॥ పుష్పవేణులతోఁ గూడి ♦ పూల సెజ్జ, లందు కాలంబు పుచ్చెడు ♦ నాసఁ బురుషు
లమృతముంబోలి తేటయై ♦ యలరు మధువు, హైమచషకంబులం గొని ♦ యానిరపుడు.

తే॥ అసుర గంధర్వ విద్యాధ ♦ రాబ్జముఖులఁ, గేరు సౌష్ఠన మొప్పు న ♦ క్కీరవాణు
లలరులం దేంట్లు తేనియ ♦ లాను లీలఁ, జప్పరించి రాసవమును ♦ చవులు వాఱ. ౯౬౭

తే॥ చంద్రికను పాలఁ బోలిన ♦ చషక మూను, చేతి కాంతిచేఁ జెలువారి ♦ జేగుఱయ్యె
సుదతి యానిన సుర, రాగ ♦ సుధను పోలె, నింతి కనుఁగవ యప్పుడ ♦ యెఱ్ఱఁ బాఱె.

తే॥ అగురుపొగగ్రమ్మ క్రొమ్ముడి ♦ యవఘళించు, మగువ త్రావిన తెల్లని ♦ మధువువహ్ని
కుండమున నేయివోసిన ♦ కుదురుదాల్చి, యుల్లమున నున్న కామాగ్ని ♦ నొలుకఁజేసె.

చ॥ విలసిత ఫాలయైన యలి ♦ వేణి యొకర్తుక పైఁడిగిన్నెలో
పలఁ దన నీడఁ గాంచి చెలు వా! మధు పానుడు రమ్మ యంచు వే

పిలిచె; వినంబుఁ బోల్కనుల ♦ వేఁడిమి వాక్కుల నబ్ధి వెన్నయున్
వెలయు మనోజ్ఞరాంధ్ర యువి ♦ వేకపు దీటు మఱొండు గల్గునే? ౯౨౧

చ॥ అలుకఁగఁ దగ్గ కౌను గల ♦ యంగన యాసవ పాత్ర ముందు వే
సలియును కెంపు మోవి చిఱు ♦ నవ్వు విష స్ఫురితాగ్ర కుంత వీ
క్షలు గల నీడఁ గాంచి వెఱ ♦ చానరొ యేమి యొకరు వద్ది యెం
గిలి యిదిక్రొత్త త్రావు మని ♦ కేరెను కుట్మల దంత కాంతితో. ౯౨౨

ఉ॥ నూత్న విధంపు హింసలను ♦ నూల్కొనఁ జేసెడి చూపులాఁడి మేల్
రత్నపు గిన్నెఁ గౌముది చొ ♦ రంబడఁ గల్గని సంభ్రమించి వే
యత్నముతోడ నానునెడ ♦ నంగన లెల్లరు కేరి కామినీ
రత్నముఁ గాంచి నవ్వ సల ♦ రామయు శీర్షము వంచి సిగ్గిలెన్. ౯౨౩

ఉ॥ వీణకుఁ బిల్లగ్రోవి కొద ♦ వించెను శ్రావ్యత యీమె యంచు వి
న్నాణముగా వచింపఁదగు ♦ నారి యొకర్తుక కల్వ తావి కల్
నాకెపుఁ బాత్రఁ బట్టి నయ ♦ నంబుల నీడను గాంచి యంత సిం
గాణి బొమల్ వెలుంగఁ దొలఁ ♦ గన్ వడి నూఁదె ద్విరేఫమన్ భ్రమన్.

తే॥ కైపు మిక్కిలి ఘూర్ణిలు♦కనులతోడఁ, గల్గునం దిందు బింబంబుఁ ♦ గాంచి యొకతె
యీపురాహుభయంబున♦నిచటదాఁగి, యుండెకొ?యడలకుమభయంబు♦నొసఁగితినను

క॥ సుడియే యనఁదగు పొక్కిలి, యడరు పడఁతి ప్రూల పంది ♦ రందలి జ్యోత్స్నన్
సుడియు మతిచేత మధువని, తొడిఁబడి గిన్నియకుఁ బట్టి♦దొడఁగెం దోడ్తోన్. ౯౨౬

తే॥ మించు సంచుపఁ జలియించు♦ నించుఁబోఁడి, సుధను పోలిన పలుకుల♦చొప్పువెతఁగ
రశన నూడిచి విరుల స♦రంబు చుట్టి, శిరసునం గట్టు బంగారు ♦ సరిగ చీర. ౯౨౭

తే॥ కల్లుపాత్రలోఁ దనమోముఁ♦గాంచి యొకతె, నిందుఁ డానఁగ వచ్చెనం♦చెదఁ దలంచి
చంద్ర! పొలయల్క వేళలఁ♦జల్ల నగుదు, వేని యీ కల్లు నీ కిపు♦డిత్తు ననియె. ౯౨౮

తే॥ ఒక్క తిలనాస ముంజేయి ♦ త్రొక్కులాడ, నాననముపయి నొలికించి♦ యాసవంబు
మొకమున నెఱుఁగక మఱి ♦ మధువు నాన, గిండి కెమ్మోవిపై బోర ♦ గించె మరల.

చ॥ పిసిని ధనంబుకై యరిగి ♦ వేచిన యాచకు లట్లు తుమ్మెదల్
ముసరి రవాళి సేయ నొక ♦ ముగ్ధ ముఖాబ్జము విచ్చి యాసవం
బెసరఁగ నాన నానగొని ♦ యింబుగఁ గోరను నానవైచు నా
బిసమున జుఱ్ఱుసాగె నలి ♦ వేణులు వింతగఁ గాంచుచుండఁగన్ ౯౩౦

ఉ॥ వాలుగ మీలు బెట్టు చెడి ♦ పాఱ నొఱన్ వెలివాఱు కత్తినా
వాలికలైన కన్నులును ♦ వాల్గడయున్ మదభర్మి చాయయున్

గ్రాలు లతాంత కోమల యొ ♦ కర్తు ప్రియుండు సురర్ గ్రహింపఁడర్
మేలి గుణంబుతో నదియు ♦ మేకొన దానఁగ నుత్సహింపదుర్. ౯౮౧

తే॥ ఒకతె కోపాభినయ మూను♦నొఱప్ప దోఁపఁ, గన్ను లెఱుపొందనొసలు వ♦క్రతభజింపఁ
బండ్లు గొఱుకుచు సులలిత ♦ పల్లవముల, తిమురడఁచు కరతలములఁ ♦ ద్రిప్పుచుండె

చ॥ చలనమునొందు మోవియను ♦ జానగు నెజ్జని దొండపంటిపైఁ
జెలి నెల కాతులంగినిసి ♦ తేటిన తెల్లని పండ్ల నొక్కుచుర్
దొలఁకుచు శత్రు రక్తమునఁ ♦ దోఁగిన ప్రాసముఁ బోలు కన్నులర్
జిలుకక చూచు చెల్వ మయిఁ ♦ జెమ్మట గ్రమ్మను చిందు కల్లునార్ ౯౮౩

ఉ॥ పండిన మోవి దొండపయి ♦ భాసిలు రక్తిమ రెండుకన్నులర్
నిండఁ, దలంచు టొక్కటియు ♦ నేర్పునఁ బల్కుట యొక్కటైన యా
యండజయాన మోమనెడి ♦ యబ్జములోఁ గల కన్నుబొమ్మ కో
దండము వంగెఁ గంపనము ♦ దాల్చెఁ జెమర్చెను భాలచంద్రుఁడుర్ ౯౮౪

ఉ॥ బూరుగపూవు కెవి గల ♦ మోవి మెఱుంగునుపీడఁ బండ్లయం
దూరిన నీరు తేనెవలె ♦ నొల్కఁగ, తొమ్మున దైకతోడుతర్
జీరయు జాఱ, వేనలియుఁ ♦ జిక్కయి జీరుకులాడ గేలి న
వ్వారఁ బ్రియాభిషంగమను ♦ నాసవ సేవయు నొప్పె సామ్యమై ౯౮౫

తే॥ అసమశరునిచే వలవంత ♦ నందుచున్న, యొర్తి ప్రియుఁ దేరఁ జేటిక ♦ నొగిని పంప
నెంచియోచెలీ! నీవునా♦యొడఁదవలెనె, యచటనేయుందొ? మరలుదొ? యనుచుఁ బలికె

క॥ హరిణాక్షి యొకతె తనప్రియు, వరుఁ బిలువగఁ జెలులనెల్ల ♦ వరుసగఁ బంపెర్
దరువాత వారివెంటనె♦తరలె నొకర్తుకయె తాను ♦ దయితుని కడకుర్ ౯౮౬

క॥ వలచు విరి సెజ్జపై దరి, దెలియని మోహాబ్ధి మునుఁగు ♦ తెఱవ యొకతె తీ
పొలయఁగ వల్లభు పేరులఁ, బలుకు చిలుకఁ గౌఁగిలించెఁ బ్రాంతి♦ తొలంకర్ ౯౮౭

క॥ వనజాక్షి యొకతి శయ్యను, దన తోడగు చిలుక నలమి ♦ దయితుఁ బిలువ కే
మనియెదు? జక్కవతో నీ, వును తాపము గూర్తె? యనుచు ♦ బోరున నేడ్చెర్

క॥ తన సవతి పేర దయితుఁడు, తను పిలువఁగ నవ్వు వచ్చెఁ ♦ దరలాక్షికి వెం
టనె కనులనుండి పలపల, మని బాష్పకణంబు లురలె ♦ నలుకయుఁ దొలఁకర్. ౯౯౦

తే॥ మునుపు దొనఁగుచేయుప్రియుండు♦నెనరుదోఁపఁ, బిఱుఁదు మొలనూలిపైఁ గేలు♦
దరుణికన్నులనశ్రుము♦క్తములునేల, జిందెఁ దెగు మేఖలామణుల్ ♦చెదరుమున్నె[ వెట్టునంతఁ

చ॥ అలుగుదునా ప్రియుం డిటకు ♦ నచ్చికబుచ్చిక సేయ వచ్చినర్
కలియుదునా మొదం గలుగు ♦ కంతుని వంత తొలంగు నట్లుగా

పలుకుదునా మనోహరు స్వ ♦ భావ విశిష్టత వీణ మీటుచున్
దెలుపుదునా మనోవ్యథను ♦ తేటగ నంచొక యింతి చింతిలెన్. ౯౯౨

క॥ ఒకరిత తన పొలయల్కను, సకులకుఁ దెలుపకయె వీణ ♦ చయ్యనఁ గొని హ
స్తకమల మెత్తిన యగునటు, సుకముగఁ దన మదిని గలది♦చొక్కఁగఁ బాడెన్ ౯౯౩

క॥ కాంచును శకునం బొకసతి, కాంచిన యప్పుడెల్ల నను వ ♦ గానని వగచే
నించు విలుతు నేటుల నుసు, అంచితముగ వెడలఁ బాఱు ♦ నన నిట్టూర్చెన్. ౯౯౪

తే॥ కందుకమున కందం బిడు ♦ సుందర కర, ప్రియుని పిలువఁగా జోటి నం ♦ పినది యంత
లోన వచ్చె నన్నంతఁ ద♦ల్పులను మూసె, నామె తలఁపేమొ యెఱుఁగశ♦క్యంబుగాదు

క॥ అనురించిన పానుపునఁ జెలి, యమర్షమునఁ దొలంచు త్రోవ ♦ యరయని దయితున్
విమలాంగి కల్ల సోమరి, తిమురున నీలుగుచు నడిగెఁ ♦ దిన్నగ గడియల్ ౯౯౬

క॥ పదరి రొయికతె లత్తుక గల, పదమునఁ దాఁపగఁను నిండు ♦ వపువను చేనన్
నెద వేయఁగ వల పులకలు, పొదలె నన్ గగురుపాటు♦పుట్టెఁ బ్రియునకున్ ౯౯౭

తే॥ పగలు నోరిచి మరలిన ♦ బంటొకండు, సుందరీ స్తనములు కృశిం ♦ చుటను గాంచి
పొంగి తన్ను మించిన ము ♦ దంబున మొగంబు, తేటనొంద భుజంబులు♦ మీటనిలిచె

తే॥ లలిత సుందరుఁ డొకఁడు త ♦ ల్పంబుఁ జేరి, కంతు సంపఱ యెల్లెడఁ ♦ గప్పి యున్న
పగిది నొప్పు పానుపు మీఁది♦పల్లవములు, మాఁడుటం గంటఁగని దిగ్భ్ర♦మంబునొందె.

తే॥ కలశ ముడుకు తాపము గల ♦ కదనవిజయ, వరునకుం బ్రియురాలిబాం♦గరపుఁజనులు
తనకు నభిషేక మొసరింప ♦ ఘనులు నిలుపు, కనకపూర్ణ కుంభములను♦గరిమఁగాంచె

ఆ॥ కనక లతిక ప్రియుని ♦ కడఁ జేర నుంకించి, గజ్జియలును రశన ♦ కంకణములు
దొలఁగఁజేసి పొరపు ♦ గల చందురుని మదిఁ, గనలి యుఱిమి చూచి ♦ కడఁక మానె.

క॥ నవ మదనున కొక్కరుత్తుక, తవిలి పువులు కోసి చుట్టి ♦ తార్చిన సరికిన్
బవి భుజ యుగళము లొంగెను, బువు సరము బలంబు నేము ♦ పొగడం దరమే?

తే॥ కుటిలకుంతల తనలోని♦కుములు దెలుప, మన్మథుని గాంచి తన చెలిన్ ♦ మరలఁగాంచె
నింతియుద్దేశమును గ్రహిం♦యించి సఖియు, సుందరుఁడుచను త్రోవను♦చూడఁదొడఁగె

తే॥ రాజవీరుని కడ కొక ♦ రమణి వెళ్లె, నాతిఁబిలిచిన దూత మ ♦ నంబుఁ గలఁచు
మధువొ? మారుతమో? మాపొ? మరుఁడొ? యేమొ? అరసి పలుకంగ నేరిక ♦నయితి గాదు

తే॥ పొంగినట్టి మోహమునకు ♦ లొంగి వాన, వంటి చల్లని కనుల బా ♦ ష్పములు రాల్ప
నేమి మూఁడెనె యని హితుం ♦ డెదుర నవ్వ, నవ్వె సిగ్గు వీడిన దెల♦నాఁగ యొూర్తు.

తే॥ లేమి నెలవగు కటి గల ♦ లేమ కనలు, ప్రబలఁ దడవిన చేతి న ♦ వ్వాలికిఁ ద్రొచెఁ

ద్రోచునాచేష్టయా ప్రియు ♦ జొమ్మనందు, కుంతలముం గ్రుచ్చుటంబోలెఁ ♦ గుములఁజేసె

ఆ॥ చెలిమి కలిమి గలుగు ♦ చెలి చేయి దడవుచుఁ, జెలువుఁ బిలువుమంచుఁ ♦ జెప్పఁబూను
దన యెడంద సిగ్గు ♦ తలయెత్తఁ జెప్పకో, రంత్రప్రొద్దు నిలిచి ♦ యలమటించు. ౧౦౦౭

ఆ॥ సుడిసి వలపు పైకిఁ ♦ బొడుచుచుండ నొకర్తు, బయలి ప్రాణమైన ♦ వలపుకాని
చేష్టలెల్ల సఖికిఁ ♦ జెప్పంగ నుంకించి, బిడియమంది వేఱు ♦ నుడువు లాడె. ౧౦౦౮

తే॥ ఒక తెయుల్లముల్ ప్రాణము ♦ నొక తెనిండు, ప్రేమయొక పాటిదేయైన ♦ ప్రియుఁడుఁ బ్రియయు
నొడళు లొకటి చేయఁగఁ బోలు ♦ నొత్తిబిగియఁ, గౌఁగిలించికొనిరివారు ♦ కాంక్ష లూఱ

క॥ సుందరుఁ డెదు రగుడు మోసు, ముందేగ మనంబుఁ బోలు ♦ మొగమును ద్రొక్కన్
సుందరునకు నది క్రొత్తగు, చందముగా సిగ్గు ప్రూచెఁ ♦ జానకుఁ బోలెన్. ౧౦౧౦

చ॥ పొలయలుకం జనించు వల ♦ పుం గొని దత్ఫల మూహ సేయు చా
పలమతి యొత్రి కొంటిమెయి ♦ వల్లభుఁ దేరక రేయివోలెఁ గ
ర్వలివలెఁ జేటి చేరఁజని ♦ బంధుర దేహ! యిదేటి తీరు? పైఁ
జులుకఁదనమ్ము గాదె? యని ♦ సూక్తులు పల్కెను తల్లి పోలికన్. ౧౦౧౧

తే॥ నంజదయ్యము దాఁకిన ♦ సరణి నొప్పు, వలపరి యొకర్తు తల యెత్తు ♦ నిలుచుఁ జూచుఁ
బలుకునదియే మొయెఱుఁగదు ♦ చెలువుఁ బిలువ, బంపుదూతితోఁ దన తెల్వి ♦ నంపెనేమొ?

తే॥ జననమరణచక్రమువోలె ♦ సంచలించు, మనసుతో మొయిలునఁ దోఁచి ♦ మరలమఱుఁగు
మించువలె బయటికి వచ్చి ♦ కాంచుఁ బిదప, నేగుచుండు లోనికిని కనంచుఁ బోణి.

తే॥ మకరికా యోగ్యస్తన చను ♦ మలల మీఁద, కంతుతూపులు తొలిచిన ♦ గాయములను
కేల సదుము నేడుచు నవ్వుఁ ♦ గినుకఁ జింత, వెల్లడించుఁ బొమ్మని దూతి ♦ వేఁడు నొకతె

తే॥ సంభవము నాత్రి నెఱిఁగిన ♦ జనులయొద్ద,, జెప్పికొనుటలు వృథయని ♦ చెమ్మరించి
యుడికి కృశియించి పడకపైఁ ♦ బడుచు నొర్తు, ప్రక్కనిలిచిన చేటిని ♦ పాఱఁ జూచె.

తే॥ లికుచకుచలగు కన్యకా ♦ లికిని మించి, బ్రమయుచున్నాఁడు మదులందు ♦ పచ్చికాని
కరణిఁ జొచ్చివారలు ద్రావు ♦ కల్లు తేటఁ, ద్రావెఁగాఁ బోలుఁ బూనిక్కఁగం ♦ దర్పఁడిపుడు.

తే॥ తరుణులం గూడ రశన లం ♦ బరము లూడ్చి, తొలఁగఁ జేసిరి వల్లభుల్ ♦ తుదుమువంటి
వారలేనియు వెలి వఱు ♦ పంగఁ దగని, చెయ్యులొప్పార దగ్గఱఁ ♦ జేరఁ దగునె? ౧౦౧౭

తే॥ బయలి మేఖలల్ వలువలు ♦ వదలఁ జేయు, టబ్రమే? యొర్తు బిడియంబు నవలఁద్రోచె
నాద పదిలంబు గలుగు సన్న్యాసి వలెనె, తన్ను సన్న్యసించుటయు ని ♦ త్తఱిని గలదు.

తే॥ తరుణుఁ డొకఁ డొక తరుణి కం ♦ దర్ప కదన, మందు సములైరి హెచ్చుత ♦ గ్గరయ రాక
యిరువుర తలంపులూపిరు ♦ లేక మయ్యె, నన్నచో నెవ్వరందు గెల్పందువాడు, ౧౦౧౯

తే॥ ఒక్కరుఁడుకరమునఁదన♦యురముమూయ, నెదనువసియించుప్రాణనా♦యకుఁబోటు
గలుగునని వంచనమ్మునఁ♦గరతలమున, మూయుచున్నాఁ డనుచు నొక♦ముదిత కసరె.

తే॥ పగడపు మొన్మోవి వక్షోజ♦పర్వతములు, మృదుల హస్తముల్ భల్లంబు♦లెనయఁ గనులు
గలుగు సతియోర్తు వలపుల♦కడలియైన, ప్రియుని కటరంభవలె మేటి♦ప్రేమ నొసఁగె.

తే॥ వలపు కాని యసత్య వా♦క్కులఁ దలంచి, మేర లేని కోపముగొని♦ మార కదన
మందు మగపోఁడిమిం జేసి♦ యడఁగి యున్న, యాస యేగెల్వ నొకచామ♦ యతిశయిల్లె.

తే॥ హింస్ర సాధనములు రూప♦ మెనసి నట్లు, మెఱయు కన్నుల చెలి తన♦ యొఱపు కాని
నలమి గుబ్బలి గెలుచు గు♦బ్బలు కడింది, విభు నురము దూసి చనెనని♦వీఁపుచూచె.

క॥ చెలువల క్రొత్త వలపులను, వలకాంద్రు భజింప గంధ♦ పంక మురలె వే
నలు లూడె గాజులందెలు, గలగల మనె సంచలించెఁ♦ గటి సూత్రంబుల్. ౧౦౨౪

క॥ కలువల దాయ యివము వలె, వలపు కినుకఁ దోల నొకతె♦ వడి నొడికముతో
బలు కల్ల నిద్దురం గొని, కల సాకున నొరిమ కాంచెఁ♦ గౌఁగిటఁ జేర్చెన్. ౧౦౨౫

తే॥ ఇందు బింబాస్యయును తన♦హితుఁడుఁ జేరు, తరుణమబ్బుట చేదానిఁ♦దలఁగఁ ద్రోవ
కొడలి నొడలితోఁ బెనవైచి♦యొడయిక నెద, నరయ ద్వైరియుదయ ఘాట♦ యరయ ద్వైరి

ఆ॥ కాంచీలూఱునుతున్న♦ కత వరులకు, వక్ర, కుంతలలకు రతులఁ♦ గూర్చు రేయి
వలుఁద చనుల మోయు♦బలిమిఁ గాంచని మధ్య, ములను పోలి కార్శ్య♦మునుభజించె

ఉ॥ పున్నెపుఁ గర్జముల్ తొడఁగి♦ పూర్తి యొనర్పని వారి సంపద క్
చెన్నుగ మధ్య వచ్చుచు న♦శించెడు రీతి విధుండు క్రుంకెఁ బై
వెన్నుని ఱొమ్మునం బరిధ♦ విల్లెడి కౌస్తుభ రత్న లీల వా
రాన్నిధియందు దోఁచె గ్రహ♦ రాజు జగంబులు తెల్వినొందఁగన్ ౧౦౨౬

## ౧౮. ఎదురుకోలుపటలము. (౩౪)

సీ॥ చెడు నీతి త్రోవలలోఁ♦ జెల్లక ధర్మ శా, స్త్రానుగుణ్యంబుగ♦ నరుగు నెఱక
నయము దప్పని పాల♦ నము గల్గు దశరథ, చక్రవర్తియు గొప్ప♦ సామజముల
మద జల ధారల♦ నదులు పాఱుచునున్న, సేనా సముద్రంబు♦ చేరి కొలువ
నాగలోకంబును♦ బాగుగాఁ గనఁబడు, పరిశుద్ధ సైకత♦ ప్రభలు గలుగు

తే॥ త్రిపథగం జేరఁగా నాయు♦ ధీయమైన, సైన్య వారాశి తజ్జల♦ నమితిఁ గ్రోలె
దానిఁ గాంచిన యుప్పు సం♦ద్రంబు గూడఁ, దేట నీరు ద్రావెడు నాస♦ దీటుకొనఁగ

తే॥ పృథుల కేదార వేష్టిత♦ మిథిలఁ జేరు, నంత దశరథు రాకకు♦ నలరి జనక
వల్లభుఁడు మహోదారుండు♦ వార్ధి వలెనె, పొంగి యెదురుకోల్వచ్చెవి♦భుత వెలుఁగ

మ॥ ప్రబలోత్సాహము చెంగలింప మదసా ♦ రంగంబులున్ దేరులున్
విబుధశ్రేణి తురంగపాళి బలయున్ ♦ వీరావళుల్ గొల్వ న
వ్విబుధేంద్ర ప్రతిమానుఁ గోసల విభున్ ♦ వీక్షించి తోడ్తేర ధీ
ర బలుండౌ జనకుండు వోయె రవిఁ జే ♦ రం బోవు చంద్రుండు నాన్.

శా॥ గంగా ప్లావిత భూ విభూత్తము చమూ ♦ కాండంబు షడ్వారిధుల్
తుంగోద్వీచుల శంఖ నాదములతోఁ ♦ దోతేర శ్రీలక్ష్మి నా
రంగం గాంచు సుధాబ్ధి సంతసమునన్ ♦ బ్రత్యుద్గమంబైన జో
కం గన్యామణి సీతఁ గాంచు జనక ♦ క్ష్మాపాలుఁ డేగెన్ వడిన్. ౧౦౩౨

తే॥ పరఁగ నశ్వత్థ దళ రూప ♦భల్ల సమితి, యడరు దశరథుసేనకు ♦ నబ్ధి సప్త
కంబు చతురంగ బల రూప ♦ గరిమ నొంది, జగము పరవంగ నదియ పో♦సాటియగును

తే॥ జాలరులు జాలువారు ము♦త్యాల గొడుగు, లోలి పీలి కుచ్చులు గప్పు♦నుప్పరంబుఁ
బగలు మఱిఁగి యిరులు గ్రమ్మఁ♦బ్రభుని సేన, రంగు పూవుల పద్మాక♦రంబుఁబోలె

మ॥ కమలాదేవికిఁ గాణయాచి విపుల ♦ క్ష్మాపాలు కెక్కెంబొ? వ
క్షమొ? కోటీరమొ? నిస్తులీకృత వళ ♦ క్ష ఛ్ఛత్రమో? సత్కుల
క్రమ సంపాదిత రాజ్యమో?బహుళ సం ♦ ఖ్యం బొల్చు సైన్యంబొ? బల్
శ్రమలం జెందియు నిర్ణయించి పలుకన్ ♦ శక్యంబె యెవ్వారికిన్? ౧౦౩౪

సీ॥ కంచుకాపూర్ణ కు ♦ చాంచితోరస్కల, నీలవేణికలందు ♦ నిండుతేంట్ల
ధ్వనులనే పోలు నా ♦ దస్వర సప్తస్వ, రారావములు బహు ♦ వ్యాప్తి గనియె
రథనేమి రవము వా ♦ రాశి ఘోషముఁ బోలె, గజ ఘీంకృతులు మేఘ ♦ గర్జఁ బోలె
జగతి పరిఖయైన ♦ జలధి మెరకగాఁగఁ, బెంధూళి నిండి యా ♦ పిదపఁ బైని

తే॥ యేడు లోకంబులను ముంచి♦యొనఁక మెనఁగె, ననుట తేలిక మాటయా♦నసుర వైరి
జగములం గొల్చు పాదము ♦చన్న త్రోవ, నేగి యావలి లోకంబు♦లెల్లఁ బ్రాకె. ౧౦౩౬

తే॥ పరవు గొడుగులవరుసలు♦ప్పరముగప్పఁ, గలుగునిరులఁ దొలంచుట♦సులభమె యగు
మణి విభూషలువెన్నెల♦మరపుదెచ్చుఁ,గొరదువై చు నెండయుఁగాయు♦మెఱుపు మెఱయు

తే॥ కోసలేశుండు రా జన ♦ కుండు గరిమ, నెదురు వచ్చు పథము తెల్ల ♦ హేమరజము
గందవొడియుఁ బుప్పొడి పచ్చ♦కప్పురంబు, పెక్కు వగల తావుల ధూళి♦ బెరసియుండె

తే॥ పునుఁగు కస్తురి కుంకుమ♦పువ్వనగు కు, కలిపి చల్లఁగా నైన పం ♦ కంబుతోడఁ
గరుల మద జలధారలు ♦ గలిసి పాఱ, నైన బురదలే వీథుల♦యందు నిండె. ౧౦౩౭

తే॥ సీత లన్నియుఁ బరిమళ ♦నీల కచల, కనక రత్న భూషల కాంతిఁ ♦ గలుగు నవియు
పలుయు చిహ్న పతాకలు♦విరియు మేలు, కట్లు గొడుగులు గప్పఁగాఁ♦ గలుగు నవియు,

తే॥ దశరథుని సేనతోడ నుత్కంఠ మెయిని, జనకు సేనయుఁ గలిసె ఘో ♦ షణముమిండ
ఘన తరంగాకులారావ♦కంధియందు, నదులు చేరఁగా జరుగు వి♦న్నాణ మొప్ప. ౧౧౪౧

తే॥ జనకుఁ డుత్సాహమున లోక♦జనకుఁ డనఁగఁ, దగిన దశరథు రథమును ♦ డాయవచ్చె
రథికవరులతోఁ దన మనో♦రథమువంటి, రథముపై నాసఁ బోలిన♦రయము మెఱయ.

ఆ॥ డాసి తేరు డిగ్గి ♦ మీసరంబగు సేన, వెనుక నిలువ మున్ను ♦ వెడలు నతని
దశరథుండు కేలు ♦ తగఁ జాఁచి యరద మెక్కించికొనియెఁ గౌఁగి ♦ లించికొనియె.

తే॥ పులియెదుటి సింగముం బోలి♦పురుషవరుఁడు, చెలిమి బంధు మిత్రాదుల♦సేమమడిగి
ముందు జరుగ నిమ్మన ముద♦మంది యెల్ల, వారు మిథిలాపురంబును♦చేరినారు. ౧౧౪౪

ఆ॥ ఇట్టులింపుపెంప ♦ నిరువు రేగుచునుండ. తన్ను దాస పోలు ♦ ధన్య గుణుఁడు
శివుని ధనువు విఱుచు ♦ శ్రీరామచంద్రుండు, జనకు జనకు నెదురు ♦ కొనఁగ వచ్చె

ఆ॥ విబుధ మనుజ నాగ ♦ వినుతుండు రాముండు, బలసి వీరవరులు ♦ గొలిచి రాఁగఁ
దమ్ములతోడఁ దాను ♦ తపనీయ రథమెక్కి, వచ్చి చేరెఁ దండ్రి ♦ వాంఛవోలె ౧౧౪౬

తే॥ దశరథేశు నెదుర్కొనఁ ♦ దరలు సేన, లోన నేనుఁగులో? పిడు ♦ లో? హయములో?
లెక్కపెట్టంగ మానంబు లేకయున్న, యా సమృద్ధిని పలుక శ ♦ క్యంబె తెలిసి? ౧౧౪౭

సీ॥ నీలోత్పలమ్ముఁ ద ♦ మాల పుష్పముఁ బోలి, చిత్రసౌందర్యంబు♦చెడఁగ నొప్పి
యమర వినుతమైన ♦ యదుగుఁదమ్ములు గల, చిన్నవాఁడగు రామ♦విభుఁడు మున్ను
వదలిన ముఖ్య జీ♦వమ్ము పిదప వచ్చి, చేరిన కిరణిని ♦ చేరి యంతఁ
దక్కువారు తనకు మ్రొక్కుచుండఁగఁ దన, కన్న జనకు పాద♦కమలములకు

ఆ॥ వినతుఁ డగుచు లేవ♦మనువసఁ దగు దశ, రథుఁడు గాఢముగ ను♦రమ్ముఁ జేర్చి
యలమికొనియె రుద్రు♦విలుద్రుంప మున్నెగు, మహిత బాహు గిరులు♦మఱుఁగుపడఁగ

ఆ॥ తొలఁగ వీలుకాని♦దుఃఖమ్ము మొత్తమ్ము, మాయ మైన యంత ♦ తమ్మ విభుండు
లలిత రీతి మ్రొక్కు ♦ లక్ష్మణుఁ గ్రుచ్చిక, వుంగిలించికొనెఁ గ ♦ రంగు ప్రేమ. ౧౧౪౯

ఆ॥ భవుని ధనువు ద్రుంచు ♦ నవ మన్మథుండంత, మరలి తల్లులకు న ♦ మస్కరించె
వారి యెడఁదఁ బొడమి♦పారమ్ము మీఱిన, సంతసంబు దెలుప♦శక్తు లెవరు? ౧౧౫౦

తే॥ మేటి భక్తి యతిశయించి ♦ తేట యైన, కరణిఁ గన్నీటి కణముల ♦ సరము లురల
మ్రొక్కు భరతుని తను తండ్రి♦మున్ను తడవు, పగిదినురమున, జేర్చె జీ♦వములఁబోలె.

శా॥ శ్యామాకారునితోడ వచ్చు ఘనుఁడౌ ♦ సౌమిత్రియుఁ విస్ఫుర
త్ప్రేమాకారునితోడ వచ్చు గుణవ ♦ ద్వీరుండు శత్రుఘ్నుఁడుఁ
బ్రేమ శ్యామల రూప భూషణములై ♦ పెంపారు పాదాబ్జముల్
మోముల్ చేరిచి మ్రొక్కఁ దేర్చికొని రా ♦ మోదంబుతో పట్టముల్

తే॥ నీతికరుణలే విభుని ని ♦ ఖ్యాత ధనము, లని యెఱింగిన తమ తండ్రి ♦ ననుగమించి
యనుప మార్గమో త్త క్రమ♦మనుసరించు, సుతులు నలువురు చూపఱ♦ ననువాడ్కిఁ గొనిరి

ఆ॥ సాక్షి యనఁగఁ దగ్గ ♦ సత్పరిపాలన, ముదరఁ దల్లి♦ బోలె ♦ సమరువాఁడు
దశరథుండు పిదపఁ ♦ దనయుని వీక్షించి, వైభవంబుతోడఁ♦బదము యనియె. ౧౦౫౮

తే॥ కరులఁ బోలిన యవ్వీర ♦ వరుల ప్రేమ, మెంతదో? వారికౌతుక ♦ మెంత పొడువో?
కనఁగలేము కుమారులు ♦ కదలునంతఁ, బరిజ నోత్సాహ మాతండ్రి ♦ పగిదిఁ బోలె.

తే॥ ప్రేమమయులగు తమ్ములు ♦ క్రేవలందు, సమ్ములై వేడ్కతోఁ దురం♦గముల మీఁద
రాఁగ నున్నత రథముపై ♦ రాముఁ డేగె, భేరి మున్నగు వాద్యముల్ ♦ బోరు కొనఁగ

తే॥ పరవి యభ్రంక షోత్తుంగ♦ భర్మ హర్మ్య, ములను చిత్రాకృతులఁ బోలు♦ పొలఁతిగముల
విసము నిండిన ట్లుండిన ♦ వీక్షణములు, పుష్ప వర్షమె యన నొప్పఁ ♦ బురము సొచ్చె.

సీ॥ అందంపు మేడల - యందెల్ల కర కంక, ణంబులు మొరయ వే - ళులు విరియఁ
జెందమ్మి పాదమ్ము - లం దాల్చు నందె లా, గమ పద్ధతుల తాళ - గతులు దెలుప
కుంభి కుంభంబుల - దంభంబు చెడ డంబు, సింబోరు వక్షోరు ♦ హంబు లొప్పు
సన్నుతాంగులు గల - సౌధంబు లెల్లను, నర్తనశాల లే - నాఁడుఁ గావు

తే॥ దేవదేవుండు శ్రీరామ♦భూవరుండు, దరియ నా బాలికా ప్రౌఢ ♦ మరసిమరుఁడు
ప్రేరణము సేయ వారు గా♦నించు చేత, లెలమి నవధరింపఁగఁ గుతూ♦హలులుగండు.

౧౯. విహారపటలము. (౫౮)

సీ॥ పూలచేఁ దరియు క్రొ♦మ్ముడు లొప్పు పడఁతులు, జింకలగుంపులు♦ చేరు పగిది
బర్హి సంఘంబులు ♦ భ్రమియించుటం బోలి, ఋషు బృందము తేజ♦రిల్లు కరణి
మెఱుపుల రాసులు♦ మెఱసిన కైవడిఁ, దుమ్మెదల్ జుమ్మని♦ క్రమ్మి మూర్వ
జాతిప క్రొమ్ముడుల్ ♦ సవరించుకొనకయు, మొల్లనూలు తెగుటయుఁ ♦ దెలియకుండ

తే॥ పైఁటలుం జాఱ నవదరిం♦పకయుఁ గొను, లులియ తెక్కలు పకయుడాసి♦ తొలఁగు తొలఁగుఁ
డనుచు మధువ్రగోలఁగ వచ్చు♦ నళులయట్లు, సరభసంబున మునరి యు♦త్సాహ గరిమ

సీ॥ కనులతోనే ప్రేమ♦ యను వస్తు రూపంబు, గాంతము గాక యో♦ కాంతలార!
ఈ నాతి జన్మంబు♦చే నొందఁ దగు ఫలం, బీ నాఁడె కందమో♦ యింతులార!
రాతికిఁ దొలిరూపు♦ రమణఁ గావించిన, పదములఁ జూతమో♦ పడఁతులార!
కను బరువైన శ్రీ♦కంఠు విల్విఱిచిన, కరము లీక్షింతమో ♦ కలుకులార!

తే॥ అనుచు నీటి యెద్దడి నొచ్చు - హరిణ చయము, విమల జల పూరముం గన్న - విధిని పల్ల
ముఁ బాఱు జలముఁ బోలి - మనసు పఱవఁ, బట్టఁ బరుగిడు చందానఁ - బరుగు లిడిరి

ఉ॥ మానుగఁ దేరిపై నగర - మార్గమునం జను రాముఁ డప్పు త
న్నే నయనంబు లార్పక ర - హించి కనుంగొనుచున్న యట్టి కాం
తా నికరంబు కన్నులనె - దప్ప కెఱుంగఁగఁ జేసె నుత్తమ
జ్ఞానులు తన్ను కృష్ణుఁ డను - నామమునం గల యర్థ మంతయున్. ౧౦౬౧

చ॥ తలఁపును మించి యీతని ర - థంబు రయంబునఁ బోవ శిల్పటల్
నిలుచునుగాక యంచుఁ దరు - ణీ మణు లెల్లఁ దపించుచుండఁగా
నిలను దివంబుఁ గొల్చిన ర - మేశుని రాఘవు నెప్డుఁ గంటి ఱె
ప్పల కటు దాఁటనీక నిలు - పం దగు మానిని యెంత ధన్యయో? ౧౦౬౨

చ॥ వలఁతి యొకర్తు స్త్రీత్వమును - నల్వయుఁ జిన్నెలు భూషణంబులున్
దెలివి తెలుంగు తేటయును - తేజము లజ్జయు మానసంబు స
త్కులము బలంబు గౌరవము - గోలతనంబును గాత్రముం స్వజీ
వ లవము దక్కఁ దక్కినవి - పాయఁగ నిల్చెను పుత్త్రికాకృతిన్. ౧౦౬౩

తే॥ కమ్మలం దాఁటి వెలుగొందు కనులయందు, మబ్బువోలె నీరొడియంగ-మతిశరమ్ము
లెడము లేకెద గాఁడఁగ - వడఁకె నొకతె, మొగులు లేని మించనఁదగు-మొలనుపోలి

మ॥ చలినీలాలక తెల్ల ఱెప్ప లిడ కా - శ్యామాంగు మైయందముం
గలయం గాంచుటఁజేసి నీలిమము నా - కన్నుల్ తగం బొందెనో
కలుకుల్ కాటుక కన్నులన్ నిరిసి యు - త్కంఠన్ విలోకించుటన్
నలుపై యొప్పెనొ రాము మేను తెలియం - గా రాదు సుంతేనియున్.

మ॥ చిగురుం బోఁడులు రాముపై విరులు వ - ర్షింపఁగఁ గందర్పుఁడా
పగిదిన్ వారలమీఁదఁ బుష్పశరపం క్తుల్ - వర్షింప నొక్కర్తునున్
జగతీనాథుని చండ శాసనము నీ - శ్యామాంగు చిత్తోన్నతిన్
దగవు న్నేరక భీత నేత్రలకు బాధం గూర్చు వీఁ డెవ్వఁడే? ౧౦౬౬

చ॥ లలిత వరాంగి యొక్కతె య - లంకరణంబులు వీడి రాలఁగా
వలువ యొకండు మాత్ర కర - పల్లవ మందునఁ జిక్కఁబట్టుచున్
మలఁగుచు నిల్చె శిల్పకుఁడు - మాటలఁ గోమల దాఁటి నిల్చు పెన్
వలపునె ముద్దచేసి చెలు - వంబుగఁ దీర్చిన చిత్రమో యనన్. ౧౦౬౭

ఆ॥ గెలుపు హీంన గలుగు-క్రేఁగంటి చూపుల, చెలువ యోర్తు నొసలు-చెమ్మరింప
మనసు సొక్క నిలిచి-మఱి యొండు గానక, రాముఁ డొంటి యున్నె-రామ!యనియె.

ఆ॥ మనసు కరఁగి యున్న-మగువ యొక్కర్త మీఁ, వంచకుం డెడంద - వచ్చి దొచ్చె
వెడఁద కేగకుండఁ-గను త్రోవ మూసితి, పెద్ద గదికిఁ బోవు, చేలి! యనియె, [illegible]

ఆ॥ ప్రతిమఁ బోలు నతివ • రతిపతి శరములు; గణన గొనక రశన • కంచుకంబు
ప్రీల వచ్చి నిలిచి • ప్రేమమై రాము మై, యొప్పుగాంచు వారి•నుఱిమి చూచె. ౧౦౭౦

తే॥ ఉత్సుకతతోడ నేతెంచి • యువతి యొకతె, దీర్ఘ చపల నేత్రంబులఁ • దేఱి చూచి
తృప్తివడి ప్రేమ గొని యెడ•తెఱపి లేని, లోని సంతాప మడరంగ•లోని కేగె. ౧౦౭౧

ఉ॥ తోరపుఁ గేశపాశములు • దొడ్డ కుచంబులు బల్ పిఱుందులున్
దూఱఁగనీక దట్టమయి - తోఁపఁగ, గన్నులఁ జూడలేక య
వ్వీరుని సౌరు గాంచు తమి - ప్రేరణ సేయ శుభాంగి యొత్తి యిం
పారఁగ వారి కొనుల బ - యల్లనె వంగుచుఁ గాంచె నత్తఱిన్. ౧౦౭౨

చ॥ మదనుని సూసి బాణములు - మానసముల్ గలఁపంగ వీథులం
జెదరిన భూషణావళులు - చిందిన గంధము జాఱు మేఖలల్
కొదరిన తారహారములు - క్రొమ్ముడి జాఱిన పూసరంబులున్
బొదలిన చోట్లు దక్క మఱి - పుట్టదు వేఱుగు తా వొకింతయున్. ౧౦౭౩

సీ॥ భుజములఁ గనువారు - భుజములే కాంచిరి, పదములఁ గనువారు - పదులె గనిరి
ఆజాను బాహుల - యందంబు గనువారు, వానినే తెప్పవా-ల్పకయె కనిరి
వాఁడి కన్నులు గల - వారిలో రూపంబు, పూర్తిగాఁ గాంచిన - పుణ్యు లెవరొ?
తమ మతానుష్ఠాన - ధర్మంబు చొప్పున, చెప్పంగఁ బడు మహా - చిద్విలాసు

తే॥ పెక్కురూపులుతోఁపనొ•క్కొక్కరూప, మొనరసద్భక్తిఁగాంచునొ•క్కొక్కమతము
వారిఁ బోలిరి వీక్షించు - వారలెల్లఁ, జారుతరమూర్తి రామ వి - హారవేళ ౧౦౭౪

క॥ తనుమధ్య యొకతె బ్రతుకుట, కనువుగ నతఁ డామె యెడఁద - నడఁగె జగములన్
దన కుక్షి నడంగించిన, ఘనాఘన నిభాంగుకంటె - ఘనులెవ్వారల్? ౧౦౭౫

క॥ చెలి యొకతె తేర్చి తొడినవి, గలగల మనఁ బూవు రెమ్మ - కరణి నరిగి యా
వల వలవల నేడ్చుచుఁ జె, ల్వల చేతులలోన మరలె - భవనంబునకున్ ౧౦౭౬

క॥ గిరి నిభ ధనువును విఱిచిన, కరణిఁ జెఱకు విల్లు విఱిచి - కావఁగఁ దగదే?
వరవీర! దాసి ననియెన్, బిరుసు మనము గల యొకర్తు బింకము చెడగన్. ౧౦౭౭

క॥ చెలి యొకతుక యనియెఁ దపః, ఫల మనఁదగు రాఘవుండు - బండిం దిగి క
న్నుల యెదుట నిఱుకు త్రోవ, న్నిలిచిన యీ చేఁత కలయొ? - నిజమొ?కపటమో?

క॥ కనకాంగి యొకత మదినే, తన దూతిగఁ గొనుచు నుసుఱు - తలరేడి చింతన్
వనజాక్షి జనకనందిని, మును ఘన తపములను చేసెఁ - బూనిక ననియెన్. ౧౦౭౯

క॥ పొచ్చెంబు లేని చిత్రపు, టచ్చనఁదగు పడఁతి యొకతి - యడలి బడలుచున్
-చెచ్చెలి! యీ దృశ్యము మఱుఁ, దచ్చముగా వ్రాసి యుంచ - నగునే?యనియెన్

క॥ హరిణాక్షి యెవ్వ ర్తి యారయ, నరునకు నీ లక్షణములు - నలువొందునె? శ్రీ
వరుఁ డితఁడు నిక్కమియ్యది, యరయఁగలరు కన్నులార - ననియెఁ జెలులతో.

క॥ వనజాక్షి తొడవు లూడఁగ, మనసు కరఁగ వాడి యితఁడు - మన పురమునకుం
జనుదెంచుట తొలిఁ జేసిన, జనకు తపఃఫలమె యంచుఁ-జక్కఁగఁ బలికెన్. ౧౦౭

క॥ కను లశ్రులు రాల్ప నొకతె, తన యొడ లొడికంబు వీడఁ - దపియించి యితం
డనుఁగులు మునులును విడివడ, వనటఁ దొలఁగఁ గలనునేని - వచ్చునె? యనియెన్

క॥ జలదమ్ముఁ గాంచిమురియు నె, మలిబోలెం గనక లతిక - మది వల దాఁచం
దలఁచె, నది మారుఁ డెఱిఁగెను, తలఁపుల మది దాఁచినట్లు - దాఁచునె మోహమ్మున్?.

ఆ॥ వాలుగంటి యొకత - పూల పానుపుఁ జేరి, పిడుగు మ్రోఁత విన్న - పడగదారి
చాడ్పు మిట్ట యిఱుకు - చన్నులు చెమరింప, బుద్ధి చెడఁగ నూర్పు - పుచ్చుచుండె

తే॥ చెంగలువఁ బోలి యమృతంబు-చెంగలించు,నధరబింబ లిట్టులు లోన-నలయుచుంద్రి
సీత చేసిన వ్రతములు - చేయకుండు, వార లెటు లుండఁ గల రాత్రి - వడయకుండ.

తే॥ ఒడలు చెమరించి ప్రాణంబు-లుడుకు నొకతె,విమలుఁడగురాముఁడింతేని-ప్రేమతోడ
నొకరిఁ జూడఁడ తలఁపడ-యుబ్బు గొనఁడ,వలపుసుంతేని మదిలేని-వాఁడొ? యనియె.

చ॥ పురమునఁ గల్గు పైదలులొ - పూర్తిగ లెక్కకు మించినారు దా
శరథి శరీర సౌష్ఠవము - చాఁగురె! యెల్లయె లేనిదయ్యె నె
చ్చిరి చిరి కౌతు మాత్ర మిఁకఁ - జేయునదేమి?శరంబునందు పూ
శరములు వట్టిపోవయిచెఁ ♦జయ్యన మొగ్గ కటారి దూయుచున్ ౧౦౮

తే॥ భువిని వెలఁదులకే గాక ♦ దివిని గలుగు, నారులకుఁ గూడఁ గలిగెను ♦ మారు పోరు
లిచట నుండిన మన మద్ది ♦ యెఱుఁగ లేద, ఇచట విడిచిన శరములే ♦ యచటఁ దాఁకె.

తే॥ మోహమునఁజిక్కి భ్రమియించు♦ముగుదలింద, ఱుండనొకతెనేనిగొనమి♦యొప్పునేమి
ఇతఁడుసన్న్యాసియో?కాఁడు♦సతులపాలి, చెడుగుకొలకాఁడనుచునొక♦చెలువపలికె

తే॥ మఱుఁగు తాపము గల తను♦మధ్య యొకతె, కాలు సేతులు తూలఁగా♦సోలి పడియె
కనిన వార లయ్యో పాప♦మనుచు బ్రదుకుఁ, గాక!యనివచించిరి మిత్తి♦తాఁకెననుచు

తే॥ యువతియొక్కతెయుయ్యల♦యూఁక వోలెఁ,గాళ్లుకాయలుగాయ న♦క్కమలనేత్రు
వెంటఁబడి కొంత దవ్వేగి ♦ పిదపమరలి, చేరె యింటి కిదెవ్వరు ♦ చేయు తీరు?

తే॥ ఉత్కటంపు మనోభ్రమ ♦ మొప్పు మగువ, లందొకతె మఱియొక గోల♦నరసియచట
నా మనముఁగూడఁగాంచితే♦నాతి!యనియెఁ,దలఁపుమితిమీఱునెడసిగ్గు♦నిలుచునేమి?

క॥ ఇన కులము వారు శరణం, బనఁ గాచిన వార లౌనఁగి ♦ యనువులనేని

వనితల యుసుఱులఁ గొను టీ, తని కెట్లబ్బె నసి యొక్క ♦ తరుణి వాదించెఁగా. ౧౦౯౪

ఆ॥ సిగ్గుచేత నెలవు ♦ చెడిన చంద్రుఁ డానన, హారుని ధనువు నిలఁడు ♦ విఱుచు టెన్న
సీతకొఱకుఁ గాదు ♦ చేపడు గెలువిద్దె, వలఁతి తనము చూప ♦ వలచి యనిరు.

ఆ॥ నేలి ప్రాణ వితతి ♦ తూలు నొక్కరుక, ఘోర ధనువు దాల్చు ♦ వీరు నెదుట
మారుఁ డిట్లు మమ్ము ♦ మారాము సేసెడి, నెంత బల్లిదుండొ♦యాతఁ డనిరి. ౧౦౯౬

ఆ॥ వనిత లెల్ల రిట్లు ♦ వలవంత పాలుఁగా, విమల మూర్తి సుండు ♦ వినుత గుణుఁడు
చేరెఁ గౌశికుఁడు వ ♦ సిష్ఠుఁడు నృపవరుల్, కూడియున్న కొలువు ♦ కూటమందు.

ఆ॥ రాముఁ డంత మెఱపు ♦ భ్రమియించు తీరున, హార వితతి చలన ♦ మందు చుండ
కాలమేఘ మొండు ♦ నేల ప్రాలు పరణి, చాఁగి శిరము వంచె ♦ సన్మునులకు. ౧౦౯౮

తే॥ ధర్మమును గానఁ బుట్టిన ♦ చాటు కొరి, మ్రొక్కి దీవించి వారు కూ♦ర్చుండు మనఁగఁ
బుష్ప శిల్పంబు గల దొడ్డ ♦ పొన్న గద్దెఁ, దమ్ము లిరుగడ నిల్వ మ♦ ధ్యమున నొప్పె.

క॥ నక్షత్రములు భజింపఁగ, ఋక్షేశుఁడు మిన్ను నెలుఁగ ♦ నేతెంచు క్రియన్
బక్షముల విభులు గొలువన, పేక్షా మండపము దశర ♦ థేశుఁడు చేరెన్. ౧౧౦౦

తే॥ చేరి మునుల పదంబులు ♦ కోరి మ్రొక్కి, భూసురాశీఃపదములతోఁ ♦ బుష్పవృష్టి
గురియ నుచితాసనంబునఁ ♦ గూరుచుండె, నగవిభేదియు సిగ్గిలి ♦ మొగము వ్రాల్ప.

సీ॥ గంగరాజులును కాళింగులు వంగులు, నంగభూపులును కు ♦ ళింగవరులుఁ
బాండ్యులు చోళు లా ♦ వంతికుల్ చేరులు, మాళవుల్ మాత్స్యులు♦మాగధులును
శకులు కొంకణులు సో♦మకులుచీనులుపుళిం, దులుతురుష్కులును చై♦ద్యులునుపౌర
వులు కటినాటి ప్ర ♦ భులు తెల్గుదొరలును, యాదవుల్ నేపాలు ♦ రాదిగాఁగ

తే॥ నాదిభూతంబుచేఁ గి ♦ యంగఁబడిన, కడపటిది యగు పృథివిపైఁ ♦ గల సమస్త
రాజులెల్లఁ గిరీట ♦ భ్రాజమాను, లగుచు వచ్చిరి పెండిలి ♦ కలవి లేక. ౧౧౦౨

ఉ॥ చక్కరబొండ్లు పిచు వెలి ♦ చామరముల్ భువనంబు లెల్లెడన్
నిక్కిన కీర్తి వృక్షమున ♦ నెక్కొను పల్లవ పంక్తిరో యనన్
మిక్కిలియు న్వెలింగె; బహు ♦ మేదుర వంశ రుతంబుఁ బోలి పెం
పెక్కిన వంశగీతు లెల ♦ యించిరి ముగ్ధలు తత్సభాస్థలిన్. ౧౧౦౩

క॥ తన వంశంబునఁ బుట్టిన, జనకజ పెండిలిని సంత ♦ సంబునఁ గాంచం
జనుదెంచు చంద్రుఁడో యనఁ, దనరెన్ దశరథుని గొడుగు ♦ ధవళిమ మీఱన్.

ఆ॥ ఉన్నచోటనుండి ♦ యొదుగంగ స్థలము లే, కునికిఁ జేసి గొప్ప♦యుదధిఁ బోలి
జనము చేరి నిలువఁ♦జనకు రాజ్యం బొక్క, పట్టణంబె యొస ♦ పగిది నొప్పె. ౧౧౦౪

తే॥ జనకరాజు కౌతుకమున ♦ సంపదలను, చల్లి సంతసించిన ప్రేమ ♦ జానకి యెడ
రాముసెడ భీదలందును♦రాజులందు, రామునందును సమముగా♦వ్యాప్తినొందె.

## ౨౦. అలంకారపటలము. (౪౩)

చ॥ ప్రతిమలు ప్రాణముం గొనిన ♦ పాటిగఁ గ్రేవల రాణు చొప్ప నా
తత విభవేంద్రుఁడౌ దశర♦థ క్షితిపాలుఁడు సంతసించు నా
తతిని వసిష్ఠుఁ డారసి సు ♦ ధా మధురోక్తుల నిట్లు వల్కె- నీ
సుత నీకిఁ బిల్వనంపుము య ♦ శోనయశౌర్యధనాఢ్య! మైథిలా! ౧౧౦౬

క॥ అనపుడుఁ బ్రియ మానందము, తోనఁకఁగ జనకుండు చెలుల ♦ తోఁ బృథ్వీశుం
గొని తెండన వారలు వడి, జని దాదుల కత్తెఱంగు ♦ జానుగఁ దెలుపన్. ౧౧౦౭

ఉ॥ ఆరుచు నొప్ప లక్షులకు ♦ నందము గూర్ప నొనర్పఁబడ్డ యా
తీరున భూషణంబు లని ♦ తేటగు రూపముఁ గప్పునంచుఁ దా
నూరయులేక తీయఁదను ♦ మంబుధినెన్నకుఁ గూర్చు కైవడిన్
సౌరుకు సౌరు గూర్చిరి; వ ♦ సుంధర యజ్ఞత గొన్నదే కదా! ౧౧౦౮

తే॥ రామచంద్రుని మై వన్నె ♦ రామ యెడఁద, నెరసి తీఁగలువాతి పై ♦విరిసె నవఁగ
నొప్పు కప్పుఁ గొప్పుఁ బూవ్వులొందఁ జెరిసె, రంబుదంబున మందురా♦యందమంద.

తే॥ చుక్కలెల్లను తొగతేనిఁ ♦ జుట్టినట్లు, నెత్తి నిండఁ బాపటబొట్టు♦నెత్తి కట్టి
యబ్జుఁ డనుక్రేపుఁగన్నమ♦బ్బనెడిపశువు, చాఁచునాల్కనాఁగఁ దురాయి♦సనదరించి

మ॥ హర కోదండ విఖండనుం డయిన పీ ♦ రాగ్రేసరుం డౌనె? ము
న్నురవౌ ప్రాణసములన్ దపించ వలచే ♦ నుఱ్ఱూట లూరించి నా
తరుణీత్వంబు గ్రహించువాఁడని యెడం ♦ దం జింత గావించు నుం
దరికిం దాల్చిరి యూఁగుచుట్టి మది చం ♦ దంబందు తాటంకముల్. ౧౧౧౨

మ॥ బలజాతాక్షుల కెల్ల ధవ్యమగు ల ♦ జ్జం గల్గుకంఠంబుల
దిలకంబై తగు సీమె కంఠమునకున్ ♦ దీప్త ప్రభా భూష
గలవే? మాపతి దాల్చు శంఖమె యటం ♦ గల్యాణ రు బుతో
సలరె న్నాఁ జను కంఠమం దిడి రమా ♦ ల్యంబైన హారావళుల్

ఉ॥ పన్నగ మింటి రిక్కలను ♦ ప్రావగఁ గూర్చిన కోవ యందమా?
వెన్నెల తేనిఁ జిల్చి తటి ♦ వెట్టి కుదిర్చిన మాల యందమా?
చెన్నగు లజ్జతో నెసఁగు ♦ చిర్నవు వెన్నెల పర్వె నందమా?
యెన్నఁగఁ దారహారము న ♦ యిఁచిన పొందిక నేమనందునో! ౧౧౧౪

ఉ॥ చిన్ని పదంబులన్ మణుఁగు ♦ చేరిన తమ్మికి రాగ మిచ్చు నా
యన్నులమిన్న మేనఁగల ♦ యందము చందము సౌరు మీఱి పే
రెన్నికఁ గన్న చన్నుల ప ♦ యిందగు హారము దాల్చినంతనే
మున్ను వళక్షమై పరఁగు ♦ ముత్తెము లెఱ్ఱన యయ్యె నయ్యెడన్. ౧౧౫

తే॥ అంగదంబులు దాల్చిన ♦ హస్తములకు, చెప్పలల్లార్చ మిఱుమిట్లు♦ గప్పు పద్మ
రాగములు ముత్తెములు గూర్చఁ♦గ్రాలుచుట్టి, వెదురు గల్గిం సమత నె ♦ప్పి కొనవచ్చు

ఉ॥ రాగపుఁ గేలు దమ్మి రఘు ♦ రాము భుజంబులఁ దాఁక నోచి త
ద్రాగము నొందఁ బాత్రమయి ♦ రాత్రులలో ముకుళింపవంచు బొ
ట్టోగుల నెంచి చంద్రముఖు ♦ లొందగ మానికముల్ ఖచించుటన్
జేగుఱు మీఱు గాజులను ♦ చెల్వుగఁ దాల్చిరి సీత కంతటన్ ౧౧౬

చ॥ నెలఁత కుచద్వయం బనెడి ♦ నీలమణుల్ గల కుందనంపుఁ గుం
డల పయిఁ బుష్పవల్లి రతి ♦ నాయకు చాపము నేణనాభి సం
కలితముగా లిఖించి కడఁ ♦ కం బరమార్థముఁబోలె శంకచే
గలదని లేదనం దగిన ♦ కౌనును నొవ్వఁగఁ జేసి రెల్లరున్. ౧౧౭

తే॥ రంగు లీనెడు పట్టు వ♦స్త్రంబు గట్టి, రత్న ఘల్లరుల్ గల మొల♦త్రాడు చుట్టి
వివిధ కాంతు లొడలి నుండి♦వీచుచుండ, చెలువె భ్రమియించి నిలిచి రీ♦క్షింపలేక.

తే॥ లక్తకము లేకయే రాగ♦లహరి వీచు, పదములు శిరీషములకంటె ♦ మృదువులగును
వాని యందిడునందెలు♦వరునమ్రోయు, మృదువులే మృదువులె మఱి♦మృదువులె యని

చ॥ సారిది విషంబు మధ్యమునఁ ♦ జుట్టు సుధం గొని కర్ణమూలముల్
దూరసియు వంచకత్వమును ♦ డొంగతికంబును లేక గోముగాఁ
జెరఁగిన కన్నుదోయి నలి ♦ వేణులు నించిన యంజనంబొ? శ్రీ
వరుఁ డగు రాము మేని నును ♦ వన్నెయొ కాంచఁగలేము సల్లనన్. ౧౧౮

సీ॥ అందమై వి[illegible] ♦ చెందమ్మిలోన నిం, పీవరద్వయ ముప్పు ♦ తిల్లునేని
వానిపైఁ [illegible]న్నెల ♦ వంక నిల్చునయేని, తన్మధ్యమునఁ జుక్క ♦ తనరునేని
యెన యగ[illegible]ని వచి ♦ యింపంగఁజెన్నారి, త్రిభువన కన్యకా ♦ తిలకమైన
జనక కన్య నుదుట ♦ జానైన కస్తూరి, తిలకంబు దిద్దిరా ♦ తెఱవ లంత

తే॥ వివిధ మధు పాళి ముసరిన♦ వివిధ వర్ణ, కుసుమ నిచయంబు మాలికల్ ♦గూర్చియుంచి
తుఱిమి చెరివిరి మెత్తిరి ♦ మురువుగాఁగఁ, బొన్న పుప్పొడిఁ బోలిన ♦ పొన్ను ధూళి.

తే॥ నేతి దీపంబు చుట్టి ప ♦ స్పురు పువులు, చల్లి కుల దేవతల మ్రొక్కి ♦ తెల్లయావ
పొడి నొసట నుంచి యారతి ♦ బడిసి వైచి, రక్ష కట్టిరి సీతకు♦ రాజ ముఖులు. ౧౨౦

తే॥ చిల్కలకుఁ బల్కులను నేర్పు ♦ సీత చెలువ, మళులవలె, నాని చెలువలే♦వలపుగొన్నిరి
ఏమి చెప్పుదు నావింత ♦ యెంచి చూడ, యువతులకు యువకుల కుల్ల ♦ మొండె కాదె?

చ॥ చెలువలు జానకీ రమణి ♦ చెల్వును పున్నమ చంద్రునట్లు క
న్నులఁ గని సొక్కి సోలిరి; జ ♦ నుల్ పరికింపఁగ వాంఛ నీయమై
పొలఁతుల కొక్కొకంగమె ప్ర ♦ పూర్ణ మనోహర రీతి నొప్ప నా
చెలువములెల్ల నొక్కయెడఁ ♦ జేరఁగఁ గాంచి భరింప శక్యమే?

ఉ॥ సంకు ధరించియుఁ గమల ♦ సద్మము నొందియు నెల్లవారి హృ
త్పంకజమందు చిత్రగతిఁ ♦ బర్వి తలంచిన యెల్ల చోటులం
బొంకముగాఁగఁ గానఁబడి ♦ పూరుష వర్యుని రాముఁ బోలె నా
పొంకవగంధి సీత యిఁకఁ ♦ జక్కఁగ వర్ణన చేయు టెట్లగుఁ? ౧౧౬

చ॥ పరవిన మేఖలల్ పసిఁడి ♦ పాప పటంబు మొగంపు టందియల్
కరములఁ గంకణంబులు ర ♦ కంబుగ మ్రోఁగఁగఁ గీరవాణు ల
ప్సరసలఁ బోలు సుందరులు ♦ సారసగంధులు పెక్కుమంది ని
ర్భర కుతుకంబుతో జనక ♦ రాజ కుమారిని గొల్చి చుట్టి రాఁ. ౧౧౭

తే॥ గుజ్జులును గూనివారు స ♦ ఖులును బలయు, మణుల మేల్కట్టుపీడ నా♦మగువమిన్న
చుక్కలందునఁ జందురు ♦ సొంపు దాల్చి, నవయకుండు జోతిం బోలె ♦ నడవసాఁగె.

తే॥ తన్ను గన్న భూదేవి యా ♦ తన్వి మృదుల, పాదములు నొచ్చునని నేలఁ ♦ బఱచినట్టి
ననలు నా నొప్పు తన మేటి ♦ నగల డాలు, ముందు పరవఁగ సీత జా ♦ నొంద నడచె.

తే॥ వినుతి కెక్కిన తనయాన ♦ ముపకు నోడి, పడుచు లేచుచుఁ జను తెలి ♦ పక్షుల వలె
నిరు గెలంకుల నెల్ల చా ♦మరము లొలయు, బర్హ కాంతితోఁ జను బర్హి♦భాతి నడచె

తే॥ ఎల్ల లోకంబులందలి ♦ యిగురుఁ బోండ్ల, కంటి పాపయై యొప్పు నీ ♦ కన్య హావుసు
చూడ రామ వంశోద్యుండు ♦ సూర్యుఁడె దిగె,నాఁగఁ జనువితానము నీడ♦నడచివచ్చె

తే॥ మణి కలాపంబు చుట్టును ♦ మలసి వెలుఁగ, నడుమ దేహ కాంతి మిగుల♦నొరుచూప
మండలాకృతి వెలయంగఁ ♦ గుండలములు, కౌను చలియింప నడచె న ♦ క్కలికి మిన్న

తే॥ విరుల తావియు బంగారు ♦ మెఱుపు కాంతి, చందనపుఁ జల్లఁదనమును♦పొందియంచ
లచ్చరలు సుధ సిగ్గిల ♦ నవని పతులు, వఱలు రత్న ఖచిత మండ ♦ పమునఁ జొచ్చె.

తే॥ కల్పనాకర్త లేని యా ♦ గమ మనంగఁ, దగిన వలుఁద పాలిండ్లొప్పు ♦ మగువఁ గాంచి
స్త్రీలు పురుషు లెల్లరు వట్టి ♦ చిత్రములను, పోలి రాప్పక యూర్పక ♦ తూల ఫోక

తే॥ ఆమెయో? కాదో? యని శంక ♦ నందుచున్న, ఇనకులేశ నందను డామె♦ నెదుటఁగాంచె
వినము పుట్ట నిర్వేదించి♦ వెనుక నమృత,ముద్భ విల్ల హర్షిలు పురు♦ హూతు రీతి ౧౧౩

తే॥ ముదురు చవి సుధఁ బెరిఁగిన ♦ పుణ్యఫలమొ, నాఁగఁ దగిన బింబాధర ♦ నా యెడంద
యుందకాళ వెల్వలను పెం ♦ పొంద నున్న, యదియొ! యని తలపోసె నీ♦లాబ్ద తనుఁడు

తే॥ ఎలమి మా చేయు గురు తపః ♦ ఫలము వలన, మహిని రాముఁడై పుట్టెను♦మాధవుండు
అతని ప్రేముడి పత్నియా ♦ నజ్జ నిలయ, సీత యని వసిష్ఠుఁడు సంత♦సించె మదిని.

తే॥ కోసలేశుండు జానకి ♦ కొమరు గాంచి, యేడు దీవుల నేలిన ♦ వాఁడ నైన
నేఁడు తత్ఫల రూపంబు ♦ నియతితోడ, దైవ మొసఁగె నం చమిత మో♦దంబునొందె

ఉ॥ నైవళవీణఁ బోలు బలు ♦ నాణెపుఁ బల్కులు గల్గు సీత యా
త్రోవను పోవఁగా దశర ♦ థుండు మహర్షులు తక్కఁ దక్కు వా
రా వనితామణిం గనిన ♦ యంతన మ్రొక్కిరి వారి డెందముల్
దైవమ యంచు నెంచెఁ; దను ♦ ధర్మ మెడందకు లోఁకువే కదా! ౧౧౩౯

చ॥ విసివి సరోజముం విడిచి ♦ వేడ్క విదేహ గృహంబుచేరు నా
వసుమతి పుత్త్రి మానులకు ♦ భక్తిని వందన మాచరించి పెం
పెసఁగఁగఁ గోసలేంద్రునకు ♦ నిచ్చను మ్రొక్కి యనంతరంబు సం
తసమున బాష్పముల్ వదలు ♦ తండ్రికడం వసియించె గద్దియం ౧౧౪౦

తే॥ ఈమె లక్ష్మియే యగు నిజ ♦ మితఁడు గిరిశు, వర శరాసన మనవేల? వలయునేని
యేను కొండల విఱువంగ ♦ లేఁడె యనుచు, నిరుసు వంటి వసిష్ఠ ము ♦ నీంద్రుఁ డెంచె

ఉ॥ వేడుక వింటి నెక్కిడుట ♦ విర్చుట చెప్పఁగ నాలకించియుం
బోఁడిమి యందె సందియము ♦ పొందిన సుందరి శంక వీడి లో
వీడని రూపముం గనుచు ♦ వెల్వలి రూపము కంకణంబులం
వాడుకచేఁ గుదిర్చెదు నె ♦ పంబునఁ గాంచెఁ గటాక్షవీక్షలం. ౧౧౪౨

తే॥ లీలఁ గ్రేఁగంటి చూపుల♦డాలు వోయి♦భ్రాంతి రాముఁడం జలధి జీ♦వనముగొనియె
దక్కుసుధ పూర్తిగఁ దానె♦త్రావినట్టు, లొడలు పొంగారె మెల్లన♦నూర్పు వెడలె. ౧౧౪౩

చ॥ తన మది నున్న వంచకుఁడె ♦ తథ్యము చాపముఁ ద్రుంచె నంచు నా
జనకజ లోని దుఃఖమును ♦ చయ్యన వీడెను జన్మదుఃఖ కా
రణ మగు మాయఁ దోలి తగు ♦ జ్ఞానముచేఁ దనలోనఁ దన్నుగాం
చిన జని ముక్తినొందు క్రియఁ ♦ జెందె నొకానొక ముక్తి నామెయుం

తే॥ విమలకీర్తియా దశరథ ♦ విభుఁడు వేద, విదుని కౌశికుఁ గాంచి యో ♦ వినుతచరిత
జానకీ రాములకుఁ బెండ్లి ♦ జరుగఁ దగిన, శుభ ముహూర్త మదెప్పుడో ♦ చూడుఁ డనఁగ

సీ॥ వాలుగల్ మిడియుచుఁ ♦ బాఱఁ గ్రుమ్మటచేత, శిఖరి మత్స్యంబులు ♦ చేరి దుముక
నానుముల మెదడును ♦ పృష్ఠముల్ ప్రీలంగ, కొఱమీలు పాళలు ♦ విరియ దుముకు

చుండు సుక్షేత్రముల్ ♦ దండిగా, గలిగిన, కోసల జననాథ!కొంతలేని
శుభ ముహూర్తము రేపె ♦సాంపారు నని గాధి,తనయుండు పల్కఁగాఁ♦దగు నటంచు

తే॥ వాఁడు లెల్లరు మ్రొక్కఁగాఁ ♦ వీడుకొలిపి, భూరి వాద్య ధ్వనులు భువి♦బోరు కొలుప
మునులకున్ మ్రొక్కి వారల♦యనుమతిఁ గొని, దశరథుఁడు లేచి విడిదికిఁ♦దరలెనంత

ఆ॥ అంచయాన సీత ♦ యరుదుగా నెడఁబాయ, హేమ సౌధమునకు ♦ రాముఁడరిగె
విభులు మునులు వారి ♦ విడుదుల కేగిరి, మేరువున మఱింగె ♦ సూరుఁడంత ౧౧౫౭

౨౧. కల్యాణపటలము. (౧౦౪)

క॥ సిరి యశుఁడు మిథిల నాయకుఁ, డరు దారఁగ నుపచరింప ♦ సౌబాల ధరా
వర మొదలితోడ నిర్జర, పురిఁ జేరిన భాతి మోద ♦ ముం బొందె నటన్ ౧౧౫౮

సీ త త హ త హ.

క॥ భరియింపరాని వెరవున, విరివిగ దగ గొన్న వారు ♦ వెదకి జలేజా
కరము గని త్రోవ లేమిన్, సురుఁగు దశం బొందె సీత♦ సుడివడు మదితోన్ ౧౧౫౯

క॥ కొలమిూఱు రాతిరీ! యబ, లల వంచన సేఁచు వారి ♦ లం గలరొక్కో!
తెలవాఱఁ బ్రియుఁడు రాఁడో!, తెలవాఱుము దుఃఖ జలధిఁ ♦ దేర్చుము నన్నున్.

క॥ మునితోడఁ గూడి చను రా,మునితోడం బోయి మరలఁ ♦ బొడగానవ యౌ
తనితో వత్తువె? మనమా!, మనుతోడున్ వదలియుంట ♦ మరియాదయొకో.౧౧౬౧

క॥ తాడిపయి చక్రవాకీ!, యేడు సముద్రములఁ బోలు ♦ నీరాతిరి నా
కీడునఁ జనదే? యూఱడిఁ, గూడుదువే యొంటిఁ బఱచి♦కొఱమాలి యయో! ౧౧౬౨

క॥ వాఁడిమి కొడిమల పోఁడిమి, వేఁడిమితో నగ్గలించు ♦ వెన్నెల! దొనఁగే
నాఁడు గన కాత్తిచే నా, నాఁడుం గృశియించు వారి ♦ నలఁచుట తగవే? ౧౧౬౩

క॥ తావికిఁ జల్లఁదనమునకుఁ, దావలమగు మలయ గుహను ♦ తారు పయిర యున్
మూావన్నె మెకమ! యెరక్కై, వే వచ్చితె? కోఱ లనెడి ♦ వెన్నెల విరియన్ ౧౧౬౪

క॥ తెరువునఁ దిరుగుచు నొకరుఁడు, నెరవిన పెను కాల మేఘు ♦ నిభ దేహుఁడు నన్
బఱిచె నిసి పగలు వీడక, వర వంశ్యులు కన్నెల కడ ♦ వఱలుట తగవే? ౧౧౬౫

క॥ ఎడ నమ్మఁదగని పనులన్, దుడుకఁడు నిర్దయుఁడు వాని ♦ దోర్యుగళంబున్
దడవఁ జనఁ దగదు; నల్లని, కడలి యపారంబు; రాత్రి ♦ కడచను నొక్కో?.౧౧౬౬

తే॥ పాటులా తగ్గుటయె లేదు ♦ పగలు రాదు, కూరుకా లేదు నిసి వోదు♦కోర్కి విడదు
నల్ల మునవోవ్వి వదలదు♦నుసుఱుచనదు, నిట్లు కుందుట విధియేమొ♦ఘొఱుఁగరాదు.

తే॥ అమలజలధి! నీవును కంక♦ణములు జాఱఁ, బడుచు లేచుచుఁ గార్శ్యంబు♦వడసిరెల్ల
వేళలందు నిద్దుర లేక ♦ వేఁగుచుందు, కన్యవో నీవు? మరునిచేఁ♦గలఁగినావొ?౧౧౧౹౮

## రా ము ని యు త్క ం ఠ .

క॥ అని యీ విధమగు పలవర, మున నొగులుచు సొమ్మసిలుచు ♦ మగుడ యటుండన్
ఘన విభుఁడగు రాముఁడు తన, మనమునఁ దలపోసె నిట్లు ♦ మల్లడి గొనుచున్.

తే॥ మున్ను కాంచి వీడక రెండు ♦కన్నులనెడి,వ్రాఁత కలములు నామదిన్♦వ్రాసె;మరలఁ
గనియు సుషమాంబునిధి దరి♦గానన్నైతి,మించుఁగనువారుమతిరెయెందు♦గాంచుటెట్లు?

తే॥ జానకీ ముఖమే యైన♦చలువ ఱేఁడ!, కామ బీజంబుఁ బండించు♦కలువ ఱేఁడ!
యేమి యీకార్య పద్ధతి?♦యింత యెఱుఁగ, వేల?నాయెడ బంధువై ♦యెనఁగరాదొ?

తే॥ ప్రాణముల వెలువడ నీడ్చు♦రామ కనుల,కరణి నిరులును పరవెను♦కొఱఁతవడక
విభుఁడు రణభూమి మరణింప♦విఱిగి పాఱు, వీరవరుని యపఖ్యాతి♦విధము దోఁపఁ.

చ॥ వన వారిణంబుఁబోలు వర ♦ వర్ణినితోఁ జను మానసంబ! పో
యిన యదె పోక యంచుఁజని ♦ యెంచవదేలకొ? దారిదవ్వొ? మ
న్నన గల చోట నిల్చుటలు ♦ న్యాయమె కాని యనాదరంబు గాం
చిన యెడ నిల్చు టెల్లిదము ♦ చెల్లునె నన్నట విస్మరించుటల్. ౧౧౬౩

ఉ॥ కన్నులనుండి నిప్పుకలు ♦ గ్రక్కు భుజంగము కోఱలన్ విషం
బెన్నఁగ నుంట నిక్క మది ♦ యెల్లెడఁ దెల్లమ మున్నె యిప్డా నా
కన్నుల చూపులందు నెస ♦ కంబుగ మానసమందుఁ బర్వి నన్
బన్నుగ నేఁచుచుండునది ♦ భామిని కన్నుల చూపులోనిదే. ౧౧౬౪

శా॥ లీలోద్యానములున్ బ్రకల్పిత గిరుల్ ♦ క్రీడా విరామ స్థలుల్
కేళాకూళులు చంద్రశాలలును లె ♦ క్కింపంగఁ బెంపారి హే
లా లోలాక్షి చరింప నుండినను వా ♦ ల్లభ్యంబుతో నామదిన్
వాలాయంబు వసించుచున్నది మఱే ♦ వస్త్వంబు నిచ్చింపదున్. ౧౧౬౫

తే॥ రాముఁ డిట్టు లుల్లమున వి♦రాళిఁ గొనుచు, నుండ సీతా వివాహమ♦హోత్సవంబు
రేపె నగరమెల్లనలంక♦రింపుఁ డనుచు,భేరీ రవములఁ జాటింపఁ బడియె. ౧౧౬౬

## పు రా లం క ర ణ ము.

ఆ॥ ఘోషణంబు వినుచు ♦ గుములయి పెద్దలు, పిన్నవారు స్త్రీలు ♦ వేగిరపడి
పరుగువాఱువారు♦పనిచేయువారునై, యపుడు పురము కడలి♦ననుకరించె. ౧౧౬౭

ఆ॥ రామవిభుఁడు జనక ♦ రాజపుత్త్రిని పెండ్లి, యాడు టెఱిఁగి చూడ ♦ నరుగుదెంచె
ననఁగ నిరుల తెరను♦మొనసి గెంటుచు నినుం, డేకచక్ర రథము♦ నెక్కి వచ్చె.౧౧౬౮

సీ॥ తోరణ స్తంభముల్ ♦ తోర నాటువారును, వానికిఁ గై సేయఁ ♦ బూనువారు
మంగళ పూర్ణ కుం♦భంబు లెల్లెడ నిల్పి, వలువలు సవరించి ♦ యలరువారు
మందిరాంగణములఁ ♦ జందనాదులు చల్లి, కవచముల్ కై సేయఁ ♦ దివురువారు
విప్ర దీనానాథ♦వితతికిఁ బెట్టంగఁ, జెలఁగుచు వంటలు ♦ సేయువారు

తే॥ ముత్తెములభూషలనుదాల్చి-మురియువారు,మణులతొడవులధరియించి-మలయువారు
పైఁడి సొమ్ముల వహియించు-పడుచువారు, పూలచే నలంకారముల్ - పూనువారు.

సీ॥ చందనంబు నగురు-గందంబు వీథులఁ, జల్లుచు నందంద - జరుగువారు
విరులఁ జల్లుచు వేడ్కఁ-దిరిగెడువారును, సాంబ్రాణి పొగవేయ - సాగువారు
ముత్యాల జాలరుల్ - ముంగిళ్లఁ గట్టువా, రనఁటి ప్రమాఁకులఁ గట్ట - నలరువారు
వివిధ వాద్యంబులు♦వినఁగ మూఁగెడువారు, మణిదీపములఁ గాంచ♦మలయువారు

తే॥ తిన్నియల రత్నపాలికల్♦దిద్దువారు, రిక్కలట్లు పందిట మణుల్ ♦ చెక్కువారు
మించుఁ బోలు దీపంబుల ♦ నుంచువారు, దీపములకుఁ గై సేయంగఁ ♦ దివురువారు.

ఆ॥ వజ్రమణులు వెలుఁగు ♦ పచ్చల మేడలఁ, డెక్కెములను వెలయఁ ♦ జెక్కువారు
బండ్లపైన విరుల♦పల్లవంబులు పండ్లు, నిండఁ గొంచుఁ దెచ్చి♦నింపువారు ౧౧౭౧

సీ॥ కలపంబులను మేన♦నలఁదుకొనెడువారు, విలువయౌ వలువల ♦ వెదకువారు
తుఱుములందు విరులు ♦ తుఱుముకొనెడివారు, తిలకముల్ నొసళ్ల ♦ దిద్దువారు
మాలికల్ మెడలందు ♦ తాలుచువారలు, నధరంబులకుఁ గావి ♦ యద్దువారు
కనులకు సొగసుగాఁ ♦ గాటుక యిడువారు, లత్తుక పదముల ♦ కత్తువారు

తే॥ కుండలము లెండ గాయఁగా♦గొఱవ యాట,లాడువారును కైసేయు♦నపుడుఁ బ్రణయ
కోపమున నొను వేళలఁ♦గొదరి విద్రుచు, వానిఁ గొని వీథులం బొఱ ♦ వైచువారు.

తే॥ ఏనుఁగులకుఁ గై సేయంగ ♦ నెలయువారు, తేజులకు బాగు సేయంగఁ ♦ దివురువారు
స్యందనంబుల కందంబు♦ సలుపువారు, బిరుద చిహ్నంబులం దాల్చి♦తిరుగువారు.

తే॥ వైభవంబులతో నృపుల్ ♦ వఱలువారు, వేద ఘోషల విప్రులు ♦ వెలయువారు
వైణికుల గాన సుధఁ గ్రోల♦శ్రేణులైన, వారు వెల వెలందుల యాట♦ గోరువారు.

తే॥ రాజ మకుట ఖచిత రత్న ♦ రాజు లొరసి, కంఠ తారహారంబులు ♦ గదిసి రాలు
మణుల పొంధూళి యచ్చటి ♦ మండపముల, నగరి వాకిటఁ గుప్పలై ♦నెగడుచుండె.

ఆ॥ అరిగ లెండగాయ ♦ నసులు వెన్నెల గాయ, ద్విరదములను పోలి ♦ తిరుగువారు
చెలులు నటన లభ్య♦సించువార్చిఱునవ్వు, చేత జీవములను♦చిద్రుచువారు. ౧౧౭౬

తే॥ అమిత కాంతుల నగపడు♦నవియుఁగానఁ, బడక ప్రతిఫలించుటఁజేసి ♦ పుడమిజనులు
నమరులుంగూడనసురపురి♦యదియొయిదియొ,యనుచుభ్రమగొనిదిక్కుల♦నరయువారు

ఉ॥ తేరులమీఁద బండ్లపయిఁ ♦ దేజులపై మణి దీప్తు లొప్పు నం
బారుల లోనఁ గాల్నడను ♦ బల్లకులందు జనంబు లెక్కకుఁ
మీఱి సరోజనేత్రలు స ♦ మృద్ధ సుధాధరలుఁ సుమధ్యలుఁ
సారవచోవిలాసినులు ♦ సామజ యానలు చేరి రొక్కెడఁ. ౧౧౭౯

తే॥ తారహారముల్ ధరియించు♦వారు రత్న, హారముల్ విచ్చి విసరెడు♦ వారు పూలు
పెక్కు వగల జడలఁ గ్రుచ్చి ♦ పెక్కువగల, చీరలం గట్టు వారలు♦నైరి స్త్రీలు.

తే॥ మిథిల నిండిన సంపద♦మేదినిపయి, నొక్కచోఁ గాంచఁగా నిట్టు♦లొప్పు టరిది
పాకశాసను పట్టాభి♦షేక వేళ, నమరపురిఁ బోలె నొప్పారె ♦ నప్పురంబు. ౧౧౮౦

దశరథాదులు వివాహ మండపము చేరుట.

తే॥ ఎల్ల యెఱుఁగంగ నరుదయి ♦ హిమగిరివలె, నున్నతంబయి మైథిలి ♦ యుద్వాహమున
కెల్ల సామగ్రి నిండిన♦ హేమ రత్న, రచిత మండపంబును దశ♦రథుఁడు చేరె. ౧౧౮౧

తే॥ నిండి తెల్లని గొడుగు వె♦న్నెలలు గాసె, నించు మించు నగల రాసు♦లెండ గాసెఁ
దేంట్ల గములు గీతమ్ము లు♦తివిరి పాడెఁ, దురగ ఖురధూళి యెగసి యం♦బరము గప్పె

తే॥ నీరదమువోలె మంగళ♦భేరు లులిసె, శంఖములు మ్రోసెఁ గాహళ♦నమితి మొరసెఁ
బ్రాఁజదువుల ఘోషణములు♦రాత్రివేళఁ, గొఱలుచుండు పారావార♦ఘోషమీఱె

తే॥ కరి తురగ రథ నికరముల్ ♦ వరుసదీరి, నడచుచుండఁగ సామంతు ♦ లెడములేక
నిరతముం గొల్చువారలు♦నియతి నరుగ, నింద్రు సేవించు వేల్పుల ♦ యెసక మెసఁగె.

తే॥ అట్లు చేరవచ్చిన కోస ♦ లాధిపుండు, రత్నమయ హేమ పీఠిపై ♦రమణ నొప్పె
మునులు నృపులు గూర్చుండిరి♦జనకుఁ డపుడు, బంధు వర్గంబుతో మంట♦పంబు చేరె.

క॥ నృపులును మునివరులును వే, లుపులు జనులు హంసయాన ♦ లును నెఱయంగా
నపుడా పెండిలికూటము, విపులంబగు మేరు శైల♦విధమున నొప్పెఁ. ౧౧౮౬

తే॥ మేఘములు గ్రహ తారకల్ ♦ మెఱుములుఱుము, లొకటమండలయుగళంబు♦నొప్పుమిగిలి
బమ్మచేసిన యండగో ♦ళమ్ము నెనసె, మయవినిర్మిత తన్మణి♦ మండపమ్ము. ౧౧౮౭

క॥ మునులును నృపులును విబుధులు, జనములు నడఁగంగ నచటి ♦ సభ బ్రహ్మాండం
బును లోఁగొని యడఁచిన వి, ష్ణుని నల్లని కడుపువోలెఁ♦జూడఁగ నొప్పెఁ. ౧౧౮౮

క॥ జగములె ప్రేరేపఁగ నిం, బుగఁ జేరె జనంబు లనఁగఁ ♦ బొగడఁగ నగునే?
జగములు వేడుటవలన భు, జగ శయనము వీడు నతని ♦ చరితము వినుఁడీ.

రాముఁ డలంకరించు కొనుట.

తే॥ సప్తసాగరములనుండి ♦ సప్తనదుల, నుండి తెచ్చిన నీట శా ♦ స్త్రోక్త విధిని
మంగళ స్నాన మొనరించి ♦ మహిత రీతిఁ, బీత చీన వస్త్రము రామ♦విభుఁడు దాల్చె

తే॥ అజుఁడు మొదలుగఁ దృణముప♦ర్యంతమెల్ల, జీవులు దవులు పెన్మాయఁ♦జీల్చియవల
మరలిరాకుండుపరమమ్ము♦దొరయఁజేయు, తనదుతిరునామమునుదుటఁ♦దానుఁదాల్చె

క॥ యతివరులకు నాకర్ణా, యతనేత్రల నొసఁగి పెండ్లి ♦ యమరిచి తపముల్
స్తుతమతిఁ జేసిన యినకుల, పతులు గొలుచు మొదటి వెలుఁగు ♦ భక్తిఁ బ్రమొక్కెన్

క॥ పొనుఁగువడు తపము ధర్మము, పున రుద్ధరణమ్ము సేయఁ ♦ బొడమిన కరుణా
తనుఁడు తన మేన జలదము, నెనసిన వెన్నెలనఁ గలప ♦ మింపుగ నలఁదెన్. ౧౯౩

తే॥ కడలి మంగళ కర పూర్ణ ♦ కళలు గలుగు, తొగలఱేనిఁ బూచిన దనఁ ♦ దగిన పగిది
సిగను గ్రొవ్విరుల్ చుట్టి ప ♦ సిండి సరులు, పూలమాలిక లెసకంబు ♦ పొసఁగఁ బెట్టె

క॥ రేయిం బగటం బడు మరు, దాయము గని యిందుఁ డినుఁడు ♦ దౌత్యము గొని యా
తోయలి తోయము చెవులం, బోయి తెలుపు చెలువు నెనయు ♦ పోఁగులఁ దాల్చెన్

తే॥ శ్రీగళుఁడు పెనుజడయందు♦చిన్నచంద్ర, కలనుధరియించె నదియేటి♦కార్యమనుచు
పూర్ణ దివ్యకాంతిసమితి♦పొలుపు మిగుల, దిద్దె నన వీరపట్టంబు♦తిలకమూనె. ౧౯౬

తే॥ చక్రమును వెను దవిలిన ♦ శంఖ మనఁగఁ, దగిన కంఠమునందు ము ♦ త్యాల సరులు
సీత మందహాస రుచులు ♦ చేరి మదిని, వెలికి నుబికిన వన నొప్పి ♦ వెలయుచుండె.

తే॥ వజ్రములు మచ్చ లట్టులు ♦ వఱలుచుండ, పద్మరాగ దీప్తులు వహ్ని♦వలె వెలుంగ
నంగదంబులు మును మంద ♦ రాద్రిఁ జుట్టి, నట్టి కవ్వపుఁ దరిత్రాటి ♦ ననుకరించె.

తే॥ ఆణె ముత్యాల ముప్పేట ♦ హార మొప్పె, జగము రక్షించు దీర్ఘ భు♦ జముల నడుమ
ముజ్జగంబుల కితఁ డాది ♦ మూర్తి యనుట, కొప్పినట్టి యభిజ్ఞాన♦ముంచురీతి. ౧౯౯

తే॥ వచ్చి వేఁడిన వారికి ♦ నిచ్చుకొఱకు, గల్పకంబు కాంచన రత్న ♦ కంకణములఁ
బూవుఁ గొమ్మల నుంచిన ♦ పొందు దోఁచి, దర్శనీయములైన హ ♦ స్తములు వెలిఁగె

ఆ॥ కమల నిలయ లచ్చి ♦ కాణాచి యగు నురోం, తరమునందు మెఱయు♦సరులచయము
మెఱుము లడర నొప్పు ♦ మేఘంబు నడుమను, దోఁచు నింద్ర ధనువు♦తోయమందె.

ఉ॥ చేరుటకుం దొలంగుటకుఁ ♦ జెల్లిన విజ్జుల తెల్వి పోల్కిఁ బైఁ
జేరిన యుత్తరీయ మెదఁ ♦ జిందు దయాకృతి కంఠమందు సొం
పారిన తారహార నిభ ♦ మంది వెలార్చిన కాంతిఁ బోలి వి
స్తారముగాఁగ లక్ష్మికి వ ♦ శంబగు ఱొమ్మునఁ దోఁచెఁ బేరిమిన్. ౨౦౨

తే॥ చెనయరాని ప్రభాకరు ♦ చెన్నుదాల్చి, యున్న ఱొమ్మున ముప్పేట ♦ జన్నిదంబు
త్రిదశులును దెల్పలేని మూ ♦ ర్తిత్రయంబు, రూపమిది యెఱుఁగుండని♦తోఁపనొప్పె.

ఉ॥ అక్కాము పక్కముల్ మిగుల ♦ సంగగు బంగరు రంగు లీనఁగా
న క్కటి రత్న బంధనము ♦ సందలి మేరువు ప్రజ్వలించె వే ·
త్రొక్క జగంబు దాని కజుఁ ♦ డొక్కఁడు వెల్వడ నాభియందు స
మ్యక్కనకాంబుజంబు పొలు ♦ సందఁగఁ బూచిన దన్న సంచునన్. ౧౨౦౪

ఆ॥ అలవి దెలుపఁ గాక ♦ యమిత గంభీరమౌ, నీల వారి రాశిఁ ♦ గేలు సాఁచి
పాల కడలి యలమి ♦ పట్టిన విధమునఁ, దెల్ల పట్టు వలువ ♦ తెలియఁ గప్పె. ౧౨౦౫

తే॥ ముత్తెముల నీలముల కాంతి♦మురువుసూపఁ, బసిఁడికాసియలోఁగ త్తి ♦ పరఁగఁజెక్కు
ముత్తెసరముల గుత్తులు♦క త్తిప్రక్క, బాల భాను కాంతుల నీన♦ ప్రేల విడిచె. ౧౨౦౬

తే॥ రత్న కాంతులు, కాంచు నే ♦ త్రముల కాంతి, నిండఁగ, ననూనశిల్పము♦ నెరయుమకర
ముఖముగల దంతపుంబిడి♦ మొనసి మెఱుపు, లలిని మెఱసిదిక్కులయెల్లఁ♦గొలిచిచూపె

చ॥ పరవిన రూపముం గలిగి ♦ పద్మజు నండము గొల్చు టెంక నె
ట్లురవగు నంచు నొక్కొకటి ♦ యుం దగ విష్ణుము గూర్చు పోలికన్
మొరయుచు నేరు నారసి క ♦ నుంగొన శక్యము గాని శిల్పముం
బొరసిన వీరమద్దియలు ♦ పొందగు నందెలు కాళ్ల శోభిలెన్. ౧౨౦౭

తే॥ వేయి మాణిక్యదీపముల్ ♦ వెలుఁగు భుజగ, రాజు సెజ్జను యోగని ♦ ద్రను సురాళి
వేఁడ వీడిన రాముఁ డి ♦ వ్విధము తన్నె, పోలు నొక యలంకారంబు ♦ పూనె నపుడు.

మ॥ అరవిందాసన ముఖ్య మూర్తులకు నా ♦ ద్యంబై మునీంద్రాళికిం
బరమ ప్రాపకమై జగజ్జనకమై ♦ భవ్యంబు సేవ్యంబునై
నిరతా నంద మయంబునై యొసఁగు నా ♦ నిత్యాత్మయే వచ్చి యీ
నర రూపంబునలంకరించి కొన న ♦ న్నా! తెల్ప శక్యంబొకో? ౧౨౧౦

తే॥ అమిత గో భూ హిరణ్య దా ♦ నాదికములు, సజ్జనులకు బీదలకును ♦ సరసులకును
విరివిగా నొసరించుచు ♦ వేద ధనులు, వినుతి సేయ రాఘువుఁడు స్యం ♦దనము నెక్కె.

తే॥ గుండు బంగరు టిరుసును ♦ వెండి చక్ర, ములును వజ్ర మయంబులై ♦ వెలయునడిమి
భాగమును చుట్టు రత్నముల్ ♦ప్రజ్వలింప, రాము రథము మార్తండుని♦రథముఁబోలె

తే॥ మంచి లక్షణములు సూక్ష్మ ♦ మతిని తెలియఁ, దగుజవంబు బలంబునం♦దము మొలంకు
వొలయఁ బురుషార్థములఁబోలి♦ వెలయుతురగ, ములుజగత్ప్రభు తేరికిఁ♦బూన్పఁబడియె

తే॥ నరుణు కై వడి నొగలపై ♦ భరతుఁ డెక్కె, మోద బాష్పాంబుమిశ్రిత♦ముఖముతోడ
కశను చేకొని రథ చోద ♦ కత్వ మూనె, నిరు దెసల నిల్చి కవలు చా ♦ మరలు వీవ.

చ॥ అమరిన పొందికంగలుగు ♦ నందముచే నటు లయ్యోనేమొ? శాం
త మనసుచేఁ దలంచుటను ♦ తప్పక యప్పను రొప్పె నేమొ? స

త్యము నెఱుఁగంగ లేము తగి ♦ నట్టుల యయ్యెడుఁగాక! యయ్యెడం
దమి గొని చూడ నెల్లరు న ♦ దా యనిమేషత దాల్చిరిమ్ముగన్.

తే॥ జగములను హింస సేసి నా♦శంబు గనక, యున్న పొలసుదిండులపాటు♦లొబ్బిడయ్యె,
నేఁడె యని వేల్పు కూటంబు ♦ నిందు వేడ్క,నచ్చరలఁ గూడినటియించె♦నిచ్చకొలఁది

తే॥ పుర పురంధ్రులు విరులను ♦ గురిసినారు, పసిఁడి వలువలు రత్నముల్ ♦ విసరినారు
రాము చెలువంపు సుధఁ ద్రేమఁ ♦ ద్రావిరేమొ? వారి చేఁతకు వేఱేది ♦ కారణంబు?

ఆ॥ తమకుఁ గల వొసంగి ♦ తాల్చినవియు నిచ్చి, వారి తీరుగా ను ♦ దారుఁ గన్న
నారు లమిత మొసఁగి ♦ నార లందపు మేనఁ, గలుగు సొమ్ము లూడ ♦ నిలిచినారు.

ఆ॥ నృపులు మద కరీంద్ర ♦ నిచయంబువలెఁ జుట్టి, నిలువ దశరథుండు ♦ నెలవుకొన్న
కూటమందు చేరెఁ ♦ గోదండపాణి మే, రువును చేరు సూర్య♦రూపు దోఁప. ౧౧౯

చ॥ వరదుఁడు తేరినుండి దిగి ♦ ప్రక్కలలో నిరుగేలు ప్రేమమై
భరతుఁడు లక్ష్మణుండు దయి ♦ వాఱఁ గొనన్ సముదీర్ణులౌ మునీ
శ్వరుల కెఱింగి తండ్రి పద ♦ పంకజముల్ దల సోక మ్రొక్కి యం
దఱకును మేని యందము ను ♦ దారత విందులు సేయుచుండఁగన్. ౧౨౦

సీ॥ పై నొక్క ధనువును ♦ వాలుగలను క్రిందఁ, గలిగి పూర్ణేందు ము ♦ ఖలముఁ దాల్చి
నెత్తని సుమలత ♦ యింపైన స్తనకుట్మ, లములతోఁ దేరిపై ♦ నమరి తూర్పు
దెసఁ బుట్టినదివోలెఁ ♦ దేజరిల్లెను సీత, తొల్త సుధాంబుధిఁ ♦ దోఁచి మరల
ధరణి నవతరించి ♦ తరువాత నొకమల, యొద్దఁ బుట్టిన దన ♦ నొప్పి పెండ్లి

తే॥ మండపము చేర వేల్పులు ♦ మగువఁ గాంచి, మరల రాముని గని సుధా ♦ మథన వేళఁ
బొడము లక్ష్మి వెన్నుని మెడఁ♦బూల మాల, వైచునాఁటికంటెను సొంపు♦వఱలె ననిరి

తే॥ జగతి జనములకంటె ని ♦ర్జరులకంటె, నాగలోక వాసులకంటె ♦ నాణె మొంది
వెలుఁగు జానకి పెండిలి ♦ విభవ మెల్ల, వాక్పతికినైన వర్ణింప♦ వలను పడునె? ౧౨౧

తే॥ ఇంద్రుఁ డింద్రాణితో మింటి ♦ కేగుదెంచె, భవుఁడు చనుదెంచెఁ దవిలి ♦ భవానితోడ
బ్రహ్మయే తెంచె బ్రాహ్మితోఁ ♦ బ్రమదమంది, జానకీ రాముల వివాహ♦సరణి చూడ

క॥ వడుగులు వైదికులును వెను, కడలి కరణిఁ జుట్టి రాఁగఁ ♦ గార్యంబును బ్రా
వడువున నడప వసిష్ఠుఁడు, వడి నుపకరణములతోడ ♦ వచ్చె ముదమునన్. ౧౨౨

ఆ॥ తండులములు పఱపి ♦ దర్భల నుంచి స్థా, నమును శాస్త్రవిధుల ♦ నమరఁజేసి
పుష్పములను చల్లి♦పూజించి హోమాగ్ని, నిరవు గొల్పి కార్య♦మెల్ల జరపె. ౧౨౩

ఆ॥ పెండ్లి వేదియందు ♦ ప్రేమంపుఁ దోడగు, భూమిజాతతోడ ♦ రామ విభుఁడు
కూరుచుండ వారు♦కొమరొందఁ గలిసిన, భోగ యోగములను♦పోలియుండ్రి. ౧౨౪

శృంగార్యు బంగారు ♦ రత్నాల సొమ్ములు, చెడఁ దెగి పడఁ దీసి - చెదర వైచి
మించుమ మించిన ♦ మేన వన్నెల వలు, వల నూడ్చి ప్రాఁతవి ♦ వలచు వారు

తే॥ తమ్ముఁబుత్తుల లోనఁ గ్రూరుం డొకండు, చావఁబ్రాణముల్ విడుతురు ♦ జనకులెందు
వంశ మ్ముండను వనికంపి ♦ పలుకుగావ, మనిన తండ్రి గుండియ యిను ♦ మనెడివారు.

ఉ॥ శ్రీకరుఁడుౙ సుధీ జన వ ♦ శీ కరుఁడుౙ గరుణాకరుండు మే
ఘాకృతి గల్గు రాముఁడు మ ♦ హాటవిఁ జేరఁగ వానితోడనే
లోకులు పోవఁ బాడు పడి ♦ లోఁకువయైన ధరిత్రిఁ బుత్త్రుఁడుౙ
గైకయు నెత్తిఁగట్టుకొని ♦ కాతురు గావలయుౙ ముదంబునౙ. ౪౪౭

తే॥ క్రుంగు నడుములనొప్పించు ♦ కుచములొప్ప, సతులు మస్తములందు హ ♦ స్తములు చేర్చి
రోదన స్వరములఁ జాల ♦ ఖేద మంది, విరుల లతకూన లట్లు కం ♦ పించి నారు.

చ॥ సిగరములౙ నిశాకరుఁడు ♦ చిక్కులఁ బొందెడు పెద్ద మేడలౙ
మగువలు పయ్యెదల్ దడియ ♦ మందిరి కొండ నెమిళ్లకై వడిౙ
బొగిలిరి పంజరంబులను ♦ పొందిన చిల్కల పోల్కిఁ గల్కు లొ
ప్పఁగఁ గిటికీలఁ గాంచి రల ♦ బాష్పము లంజన మిశ్రితంబుగాౙ. ౪౪౮

ఉ॥ అందములైన నేత్ర వల ♦ యంబులనుండి స్రవించు నస్రముల్
బిందువు లౌచు ధారలయి ♦ పెద్దప్రవాహములై కతంబునౙ
సుందర సౌధముల్ మిగుల ♦ స్రుక్కుచుఁ గన్నులు గుంటవాఱ నా
క్రందనముం బొనర్చు క్రియఁ ♦ గ్రాలెను శ్రీరఘువర్యు పోకకై ౪౪౯

క॥ తల్లుల మఱచిరి తనయులు, తల్లులు లేమ సుతుల మఱచి ♦ తలరి సురిగి కం
పిల్లిరి కుత్తుక లెండఁగఁ, దల్లడిలిరి తండ్రు లెదలఁ ♦ దత్ జ్ఞత కలఁగౙ ౪౫౦

క॥ ఇంపును మృదువును కాకలి, సొంపుగలుగు పలుకు లొప్ప ♦ సుదతులు వీథిౙ
గుంపులు గూడఁగ మేడలు, కంపిల్లఁగ సరి తొలంగు ♦ కమలముఁ బోలెౙ ౪౫౧

మ॥ తరణి వ్రాతము లీలఁ గుండలము లు - ద్యత్కాంతు లీనంగ ని
ర్ఝరిణీ వ్రాతము రీతి నస్రువులు గా ♦ ఱౙ స్రస్తకైశిక్యమై
తరు ణీవారము బాణ విద్ధమయి సం - తాప ప్రఘూర్ణంబు లౌ
హరిణీవారము వోలె సంచలిత దే - హావస్థమై దూపిలెౙ ౪౫౨

మ॥ అడఁగెౙ గొండలఁ బోలు మేడలఁ బతా ♦ కాదుల్ మృదంగ స్వనం
బడఁగెౙ మంగళవాద్య ఘోషణము ల ♦ త్యంత ప్రమోదా రవం
బడఁగెౙ వీథుల ధూళి ధూసరము బా ♦ ష్పాంబు ప్రకీర్ణంబుగా
నడఁగెౙ భూసుర వేదఘోషములు స ♦ ర్వాశీః ప్రఘోషంబులోౙ. ౪౫౩

ఉ॥ నీఁగెను వంటయిండ్లు పొగ ♦ నీఁగెను మేడలు ధూప ధూమముల్
నీఁగెను దేహళుల్ కళల ♦ నీఁగెను ఘాణముల౯ హారుల్ కరుల్
నీఁగెను కీరపోతములు ♦ నీటగు బంగరు పాలగిన్నెల౯
నీఁగెను మోదముల్ జనము ♦ నీఁగిరి తల్లులు తొట్ల కూనలన్. ౭౫౪

ఉ॥ వీడెను కాంతి ప్రాణముల ♦ వీడిన వానిని పోలి మాన్యముల్
వీడెను వర్షముం గురియు ♦ వేడ్క విసీల పయోద సంఘముల్
వీడెను వారువంబు లట ♦ విస్తృతమై తగు నశ్వశాలల౯
వీడెను దంతి రాజి తని ♦ వి౯ మధువ్రుం గొను తేంట్ల కై వడిన్. ౭౫౫

క॥ విడిచెను నీడల గొడుగులు, విడిచెను క్రొవ్వేదలు క్రొత్త - విరుల సరముల౯
విడిచె మరుశరము వేడిమి, విడిచెను కటకముల మేటి - వీరుల పదముల్ ౭౫౬

క॥ వదలెను ధ్వనులను భేరులు, వదలెను కింకిణుల రొదలు - వాశ్వముల గముల్
వదలెను గీఁకల గజములు, వదలెను నేమిస్వనంబు - బంగరు రథముల్. ౭౫౭

చ॥ కలుగవు మంగళ ధ్వనులు - కల్గవు విప్రుల వేదనాదముల్
కలుగవు వీణారావములు - కల్గవు కాళుల నందుకధ్వనుల్
కలుగవు మేఖలాధ్వనులు - కల్గవు కోకిల శారికాధ్వనుల్
కలుగవు తేంట్ల శబ్దములు - గల్గవు పిట్టల శ్రావ్యగీతముల్. ౭౫౮

క॥ మఱచెను నిటిం బొలములు, మఱచెను లేబొట్టియలను ♦ మగువల కరముల్
మఱచెను నేతిని వహ్నులు, మఱచెను తత్త్వంబు జ్ఞాన - మాన్యుల మనముల్.

ఉ॥ కుందిరి గుంపు గుంపులుగఁ ♦ గూడుచు నాడుచు నుండు వారలు౯
వందిరి శ్రావ్యగీతములఁ - బాడుచు నుండిన వార లట్టులే
పొందిరి కొందలంపు రొద - పొల్తుక లక్కలఁ గొన్న వారలు౯
క్రుందిరి ప్రాణనాథులను - మానుగఁ బొందిన సుందరాంగులు౯. ౭౬౦

ఉ॥ చాఁపవు తొండము ల్కరులు - చాఁపవు నోళులు మేఁతకు౯ హారుల్
చూపవు పోతసంతతికి - సూటిగఁ బక్షులు తెచ్చు మేపుల౯
దాపవు పాలు దూడలకు - దాయఁగ నీయవు ధేనుకా తతుల్
మేపవు గోవులం బిదుక - మే కొనవు౯ దగ గోప వారముల్. ౭౬౧

క॥ మగల వెడందయురమ్ములు, మగువల కుచమర్దనంబు - మఱచెను తోడ్తో
మగల సొగసైన సిగలును, మగువల నిడుపైన జడలు - మఱచెను విరులన్. ౭౬౨

క॥ అందము నొల్లవు గజములు, పందెము నొల్లవును పరువు ♦ వలచిన మావుల్
గందము నొల్లవు వీథులు, చందము నొల్లవు సువర్ణ ♦ సౌధ పతాకల్, ౭౬౩

చ॥ సమముగ సౌఖ్య దుఃఖముల ♦ సన్మతిఁ జూచెడు యోగులే మదిం
గుమిలిరి; తగ్గ చోటరసి ♦ కూడిన దుష్కృత భాగ్యమంచుఁ దో
యమునుగఁ దలంచువారు లన ♦ దంచిత కర్మఫలంబ యంచు డెం
దములఁ దలంచువారు నగు ♦ తక్కటి వారల చింత యెట్టిదో! ౪౬౪

ఉ॥ ఊహములెల్ల వేఁడియగు ♦ నూర్పులతో నుసురుల్ చలించి నం
దేహమునొంద నందమును ♦ దీప్తి చెడన్ మది స్రుక్క నక్షసం
దోహము తాఱుమాఱగుచు ♦ దుఃఖము నొందఁగ మేనులెల్ల రా
ద్దేహము వోలెఁ బ్రాణములు ♦ తీఱుగతిన్ బురిఁ దోఁచె నెల్లెడన్. ౪౬౫

రాముఁడు సీతయున్న మందిరమున కరుగుట.

ఉ॥ పౌరులు విహ్వలించుచొక ♦ ప్రక్కకె డెందము లెల్ల వ్రాలఁగాఁ
గాఱియనొంది కుంది వెను ♦ కంబడి రా గణియింపరాని యా
కారములొప్పు దేహులకు ♦ గాదిలి ప్రాణమెుకండ నాఁగ నొ
ప్పారిన రాఘవుం డరిగె ♦ నయ్యెడ జానకి యున్న చోటికిన్. ౪౬౬

ఉ॥ తల్లులు ధారణీసురులు - తాపస వర్యులు సంగకంబులన్
బెల్లుగ ధూళినిండ దుర ♦ పిల్లుచు వచ్చుచునుండ రాజసం
బొల్లని నారఁ గట్టికొని ♦ యొప్పని తీరున వచ్చు నాథుఁ దా
నుల్లము వాడఁ గాంచి యెుక ♦ యూఁకున లేచెను సీత కొంకుచున్. ౪౬౭

ఉ॥ అగతి లేచు ధారణిజ ♦ నత్తలు కాటుక కంటి నీటితోఁ
గాఁగిలిఁ జేర్చి తడ్పుచును ♦ గద్గదికంబున నొక్కపెట్టఁ దా
మాఁగక యేడ్వఁ గాంచి జన ♦ కాత్మజ వారలు దుఃఖముం గొనం
గాఁ గతమేదియో మదిని ♦ కానఁగఁ జాలక కాంచె రాఘవున్. ౪౬౮

తే॥ కాంచి మించునంచునఁ జలి ♦ యించు మేను,గలుగు వైదేహి యిట్లనుఁ♦గాంతుతోడ
చక్రవర్తి కేదేనియు ♦ సంభవించె, నేమి పల్కుఁడు జాగు స ♦ హింప ననుడు. ౪౬౯

చ॥ అసదృశుఁడైన నాయనుజుఁ ♦ డక్కటికంబున ధర్మపద్ధతిన్
వసుమతినేలు వృద్ధజన ♦ వాంఛిత మిద్ది జగంబు నెమ్మదిం
బసఁగొనఁ గారణంబయిన ♦ వారిదము ల్వసియించు కానకున్
వెనఁ జని వత్తు నీవు మది ♦ వేసట నొందక యుండు మిందనన్. ౪౭౦

ఉ॥ కాంతుఁడు క్రూరసత్త్వయుత ♦ కానన భూమికి నేగునంచు భూ
కాంతుఁడు గాక పోయెనని ♦ కష్టము సెందక యింటనుండుమా

వంతను వీడు వేగ చని ♦ వత్తు నటన్న సుతీక్ష్ణ వాక్కులా
కాంత మనంబు మిక్కిలిగఁ ♦ గాల్పఁదొడంగ వహించె వేదనన్. ౪౭౧

మత్త॥ క్షీర సాగరమందు వీలగు ♦ శేష తల్పముపై రహిన్
చేరికల్ విడి ధర్మ ముద్ధృతి - సేయ భూస్థలిఁ బుట్టఁగా
వారిజాక్షియుఁ బుట్టి వీడక - వచ్చు తన్ను దొలంచు నా
దారుణార్థము వీనుల న్వినఁ - దన్వి కూఱట కూరునే? ౪౭౨

క॥ జననీ జనకుల యాజ్ఞం, దనయుఁడు తలఁదాల్పనేత ♦ తగవే యగు న
న్వనరఁగ నిచటనె యుండుమ, యనఁ గారణమేమి యనుచు ♦ నారట పడియెన్.

ఉ॥ రాముఁడు రామఁగాంచి యను ♦ రాక్షసరూపముఁబోలు కొండలున్
భీమములౌ విభావరుల ♦ వేఁడిమి తగ్గక యుండు ప్రస్తర
స్తోమము ముమ్మొనల్ గలిగి ♦ త్రోవల నిండుగనుండి కాళులన్
వేమఱు బాధవెట్టు నలి ♦ వేణి! మరల్పుము నీయభీష్టమున్.

చ॥ అని తను గూర్చి పల్కు తన ♦ యర్మిలి భర్తకు సీత యిట్లనున్
గనికర మింతలేక ♦ మది గాటపుఁ బ్రేమయు లేక వీడి పో
వనె తలపోసి నాఁడ విది ♦ పద్ధతియే? లయకాల భానుఁడున్
ఘనమగు నీవియోగమున ♦ కంటెను కాల్చునె? ప్రాణ వల్లభా! ౪౭౫

చ॥ నలువుగ రాముఁ డామె వచ ♦ నంబులు వింటయెకాక తన్మతిన్
దలకొను చింతయుం దెలిసి ♦ తక్కక బాష్ప పయోధి పొంగ నా
జలజ సుగంధిఁ బాయుటకు ♦ సమ్మతి లేని నదంత రంగుఁడై
నినిచెను కర్జమిద్ది యన ♦ నేరక నెవ్వగ నివ్వటిల్లఁగన్. ౪౭౬

ఉ॥ అత్తఱి సీత విస్తృత గృ ♦ హాంతర సీమకు నేగి డెంద మం
దత్తలపాటుతోడ మృదు ♦ లాంబరము ల్విడనాడి సాహసం
బొత్తఁగ నార చీర నను ♦ వొందఁగఁ దాలిచి వచ్చి రాము న
ద్వృత్త భుజంబు వట్టికొని ♦ యిమ్ముగ నిల్చెఁ బ్రయాణపాటుకై. ౪౭౭

మ॥ అబలా రత్నము గోల కోమలి యసూ ♦ ర్యం పశ్య గావించు చె
ద్ది బహుక్లేశముఁ గూర్పఁ జాలఁదగు పృ♦థ్విన్ బ్రాలియున్ గాలుఁడున్
గబళింపం డవు జీవితంపు దినముల్ ♦ గల్గన్ శిరోగ్రంబునన్
బ్రబలంబౌ నొక గుండు వైచినను చా ♦ వం బోవ దే ప్రాణియున్. ౪౭౮

తే॥ చెలులు దాదులు దాస దా♦సీ జనంబు, మంటలోఁ బడి తపియించు♦మాడ్కి నైరి
రామచంద్రుఁ డుత్తమ సతి♦రాజ వదన, యైన జానకిఁ గని యిట్టు ♦ లనియె మరల.

మ॥ సుదతీ! రాఁగల కష్టము ల్దలఁప వో ♦ సుంతైన నాతోడ రా
ముద మొప్పారఁగ నంటి హెచ్చుగ శ్రమం ♦ బుల్గూరు వచ్చేనన్
ముదమే కల్గును నన్ను వీడి చనఁగా ♦ ముఖ్యంబుగా నేనె మీ
ముదముం బాపఁగ నుంటి నోటు! నిజమే ♦ హో! యంచుఁ గోపింపఁగన్.

తే॥ మనసు కలఁగి ప్రతి స్థల♦మునను జనులు, పడుచు లేచుచు దుర్దశఁ♦బడయుచుండు
రాచ వీథిని మెల్లఁగా ♦ రామ విభుఁడు, జానకిం దోడు కొనుచుఁ గ ♦ ష్టమున నేగె.

తే॥ ముదిత వల్కలములు దాల్చి♦ముందు వోవ, విల్లుచేఁ బూని యనుజుండు♦వెనుకనడవ
నడుమ రాముఁడేగుట గాంచు ♦నాగరకుల, యడలు వర్ణింప నాబోటి♦కలవియగునె?.

తే॥ అశుభముగ వెక్క నెవ్వరు ♦ నడల లేదు, తలరు మదితోడఁ జుట్టి సీ ♦ తా హృదీశు
కంఠె మున్నుగఁ బోదము ♦ కాన కనుచు, నడచి రెల్లరు పెనుగోల♦యడరు నట్లు.

క॥ ఇనకుల జలనిధి సోముఁడు, జనకు నగరు డాసి యంత ♦ జననులఁ గని యిం
దునె యుండి తండ్రిఁ దేర్పం, డన వారలు తల్లడిలిరి ♦ హాహా యనుచున్. ౪౮౪

క॥ సుడియుచు నాలుక తడఁబడ, వడఁకుచు నిలువెల్లులార! ప్రార్థింతుము కా
వ్రుడు వీరల నని తనయులఁ, బుడుకుచు దీవించి సీతఁ ♦ బొగడిరి మిగులన్. ౪౮౫

తే॥ జననులను వీడి కులగురు♦చరణములకు, మ్రొక్కి రాముఁడు తన ప్రాణ♦ములను బోలు
తమ్ముతోడను సీతతోఁ ♦ దప్తకనక, రథముపై నెక్కి వెడలెఁ బు ♦ రంబె కలఁగ.

౫. తైలగుప్తి పటలము. (౮౭)

చ॥ నిలిచిరి రాణులెల్ల ధర ♦ నెవరు నెప్పుడు వీడియుండమిన్
నిలిచెను భిత్తి చిత్రములు ♦ నెక్కొను ప్రాణము లేకపోవుటన్
దలఁపఁగ నెవ్వరింక నయ ♦ ధాముని రాముని వెంటఁ బోక య
న్నెలవున నిల్చినారలు గ ♦ ణించిన-దోఁ గలికాని కేనియున్? ౪౮౬

తే॥ కాంచన స్యందనంబు మా ♦ ర్గమున యందు, వేఁడికన్నీటి కాల్వలు♦వెల్లి విరియ
మెల్లఁగా నేగుచుండ నా♦మేటి వీరుఁ, డబ్ధి విహరించు నాది మ ♦ త్స్యంబుఁ బోలె.

క॥ వనముల కరిగెడి రాముని, గనఁ జాల నటంచు నినుఁడు ♦ కనికరమునఁ దా
వనరాశి దూఁకెనో యనఁ, జని క్రుంకెం బసియు మరలి ♦ చన మందలకున్. ౪౮౯

క॥ నెలవంకఁ గొని యజుండే, కలిగించిన జిగి నొసల్లు ♦ గల కలుకుల మో
ముల వలె సరసిజములు మో, ములు మోడిచె నశ్రు లురలి ♦ ముకుపుచెడంగన్

క॥ మునిమాపున వేడిమి చెడ, ఘనమతి కైకేయి మదిని ♦ కటు మంథర బో
ధనమును విష మలమిన రీ, తిని తేటదనంబు వీడి ♦ తిమిరము క్రమ్మెన్. ౪౯౧

క॥ ఉడుసమితి వెలుఁగు గగనము, కడఁకన్ గౌతముని శాప ♦ కారణమున గం
డ్లడరు వెయిగనుల వేలుపు, టొడయని దేహంబు వోలె ♦ నొప్పెసలారెన్. ౪౯౨

క॥ నగరి విడిచి రెండామడ, లొగిఁ జని కాకుత్థ్సవర్యుఁ ♦ డొక్క వనమునన్
దిగి యచటి ప్రియస్నేహితు, లగు తాపస వరులఁ గలిసి ♦ యలరి వసింపన్. ౪౯౩

చ॥ వినుత గుణాఢ్య రామ విభు ♦ వీడఁగఁ జాలక వెంటనేగు నా
జన నికురుంబ మవ్వనము ♦ చక్కటి నామడ చుట్టి నూవు గిం
జను విడువం గలట్టి యెడ ♦ సైతము పొందని రీతి నిండ స
వ్వన మొక కంచె కోటగల ♦ వైఖరిఁ గానఁగనయ్యె నయ్యెడన్. ౪౯౪

క॥ ఎదియును నోటం బెట్టక, నిదురింపక పరితపించు ♦ నెంజిలిఁ దమసా
నది పులిన శాడ్వలంబుల, నొదిఁగి పడిరి జనములెల్ల ♦ నోర్వని చింతన్. ౪౯౫

క॥ క్రొవ్విరి తామరలనఁ జను, మవ్వపు నయనములు గలుగు ♦ మడఁతులు పాలన్
నివ్వటిలు నురుగుఁ బోలిన, దువ్వలువలఁ బఱచికొని రొ ♦ దుంగఁగ నచటన్. ౪౯౬

తే॥ నిడుపు పగలెల్ల మిక్కిలి ♦ యడలి యడలి, పరితపించి మొగ్గచనులు ♦ కఱకుటలుఁగు
కనులు తీయని పలుకులు ♦ గలపడుచులు, పెంచుతల్లుల యొడుల ని ♦ ద్రించినారు.

ఉ॥ కాటుక మావిపిందెలకుఁ ♦ గల్గిన యట్లు రహించు కన్నులన్
మాటి మొగిడ్చి నిద్రిలిరి ♦ మానిను లందు కరేణులం బలెన్
మేటి కరాసిపీరులును ♦ మేదుర గంధగజంబులం బలెన్
బోటులకున్ సమీపమునఁ ♦ బొందిరి కూరుకులం గ్రమంబునన్. ౪౯౮

చ॥ అతిశయ ధర్మముం దపము ♦ నందుట నున్నతి నొంది వల్లభ
ప్రతత కృపానురాగ రస ♦ ధారలు కొందఱు తే మయూర సం
తతులు ముసింగి వ్రాలు క్రియ ♦ ధారిణిపైఁ బడి తీవ్రతాప సం
గతలయి వ్రాలినారు కసు ♦ గందులు స్తన్యముఁ ద్రావుచుండఁగన్. ౪౯౯

ఉ॥ కొందఱు మాధవీ కుసుమ ♦ కుంజములన్ హరినీలవేదులం
జెంది మయూరవారముల ♦ చెన్నునఁ బండిరి సోలి వ్రాలుచున్
గొందఱు బంధుర క్రముక ♦ కూటములన్ హ్రద తీర సైకతం
బందు వరుండి కూర్కెరెల ♦ యంచల పిండుల మించు సంచునన్. ౫౦౦

క॥ వనమఱి చంపక వనములఁ, గుసుమ లతలు వాడుక్రియను ♦ కొందఱు గుములై
యిసుక పఱపుపైఁ గొందఱు, మసచెడి నిద్రిలిరి విద్రు ♦ మ లతల పగిదిన్. ౫౦౧

ఉ॥ కొందఱు కుంకుమంబు నెఱి ♦ గూడిన కొండను మంచు వ్రాలు పొ
ల్పొందఁగ ఝొమ్ములందు దవ ♦ యొప్పఁ బరుండిరి నేల సోలుచున్

గొందఱు దిండుగాఁగ దమ ♦ కోమల హస్తములం గదించి కూ
ర్కుందిరి మోము లంగు చెడి ♦ యంబుజము ల్ముకుళించు చాడ్పుగాన్. ౫౦౨

ఉ॥ కొందఱు బండలందు మఱి ♦ కొందఱు రాలిన యాకుకుప్పలన్
గొందఱు కొంగులం బఱచి ♦ కొందఱు పల్లవము ల్ఘటించుచున్
గొందఱు నట్టి నేలపయిఁ ♦ గొందఱు భర్తల పాదసన్నిధిన్
గొందల మంది డెందములు ♦ క్రుంగఁగ వ్రాలిరి సోలి నిద్రకున్. ౫౦౩

తే॥ ఇట్లు మైవ్రాల్చి నిదురింప ♦ నెల్ల వారు, మైథిలీ భర్త యపుడు సు♦మంత్రుఁ బిలిచి
పావన గుణ వికాసి! నీ ♦ వలన మాకుఁ, గావలయు పని యొక్కటి ♦ కలదు వినుము.

మ॥ అధిక ప్రేమము గల్గు నీ జనులఁ బో ♦ నంపంగ లేనైతి ని
వ్విధి వీరిం గొని పోవఁ జాలనయితిన్ ♦ వే త్రిప్పి కొంపోవు నీ
రథ మార్గంబును కాంచి వీరు 'పురమున్ ♦ రాముండు చేరెన్ మనో
రథముల్ దీరెనటంచుఁ గ్రమ్మఱెదు వా ♦ రల్ దీనిఁ గావింపుమా. ౫౦౫

మ॥ రథిక శ్రేష్ఠుఁడు రాముఁడిట్లు పలుకం ♦ బ్రార్థించుచున్ మేటి సా
రథి వాక్రుచ్చును నిన్ను వీడియును నా ♦ ప్రాణంబులన్ వీడకీ
రథముం గొంచుఁ బురంబు చేరి కన నే ♦ రన్ గోడు, కాంచంగ దు
ష్పృథముం బొందిన కైకకున్ విధికి నేఁ ♦ బై చేయియే యాదుగా! ౫౦౬

ఉ॥ తమ్ముఁడు దేవియుం గడు ము ♦ దమ్మునఁ దో నరుదేర రాము నం
దమ్ములు చిందు నందన వ ♦ నమ్మున వీడితి నంచుఁ జెప్పనా?
యిమ్మెగఁ దోడి తెచ్చితి న ♦ హింపుఁడి చూడుఁడి యంచుఁజెప్పనా?.
యెమ్మెయి ఱాతిగుండె గొని ♦ యేమని చెప్పుదు వారి కచ్చటన్? ౫౦౭

తే॥ ప్రాఁత మిత్రుఁడ నొక మచ్చ ♦ పడని వాఁడ, మృదుల పుష్ప ప్రకీర్ణ మా ♦ మేదినిపయిఁ
జెలఁగి నడవంగఁ దగిన యీ ♦ సీత తోడఁ, దనయులం గాన నీఁగితి ♦ ననఁగఁగలనె?

తే॥ ప్రబలములగు నింద్రియములు ♦ రాతి గుండె, గలుగు నేను శరీరంబు ♦ కార్శ్య మొంద
మది కలఁగి పరిదేవించు ♦ మనుజ నాథు, కడకు యమ దూతవలెఁ బోవఁ ♦ గలనె చెపుమ

తే॥ నగరవాసులు నీపుత్త్రి ♦ నయముతోడఁ, బిలిచికొని వత్తురని శాంతి ♦ గొలుపుచుండ
నతని నిప్పుడు కట్టెఁడి ♦ యముని పోలి, కఠినవాక్కున గోలచేయఁ ♦ గలనె చెపుమ? ౫౧౦

తే॥ అరుదుగాఁ గన్న పుత్త్రి సిం ♦ హాంబు లడవి, కేగెనని తెల్పఁ బోదునే? యీ సునీతి
పలుకఁ బోలునే? యట్లువఁ బార్థివునకుఁ, గైకయే మేలుచేయి నా ♦ కంటె నరయ

తే॥ వజ్రపాతంబునకు నుల్కు ♦ ఫణి విధమున, వెలవెలంబాఱి రామ భూ ♦ విభుని చరణ
సరసిజంబుల వ్రాలి యా ♦ సచివుఁ డిట్లు, పెక్కు విధములఁ బ్రార్థించె ♦ వీడ లేక.

క॥ జ్ఞానేంద్రియములకందక, జ్ఞానమునకు నెఱుఁగనైన ♦ శాశ్వతుఁడు రమా
జాని సుమంత్రుని కరముల, తో నెత్తుచుఁ దడిసి నీరు ♦ తుడుచుచు ననియెన్. ౫౧౩

క॥ పుట్టిన పిమ్మట రాఁదగు, పట్టిని సంపూర్ణముగనె ♦ యొసఁగిన నీవుం
గట్టిగ శ్రమ గలదనుచుం, బట్టిన ధర్మంబు విడుము ♦ అది నాయందే? ౫౧౪

తే॥ జగతి నుత్తమ ధర్మంబు ♦ జయమొసఁగు, జలిపి యనుసరించినను నిల్చి ♦ స్వర్గమొసఁగు
నింపుగలదేని చేయు చవిష్ట మొనర, నీవు వాఁడట్టి ధీరుఁడో ♦ చూడు మీవ.

తే॥ వాఁడికైదువు లోఁ ద్రిప్పఁ ♦ గాఁడ నోర్వఁ, గలుగు టెన్నంగ వీర ♦ లక్షణము గాదు
మరణమువ్విధమునఁ ♦ బ్రామసి పోవఁ, దగవు దప్పకుండుటె మగ ♦ తనము సువ్వె ౫౧౬

తే॥ శత్రు జీవాపహారణ ♦ శస్త్రభాసి, ఖడ్గహస్త! వనుల కేఁగి ♦ కష్టపడుచు
మరలి వచ్చి యొనరింపుము ♦ చిరయశంబు, గాంచు మా నాకదే కల ♦ కంబు గాదె?

తే॥ సత్యసంధుఁడు పురుషుఁడు ♦ సత్యమునకుఁ, దనదు వచనము కంపు టవని ♦ తపము యగును
అతని యాజ్ఞను తలఁదాల్చి ♦ యడవి కరుగు, టరయ నా మేటి తపము; నీ ♦ వడలు టేల?

తే॥ మొదటఁగులగురువకు నామ ♦ మ్రొక్కు గాఁగ, వినయపూర్వకముగ ♦ మ్రొక్కి ♦ పిదప నతని
తోడ మాతండ్రిఁ గాంచి పు ♦ త్రుండు జోత, సలిపె నని చెప్పియువల నా ♦ తలఁపు దెలుపు.

చ॥ కులగురు నాజ్ఞ నౌదలను ♦ గూరిచి ధర్మ పథాను వర్తివై
సలుపుచు నుండుమా శుభ మెు ♦ సజ్జన పాళికి దేవతాళికిన్
వలవని నా వియోగమున ♦ వందురు తల్లులఁ దండ్రిఁ దేర్చుచు
తలఁగని సత్ప్రవృత్తి ననిఁ ♦ తమ్మునకుం దగ విన్నవింపుమా ౫౨౦

ఉ॥ క్రూరుఁడు తండ్రి యిట్లు చెడు ♦ గుల్ ఘటియించెన యంచు నీవు దు
ర్దారుణరీతి నెంచకుము ♦ దంబున నామెతఁ జూపు నుల్లస
త్కారుణికత్వమున్ దగు వి ♦ ధంబున మార్దవ భక్తినాతఁ డో
దారుపు చెందు నట్టులుని ♦ దారముగా వినిపింప వేఁడెదన్. ౫౨౧

తే॥ గురు మహాదేవు కోనంతి ♦ పురికి నేగి, మొదటఁ దండ్రి దుఃఖము దీర్చి ♦ పిదప నతని
భరతుపై మీరు పాదకృ ♦ పన్ ఘటింప, వలయు వరము వేఁడితి నని ♦ పలుకు మయ్య!

తే॥ అడవులం బడు గ్రాఘువు ♦ హాయనములు, కడపి వచ్చి మీ చరణ పం ♦ కజములకడఁ
జేరు నటలనుఁడనుచు న ♦ సిద్ధ రూపు, వలనఁ జెప్పించి సాంత్వనం ♦ బు పుచుకొని. ౫౨౩

చ॥ ననుగని పెంచు తల్లులకు ♦ నా నెఱి దప్పని వందనంబులన్
వినతిమొయిం గదించి ♦ యను ♦ వెంటనె తండ్రి యటంత దీర్చి యా
తని మనె నా వియోగమునఁ ♦ దాలిక యుండఁగ నూఱడించుచున్
బనవక వీడకుండుఁడని ♦ ప్రార్థన చేసితి నంచుఁ దెల్పుమా. ౫౨౪

ఉ॥ సేవకు కింకరత్వ మది ♦ చెందదు మూర్ఖ సతం బటంచు సం
భావన జేసి యంతట సు ♦ మంత్రుడు రాముని భద్రపాద రా
జీవములం భజించి భువి ♦ జీవికిఁ దప్పని సౌఖ్య దుఃఖముల్
దైవ వశంబులంచు వని ♦ తా మణి సీతకు మ్రొక్కి నిల్చెదుర్. ౫౨౫

ఆ॥ వందనముల్ వచించె నను ♦ వత్సలతం గను మామగారికిన్
జిందెడు ప్రేమతోడ ♦ నను చేరఁగఁ దీసెడు ముగ్గురత్తలన్
డెంద మెలర్ప మ్రొక్కెనను ♦ తేఁకువ ముద్దుల కీరి శారికల్
వందక పెంచఁ గోరెనని ♦ పల్కుము గాదిలి చెల్లియండ్రకున్. ౫౨౬

ఉ॥ సీత వచించు వారవిని ♦ చింతయె కానని యీమె కానలన్
జేతము ప్రుక్కి నెంత వగ ♦ చెందునొ యంచుఁ దపించు మంత్రివి
ఖ్యాతుని గాంచి రాముఁడనుఁ ♦ గష్టము వచ్చినఁ దీర్చు నేర్పరుల్
భూతల మందు గల్గుదురె? ♦ పోవఁగఁ జూచినఁ బోనె ప్రాణముల్?

తే॥ సుస్థిర ప్రేమచే మది♦ప్రుక్కి మంత్రి, రాము వాక్కులఁ గొంత యూ♦అటనుపొంది
కుదల గొని మ్రొక్కి లక్ష్మణు♦మోముగాంచి, యేమిపల్కెదవన వచి♦యించెనతఁడు

ఉ॥ నామనముల్ సమస్త సుగు ♦ ణంబుల చేత జయించు రాఘవ
స్వామికి భూమి నిచ్చి యొక ♦ దాస కుబుద్ధికి లోఁగి పిమ్మటన్
రాముని కాన ♦ కంపి తన ♦ రాజ్యము స్త్రీకి నొసంగు సత్య వా
క్స్థముని రాజుగాఁ దలఁచి ♦ చెప్పఁగ నొక్కటి యేని యొప్పునే? ౫౨౮

ఉ॥ కానల జ్యేష్ఠ పుత్త్రకుఁడు ♦ కాయలు దుంపలు దిన్చు నుండఁగాఁ
దాను సురేంద్ర భోగములఁ ♦ దప్పక పొందెడు సత్యశీలికిన్
దానికి మానిసీ జిత వి ♦ ధానికి జీవము తోడ నుండి యిం
కేని దివంబుఁ జేరఁజలి ♦ యింపని స్థైర్యముఁ జాటి పల్కుమా. ౫౩౦

చ॥ అవనికి రాజు కాఁదగిన ♦ యాతని తోడను పుట్టలేదు నే
నవనికి నిప్పు డేలికగు ♦ నాతని తోడను పుట్టలేదు నా
కవరజుఁడున్ భువిం గలుగఁ ♦ డంబుజసంభవుచేత నాకు నేఁ
దవిలిన తోడుగాఁగ వసు ♦ ధన్ జనియించిన యో బలిష్ఠుఁడన్. ౫౩౦

తే॥ అనుచునిటు కోపమునఁబల్కి ♦ననుజుఁగాంచి,వత్స!యొప్పిదములుగాని ♦పలుకులనకు
మనుచు నాశ్వాస మొసరింప♦ మనసు కుమిలి, చాఁగి మ్రొక్కి తేరి కడకు♦సాగెమంత్రి

ఉ॥ తేరికిఁ బూన్చు ఘోటములఁ ♦ దేఁకువఁ జేకొనెఁ గోలఁగేల నా
దారి జనంబు లెల్ల విశ ♦ దంబుగఁ గాంచెడు నట్లు చోదక

స్ఫార విచక్షణత్వమున ♦ సందడి యెక్కుడుగాక నిద్రపుం
గూరిన వారు మేలుకొనఁ ♦ గూడను తీరునఁ దేరు తోలుచున్. ౫౩౩

ఉ॥ సీత పతివ్రతాత్వమును ♦ స్వీయ విశేష గుణంబులున్ లస
త్ఖ్యాత యశంబు సత్యమును ♦ ధర్మపు విజ్ఞత కార్యకంబు సం
ప్రీతుఁడు తమ్ముఁడున్ దసరు ♦ పీడని తోడుగ నా నిశీథినిన్
శ్రీతరుణీ మనోహరుఁడు ♦ చేరె వనంబులకున్ మనో ధృతిన్.

చ॥ కుటిల మనస్కులౌ దనుజ ♦ కుంజరులం దగఁ గూడి లోక సం
కటమగు కృత్యము ల్సలుపు ♦ కష్టుల కార్యము లడ్డుకో విశం
కట గతి నొప్పి యెల్లెడలఁ ♦ గాటుక రంగు వెలార్చు చుండు చీఁ
కటిఁ దొలఁగించు వేలుపుల ♦ కాగడ నా నుదయించెఁ జంద్రుఁడున్. ౫౩౪

ఉ॥ మర్మముఁ దాఁకు పాపముల ♦ మాయఁగఁ జేయు వలంతులైన స
ద్ధర్మములన్ వహించి మహి ♦ ధర్మము నిల్ప సహాయపడ్డ యా
కర్మ ఫలంబు నెంచి కుతు ♦ కంబునఁ గానఁగ వచ్చినట్టి యా
యర్మిలి ధర్మదేవత ము ♦ ఖాబ్జ మనన్ శశి తాల్చెఁ దేజమున్. ౫౩౫

మ॥ భయదారణ్యములం జరించు నసి తా ♦ బ్దశ్యాము పే దర్మిఁ గాం
చి మొదల్ నొవ్వ మొగంబు మోడ్చి నటు దోఁ ♦ చెం గల్వ లంభోజ సం
చయముల్ గన్పడె జెట్టిపోతుల శిర ♦ శ్శూలయున్ ఘనో వేదనన్
లయమై నోరులు మూసి కొన్నవని య్యే ♦ లా చెప్ప నన్యంబులన్. ౫౩౬

ఉ॥ అంజన శైల సుందరుఁడు ♦ నట్టెఁడ మేలి పసిండి చాయమై
రంజిలు వాఁడు వింటికొన ♦ రాణ నొసల్లల భూమి జాత మె
ల్లంజప వేసటం గొనని ♦ లాగున నేగుట కాను కష్టల్యమై
కంజ విరోధి వెన్నెలలు ♦ గాసెను మొత్తని దూది వై చెనాన్. ౫౩౭

తే॥ మిగుల లేఁగాను స్తన లక్ష్మి ♦ మెఱయు సీత, మృదు మృణాల పదంబుల ♦ మెల్ల మెల్ల
వెంబడించె విమలమైన ♦ ప్రేమ కంటె, గురు తరంబగు వస్తువు ♦ ధరణిఁ గలదె? ౫౩౮

చ॥ ఇనుఁ డుదయాచలంబు శిర ♦ మెక్కెడు మున్నె రఘూ ద్వహుండు తే
క్కినముగ యోజన ద్వయము ♦ కీడ్పడ కేగెను; మీఁటి బాష్పముల్
కను గవ పీడఁగా మనసు ♦ కాతఱ తాపము నొంది కుందఁగా
మనికిత పాటు తోఁ జని సు ♦ మంత్రుఁడు చేరెఁ బురంబు చేరువన్. ౫౪౦

ఉ॥ చేరి దినేంద్ర వంశగురు ♦ శిష్టు వసిష్ఠుని గాంచి మ్రొక్కి కాం
తారము రాముఁ పోక్క బరి ♦ తాపముతో వివరింప ఘూర్ణిని

ట్టూరుపు పుచ్చి కాఁగలది ♦ యుల్లమునం బరికించి యక్కటా!
భూరమణుండు తీక్షఁ బుర ♦ ముం గలగుండు పడెం గదా యనెన్. ౫౪౧

తే॥ రాజు నిందకు జంకి మ ♦ రల్పఁ డయ్యె, ధర్మమును నిల్ప నెంచిన ♦ దాశరథియు
వినఁడ యింతయు నామాట ♦ విధిని దాఁట, నగునె? యని యేగె నతనితో ♦నంతిపురికి

తే॥ దాశరథి వచ్చెననుచు ను ♦ త్కంఠ మంత్రు, లరిగి పరిధి చంద్రుంబోలె ♦ నధిపుఁ జేరి
రాముఁగానక బాష్పవ ♦ ర్షంబు గురియు, నానుమంత్రుని గని చాల♦నడలినారు. ౫౪౩

తే॥ తేరుమరలినదని యెల్ల ♦ వారు పలుక, రాముఁ డేతెంచెనని దశ ♦ రథుఁడు కనులు
తెఱచి నా జీవ జీవ మే ♦ తెంచెనె? యని, యడిగెఁ దనయెద యుబలాట♦పడుచు లేవ.

తే॥ బదులు చెప్పఁ జాలక మాని♦పరితపించెఁ, దపసి మొగమె భూపతికి ను♦త్తర మొసంగె
నెడఁద పగిలి భూమీశ్వరుఁ ♦డిలకు వ్రాలె, గొవరు చూడఁ జాలక మాని♦యవలి కేగె.

ఉ॥ దగ్గఱ నుండెనే సుతుఁడు ♦ దవ్వుల నుండెనె యంచు మెల్లనన్
బెగ్గడ నడ్గి యాతఁడు ద ♦ వీయ వనంబుల కేగెఁ దమ్మతో
సిగ్గరి సీతతో నని వ ♦ చించి వచింపక మున్నె భూవరుం
డగ్గలికంపుఁ జేర్మిఁ దన ♦ యా! యని హా!యని వీడెఁ బ్రాణముల్. ౫౪౬

వ॥ అపుడు పురందరాది సురు ♦ లందఱు మా ప్రభుతండ్రి వచ్చె నం
చుపగత మోద భావమున ♦ నొక్కటియై శశిబోలె శీతలా
తపము వెలార్చు తేరిపయి ♦ దాకొని పుట్టిడి తంటలెల్ల లే
క పొదలు పైజగంబునకుఁ ♦ గైకొని పోయిరి సమ్మదంబునన్. ౫౪౭

మ॥ కని సందేహమునన్ సతీతిలకమా ♦ కౌసల్య మైఁదాఁకి చ
ల్లనయై యావియు నాడ కుండుటలు పో ♦ లం జూచి నాథుండు ప్రమం
దెనకా నిశ్చయమంది గ్రీష్మరవి సం ♦ దీప్త ప్రతాపంబుచే
దనుకం జొచ్చిన యెమ్మలేని జని చం ♦ దం బందుచుం దూపిలెన్. ౫౪౮

సీ॥ కమల గర్భుండాది ♦ గాఁగ సమస్త జ, గంబుల సృజియించి ♦ కాచు హరిని
తనయుఁగాఁ బడయు ను ♦ త్తమ తపం బొనరించి, నట్టియన్నులమిన్న ♦ యట్టి కూలి
పీయూషమును జాఱ ♦ వీడి వందురు వాగి, వలె మది మిక్కిలి ♦ పరితపించి
మణిఁగోలు పోయిన ♦ ఫణి విధంబున నుల్ల, మల్లలాడఁగఁ బెల్లు ♦ తల్లడిల్లి

తే॥ మగపులుఁగుఁబాసి ♦ మనమున మఱుఁగునట్టి, కురరి భంగిని గద్గద ♦ స్వరముతోడ
నెన్నువలు పల్కి వినువారి♦యెదలు కరఁగి, ద్రవముగాఁ బ్రలాపించె రో♦దనముతోడ

చ॥ వినుత మహాశయుండు నృప ♦ వీరుఁడు ధన్వియొకండు వ్యాధియుం
ఘనకళ తానుగాఁగ మృతి ♦ జెందెనె మమ్ము వియోగ దుఃఖ భా

జనముగఁ జేసి యంచు జల ♦ సద్మము వట్టఁ దపించు మత్స్యభా
తిని బలు తల్లడం గుడుచు ♦ దేహముతోఁ బృథివీస్థలిం బడెన్. ౫౫౦

సీ॥ ఈ దేశమును గాచు ♦ నృపతులొకేరీతి, స్వర్గంబుఁ బాలించు ♦ వారెకాదె?
పోలుపుగా మనిన స ♦ త్పుత్త్రికులకు గతు, లొక్కడనేని లే ♦ కుంట గలదె?
మత్సుతుఁడే తెంచి ♦ మదికి నూఱట గొల్ప, కిటు తండ్రి మృతికిఁ దా ♦ హేతువయ్యె
నను చింత యొక్కటె ♦ నన్నాఱటం బెట్టెఁ, గైదువుపోటు రో ♦ గంబు లేక

తే॥ ప్రాణములు వీడుగతికిఁ బా - ల్పడియె నకట, కన్నకొడుకులచే నిట్టి-గతియుఁ దగునె?
వెదురు శక్తియరఁటియెండ్రి-విధమెయయ్యె, నీమహీంద్రుఁ బ్రదుకుభరి-యింపఁదరమె?

తే॥ మఱి బలిమిచేత విభుబుద్ధి - మాడ్చివైచి, బదులు పలుకనీయని రీతి - వరము గొంటి
మగనిఁ జంపుకొంటివి తృప్తి-నెగడుచుంటె, కైక! మిగిలియున్నదె చేయఁ-గలదియింక?

ఉ॥ దుర్జయుఁడైన శంబరుని - దోర్బల శక్తి నడంచు వీర! నీ
యూర్జిత శౌర్యసంపదనె - యోడక నెమ్మది నందు చున్న యీ
నిర్జరపాళికే యిపుడు - నెమ్మి గడించిన విందవైతివే
వర్జన సేయఁగాఁ దగునె - పార్థివ! నమ్మిన మమ్ము దీనలన్? ౫౫౩

చ॥ ననుగొని వేల్మి వేల్చిన మ ♦ నః ప్రియ! యిప్పుడు నన్ను వీడి క్ర
న్నన నొకరుండ వే చనఁగ ♦ నాయమె తత్ఫలమున్ భుజింప? స
త్యనయ ఫలంబు నానుటయు ♦ ధర్మ ఫలానుభవంబ యేనియున్
జనునొకొ సామి దేహమునఁ ♦ జక్కనగా ననుభూతి నొందుటల్? ౫౫౪

చ॥ గజ విభుఁ బాసి తాపమునఁ ♦ గ్రాఁగు కరేణువు పోల్కి కోసలా
త్మజ విభు తొమ్ముపై శిరము ♦ దారిచి యిట్లు విలాప మొంది సో
లి జగతి వ్రాల నంతి పురి ♦ లేమ లురమ్ముల బాఁది కొంచు దుః
ఖ జనిత బాష్ప తోయములఁ ♦ గ్రాఁగుచుఁ దోఁగుచు స్రుక్కి వెక్కుచున్.

చ॥ విసము భయంబుచేఁ గుడిచి ♦ విహ్వల మందుచు వ్రాలు కైవడిన్
దెసచెడి నేలఁగూలుచుఁ బ ♦ తిన్ దివమందు భజింపఁ గోరి ని
ర్వ్యసన మనస్కలౌచుఁ బ్రతి ♦ మాకృతిఁ దాల్చిరి ప్రేమకంటె ని
వ్వసుమతి వేఱొకండు చెడు ♦ వస్తువు గల్గునె పోలఁ జూచినన్?. ౫౫౬

సీ॥ ఉప్పళంబుల తీర - మొప్పారు కడలిచే, బలసిన యీధరా - తలము నందు
దివమున యందుఁ బై - భువనము లందును, కల కులపతుల వీ - రలను పోలు
నకలంక హృదయు లెం - దైనఁ గల్గుదురేమి?, యనఁగనొప్పి యడవి - నడరు వాఁక
గిరిఁ జుట్టి కవియ ను ♦ స్థిరముగా నిలిచిన, కొండపై నెమిళుల - కొమరు దాల్చి

తే॥ కొడుకుఁ బాసి డెందము వ్రీలు ♦ నుడువుచేతఁ, జచ్చియును మరణాంతంబు ♦ సత్యమందె
నిలుచు ప్రభునొడలిని వీడి-తొలఁగలేక, కిట్టి పలవించు చుండిరి-చుట్టు మూఁగి.

చ॥ మనుజుల బంధహేతువగు ♦ మాయ యనం జను చోట మీను చే
రిన జననాంబురాశిని త ♦ రింపఁగఁ దారకమంత్రరాజ నౌ
కను గొను వారి పోల్కి-ఁ బ్రభు ♦ కామిను లర్వదివేలమందియుఁ
మనమున దార్ఢ్యమూని యన ♦ మాన సునిశ్చలతన్ భజింపఁగన్. ౫౫౯

తే॥ రాము తల్లి లక్ష్మణు తల్లి ♦ వ్రాలి సోలి, మఱుఁగు చుండ నోరువని సు ♦ మంత్రుఁ డేగి
జరిగినది తెల్పఁగా రాజ ♦ గురుఁడు వచ్చి, ప్రభుని మరణంబునకుఁ జాలఁ-బరితపించె.

తే॥ వరము లొసఁగి కుమారుని-వనుల కంపి, యార్యుఁడు గతించెనని మది - నడలి యడలి
యబ్ధిలో నావ వ్రీల నా-యకుఁడు చావ, ఱిచ్చవడు మాలిమిం బోలె- ఋషివరుండు

చ॥ జరుపఁగ దగ్గ సంస్క్రి-యలు - సల్పఁగఁ బుత్త్రులయందు చెంత నొ
క్క-రుఁడును లేమికిం గురుఁ డొ - కానొక మార్గమునెంచి యంతటన్
భరతుఁడు వచ్చు పిమ్మటనె - పద్ధతిగా నొనరింప రాట్క-ళే
బరమును తైలరాశి నన ♦ పాయత గుప్తము చేసె నెవ్వడిన్. ౫౬౧

చ॥ పతి కిట సంస్కృతు ల్జరుపు ♦ పట్టున మీరలు ధీరచిత్తులై
చితిఁ జొరవచ్చుఁ బొండనుచుఁ ♦ జెచ్చెర రాణుల సాగనంపి సం
గతముగ లేఖ వ్రాసి యిది ♦ కైకొని కైక కుమారు రాజు నా
నతి యని వేగ తోడుకొని ♦ నైపుణి రండని పంపె దూతలన్. ౫౬౨

తే॥ సర్వసైన్యాధి పతియును ♦ సారథియును, మంత్రిముఖ్యుండు నైన సు-మంత్రుఁబిలిచి
యవసరంబులౌ రాజ కా ♦ ర్యంబులెల్ల, జరుపుచుండుమ యనుచు నా ♦ జ్ఞప్తి యొసఁగె

చ॥ తన కుల దీపకుండయిన ♦ ధారణి నాథుఁడు స్వర్గమేగఁ ద
త్తనయులు చెంతలేరు నృప ♦ ధర్మము నాశిల కంతఁ దాఁకఁ బృ
థ్వని తగఁగాతు నంచుఁ జను ♦ దెంచిన కైవడి భాస్క-రుండు తూ
ర్పున నుదయించె నిర్జరులు ♦ పుణ్యులు మ్రొగ్గఁ బయోధి మ్రోఁగఁగన్.

సీ॥ చింతింపఁ గూడని-చెన్నునఁ జింతించు, చుండిన వారలు - నొడలు మఱచి
కూర్కి-న వారును - కోదండ పాణియు, నిటనె యున్నాఁడని - యెంచినారు
నగు జనంబులు లేచి - యంబుద శ్యామునిఁ, గానక మనమున - గాసిచెంది
మాయని కన్నులు - మాసి మనల నిట్లు, చెఱుప నెంచిన వని - మఱిఁగి నారు

తే॥ ధరణిఁ బొరలిరి దెసలకుఁ-బరుగు లిడిరి, పడిరి లేచిరి కుందిరి - వందినారు
మనల దుఃఖ సాగరమున - మునుఁగ విడిచి, జాఱె పోయెను రఘురామ-చంద్రుఁడనిరి,

సీ॥ చెడుపని చేసె రా-ముఁడు తగునే యిది? దండక భువిలోనె-యుండదేమి?
వెదకి చేరక యున్న - నెదలోన నూఱట, నందఁగాఁ గలమె ర - వంత యేని?
అరదంపుఁ గందువ - యరయుదమా యని, చని కొంత దూరంబు - గని జనములు
మరలె నయోధ్యకే - మన రాము తేరని, పోయిన ప్రాణముల్ - పొందినట్లు
తే॥ తలఁచి తలరిచి మేఘముల్-జలధిఁ గలిసి, ఘోష మొనరించు తీరునఁ-గూడి యార్చి
త్రాఁచు కాటొంది పైనమృ - తంబు దొరకి, మరల జీవము గ్గాంచిన - కరణినొంది
ఉ॥ త్రోవ తొలంగ కుండఁ బురి - త్రోవనె స్యందన మేగుదెంచు నా
ప్రావను గాంచి మించిన య ♦ పార ముదాన లయుంబునాఁడు లో
కావలిఁ గప్పి ముంచికొని ♦ యవ్వలఁ జెల్లెలికట్ట లోనికిన్
లోవు పయోధిఁ బోలి జను ♦ లుం దగఁజేరిరి పట్టణస్థలిన్ ౫౬౭
ఉ॥ చేరి ప్రభుండు నాకమును ♦ చేరెన యంచును రాఘువుండు కాం
తారమె చేరెనంచు విని ♦ తద్దయు డెందము కుంది క్రుళ్ల శా
రీరము కీఁచు వోవఁ దల ♦ రెన్ పొలసెన్ జనమెల్ల; గాలపున్
మేర తొలంగదేని మర ♦ ణించునె జీవి తపించుచుండినన్? ౫౬౮
సీ॥ ఉసులు లేఁగిన పతి ♦ కొదవని వారును, వనులకేగిన రాఘు ♦ వునకు నల్లె
దుఃఖమున్ చెఱియందు ♦ తూలి తపించెడి, వారలఁ గాంచి తా ♦ పసవరుండు
నేనును తలఁపంగ ♦ రాని వంతకుఁ జిక్కి, యే చావకే గోడు ♦ చూచుచుంటి
నని సమాశ్వాసింప ♦ నమ్మని పల్కుల, నందఱు బడబాగ్ని ♦ కలికి వేల
తే॥ మీఱకుం డు కడలిపోలె ♦ నూఱడిల్లి, రట నుదారుఁడౌ భూదారు ♦ నాజ్ఞ యనెడి
నాకుల తపఃఫలంబున ♦ నట్టనడిమి, రేయి వెల్లి నాతని విచా ♦ రింత మింక. ౫౬౯

౯. గంగా పటలము. (౩౭)

ఉ॥ కాటుక కొండయో? మరత ♦ కస్థిర మో? జలపూర్ణ మేఘమో?
నీటి సమూహమో? యనఁగ ♦ నిర్మల సుందర విగ్రహుండు ఘో
రాటవి త్రోవ మేని జిగి ♦ యర్యమ కాంతిని గప్ప నేగె న
ప్పాటల గంధితో ననుజ ♦ వర్యునితోఁ జరితార్థభావుఁడై. ౫౭౦
ఉ॥ లేదన నొప్పు కౌను లవ ♦ లీ లలితాంగము నీలవేణి క్షీ
రోదధి వెన్నఁబోలిన మృ ♦ దూక్తులు నిండుతపంబు వంటి శు
ద్ధోదము వంటి శీలమతి ♦ నొప్పు మనోరమతోడ రాఘువుం
డాదటఁ గాంచె మత్తకల ♦ హంసము హంసియుఁ గూడి యాడుటల్. ౫౭౧
ఆ॥ కాము బాణములను ♦ రాము కోదండంబుఁ, గొలిచి గెలుచు కనులు ♦ గలుగు సీత
రాఘువేంద్రు చరణ ♦ రాజీవములు హసి, యించు పంకజముల ♦ నంచుఁగాంచె. ౫౭౨

సీ॥ మకరందమును పరి ♦ మళము గుప్పెడు వేణి, నెలవంక బోలొ్న్నసల్ ♦ గలుగుసుదతి
జానకితో రామ ♦ చంద్రుఁడు మేఘము, మెఱపుతో వచ్చెడు ♦ తెఱఁగు దాల్చి
నాగంబు పిడితోడ ♦ నడచు చందంబున, నడచుచు సుషిర ని ♦ నాద వరణి
తంత్రీ విరావామ్ర ♦ తంబు కరణిఁ దేనె, వలెను చక్కెరపాగు ♦ పగిదినమరి
తే॥ చెలువమైన పల్కులు గల ♦ చిలుకవంటి,సీత కన్నులఁబోలిన ♦ చెంగలువల
మళ్లలోఁ గల్వ తీసెడు ♦ మగువ మిన్న, లూడ్చి కుప్పవై చుటగాంచె ♦ నొప్పమీఱ
ఆ॥ మద మరాళ యాన ♦ హృదయంబు నందించు, కేళి గ్లాని యనుట ♦ యెఱుఁగ కుండ
విభునితోడఁ జనియె ♦ విహారణ లీలల, నించు గానుగలను ♦ కంచుఁద్రోవ. ౫౭౪

సీ॥ చిందమ్మ లెక్కడు ♦ చిందించు నాణేము, త్యములు వెలుంగు ప ♦ ద్మా కరముల
హంసలు నిద్రింప ♦ ననువైన తోఁటల, నంకు పుర్వులుగల ♦ సైకతముల
సుమము లొత్తుగరాలు ♦ సుందర వనముల, వర హేమమును వెలి ♦ వఱచు నదుల
వరివెన్నులను మేయు ♦ వదనంబు లందుకీ, రంబులు గార్చు హే♦రంబ సమితి
తే॥ తేనెఁ గ్రోలఁగ వ్రాలిన ♦ తేంట్లు లేవ, వారి దుముకుచు లేచెడు♦వాలుగలను
హంస లట్లు చెలులు మున్గు♦హ్రద చయములఁ,గనుచుఁ గోసల దేశంబు♦గడచిచనిరి.

చ॥ పరిధి గలట్టి కాంతులను ♦ భాసిలు భూషణ భూష్యతోడ స ౫౭౫
ప్పురుషులు మేటి క్షేత్రముల ♦ పొల్పెస లారెడు కోసలంబు దాఁ
టి రయమెసంగ వేదము ప ♦ ఠించి మహత్త్వము నొందు తాపసే
శ్వరులు వసించు తీరములు ♦ భాసిలు గంగను చేరి రంతటన్. ౫౭౬

తే॥ అచటవసియించుమునులుమా♦యఖిలవినుత, పాత్రమగుపరమార్థంబు♦వచ్చెననుచుఁ
గౌతుకంబున వచ్చి య ♦ క్కమల నేత్రుఁ, గాంచు వేడుక మూఁగిరి ♦ కడఁకతోడ.

చ॥ మతిఁ దలఁపంగఁ బల్కనణు ♦ మాత్ర మశంగని ప్రేమరూపమేఁ
శ్రుతులకు దాఁటి వెల్గు పరి ♦ శుద్ధ సుధామయ మూర్తి నమ్మని
ప్రతతులు చర్మ చక్షువుల ♦ బంధుర మోదముతోడఁ గాంచి రం
దితర గృహస్థు లెయ్యెడల ♦ నేని వరాంగులఁ గాంచుకైవడిఁ. ౫౭౭
తే॥ వంశ ధరులగు ముని వరుల్ ♦ పద్మనేత్రుఁ, బాల కడలి వెన్నను పోలెఁ ♦ బరిగణించి
కనులఁ ద్రావుచు నెదుటను ♦ గంతు లిడుచు, నించు పాటలతోడ స్తు♦తించి నారు.
తే॥ ఇల్లు వీడిన కొడుకుల ♦ నెల్ల వేళఁ, దలఁచి తలరుచు వెదకుచోఁ♦దనయు లొకట
వచ్చిచేర నుత్కంఠమై ♦ వచ్చు తండ్రు, లం బలెఁ వచ్చి కనిరి ము ♦ దంబు గొనిరి.
తే॥ అతఁడు నడచు మార్గాయాస ♦ మఱ స్వనేత్ర, బాష్పశుద్ధ జలంబుతోఁ♦బరఁగనార్చి
మృదుమధుర వాక్య సుమముల♦నెద గదించి, చెదని ప్రేమామృతంబు భు♦జింపఁజేసి

తే॥ వనము లందుండి యేర్చి తె ◆ చ్చిన విశుద్ధ, కంద మూల ఫలంబులఁ ◆ గాన్క లిడుచు
విమలతేజ! కుఱంగట ◆ వెలయు గంగ, యందు నీరాడి వేల్చి ర ◆ మ్మారగింప. ౧౮౨

చ॥ తగ నిటు ప్రేమ పూర్ణులగు ◆ తాపసు లాడఁగ రామ భద్రుఁడున్
మగువలలోన దీపమన ◆ మాన్యత గన్న విదేహ కన్యతోఁ
బొగడఁగ దేవ సంఘములు ◆ పూర్వము బ్రహ్మ కరంబుతోడ నిం
బుగఁ దన పాదముం గడుగు ◆ పూత జలంబుల మున్గె నత్తఱిన్. ౧౮౩

ఉ॥ గంగయుఁ గేలు మోడ్చి కడుఁ ◆ గ్రమ్మ మృదూక్తుల నిట్లు వల్కె శ్రీ
రంగ దురస్థలా! ఘన త ◆ రంబగు పాపము గల్గువార లా
రంగ మునింగి పాప్మ నిక ◆ రంబుల నాయెడ వీడువారు న
న్నుంగను తండ్రి నీవిట ము ◆ నుంగ భజించితి నేఁ బవిత్రతన్. ౧౮౪

ఉ॥ నాగ కులేశ కంకణుఁడు ◆ నాక నదీ జటిలుండు శైల పు
న్నాగ తనూజయు న్నిలిచి ◆ నందన మందుచుఁ గాంచుచుండ, నా
భోగ మనుష్యతం దెలుపఁ ◆ బుట్టిన రాముఁడు మున్గి లేచు నా
బాగు రహించె గంగను క ◆ పర్దమునన్ ధరియించు పోలికన్. ౧౮౫

చ॥ జనకజతోడ మున్గి నృప ◆ చంద్రుఁడు లేచుట చూడఁ దొల్లి శ్రీ
వనిత కరంబు వట్టికొని ◆ పన్నుగ వెండిని పోలు పాల వె
ల్లిని ఫణి తల్పమందు పవ ◆ ళింతను వీడి జగంబు గావ లే
చిన రహి దోఁచె బుణ్య జన ◆ సేవిత శైవలినీ జలంబులన్. ౧౮౬

సీ॥ కానను గాంచి తీఁ ◆ గలు పుయిలోడంగ, సనుఁగు నడక కోడి ◆ హంసలాడుఁగఁ
బదముల కెదవడి ◆ పద్మముల్ తేలంగఁ ◆ గనుల కలికి వాలు ◆ గలు తొలంగఁ
బారాణిచే నీరు ◆ వన్నియ మీఱంగ, మృదు పదయుగ యగు ◆ మెలఁత మిన్న
పతి భుజంబును కర ◆ పంకజమునఁ బట్టి, పూత తోయంబుల ◆ మునిఁగి లేవ

తే॥ శూలి జటలోని జిల్లేడు ◆ రేలపూల, గంధముం బొంద నట్టి గం ◆ గా జలంబు
కుసుమవేణి క్రొవ్వెదలోనఁ ◆ బూసఁగు పుష్ప, వాసనయుఁ గస్తురియుఁ గొని ◆ పరిమళించె

చ॥ తరఁగలు పై నురుంగులఁ గ ◆ దల్చుటచే నరవొందు వేణి కా
భరము గలట్టి పెద్ద మగు ◆ వం బలెఁ గానఁగ వచ్చు గంగ సం
బరమున సీతఁ దృప్తి పఱు ◆ పం గొని పెంపుడు తల్లి కైవడిన్
దరఁగ కరంబు చాఁచి ప్రమ ◆ దంబునఁ దీర్ఘము లార్చె నొయ్యనన్. ౧౮౭

తే॥ సీత జడయను జీమూత ◆ జాత మపుడు, విరిసి వ్రాలి నీటను మున్గు ◆ విధము దోఁచె
గంగ నడుమను బ్రవహించు ◆ కజ్జ్రియమున, యుదకమందున్న పెనుసుడుల్ ◆ కదలనఁగ

తే॥ సుడులు పడుచు శబ్దించెడు ♦ సుర సరిత్తు, కనులఁ బోలిన పేనువాలు ♦ గలు చలించి
దుముకు వెల్లువలో సీత ♦ దోఁగి లేవఁ, బాలకడలి లేచిన లక్ష్మి ♦ పగిదిఁ దోఁచె.

చ॥ తొలి నొక పాదమే కడిగి ♦ దోషము లెల్లఁ దొలంచి కొంచు ని
ర్మలినతఁ జెంది పూర్ణ మహి ♦ మంబు గడించిన గంగ యిప్పు డా
సలలిత దేహమెల్లఁ బెలు ♦ చన్ స్పృశియింపఁగ నోచె నింక లో
కులు నరకంబుఁ బొందెదరొ ♦ కో! తనయందు మునుంగ భక్తిమై? ౫౯౧

తే॥ వార లీరీతి రేవున ♦ నీర మాడి, యాశ్రమము చేరి జ్ఞానగ ♦ మ్యంబు పరమ
వస్తువుఁ దలంచి పావనవర్తు ♦ భక్తిఁ గొలిచి, మునుల ప్రేమంపు టాతిథ్య ♦ మును గ్రహించి

ఉ॥ వేసట దీర్చి తానె యొద ♦ వించిన యయ్యమృతంబుఁ బ్రీతి స్వ
ర్వాసులకున్ భుజింపుఁడని ♦ రాజిల నిచ్చిన మేటి యిప్పు సం
తోసము తోడ మానులిడు ♦ దుంపల నాకులఁ దృప్తిగాంచె; నో
పీసర వోవునే తనియు ♦ పెద్దల కొందఁగఁ జేయు కృత్యముల్? ౫౯౩

## గుహుఁడు రాముని గాంచుట

సీ॥ అంత వేనావల ♦ కధికారి దివ్యాప, గా తీరవాసి వి ♦ ల్యాంద్ర మిన్న
కుధర భుజ యుగుండు ♦ కుక్కలు గలవాఁడు, తమ్మటమును జోళ్లు ♦ దాల్చువాఁడు
చీకట్లు గుంపులై ♦ చేరెననఁగ నొప్పు, మెఱుఁగారు నల్లని ♦ మేని వాఁడు
తనవెంట సేన రా ♦ దట్టంపుఁ గార్మొగు, ళ్లోగి లేచి వచ్చెనా ♦ నొప్పువాఁడు

తే॥ కొండుపుఁ గజ్జలతో దుందుభిఁ ♦ గొట్టువాఁడు, పంబి పంబ వాయించు సై ♦ న్యంబు గలఁడు
తలిరుఁ బోలిన కెంపు తూ ♦ పులుగలాఁడు, గజఘటలవంటి చుట్టముల్ ♦ గలుగువాఁడు

తే॥ తొడల కందంపు టరలాగు ♦ దొడిఁగినాఁడు, చుట్టు పులితోఁకలను వ్రేలఁ ♦ జుట్టినాఁడు
తెల్ల నామంబు నుదుటను ♦ దిద్దినాఁడు, భల్లుకాజి నోష్ణీషంబు ♦ పరఁగువాఁడు. ౫౯౫

సీ॥ పండ్లు కూర్చిన లీలఁ ♦ బరిఢవిల్లెడు గవ్వ, లం గూర్చు హారము ♦ ల్దాల్చినాఁడు
తాళ్లు కూర్చిన రీతి ♦ రవళించు నందియల్, పొలుపుగాఁ గాళ్లకుఁ ♦ బూనినాఁడు
చీకట్లఁ గట్టి చే ♦ ర్చినయట్లు చెన్నారు, సిగయందు వరివెన్ను ♦ చెక్కినాఁడు
నూనియఁ ద్రావిన ♦ జానున నొప్పారు, నిరుల వన్నియ మేసఁ ♦ బొరసినాఁడు

తే॥ నిడుద కనుబొమల్ మిక్కిలి ♦ వెడఁద ఱొమ్ము, గలుగువాఁడు కఱకు తాళ ♦ కంటకముల
బోలు రోమముల్ ముంజేతఁ ♦ బొందువాఁడు, వజ్రముం బోలు మధ్యంబు ♦ వఱలువాఁడు

తే॥ పలుకు పొందిక లేకుండఁ ♦ బలుకువాఁడు, చిలువ కంటెను క్రూర దృ ♦ ష్టులు గలాఁడు
నల్ల చిన్నెల దునెగల ♦ నడుము వాఁడు, జముఁడు సైతము వడఁకెడు ♦ స్వరమువాఁడు.

తే॥ బల మతిశయింప నెఱచి చేఁ ♦ పలు భుజించు, కంపుగలిగి నవ్వాని నోరు♦గలుగువాఁడు
కినుక లేకున్న నిప్పులు ♦ కెరలునట్టి, కఱకు బెడిదంపుఁ జూపులు ♦ గలుగువాఁడు

ఆ॥ గంగ దరిని గలుగు ♦ శృంగి బేరంబను, నగరమున వసించు ♦ నాయకుండు
గుహుఁడు రాముఁ జూడఁ ♦గొనకొని తేనియల్, మీలు కాన్క గొనుచు♦లీలఁజేరె.

క॥ ముదమున బంధులకడఁ దన ♦ ప్రదరంబులు, విల్లు వాలు ♦ వదలి ప్రమలవకా
నెదయందు నెనరు నిండఁగఁ ♦ బొదలు గుహుఁడు తపసి వాటి ♦ పొంతను నిలిచెన్.

తే॥ వేఁటరుల నాయకుండెదఁ ♦ బ్రేమనిండ, గుక్కఁ బోలిన నీసేవ ♦ కుండు వచ్చి
యాజ్ఞ నెఱవేర్ప నున్నవాఁ♦డనఘ చరిత!, కరుణ నేలు కొమ్మనుచు బి♦గ్గఱఁగఁబిలిచె

తే॥ పిలువ విని లక్ష్మణుండట ♦ వేగ వచ్చి, యెవఁడ వీవు వచ్చిన పని ♦ యేమి యనఁగఁ
గుర్కురము వంటి మీసేవ ♦ కుండు గుహుఁడు,పాద సందర్శనముఁ చేయ♦వచ్చెననిన

చ॥ ఇచటనె యుండు మంచు వచి ♦ యించి పదంపడి లోని కేగి యు
న్న చరణ పంకజంబులకు ♦ నర్మిలి మ్రొక్కి విశుద్ధ మానసుం
డుచితుఁడు తల్లికంటె నెన ♦ రొప్పిన వాఁడు గుహుండు నావికా
నిచయము గల్గువాఁడు నిను ♦ నెమ్మిని చూడఁగ వచ్చె నాఁడనన్.  ౬౦౩

ఉ॥ రాముఁడు సంతసించి కొని ♦ రమ్మన రమ్మని లక్ష్మణుండు ప్రే
మామృత మొల్కఁ బిల్వఁగ గు ♦ హాఖ్యుఁడు లోనికి వచ్చి యూస నా
కోమలికంబు గాంచి తన ♦ కుం గల కన్నులు ధన్యతంగొనన్
నేమము తోడ మ్రొక్కియట ♦ నిల్చెఁ గరంబున నోరు మూయుచున్. ౬౦౪

మ॥ ఇటఁ గూర్చుండుమ డాసి యంచు రఘు వం ♦ శేశుండు వ్యాక్రుచ్చు నం
తటఁ గూర్చుండక యెల్ల మీకిన ప్రియూం ♦ త ర్యాత ఘావాధ్యుఁడా
దట మీకోరెము దెచ్చినాఁడ మధు మ ♦ త్స్యంబుల్ గొనుండన్న మీఁ
దట రాముం డెల నవ్వుతో ననుఁ దపో♦ధన్యాత్ములం గాంచుచున్. ౬౦౫

ఉ॥ వీడని ప్రేమ పండి ప్రభ ♦ వించిన భక్తియె ముఖ్య హేతువై
సూఢిదగాఁగఁ దెచ్చినవి ♦ చొప్పడు టెన్నఁగ దుర్లభంబులోఁ
బోఁడిమి కూర్మిచేత నవి ♦ పూతములౌ సుధకంటె, నింపులౌ
వేడుకతోఁ గొనం దగిన ♦ వే భుజియించినవారమే కదా! ౬౦౬

క॥ మాఘిచట నుండిరేపట, రేపకడ సురాపగం ద ♦ రింపఁగ వలె నీ
వీపాట వెళ్లినావం, జేపడఁ గొనితెమ్ము సాహ్యా ♦ చిత్తమునఁ జెలీ! ౬౦౭

ఉ॥ శ్యామల దేహుఁ డిట్టులు ప్రి ♦ యంబునఁ బల్క గుహాఖ్యుఁ డిట్లనున్
భూమిని సర్వ సంపదలు ♦ పొల్పుగ నీయవికావె? నీదు తీ

రీమెయిఁ గాంచు కన్నుల స • హించిన కృత్రిమ వేషి నేను నీ
బాములఁ జూచి నిన్ను విడు - వం గలనే? యిట సేవ చేసెదన్. ౬౦౮

చ॥ విలుగల వీరులందు ఘన - విశ్రుతుఁ డాతని పల్కువించుఁ దో
య్యలి జనకాత్మజం గని గు • ణాకరు తమ్ముని మోముఁ గాంచి యా
బలియుఁడు మేరదాఁటి చను • భక్తిగలాఁడని పల్కుచున్ దయం
విలసితనేత్రుఁ డాతనిని - పేరిమి మాకడ నుండుమా యనెన్. ౬౦౯

ఉ॥ నావుడు రామచంద్రునకు - నర్మిలిమ్రొక్కి మునీంద్ర వాటికిన్
గావలియుంచి సైన్యమును - కార్ముకముం దగ నెక్కువెట్టి బా
ణావలి చేతఁబూని కటి - యం దడిదంబు ఘటించి యంబుదా
రావముఁ బోలు కంఠమున - రాఘవుఁ బ్రస్తుతిసేసి నిల్చుచున్. ౬౧౦

ఉ॥ రాజ్యసుఖంబు వీఁడి యిటు - రాఁ గతమేమన సర్వలోక సం
పూజ్యుని తమ్ముఁ డంతయును - వోలఁగఁ దెల్పఁగ నానిషాద సా
మ్రాజ్యవిభుండు చింతిలి ధ - రారమ పెద్ద తపించియున్ ఫల
ప్రాజ్యత నొందకుండెనని - వందురెఁ గన్నుల నీరు చిప్పిలన్. ౬౧౧

చ॥ పరవిన చీఁకులన్ వగఁజఁ - బాఁఱగఁ దోలి దిశల్ జయించి యు
త్తరదిశ నిల్చి పాలన ము • దంచిత లీల నొనర్చి కీర్తి సం
భరితముచేసి సర్వజన • మాన్యత పెల్లుగడించి పెద్ద ని
ద్దురగొను నాజికై పడినె • తోయజమిత్రుఁడు క్రుంకె వెన్దెసన్. ౬౧౨

చ॥ ఉరవడి సంజ కర్జముల • నొప్పుగఁ దీరిచి రాఘవేంద్రుఁడున్
సురసుధ వోలు సీతయు వ • సుంధర వర్ధిలు శాద్వలంబునం
బొరసిరి నిద్ర కార్ముకము • పూని సుమిత్ర సుతుండు తెల్లవా
ర్వఱకును కన్ను మూయక క•రంబు మెలంకువ నిల్చెఁ గాపుగన్. ౬౧౩

ఉ॥ ఎండలు కాయు హేమగిరి - యింబు చెనన్ విలసిల్లు ప్రాజ్యరుక్
షండము లీను వజ్రమయ - కాంచన భూషణుఁ డర్కవంశ్య చం
ద్రుండు మృగేంద్ర సన్నిభ గ - తుండగు లక్ష్మణు నిద్రచేర నా
యండ కయోధ్యఁజేరు దిన - మందున రమ్మని పల్కెనామెయున్. ౬౧౪

తే॥ వీరనిధి లక్ష్మణుని విధి - మీఱలేక, యతని పాదపద్మములకు - నతి రొనర్చి
యార్య! మీయాజ్ఞ తలఁ దాల్చి-యర్లివత్తు, ననుచు వెడలె నిద్రాదేవి-యచటినుండి

చ॥ కమల నికేతనాంశయగు - కాంత విదేహ నృపాత్మజాతతో
విమలుఁడు రాఘుచంద్రుఁ డట - విం బవళింపుటఁ గాంచి మెట్టి గా

రములను పొందు నంచితుఁడు - రక్కైన రీతి నిటం బరుండె హా!
యమవిధి యంచు లక్ష్మణుఁడు - నశ్రులురాల్చుచు నిల్చె బొమ్మనాఁ.

మ॥ పరికానిం గరియూథముల్ బలయు శే - వం జుట్టు చుట్టాలతో
శరముం గూర్చిన వింటితో గుహుఁడు ప-ర్జన్ లక్ష్మణుం జూచి ని
ద్దుర గావించెడు రాముఁగాంచి మిగులన్ - దుఃఖించి కన్నీటితో
ఝురముల్ వెల్వడు శైల లీల నిలిచెన్ - సంతప్త సర్వాంగుఁడై. ౬౧౭

చ॥ జననము లేని భాస్కరుఁడు - స్వర్గ సుఖంబులు చావుపుట్టుకల్
దినగతి బోధసేసి కడ - తేఱు పథంబును తెల్పఁబూని భూ
జనముల మేలు కొల్పుటకుఁ - జయ్యన వచ్చిన వానిఁ బోలి తా
మునుపటి నాఁడడంగి మఱి - పుట్టెను పిమ్మటి నాఁడు తూర్పునన్. ౬౧౮

తే॥ పంకజంబులు తేరిపైఁ - బరఁగు భాను, మండలముఁగాంచి వికసించె-మఱియునొక్క-
నల్ల సూర్యుఁడనందగు - నాథుఁ గాంచి, సీత మోముఁ దమ్మియు విక - సించె నపుడు

చ॥ పగఱకు భీకరం బయిన - బాహువులకుం దగు కార్ముకంబు నొ
ప్పుగ ధరియించు రాఘవుఁడు - పొల్పుగఁ దీరిచి కాల్యకృత్యముల్
మొగసలఁ జేరి నావికుల - ముఖ్య గుహుంగని గంగ దాఁటఁగాఁ
దగు కలమొందు దెమ్మని ము - దంబున నానతి సేయ నంతటన్. ౬౨౦

చ॥ మనమున పీడలేని ప్రియ - మండనుఁడైన గుహుండు భక్తిమై
జనకజకుం దమూల సుమ - సాగర నీరద నీలరత్నవ
ర్ణునకుఁ బ్రణామముల్ సలిపి - నొచ్చి కనుల్ వెనఁ గ్రుమ్మరించు వాః
కణములు వెల్లువై పఱవఁ - గై ముకుళించి కడంక నిట్లనున్. ౬౨౧

సీ॥ వనమాలి! విను మాని - వాస మనత్య ప, ద్ధతిలేని శుద్ధ కాం - తార భూమి
అక్షీణ బలమున - నలరారుదుము మేము, భవదాజ్ఞ మిగుల న - ల్పంబ యైన
శిరసా వహించి చే - సెదము మమ్మెల్లర, నీ బంధువులు గాఁగ - నెమ్మి నెంచి
నీ వనవాసంబు ♦ మా వనంబునఁ గడ, పంగ నర్థింతు మా ♦ ప్రభుఁడ వగుచుఁ

తే॥ దేనె కొట్టులు దివ్య ల♦ర్థించు నెఱచి, కలవు తోడుగాఁ గుక్కల ♦ కరణి నున్న
యల్పమైన మాప్రాణ చ♦యంబు గలదు,వనులు గలవు గంగయును దా♦పున నెగలదు

సీ॥ పట్టుఁ బోలిన చర్మ - పట్టముల్ గలవు భు, జింప నింపగు పండ్లు ♦ దుంపలుండు
నూఁగు లాడుటకు మే ♦ లుయ్యాలలంబోలు, కలముల పై భాగ ♦ ములును గలవు
పరుగెత్తఁదగు కాళ్లు ♦ బలువిండ్లు గల కేలు, గలవు దుస్సాధము♦ల్పులువు సేసి
నంబర వీథి ను ♦ న్నట్టి వస్తువునైన, గడియలోఁ దెచ్చి యీఁ ♦ గల్గమ్ము మేము

తే॥ విల్లుకాం(డ్రాజ్ఞ నెఱవేర్చు ♦ వేఁటరులును, బలియు రేఁబది లక్షలు ♦ కలరుమీర
లొక్కదినమేని మాయూరు♦టెక్కయందు,నిలిచి మము ధన్యులం జేయుఁ♦డెలమితోడ

ఉ॥ ఆతని వేఁడికోలు విని ♦ హర్షముతోఁ జెలునవ్వుతో హృద
బ్జాతము నిండు ప్రేమ రఘు ♦ వర్యుఁడు పల్కెను వీరశేఖరా!
పూతములైన యాపగల ♦ పుణ్యజలంబులఁ గ్రుంకి పెద్దలం
జేతము రంజిలన్ గొలువు ♦ చేసి యనంతర మిందు వచ్చెదన్. ౬౨౪

తే॥ అనుడు నింగితజ్ఞుండగు ♦ నా గుహుండు, వడివడిం జని యొకపెద్ద ♦ పడవఁదెచ్చె
జలజనేత్రుండు మానుల♦సెలవుగొనుచుఁ, దమ్మితోఁ జంద్రభాలతోఁ దరణినెక్కె

ఉ॥ ప్రాణముఁ బోలు రాముఁడు త ♦ రంగిణిలో నడపింపు వే యనన్
నాణెముతో మరాళ మటు ♦ నావ తరంగములందు పోవ ని
ష్ప్రాణ వహించి తాపసులు ♦ సంకటమున్ భజియించి చింతమై
బాణాలి వైచు మిర్యముల ♦ భాతిని వాడిరి రాము పోకకై. ౬౨౬

ఉ॥ పాలను గెల్చు పల్కుల నృ ♦ పాల తనూజయుఁ దమ్మి నెచ్చెలిం
బోలిన రాముఁడున్ నదిని ♦ పుణ్యజలంబుల మీలతోడుతన్
బోలఁగఁ గేల వారుగొని ♦ పొల్పుగఁ జల్లుచు నుండఁ దెడ్లతో
మాలిమి నడ్పు నావ పటి ♦ మం జనెఁ గర్కట మేగుకై వడిన్. ౬౨౭

ఉ॥ చందన సైకత స్తని ప్ర ♦ శస్త సురాపగ కాంతి పుంజముల్
చిందుమణుల్ తళత్తళలు ♦ చెంద సుగంధ జలేజ రోచు తె
ఱ్ఱందన మొంది తేటగు త ♦ రంగములన్ కరముల్ఘటించి తె
చ్చెం దన దక్షిణంపుఁ దట ♦ సీమకుఁ బ్రేమ పయోధిఁ జేరుచున్

శా॥ ఆర్యుం డావలి తీర మెక్కి ప్రమదం ♦ బారంగ నచ్చో సుహృ
ద్వర్యుం గాంచుచుఁ జిత్రకూటమునకున్ ♦ దారిన్ వెసం జూపి నీ
కార్యం బారయ నేగు మన్నఁ జెలిమిం ♦ గావంగఁ బ్రాణంబులున్
స్థైర్యం బొప్పఁగ నీయఁ దగ్గ గుహుఁడా ♦ సత్యస్థిరుం గాంచుచున్. ౬౨౯

ఉ॥ ఏనును వెంటవచ్చెదు న ♦ దృష్టము పొందుదునేని రాఘవా!
కాననమందు దారి నెఱుఁ ♦ గన్ వలఁతిన్ మఱి పండ్లు దుంపలున్
దేనెయు మీకు వేళకొగిఁ ♦ దెచ్చి యొసంగు పనిన్ సమర్థుఁడన్
జాను కుటీరముం జలుపఁ ♦ జాలిన ప్రోడను వెంట వచ్చెదన్. ౬౩౦

ఉ॥ దుష్ట మృగంబులన్ దిశలఁ ♦ దోలుదు శుద్ధ వనస్థలంబులన్
గష్టము లేక రోసి వెసఁ ♦ గాంతును కోరిన వస్తుజాలముల్

మృష్టము గాఁగఁ దెత్తుఁ బని ♦ మోని చేయుదు రేయి వేళ వి
స్పష్టముగాఁ జరింతు నెడఁ ♦ బాయక యుండెద వెంట వచ్చెదన్. ౬౩౧

చ॥ పలువగ దుంపలన్ శిఖరి ♦ పై లభియించినఁ గెల్లగించి తే
వలఁతిని చాలదవ్వు నడ ♦ వన్ జలమెచ్చట నున్నరోసి తేఁ
గలుగుదు విల్లుదాల్చి మిము ♦ గాతును కంటిని తెప్పవోలె నే
నలుకను దేనికిన్ శ్రమము ♦ నందను వీడక వెంట వచ్చెదన్. ౬౩౨

చ॥ మురువగు వక్షముం గలుగు ♦ మోహనరూప! యభీష్టమేని సం
బరమున నాబలంబుఁ గొని ♦ వచ్చెదఁ గాచెద నొక్కవేళ ము
ష్కరు లెవరేని శాత్రవము ♦ నల్పి పయింబడిరేని తోల్త నే
నిరవుగఁ దాఁకి ప్రాణముల ♦ నిచ్చెద వేఁడెద వెంటవచ్చెదన్. ౬౩౩

చ॥ అనుచు గుహుండు భక్తిమెయిఁ ♦ బ్రార్థన సేయఁగ రాముఁ డిట్లనున్
వినుము సుహృత్తమా! సుగుణ ♦ విశ్రుత! ప్రాణముఁబోలు వాఁడ వీ
యనుజుఁడు నీకుఁ దమ్ముఁడు ల ♦ తాంగి ధరాత్మజ నీకు మిత్రురా
లును భవదాజ్ఞఁ కేను మఱి ♦ లోఁగిన వాఁడ నొరుండ నౌదు నే? ౬౩౪

చ॥ శ్రమముల నొందు నంతఁ గద ♦ సౌఖ్యము గల్గును జీవకోటికిన్
వెనుక సుఖంబుకై నడుమ ♦ వేధ వియోగము గూర్చెనంచు నీ
మనమున నెంచి చింతిలకు ♦ మానుగ నల్వుర ముంటి మయ్య నె
క్కొను మన మెప్పు సోదరులు ♦ కూరిమి నైదుగు రైతి మియ్యెడన్.

ఉ॥ కాలవిపర్యయంబునను ♦ కల్గు నెలుంగు భరింపఁ దోడు కాఁ
జాలిన నీదు తమ్ముఁడు య ♦ శస్కరుఁ డొక్కరుఁ డున్నవాఁడు నా
కేలలి నేరితో నయిన ♦ నేల పగల్ జనియించు? నీవు నీ
ప్రోలికిఁ బొమ్ము నే మరలి ♦ పోయెడు నాఁటికి నిన్ను గాంచెదన్. ౬౩౬

ఉ॥ అచ్చటి బాంధవ ప్రతతి ♦ నారయ నీ యనుజుండు గల్గెన
ట్లిచ్చటి చుట్టలం గరుణ ♦ నేలఁగ నేరు గలారు పల్కుమా?
నచ్చిగ నీకు బంధువులు ♦ నాకును బంధులు గారొ? వారలున్
బెచ్చుగు దుఃఖ మొందఁ దగ ♦ వే? మదనుజ్ఞను వారిఁ గావుమా. ౬౩౭

ఉ॥ ఆనతి మీఱలేక మది ♦ నంగద వీడఁగలేక చూచు వా
రీ నరుఁడేదొ రోగపడె ♦ నేమొ యనం జను శృంగిభేర భూ
జానియు వీడుకోల్వడనె ♦ జానుగ భూషలు దాల్చి కేకిఁబోల్
జానకి లక్ష్మణుండు రఘు ♦ చంద్రుఁడు పట్టి రరణ్య మార్గమున్. ౬౩౮

## ౨. వన ప్రవేశ పటలము. (౪౭)

చ॥ వెడఁగులు పోఁడిమిఁ వలఁచు ♦ వేశ్యల డెందముఁబోలెఁ జెమ్మ యొ
క్కెడయును కద్దొ లేదొ యని ♦ యేర్పడ శంక వహించు నట్టు ల
ప్పుడమియు నెండఁ బాఱు మిడి ♦ వొందుచు వేసఁగి వచ్చువేళ రా
ముఁడు చనుదేర మేఘములు♦మూఁగెడు జాడలు దోఁచె మింటిపై. ౬౩౯

చ॥ గ్రహపతి లేఁత వెన్నెలల ♦ కై వడిఁ గాయఁ దరూత్కరం బను
గ్రహమున నీడ లీన ఘన ♦ కాండము సోన వెలార్ప గంధ సం
గ్రహుఁ డనుకూలుఁడై వెలయఁ ♦ గైపున నెమ్మిళు లాడఁ జారు వి
గ్రహు లెదఁ దాపముం గొనక ♦ కాననవీథిఁ దరించి రిమ్మగన్. ౬౪౦

మ॥ ధరణీజాతను గాంచి రాముఁడను డెం ♦ దం బింపు సొంపార నో
హరిణాక్షీ! యిటు చూడు మింపయిన వ ♦ స్త్రాళుల్ ఘటింపించు మే
ల్వైరవుం జూపెడు నింద్రగోపములు ను ♦ ర్విన్ జేలపూరాసులున్
ధరణీ దేవికి రత్నహార విధి ను ♦ ద్యత్కాంతులం జిమ్మెడున్. ౬౪౧

శా॥ రోలంబంబులు పాడ మద్దెల మొగుల్ ♦ మ్రోఁగింపఁ బింఛంబులన్
లీలన్ విప్పి నటించు నెమ్మిళులు నీ ♦ నెమ్మేనసంఖ్యాక నే
త్రాలం జూచుచు నీదు వేనలి క్రియన్ ♦ రాజిల్ల కుండంగఁ బే
రీలన్ బర్హము ముడ్చుకొన్న వయినం ♦ బింపారగాఁ జూచితే? ౬౪౨

చ॥ పరవిన కాంతు లుల్లసిలు ♦ పచ్చని మేనును రాగ వక్త్రముల్
బొరసిన కీర వారములు ♦ పోల శిరీష లతాంత రాజిపై
నిరవుగఁ గూరుచుంట గని ♦ యించిన నీదు ప్రకోష్ఠమందు వ్రా
లు రహిఁ జెలంగుఁ గాంచితె వి ♦ లోల విశాల మృగాక్షి! యియ్యెడన్.

తే॥ ఆమ్ర పల్లవ లలిత వ ♦ ర్ణాంగి! చూడు, నమలి పిల్లలు జింక కూ ♦ నలును నీదు
మేనివన్నియ చూపుల ♦ మేల్మిఁగాంచి, తమకుఁ జుట్టంబనియె యెంచి♦దాయుచుండె.

తే॥ ప్రసవ రాశిలో నిద్రించి ♦ వచ్చు కేకి, పింఛమునఁ దావి యుండుట ♦ పెట్ట గాంచి
ప్రణయ కోపాన దానిఁజే ♦ రంగ నీక, తిరుగుచుండుట చూచితే ♦ తెఱవ మిన్న!

తే॥ వికచ కంకేలి నెట్టని ♦ విరుల యందు, గండుఁ దుమ్మెదల్ వ్రాల బం ♦ గారునూఁదు
బొగ్గులందున లేచు ని ♦ ప్పులను పోలి, వెలయుచుంట వీక్షించితే ♦ విధు నిభాస్య!

తే॥ నాగలింగ కలిక నొక ♦ నమ్మిగాంచి, పాముని తలంచి నోటితోఁ ♦ బట్టి కొన్న
నరణిఁ గని విరి మొల్లలు ♦ నలుపు చుండు, మందహాసంబు గంటివే♦మధుర వాణి!

ఉ॥ కోనల సంచరించు పులి ♦ కూనలు చీఁకటి ముద్దలన్న చె
న్నూనిన హస్తి పోతములు ♦ నొద్దిక గొల్లల యింటి క్రేపులన్
బూనికఁ గూడి వైరమును ♦ పొందక వీడెడు నిచ్చలేక మే
లూనిక సంచరించి చెర ♦ లాడుచునుండుట గాంచితే చెలీ! ౬౪౮

చ॥ ముడువఁగఁ దగ్గ పూలు పరి ♦ పూర్తిగఁ బూచిన గుత్ప సంతతుల్
దొడిగిన పెక్కుకొమ్మలు మ ♦ ధు ప్రసవంబులఁ దాల్చు కొమ్మలో
క్కెడ దిగి నీరమాడు క్రియ ♦ నింపగు తెల్లని పట్టువల్వకై
వడిఁ దగి తావులం జిలుకు ♦ వారిని మున్గుట చూచితే సఖి! ౬౪౯

ఉ॥ సీటగు వింటి కొప్పు లలి ♦ నెన్నుదు రొప్పు వరాలకుప్ప! యీ
పాటలి మొగ్గలందు చొరఁ ♦ బాఱఁగ లే కెలదేంట్లు మిక్కిలిన్
వాటము గాఁగ విచ్చు ప్రస ♦ వంబుల పై కెగఁ ప్రాఁకి యుండుటల్
హాటకమందు నీల మణు ♦ లంటిన చందము దోఁచుఁ గాంచితే. ౬౫౦

చ॥ పరిమితి మీఱఁ ద్రాగు మధు ♦ పాయులు కన్నులు తెర్వలేక బ
మ్మెర గొని సొక్కి మార్గము గ ♦ మింపఁగఁ గానక తూల, నాఁడు బం
భరములు గాంచి ముందుగను ♦ పాటలు పాడుచుఁ బోవ వెన్కఁ జేఁ
కు రహిని నేగు చుండె నది ♦ గో కనుఁగొంటివె? యంబుజాననా!. ౬౫౧

చ॥ విరి కయిసేఁత కన్యకలు ♦ వే యలవాటొనరించు నట్లు బం
గరువు హొరంగు రంగరువు ♦ గల్గిన వేఁగిస కొమ్మ లిందు నీ
వరసితె? నీదు ముంగురుల ♦ యందపు ఫాలము నంట సూటిగా
బెరయు వినూత్న పుష్పముల ♦ వేడుకఁ జిందఁగఁ జేయుచుండుటల్. ౬౫౨

ఉ॥ సుందరి! తార హారమును ♦ సొంపుగఁ దాల్చు పయోధరంబుపై
సందు హారిద్ర లేపము క్రి ♦ యన్ సుర తావులు వీవఁ బుప్పొడుల్
క్రిందుగ రాలపైఁ బడుచుఁ ♦ గప్పుట చేత హిరణ్య ఖండముల్
పొందుగ వానగా విరిసి ♦ భూస్థలిఁ బడ్డ విధానఁ గన్పడున్. ౬౫౩

ఉ॥ నీ పదకంజముల్ కరఁగు ♦ నే యని హార్వునఁ ద్రోవ నెల్లెడన్
మోపఁగ మెత్తనౌ కరణిఁ ♦ బూవుల రాల్చిన చెట్లఁ జూడు మీ
దాపలి పూవుఁ గొమ్మలు సు ♦ ధామయదేహ! యుడుక్కఁ బోలి మో
పోపని నీదు కౌనునకు ♦ నొప్పగ లేక చలించె నెల్లనై. ౬౫౪

సీ॥ నీరజంబులఁ బోలు ♦ నీ పాదముల నీదు, పాదంబులం బోలు ♦ పల్లవముల
ముసరిన తేఁటి గుం ♦ పులను గాంచెదె? చీఁక, టిం బోలు నీవేణి ♦ ఠీవి యొప్పు

మొగుళులఁజూచెదే? భుజములఁ బోలిన, యెల వెదుళ్ల గుముల ♦ లలినిఁగంటె?
ఈకోకిలలపాట ♦ లాకేకి గమియాట, లీజింక చూపుల ♦ హేల కంటె?

తే॥ కలికలును సూనములు నిండఁ♦గలుగుకొమలఁ, బక్షులటనటఁగూర్చుంట♦వగ్ని వ్రాయు
పలుతెగల పూల పత్త్రుల ♦ విలసనంబు, వఱలు తెర చీరలం బోలు ♦ వానిఁ గంటె.

చ॥ అనుగల మొందు జానకికి ♦ నర్యమ వంశ్యుఁ డిటుల్ వచించుచుౕ
దనియు విహార పద్ధతిని ♦ దారిని చాల నతిక్రమించుచుౕ
దినమణి యస్తశైలమునఁ ♦ దేరును నిల్పుట గాంచి రాఘవుం
డెనసితి మంచుఁ బల్కెను ము ♦ నీశ్వర వాటముఁ జిత్రకూటమున్. ౬౫

## రాముఁడు భరద్వాజు నాశ్రమము చేరుట

తే॥ మించు ప్రేమను మనసు పూ ♦ రించువాఁడు, చిరము తిరముగ సిద్ధికై ♦చేయుతపము
ఫలము గనుటెటింగిన భర ♦ ద్వాజ మౌని, పూని భవరోగ వైద్యుని ♦గానవచ్చె.

క॥ గొడుగును దండము కుండిక, జడముడులును జింకతోలు ♦ సంధించి వెసౕ
దడఁబడక త్రోవఁగాంచుచు, నడచి యెదురు వచ్చె యోగి ♦ నాథుం డటకున్. ౬౬

సీ॥ నాల్గు వేదములు ఘ ♦ న క్రమ పదరీతి, నటనంబు సలిపెడు ♦ నాల్కవాఁడు
నలున సృజించు ప్రా ♦ ణులు సమస్తం బొక, రూపునఁ గాంచు కా ♦ రుణ్యమూర్తి
యెల్ల లోకమ్ముల ♦ సృష్టించు నేర్పున, హరినాభిఁ బుట్టని ♦ యపర ధాత
మునినాథ నికరంబు ♦ ఘన శిరోమణి యగ్ని, పూజ తప్పక చేయు ♦ పుణ్యమూర్తి

తే॥ రాఁగరాఘవేంద్రుఁడుసుమా♦ర్చనముచేసి,మునిపదములకుముమ్మారు♦మ్రొక్కిలేవ
నతని గాఢ పరిష్వంగ ♦ మాచరించి, తపసి వేషంబుఁ గాంచి చిం ♦ తయు వహించె

క॥ చిరము ధరనేలఁదగు నీ, తరుణంబునఁ దపసి రూపు ♦ దాలిచి వనులౕ
జరియింప వచ్చు కారణ, మరయఁ దగున యేని తెల్పు ♦ మా? యని యడుగౕ

చ॥ జరిగిన వృత్త మాతనికి ♦ స్పష్టముగా వివరింప మౌని ని
వ్వెరగొని యిట్టి చెద్ది ప్రభ ♦ వించునె యీ యుగమందు సక్కటా!
జరుగక తప్పునేమి విధి ♦ చక్కటి; గొప్ప తపంబు చేయదీ
ధరణి యటంచుఁ జాలఁ బరి ♦ తాపము నొందెను డెందమందునన్. ౬౭

ఉ॥ పేశల క్రమ వాక్య వర ♦ బింబ సమోష్ఠి విదేహ కన్యతో
శ్రీశనిభుండవౌ నిను మ ♦ హిం బరిపాలన సేయు మంచు భూ
మీశుఁడు నాహితుండు వచి ♦ యించి యనంతర మిట్లు పంపి జీ
వాశ గడించువాఁడు భువి ♦ నాఱడిఁ బొందక యుండుఁ జెల్లరే ౬౮

చ॥ తొడరిక గాఁగ సౌఖ్యమును ♦ దుఃఖము వచ్చుట సాజమేకదా?
పుడమిని దేహి చేయు తన ♦ పుణ్యము పాపము చేత నవ్వియుం
దొడరును మిన్న కిక్కరణి ♦ దుఃఖము నొంది ఫలంబె? యంచుఁ దాఁ
దడవుచు రాముదేహము ము ♦ దంబునఁ దోఁగొని యేఁగె నింటికిన్.

ఉ॥ ప్రాతగుణుండు యోగికుల ♦ పుంగవుఁడాదటఁ దోడి తెచ్చి ప్ర
స్ఫీత తలంబు చూపి గుణ ♦ పేశల వాక్కులనాతిథేయముల్
బ్రాఁతిగఁ జల్పి కాయలను ♦ పండ్లనొసంగి తనూజులం బలెన్
బ్రీతిగఁ జూడ రాఘవులు ♦ వేడుక నిల్చిరి రేయి యచ్చటన్. ౬౬౪

తే॥ ఇతనితో మనమిట వసి ♦ యించు కతన, సుగతి గలదని తలపోసి ♦ సుజనహితుని
రాముఁగని భరద్వాజుండు ♦ ప్రేమతోడఁ, గలదు వచనీయమని యిట్లు ♦ పలుకఁదొడఁగె.

చ॥ కలవిట నిండుగా జలము ♦ కాయలు పూవులు పండ్లు దుంపలున్
గలిగిన చింతలుం దొలఁగుఁ ♦ గ్రచ్చుఱఁ బుణ్యము వృద్ధి నొందెడున్
గలుగద యింతకంటె మఱొ ♦ కండు ప్రశాంత సుఖస్థలంబు మీ
రలు మముగూడి యుండినఁ గ ♦ ర్థంబు కృతార్థుల మౌదు మిమ్మహిన్.

శా॥ అంతర్వాహినియౌ సరస్వతియు సూ ♦ ర్యాత్మీయసంజాత యీ
ప్రాంతంబందె సురాపగం గలియు ది ♦ వ్యక్షేత్ర మీతావు వా
క్కాంతుండిందు వసింపఁగా నెడఁద ను ♦ త్కంఠించు మా బోటికే
చెంతంజేరఁగ దుర్ఘటంబు లభియిం ♦ చెం బూర్వపుణ్యంబునన్. ౬౬౫

చ॥ అనియిటు పల్కు మౌనిఁగని ♦ యంజలితో రఘురాముఁ డిట్లనున్
మునివర! కోసలంబునకుఁ ♦ బుణ్యతలంబిది దవ్వుగాదు మా
జనములు గుంపు గుంపులుగఁ ♦ జక్కన వచ్చి వసింతు రిందు మా
యునికి నెఱింగిరేని యది ♦ యొప్పుదు మీరు గ్రహింపఁ జాలరే? ౬౬౬

ఉ॥ నావుడుఁ దాపసేంద్రుఁడను ♦ నాయుమ యుద్ది నిజంబ యొప్పితిన్
వావిరి సీవనంబుఁ గడ ♦ వన్ దశయోజన దూరమందునన్
దేవతలెల్ల బ్రాంజలి ను ♦ తింపఁగ నొప్పిన చిత్రకూటమే
నీవు వసింపఁ దగ్గ దది ♦ నిక్కము నాకముకంటె నింపగున్. ౬౬౭

తే॥ మురిపమున నిట్టులను యతి ♦ వరునకెఱఁగి, మూవురును చని పిల్లన ♦ గ్రోవులూఁదు
గొల్లపల్లె లుపత్యక ♦ లెల్లఁగడచి, యమునఁ గాంచిరి కడఁక మ ♦ ధ్యందినమున. ౬౭౦

శా॥ సారంగంబులు నీరుద్రావుటలు భా ♦ స్వద్వంశ సింహాంబు లో
ప్పారం గాంచి పవిత్ర వాహినికి వా ♦ స్తాబ్జంబుల నొల్లె వి

స్ఫారంబైన ధరా పరాగము విర్ధన్ ♦ స్నానంబు గావించి కాం
తారాహారముఁ గొంచు నిల్చి రగ బృం♦దచ్ఛాయ విశ్రాంతికై. ౬౨౧

ఉ॥ అవ్వల వాహినిం గడుచు ♦ టారయుమా యన లక్ష్మణుండు తా
నవ్వనిఁ గల్గు వంశముల ♦ నంటఁగఁ గట్టి కలంబు చేసి పై
జవ్వనియున్ రఘూత్తముఁడు ♦ చయ్యన నెక్కఁగ రెండు చేతులన్
మవ్వపుఁ దెడ్లుగా ఝషము ♦మాక్కని త్రోచుచు దాఁటె నన్నదిన్ ౬౨౨

తే॥ రాము తమ్ముని భుజ మంద♦ రంబు తిరుగ, నొక్క ప్రక్క నీరంబు తూ♦ర్పుదధిఁ జేరె
మిగులు జలములు పడమటి ♦ మేరఁ జేరెఁ, దెప్ప వైళంబ యావలి ♦ దిక్కుఁ జేరె. ౬౨౩

ఉ॥ నారలు దాల్చియుం ద్రిభువ ♦ న ప్రతిమారులు దంతివైరి గం
భీరులు తీర మెక్కియట ♦ విం బహుదూరము వోయి కొమ్మలన్
వేరులు మాఁడి ధారణియు ♦ వేఁడిమి నొంది కనంగఁ జిత్తమున్
నీరుగఁ జేయునట్టి యొక ♦ నిర్జల భూమిని గాంచి రయ్యెడన్ ౬౨౪

ఉ॥ జానకి యాభువిం గడవఁ ♦ జాలదయంచు విభుండు చింతిలన్
భానుఁడు శీతభాను చెలు ♦ వంబునఁ జందన శీతలత్వముం
బూనెను మాఁడి నల్లనగు ♦ ప్రోడులు వెంటనె పల్లవించె ఘో
రానల మంత నంబుజ వ ♦ నాకృతి నొందె మనోహరంబుగన్. ౬౨౫

ఉ॥ వేఁచిన విత్తులట్టి కజి ♦ వేంద్రపు రాళులు కోసి మెత్తగా
వైచిన పూలఁ బోలినవి ♦ వేఁగిన తీఁగలు నన్చెఁ గోఱలం
బూఁచిన చిల్కువోయి సుధ ♦ వొంది భుజంగము లుండెఁ దృప్తిమైఁ
దోఁచిన మేఘముల్ గురిసెఁ ♦ దుంపురులన్ భువనంబు చల్లఁగాన్. ౬౨౬

తే॥ హింస్రకులగు వేటరులు ఋ♦షీంద్రులైరి, యాఁకలియె లేక పగవీడి♦యులరి తడవు
పులుల కడఁ జేరి సారంగ ♦ పోతకములు, పాలు ద్రావ సాగిన యవి♦ భయములేక

తే॥ కొండ చిలువలు క్రూరంపుఁ ♦ గోపమీఁగి, నీటదిగినవి వోలె శాం ♦ తిని వహించె
వంశములు చిటపెటమందు♦వరుసమాని, కుందరదనల బాహుల♦కొమరుదాల్చె. ౬౨౭

చ॥ కనవు పెరింగి పచ్చనగు - కంబళముం బఱపించి నట్టి సాం
పెనఁగె మయూరముల్ పురుల - నింబుగ విప్పుచు వేశ్యలంబలెన్
బొనేఁగఁగ లాస్యముల్ సలిపెఁ - బోయెదు త్రోవల గండుఁ దుమ్మెదల్
దెనలను వైణికాళి బలెఁ - దృప్తిగ గానముసేసె నయ్యెడన్. ౬౨౮

చ॥ ఫలము లకాలమయ్యుఁ బరి - పక్వములై యిల వ్రాలుచుండె దుం
పలు తమ వేళ్లతోడ వెలి - వాతి కనంబడె భూమియెల్లఁ బూ

వులఁ దరుజాలముల్ సొగసు - పూనిన చానలఁ బోలెఁ; బ్రేమ మ
గ్గలముగఁ గూర్చు శీలమున - కంటెఁ దపం బొకరుండు గల్గునే? ౬౮౧

తే॥ బోయ పల్లెయు మునిపల్లె - యాయెఁ గెంపు,వోలె నెడనెడ నారుద్ర-పురుగులొలసె
వృక్షములయందు చింతించు-పెంటులఁ గని, గండు కోయిలల్ ప్రియమున-గారవించె.

చ॥ వెనుకకు వచ్చువేళ విని ♦ పించిన నాథులఁగాంచి ప్రాణముల్
తనియఁగఁ గౌగిలించుకొని ♦ దాడికి నంపిన యావతంబు నె
మ్మనముల కై వడిం గుముల ♦ మాఁడిన యమ్మరు భూమి, గెల్చి వ
చ్చిన ప్రియులం గనం జెలఁగు ♦ చేతములం బలె నయ్యెఁ జల్లనై. ౬౮౨

మ॥ మరుభూమిస్థలి దాఁటి పువ్వ రెల రే ♦ మన్నీఁడు గర్భంబునన్
మఱుఁగన్ గర్జిలు మేఘపాళిఁ గని నం ♦ భ్రాంతాంతరంగంబుతోఁ
గరిణీవారముగాఁ దలంచి గజముల్ ♦ కై సాఁచు నెత్తైన భూ
ధరముం గాంచిరి చిత్రకూటము మునీం♦ద్ర ధ్యాన సంవాటమున్. ౬౮౩

౮ చిత్ర కూట పటలము. (౫౮)

చ॥ వినుత సురాళికిన్ మనకు - వేఱిమి నొందక యొక్క-యాకృతిన్
మొనసి వినిశ్చలం బయిన - పుణ్య పథంబునఁ బోవు రాఘవుం
డనఘుఁడు సీతకా శిఖరి - యందలి సుందర దృశ్య వీక్షచేఁ
బొనరు పథిశ్రమంబు మఱు - పుచ్చుచు నిట్లను నెచ్చుపల్కులన్. ౬౮౪

తే॥ అలరుఁబోఁడి!చూడుమ యుప-త్యకతలముల,నేలకులతీవియలును త-మాలములును
నీరదములు వారణములు - వేఱుపఱచి, కాంచరానట్టి కరణిని - కాననయ్యె. ౬౮౫

తే॥ కువలయాక్షిరో! కాంచుము_ కొండమీఁది,యురణములుమరకతరత్న - కిరణసమితి
బలయ భానుని పచ్చని - వారువములఁ, బోలి విలసిల్లు చున్నవి-పూతచరిత! ౬౮౬

తే॥ మదగజంబు లడఁగు పెద్ద-యుదరములను, దొరయు పాములపొరలు వె-దుళ్లయందు
దగులు కొని కదలుచు నయో - ధ్యాపురమున,సౌధశిఖర ధ్వజము లనఁ-జాలెఁగంటె!

తే॥ పగడఃపులు పొదిఁగినయట్లు-ప్రభలు వెడలు, శైల పార్శ్వంబు లందెల్లఁ-బాలఁబోలు
చమర వాలముల్ గదల వి - ద్రుమగిరీంద్ర, జనిత నిర్ఝరిణింబోలు - చాయ గంటె!

తే॥ కుపిత సింహ పాటిత గజ -కుంభములను, రాలుము త్తెముల్ మగువల-ప్రణయజనిత
కోపవేళను రాలు కుం ♦ కుమ విలిప్త, మౌక్తికములన నొప్పారు ♦ మగువ కంటె!

తే॥ శశికి విడిదిగా నెత్తిన ♦ చంద మొప్పు, గొనబు కెంపు సొంపులు నింపు♦కొండకొమ్ము
హర కపర్దము గాఁగ నం♦ దలరు ఝురము, లందు వసియించు గంగ నా♦నడరెఁగంటె

తే॥ తలల మానికములతోడఁ ♦ దరలు పన్న, గములు చూడఁగా మదకరీం ♦ ద్రములు కెంపు
ముఖ పటంబులతోఁ బోవు ♦ మురువు దోఁచెఁ, గంటివే సుధామయి! కంటి ♦ కఱవుదీఱ.

తే॥ రత్నఘటయుగళమును దా ♦ రంబు మోచు, ననువుఁ బోలు కౌనొప్పు ల ♦ తాంగి! కంటె
ననుచు చందన వనములు ♦ నభముఁ గప్ప, నందు చొచ్చి పోయెడుక్రియ ♦ నబ్జుఁడొప్పు

తే॥ ఆకురెమ్మలఁ గొని మూఁగు - నళులఁ దోలి, తేనియం గొని కరిణికి - నానఁ గరము
చేత నందిచ్చు నెలవంకఁ ♦ జెనయు దంత, ములను గల హస్తిఁ గాంచితే - తలిరుబోణి!

చ॥ మనుపఁగఁ గర్తయైన హరి ♦ మాయ నడంగి కనంగ రాకయు
న్నను విజితాత్ములైన ముని ♦ నాథులకున్ బయలైన యట్టి భం
గిని తనయందు డాఁగి కొను ♦ కింపురుషావళిఁ గానిపించు పొం
తనము వహించెఁ గాంచుమిది ♦ తద్రికలా పటికంపు బండలన్. ౯౯౪

ఉ॥ ఆడెడు నెమ్మికంటెఁ గడు ♦ నందము నొందిన కోకిల స్వరా!
మోడి యెడదంతోఁ బతుల ♦ మోములఁ గాంచక యల్క నూను నా
చేడెలు తామె వల్లభులఁ ♦ జేరఁ దపించుచు రోయునట్లుగాఁ
బాడెడి కిన్నరాంగనల ♦ పాటల వైఖరి వింటె? యుగ్మలీ! ౯౯౫

ఉ॥ ఎక్కడు విల్లువంటి నుదు ♦ రించుక వంచి కనుంగొనన్ వెదు
ళ్లక్కడ నక్కడన్ దగుల ♦ నారఁగఁ గాఱు మరంద బిందువుల్
మిక్కిలి, యందు వేఁటరులు ♦ మేగలి దుంపలఁ ద్రవ్వటించు స
ల్లిక్కల నిండెఁ జూచితె య ♦ హీన సతీత్వ మహిష్ఠ జీవమా! ౯౯౬

తే॥ ఎలమితోఁ గుతుకంబుతో - జలకమాడు, నాఁడు కోఁతి నిర్ఝర జలం - బలమి చల్ల
నెదుటి దరిఁ జేరి గడ్డమై - యెసఁగు మొగులుఁ, గలఁచి చల్లులాడెడు మగ-కపిని కంటె!

తే॥ వత్తిలేనట్టి యమృత దీ-పంబ! యెండ, వంటి పరిధి కాంతులు స్థిర - త్వంబునొందు
కెంపు గుండులు వెవ్వేఱ-క్రిందికి దిగు, పెక్కురవి బింబములఁ బోలి - వెలిఁగెఁ గంటె!

తే॥ శీలమా యరుంధతికిని - చెప్పుజాణ! ఇమ్మహావని వేఁగిస - కొమ్మలెల్ల
స్వర్ణ పుష్పంబులం జల్లి - పాదములకు, నెఱఁగి లేచు వారిని పోలు - తెఱఁగు కంటె!

తే॥ తలిరుఁ బోణి! యుష్ణకరుఁడు- తడవు నట్టి, శిఖరిపైఁ గొట్టఁ జేల్గాచు - చెలువ లరసి
పిట్టలందోల నొడిసెల - విసరుమణులు, మింటఁ జుక్కల మాడ్కి-ని- మెఱయుఁ గంటె!

తే॥ ఎఱుకు లగురు కట్టెలఁ గాల్ప-నెగయు పొగయు, మునుల హోమకుండమ్ముల- మొనయు
గలిసి పెనుగిరి శిఖరంబు-కరణిఁ బర్వె, రాజవదన! కంటివె యంబ-రంబు దెసను. [పొగయుఁ

చ॥ గుమగుమ గుప్పు వాసనలఁ - గూడిన దీర్ఘ వినీల కేశ భా
రమునఁ జలించు కౌనుగల ♦ రామ! వియన్నదిలోన బుఁషు సం

ఘము వలె మీాలు గాన నగు ♦ కై వడి నట్టిన నిర్ఝరంబులన్
గొమరుగ రత్నముల్ వెలసి ♦ కుప్పలుగాఁ గనిపించుఁ గాంచితే॥　　౨౦౨

తే॥ పఱపు కెంపు బండలలోన ♦ నిఱుము కొనుచుఁ, బచ్చబండలలోఁగానఁ♦బడుచునుండు
కినుక గొన్న విద్యాధరాం ♦ గనల యడుగు, లత్తుకల జాడఁగంటివే ♦ లలితవాక్య!

తే॥ జలకమాడు రంభాదుల ♦ జడలనుండి, విడిచివైచిన విన్నమాని ♦ విరులతోడ
దొరలివచ్చు రత్నములతో ♦ మెఱపు వలపు, గలిగి పాఱుఝరులఁ గంటె? కలికిమిన్న!

తే॥ వేఁటరులు చేలఁగావంగఁ ♦ బెట్టినట్టి, పలకలెత్తి వాయించు కోఁ ♦ తులను గంటె!
అందికొని చేత నెలవంక ♦ కందుదుడుచు, గోలయగు కొఱవతఁ జూచి ♦ తేరలతాంగి!

తే॥ మాధవీ నికుంజములందు ♦ మగలఁ బాసి, వేల్పు మగువలుండిన జాడఁ♦ దెల్పుచుండ
నల్లనై మాఁడినట్టి యా ♦ ననలతోడి, తల్పములఁ గాంచితే? సహ♦ధర్మచరిత! ౨౦౩

చ॥ తలఁచిన యట్టి దేవసుధ ♦ తప్పక యానిన వారి మాడ్కిఁ భే
రెలమిని పొందు జానకి! ర ♦ హింపఁగ నీపెనుమ్రాఁకులందు దీ
వలఁ దగిలించి యుయ్యేలల ♦ వారక యూఁగుచుఁ జెంచువాండ్ర చె
ల్వలు రహిఁ బాడఁగా నళున ♦ పక్షులు వచ్చుచునుంట గాంచితే!.　　౨౦౪

తే॥ మేనకాదులు క్రీడించి ♦ తానమాడఁ, గలపమును కుంకుమముఁ గల్ప ♦ కంబు లించు
మంగళ ద్రవ్యములు గలి ♦ యంగ నీటి, తుంపురులు పరిమళముఁ♦బొందుటను గంటె!

తే॥ అద్దుకొని మాఁడు జాలకే ♦ యధికమైన, చల్లఁదనము పాంథులకు నొ♦సంగుచున్న
శిఖరరాజంబు సూర్యుండు ♦ చేరమేటి, ముకుటముం దాల్చు తీరునఁ♦బొలిచెఁగంటె

తే॥ మానికంపు బండల మీాఁద♦మలసివెదురు, పొదలు రాల్చిన ముత్తియ♦ములు వెలుంగ
సంజ మిన్నంటఁ బర్వ ♦ స్మితసఖుతి, కరణిఁ గానంగ వచ్చుట♦గాంచుమబల!　　౨౦౫

తే॥ విజిత వంశ వీణారావ ♦ విమల శుకము! ప్రూచు మోదుగు లెడనెడఁ ♦బొలుచుచుండ
వనము మండుచు నుండెడు ♦ పగిదిఁ దోచెఁ, గాంచితే దూరభాగంబు ♦ కన్నులలర

ఉ॥ చెందొవలందు గాజులను ♦ చేర్చిన చెన్నునఁ గానవచ్చుకే
లొందిన జానకీ! కలభ ♦ యూథము తుండము తోలుసంచి గాఁ
బొంది జలంబు నించికొని ♦ పోయి తపస్సుల కుండికావళిం
గ్రందుగ నింపుచుండుటలు ♦ గాంచితె యచ్చటి చిత్రలీలలన్　　౨౦౬

తే॥ వంపుతోఁకలు కూర్మికి ♦ వంగు మనసు, గలుగు కోఁతులు వృద్ధులఁ ♦ గనులులేని
తాపసులఁ గట్టలంబట్టి ♦ దారిచూపు, చుండు వేడుక గాంచితే ♦ యుత్పలాక్షి!

తే॥ పురులు విప్పిమయూరముల్ ♦ మునులహోమ, కుండములనగ్ని వడిరాఁజు♦కొనఁగ విసరు

చుండుటలు చూచుచుం డెక్కు♦శోదరీ! ప్రశస్తయతుల మహిమ నెన్న♦శక్యమగునె?

తే॥ చెట్లఫలముల రాల్చెడు ♦ చెడుగుణంబు! చెలఁగు కోఁతులు ప్రతిని ♦ చిక్కుదీసి
పోగుచేసి జందెములకై ♦మునుల కొసఁగు,చుండుటలు కాంచుచుంటివే♦యువిదమిన్న!

తే॥ మావి పనస యరఁటిచెట్ల ♦ మంచిపండ్లఁ, దెచ్చి యిచ్చు కీశమ్ములఁ ♦ దెలివ! కంటె
దుంపలం ద్రవ్వికొని భక్తి ♦ తోడఁ దెచ్చు, కిటుల నిటఁ గంటివేప్రేఁడి ♦ కీలుబొమ్మ!

తే॥ కొండవరి జొన్న రాగి కం ♦ కులును వెదురు, బియ్యమనుములు నీ వన♦చెయ్యవంటి
నోళ్లుగల కీరనికరమ్ము ♦ మళ్లనుండి, తెచ్చిమునుల కిచ్చుట గంటె ♦ మచ్చెకంటి!

తే॥ దంతములు తేజరిల్లు మ♦ దావళముల, నెత్తుకొని మ్రింగు భుజగంబు ♦ లుత్తమజన
భాతి వినతిమై జటిలులు ♦ పదములూని, త్రొక్కు మెట్లుగు టరసితే ♦ నిక్కులాఁడి !

తే॥ చపలనేత్ర! యీకొండపైఁ ♦దపముచేసి♦ కన్నుల ముదశ్రువులు కుండ ♦ కరణిరాల్చు
వారలకు ముక్తినీయ దే♦వతలు వచ్చు, మింటి తేరు లెండలఁ బోలె ♦మెఱసెఁజూడు

చ॥ తపనుని మ్రింగి యాజ్యమును ♦ ద్రావిన కుంతముఁ బోలి కాలుఁడుర్
విపుల భయంబు నొందు కడు ♦ విప్పగు కాటుకకంటి! జానకీ!
ఉపగత సూతికాశ్రమము - నొర్వఁ గరేణువులర్ భరించి త
ద్విపములు నొవ్వనీకొదవి ♦ తేఱిచి పట్టుచునుంటఁ గాంచితే!. ౭౨౦

తే॥ నీదు మైకాంతి మెఱుపని ♦ నిశ్చయించి, ఘనులు పుట్టలఁ దూఱుట♦పడఁతి! కంటె
జలద నాదంబు సింహగ ♦ ర్జనమయంచుఁ, గలఁగిపాఱు వారణములఁ♦గలికి! కంటె,

చ॥ అఱని గృహస్థ ధర్మమున ♦ యందె తపంబును సత్యముఙ్ దిటం
పఱచిన యాజి పుత్రికుఁడు ♦ పైదలి కిట్టి వినోదముల్ ముదా
కరముగఁ జూపుచుం జని సు ♦ కర్మలు తాపసు లందు కానరా
నెఱఁగి మునీంద్రవర్యులకు ♦ నెచ్చగు విందయి యుండె నచ్చటన్. ౭౨౨

క॥ వెనఁగాల నేమి నాఁజను, నసురుని యుసుఱుల హరించి - యరుణంబయి యా
కసమున వెలసిన చక్రము, పసదోఁచెం బశ్చిమాద్రి ♦ భానునితీరుల్ ౭౨౩

తే॥ చక్రదారిత దనుజ వి ♦ స్తార దేహ, గళితరక్తంబు నా సంజ ♦ కావి పరవె
వానినోర విఱుగు కోఱ ♦ పల్లువోలె, నంద మొందెను మింటలేఁ ♦ జందమామ. ౭౨౪

క॥ సుదతులకు ముఖ వికాసము ♦ పొదలించుచు నలిన పుష్ప ♦ ములు ముకుళించెన్
పదపడిగగనముఁ బోలిన, హ్రదముల రిక్కలను పోలి ♦ యలరెం గలువల్ ౭౨౫

తే॥ ఆఁడు మగ కోఁతులటమ్రాకు-లరయుచేగెఁ, బిడులుదంతులుసానువుల్ - వెదక వెడలెఁ
గాన పిట్టలు నీడముల్ - గానఁ బోయె, జ్ఞాన వేద్యుఁడు సంజ క - ర్జముల కరిగె ౭౨౬

తే॥ కొన్ని పువ్వులు ముడిఁగెను-గొన్ని విడిగె, రామునకు లక్ష్మణునకు సు - ధామయి యగు
జానకికి హస్తనేత్ర కం - జంబు లపుడు, నీరజంబులకై వడి - నేముండింగె ౨౨౭

## లక్ష్మణుఁడు పర్ణశాల నిర్మించుట.

క॥ ఉత్తముఁడు సుమిత్రాసుతుఁ, డత్తఱి తనుమధ్యతోడ ♦ ననఘుం డుండన్
జిత్తమున నెంచి యచ్చటఁ, దత్తఱమునఁ బర్ణశాల ♦ తగ నిర్మించెన్. ౨౨౮

సీ॥ పంగకఱ్ఱల నాటి ♦ పైన నడ్డంబుగాఁ, బొడవైన వెదురులఁ ♦ బొందు పఱచి
నడుమ నిట్రాడుల ♦ నాటి పై వాసంబు, లమరించి పెండియ ♦ లణఁగఁగట్టి
శాకపర్ణంబుల ♦ జానుగాఁ గప్పిపై, బోదకసవు వైచి ♦ బొద్దుగాఁగఁ
బ్రక్కల వెదురుల ♦ బ్రద్దల నల్లి మ, ట్టిని మెత్తి మణిగాన ♦ మొనరఁజేసి

తే॥ జానకికి రామునకు వేఱు ♦ స్థలము లుంచి, వాస్తుశాస్త్రోక్తముగ నెల్ల ♦ పనులు తీర్చి
లోనఁ గుంకుమ పంకంబు ♦ తోన యలికి, గోడలకు నదీ రత్నముల్ ♦ కూర్చి యంత.

తే॥ బర్హిబర్హ వితానంబు ♦ పరఁగఁగట్టి, కత్తిఁ గొని వ్రేలు క్రచ్చులఁ ♦ గత్తిరించి
చుట్టు వెలుగు వెదుళ్లతోఁ ♦ గట్టి నసలఁ, బఱచి కొవ్విరుల్ చల్లి ♦ తల్పం బమర్చె.

ఉ॥ ఈవిధి లక్ష్మణుండు రచి ♦ యించిన యొప్పగు పర్ణశాలలో
దేవతలన్ భజించి జగ ♦ తీపతి యంబుజగర్భునందు న
జ్ఞావళి నన్ను బోఁటి జను ♦ లందుఁ జరాచర కోటియందు నొ
క్కవిధి నొప్పు వాఁడు తన ♦ యింతినిగూడి వసించె నచ్చటన్. ౨౩౦

ఉ॥ మాయను నీఁగినట్టివగు ♦ మానసముల్ శ్రుతులున్ సుధాబ్ధియుం
బాయని తొల్లి కెంకియు న ♦ మస్తము నియ్యదె యంచుఁ బల్కునా
చాయను లక్ష్మణుండు కడు ♦ చాతురిఁగట్టు కుటీరమందు సీ
తాయుతుఁడై రఘుప్రభుఁ డ ♦ దం బరితృప్తి వసించె నత్తఱిన్. ౨౩౧

తే॥ జానకీ సుకోమల - చరణయుగళి, కటుశిలాతల మార్గంబు ♦ గడవ నడచెఁ
దమ్ము కరములు గుడిసె నొం - దంగఁగట్టె, సాయమే లేని వారికీ ♦ జగతిగలదె? ౨౩౩

క॥ అని చింతించుచుఁ దమ్ముని, గనుఁగొని యీపర్ణశాలఁ ♦ గట్టెడు పని యెం
దున నేర్చితి వని నిలువక, కనుగొలుకుల నశ్రువులను ♦ కార్చెను తోడ్తోన్. ౨౩౪

చ॥ పొలుపగు సంపదన్ భరత ♦ పుత్రున కిచ్చిన తండ్రి యానతిన్
వెలలి వనంబు చేరి బహు ♦ విశ్రుత ధర్మముఁ గాచి భాస్కరుం
బలె వెలిఁగించు సన్నుతి ను ♦ పార్జన చేసితి నంటకంటె నా
కులతను నీకు మిక్కిలిగఁ ♦ గూర్చితి నంటయె యుక్తమౌఁ గదా? ౨౩౫

చ॥ అని యిటు రాఘవుం డనఁగ ♦ నంతటఁ దమ్ముఁడెడందఁ గుంది య
న్నను దగఁగాంచి యిట్టులను ♦ నాయక! యన్నకు సేవసేతకై
యనుజుఁడు గల్గు నిక్కమిది ♦ యారయఁ గష్ట ముఖాంకురంబు నా
టనె యుదయించి కాటనె రు ♦ టంబుగ నిల్చి చెఱుంగవే యనన్. ౨౩౬

ఉ॥ ఐన నటుండ నిమ్ము పరి ♦ హారము దీనికి లేదు ధర్మమున్
మానుట కూడదంచుఁ దన ♦ మానస మందు తలంచి సేవపైఁ
బూనికయుం గుతూహలము ♦ పూర్తిగఁ గల్గిన తమ్ము చింతయున్
లోన నెఱింగి వాని యడ ♦ లుం దొలఁగింపఁగ నెంచి యిట్లనున్. ౨౩౭

తే॥ ఉర్వి సంపదలకుఁ దుది ♦ యొండు గలదు, భావి సద్గతి యనెడి లా♦భంబుతోడి
అతుల సమ్మోదమరయ శా♦శ్వతముగాన, దీనఁగొఱఁత యేమున్నది♦ తెలియుమయ్య

తే॥ తమ్ము రాఘవుఁ డిటు సమా ♦ ధానపఱచి, యమరులు నుతింప వ్రతముల♦నాచరించె
తబిసి యగు వసిష్ఠునియాజ్ఞఁ ♦ దరలిపట్టి, దూతలేమైరొ వారలఁ♦జూత మింక. ౨౩౮

౯. దహనపటలము. (౧౪౫)

తే॥ సత్య వాక్యులౌ దూతలు ♦ సరగ రేయిఁ, బవలు నిలువక నడచి యా♦భరతుఁడుండు
హర్మ్యముం గని తమరాక♦యతని కెఱుక, పఱపుఁడని ద్వార్థి నతులతోడఁ♦బలికినారు.

తే॥ భరతు నానతిఁ గొనుచు లో♦పలికి వార, లరుగఁ గుతుకంబు మితిమీఱ♦నతఁడు కాంచి
రాజరత్న కిరీట నీ ♦ రాజితాంఘ్రి, యుగళుఁడగు తండ్రి సుఖుఁడయి♦యొప్పునె? యన

ఉ॥ రాజు సుఖుండనంగ యువ ♦ రాజును లక్ష్మణుఁడున్ సుఖాప్తికిన్
భాజనులే కదా? కుశల ♦ వర్తినులే జననుల్? తపోధనుం
డోజకు భద్రమే? యనుడు ♦ నుత్తర మిచ్చుచు దూతలెల్ల వా
రోజఁ జెలంగు వారనుచు ♦ నుంచిరి భూపతి శ్రీముఖంబటన్. ౨౪౧

తే॥ మఱియుఁ గల బంధువుల యనా♦మయము లడిగి, తండ్రి పంపిన లేఖ హ♦స్తమున నునిచి
ముద్రగల దానిఁ ద్వరగ వి ♦ ప్పుచు నె వారి, కిచ్చె నధికంబు గాఁగ న ♦ భీష్ట ధనము.

తే॥ మొగమునందునఁ జిఱునవ్వు ♦ మొలకలెత్తఁ, బులకములకు శరీరంబు ♦ కులకములుగ
నుబ్బి యగ్రజుఁ గాంచనౌ ♦ నుత్సుకతను, నిరు లవారిగాఁ జల్లెను♦భరతుఁడపుడు. ౨౪౪

తే॥ అరుగఁ బరివార వితతికి ♦ నాజ్ఞ యొసఁగి, పెద్దలకు మ్రొక్కి వారి దీ ♦ వెనలఁ బొంది
యాయితంబైన తేరిపై ♦ ననుజుతోడ, నెగడి తిథివారముల గమ ♦ నింప కరిగె. ౨౪౫

సీ॥ ఏనుఁగుల్ ముందుగా ♦ నేగెను రాజ కు, మారులు బారులు ♦ తీరి చనిరి
సాయుధం బగు వీర - సైన్యము నాలుగు, ప్రక్కలఁ గ్రమముగా - బలసి వెడలె

నొత్తిరి శంఖములఁ ♦ మొత్తిరి భేరులు, వెలసెను ధ్వజములు - బలిసె ధ్వనులు
మెఱసెను గొడుగులు - పెరసె భూషణ కాంతి, మొరసె నేమి రవంబు-విరిసె సురఁటి
మ్రోఁగె బండ్లపై బహువాద్య♦ములరవంబు, మూఁగెఁదేఁటులుక్రొవ్విరి♦మొగములందు
రేఁగె మిన్నున్న మన్నలము భూ ♦ రేణు చయము, సాగెభరతుండుమిక్కిలి♦సంబరమున

తే॥ మించి సకిలించి తలల నా ♦ డించుసవియు, నింగికెగురుమన్ననువేడ్క♦నెగయునవియు
పోవఁ దగు వేళకే చేరఁ♦బోవు నవియు, మొగము వాంచిన వగు నశ్వ♦ములునుగదలె.

తే॥ విల్లు కాండ్రు రీఁలెలవారు ♦ మల్ల వరులు, చక్రతోమరాసి గదా ప్ర ♦ శస్త హస్తు
లనుభవం బున్న మావటీం ♦ డ్రధిక విజయ, శీలురగు వీరులును చుట్టి ♦ చెంత నడవ.

తే॥ పోటులాడుదున్నలుకోడి♦పుంజులును పొ, ట్టేళ్లు కముఁజులు మఱియుఁబూ♦రేళ్లు పెంచు
నట్టి వేఁటరుల్ మనముల ♦ నలరి వాని, వెంటఁగొని వేడుకగ ముందు♦ వెడలి నారు.

తే॥ ఉత్తములు కొంద ఱురముల ♦ నొరసికొనుచు, జరగి చాల్చాలుగని నిల్చి ♦జన్మమెత్తి
సురలు జ్ఞానులై యైహిక♦సుఖము వీడి, పూర్వ నాకలోకముఁ♦గొన్న♦పోల్కినుండ్రి.

తే॥ మధువు చెవులకుఁ గుడిపిన ♦ మాడ్కి వఱలు, మాగధుల కీర్తనధ్వనుల్ ♦మలసె దివిని
ఒడలికిని ప్రాణముం బోలె ♦ నొప్పునట్టి, మద్దెల రవంబు లెల్లెడఁ ♦ దద్ద చెలసె. ౨౫౧

క॥ భేరి రుతి మించి విప్రా, శీరవము చెలంగె మేటి ♦ జెట్టుల పెను గ
ర్జారవము మించి వందులు, పేరుకొని వచించు వినుతి ♦ పెలుచం దాఁకెన్

భరతుఁడు కోసలముఁ జేరుట.

క॥ అడవుల నదులను గిరులను, కడచి చెఱకు రసము మడవ ♦ గనిమలఁ ద్రిప్పన్
వడియు వలుఁద పొలములు గల, పుడమిని కోసలము నేడు ♦ పూఁటఁ జేరెన్. ౨౫౩

క॥ పొలములు మడకల సీఁగెను, పొలముల పైరులను సీఁగి ♦ పోయె జలంబుల్
జలజాసవ జలజంబున, నిలువక యేగుటయె గాక ♦ సీఁగె విషయముల్

క॥ పండిన ఫలముల వెలువడి, నిండి రసము దరులఁ బాఱి ♦ నిష్ఫల మయ్యెన్
మెండగు పువ్వులు విరిసియు, నెండి దిగువ రాలి వితగ ♦ నెఱసెను మంటన్. ౨౫౪

తే॥ పక్వ కాలంబు నెఱుఁగు కా ♦ పరులు లేక, పండి వరిపైరు తలవ్రాల్చి ♦పాఱుచున్న
మావిపండ్లరసము గని ♦ మలను పొరల, మొదలు మురిసి ధాన్యంబులు♦ మొలకలెత్తె.

తే॥ పశు లాడు పొలంబులఁ ♦ బనులు సేయు, తిల సుమంబులఁ దెగడు నా ♦ సలు గలారు
పనులు సేయరు మడఁతులు ♦ ప్రణయ కోప, మొంది నట్టులు కలుపుల ♦నూడ్వకుండ్రి

క॥ చిలుకలు పలుకులు నిలిపెను, పొలఁతులకున్ దూతి పనులఁ ♦ బోవుట తొలఁగెన్
బలుకవు భేరులు పురవీ, థులలో నుత్సవము లెందుఁ ♦ దోఁపరక యుండెన్, ౨౫౫

క॥ వేదవు శిరసులు పూవుల, నాదవు చెలిగములు నీట ♦ నాట నెలవులన్
బాదవు పిల్లనఁ గ్రోవులు, కాఁదవు మాడువుల నువ్వి ♦ కర్ణ బిలములన్ ౭౫౯

తే॥ వెలయు ఘుగములు చిఱునవ్వు ♦ వీడియుండె, మాడుగులు తావిపాగలను ♦ మానియుండె
దీపములు ప్రకాశము లేక ♦ త్రిక్కియుండె, మదవతుల జడల్ సుమముల ♦ వదలియుండె

క॥ పెరిఁగినపచ్చని పైరులు, చెఱువుల నుదకములు రామిఁ ♦ జెడు లోభుల మం
దిరముల వాకిండ్ల కడన్, దిరిగెడు యాచకుల మోము ♦ తీరున వాడెన్

క॥ వేలుపులు దూరమేగఁగ, నాలుకతోఁ బలుకరాని ♦ నయమున సుక్షే
త్రాళులు పంటల వీడఁగ, నేలపొలుపుక్షీణదక్కె నసులు ♦ నీఁగు నొడలు నాన్. ౭౬౧

క॥ అటువంటి కోసలంబును, తటుకున భరతుండు చూచి ♦ తన మదిలోఁ బే
రటమట పడి చెడుగేదో, యిట విన నగు నంచు నూర్పు ♦ లెచ్చుగఁ బుచ్చెన్.

క॥ మఱి యేఁగి సత్య భూషుఁడు, తఱిమెడు నరదంబు కంటెఁ ♦ దద్దయు వడిగా
నెఱుకఁ బనిచి యాలో మెఱు, పొఱయని సాకేతమును స ♦ ముత్కతఁ గాంచెన్.

తే॥ వేవెలుఁగుఁగని యిబ్బామి ♦ వేల యెల్లఁ ♦ దిరిగి యలసితి నిలువుము ♦ తిందు రమ్మ
వెనుకఁ బోవచ్చునని నిక్కి ♦ పిలుచునట్లు, గాన నగు ధ్వజ పటములఁ ♦ గానఁడయ్యె.

తే॥ ధర్మ పద్ధతి నార్జించు ♦ ధనము నెల్లఁ, గోరు వారలు వచ్చికై ♦ కొనుఁ డటంచుఁ
గీర్తికాములు పిలిచెడు ♦ కేకవంటి, మురజ నిస్వనములు మున్ను ♦ మొనయ వినఁడు

క॥ సధనుల నుండి యిభంబుల, నిధులను దొడ్డగొనువారి ♦ నెఱిఁ గానకన్
బంధులును గాయకులును మా, గధులును కొనిపోవు టతఁడు ♦ గానఁడు నగరిన్.

క॥ ఆవుల మద వారణముల, మావులఁ బెన్నిధులఁ బడసి ♦ మన్ననతో భూ
దేవతలు నడచుచుండుట, భూవిభునందనుఁడు కనఁడు ♦ పుర వీథులలో.

క॥ పురమున గాయను లిండ్లన్, ద్విరేఫములు వీణియలును ♦ తీయని సప్త
స్వరములు వెలిపఱుపమి సుం, దరుల కురుల కరణి నొప్పెఁ ♦ దార రహితమై. ౭౬౯

క॥ కరులను పల్యంకికలను, హరులను రథములను బండ్ల ♦ నరిగెడు వారె
వ్వరు లేక నగరవీథులు, శర విరహిత సికత సహిత ♦ ఝరముం బోలెన్. ౭౭౦

క॥ ఉత్తమగుణియగు భరతుం, డత్తఱి నగరంబు కాంతి ♦ యందము చెడుటల్
చిత్తమునఁ దలఁచి యనుజా!, యెత్తెఱఁగున నుండెఁ జూచి ♦ తే పురి? యనియెన్.

క॥ అరిభీర భయద భుజబల!, పుర సంస్థితి చూడఁ జూడఁ ♦ బొలుపఱి దామో
దరు సతి వీడిన కలశాం, బు రాశి గతి నొప్పుచుండె ♦ బుధ నుత! కంటే. ౭౭౧

తే॥ రత్న భూషుండు సింహప ♦ రాక్రముండు, నైన శత్రుఘ్నుఁ డిరుగేల ♦ నంజలిగొని
యిపుడు గలిగిన దొక దొడ్డ ♦ యెడరు సతము, చెడని పురమును సిరిపీడు ♦ చెన్నుదోఁచె

భరతుఁడు కైకగృహంబున కేగుట.

తే॥ అట్లు పలుకుచున్నంతలో - స్యందనంబు, నగరుచేర వేగ భరతుండు ♦ దిగి బిరబిరఁ
దండ్రివసియించు నట్టి సౌ ♦ ధంబుచేరె, మనమునందున శంకలు - మల్లడిగొన. ౨౨౪

తే॥ ఉద్ధతభుజుఁ డుత్కంఠతో ♦ నుర్వినాథుఁ, డెలమివాడుకవసియించు ♦ గృహముసొచ్చి
యెచటఁ గానక యిది యల్ప ♦ హేతుకంబు, గాదటంచు శంకించె మి ♦ క్కుటముగాఁగ

తే॥ జనకు వెదకి విశుద్ధ హ ♦ స్తముల తోడ, వందనముసేయ నుంకించు ♦ భరతుఁగాంచి
యొక్క చేటిక మీతల్లి ♦ యుత్సుకతను, పిలుచు చుండెను రండని ♦ పిలుచునంత. ౨౨౬

తే॥ వచ్చి తల్లికి మ్రొక్క న ♦ వ్వనిత తనయు, మనసు తనివోందఁ దడవుచుఁ ♦ దనదుతల్లి
దండ్రి సేమంబులడుగ నా ♦ తఁడు వారు, భద్రయుతులని పలికి యా ♦ వలనుఁ గాంచి

శా॥ తల్లిప్రేమము పెల్లగిల్లఁగను మా ♦ తండ్రిన్ వడిం గాంచ నా
యుల్లంబల్లల నాడుచున్నయది యెం ♦ దున్నాఁడొ నానేత్రముల్
చల్లంగాఁ గనువాఁడఁ జెప్పఁగదె ప్ర ♦ శ్నంబింకఁ జాలింపు మే
నొల్లం దండ్రిని కాంచు పిమ్మటనె నా ♦ కుత్సాహ మొప్పారెడున్. ౨౨౭

ఆ॥ అట్లు తనయుఁ డడుఁగ ♦ నావంత యుల్లమ్ము,నందు వంతలేని ♦ యతివ తెగువఁ
బలికె నసుర బలము ♦ నడఁచిన మీతండ్రి, సురలెలర్ప దివము చొచ్చె ♦ ననుచు. ౨౨౮

ఉ॥ భగ్గునఁ గాల్చునట్టి చెడు ♦ వార్త చెవింబడ నెత్తివెండ్రుకల్
దిగ్గన నగ్గిఁ గాలుగతి ♦ దిక్కఱి వజ్రముచేత రావి మ్రా
నగ్గతిఁ గూలు నగ్గతిని ♦ పృథ్విని గూలి చిరంబు శ్వాసముల్
మ్రొగ్గక తెల్విదప్పి శవ ♦ ముం బలె నుండె జనంబు జంకఁగన్. ౨౩౦

చ॥ మొగమున కాంతి మ్రగ్గ నర ♦ మోడ్చిన కన్నుల నశ్రుబిందువుల్
బుగులుకొనన్ వెనంగొఱవి ♦ పూర్తిగ వీనులఁ జొన్ను రీతి నీ
దగరము లాడ నిన్ను బలెఁ ♦ దక్కొరు లెవ్వరు డెందమందు ప
ల్కఁగఁ దలకొందురే? యిటులు ♦ కర్కశ మానస వెట్టులైతివో!. ౨౩౧

తే॥ గుహుని కంటె సుందరుండు సు ♦ క్కుచునులేచి, పరితపించుచు మఱినేల ♦ వ్రాలివగచి
వేఁడిగా నూర్చివేదన ♦ వెక్కసముగ, నేడ్చి యేడ్చి తుదిం గాంచ ♦ కిట్టు లనియె. ౨౩౨

తే॥ ధర్మ నిర్మూలనము చేసి ♦ దయనుచంపి, శీతలోన్నత కరుణకుఁ ♦ జెలువు చెఱచి
మరణ మొందితి వన నీతి ♦ మఱచి నాఁడ, వింతకంటె హెచ్చగు దోష ♦ మెద్ది తండ్రి?

ఉ॥ కోపము ద్రోసి కామమును ♦ గోసి యెడందను లోభ సంహతిన్
లోపము చేసి యున్నతిని ♦ లోకము నేలు నుదార! నీప్రజన్
దాపము పాలుచేసి తగు ♦ దారిని నీకయి చూచుకొంటయున్
లోపము గాదె? యర్థియును ♦ లోభము గాక యుదారమార్గమే?. ౭౮౪

తే॥ ఇనుఁడు మొదలుగా నీకుల ♦ నృపుల చరిత, ములను క్రొత్తలు చేసిన ♦ పూతచరిత!
భర్గుమేర్వంశమగు విల్లు ♦ భంగపఱచు, ముద్దుకొడుకు నెల్లెడఁ ♦ బాసిపోయి తిట్లు.

తే॥ ఆర్య! ధర్మచరిత్ర! యీ ♦ యవసియందు, మ్రందు వార లేవంశము ♦ నందు లేమి
స్వర్గమున మైత్రిగలవారు ♦ చాలఁగలరు, పోదమని యెంచి యేగితే ♦ భువనవంద్య!

తే॥ తడవు చల్లనై యున్న నీ ♦ గొడుగు నీడ, వఱలు పలు జీవు లిప్పుడు ♦ వాడి నిలువఁ
గల్పశీతల చ్ఛాయ నా ♦ కాంక్షచేసి, వెడలి నాఁడవె నీవార ♦ లిడుమఁ గుడువ? ౭౮౬

క॥ శంబరుఁ బోలిన దనుజులు, వెంబడి మఱిముట్టరేమి ♦ విబుధులు కడగం
డ్లంబడి పరుగిడి నీచర, ణాంబుజములఁ బడిరె? దాన ♦ నరిగితె చెప్పుమా? ౭౮౮

ఉ॥ శాత్రవు లిచ్చినట్టి ధన ♦ సంపద విప్రులకిచ్చి దివ్యులన్
బాత్రముగా భజింపఁ దగు ♦ పద్ధతిఁ జేసితి వశ్వమేధముల్
పుత్రులఁ గంటి భక్తి శుచి ♦ పూజ లొనర్చితి వట్టి పుణ్యచా
రిత్రక! యిట్టి వెవ్వియు భ ♦ రింపని నాకముఁ జేరఁ గోరితే? ౭౮౯

తే॥ తండ్రి! రాముఁడు వట్టి హ ♦ స్తములతోడ, నున్నవాఁడని నీచేత ♦ నున్న ప్రభుత
నతని కీయఁగఁ దలఁచి యే ♦ బ్రతికియుండ, సమ్మతింపఁ డనుచు నిట్లు ♦ జరిగితేమి?

చ॥ అరిది తపోబలంబు భువి ♦ నందమి రామున కీవు మోద సం
భరితముగాఁ గులక్రమ స ♦ మార్జిత శీర్షకమున్ ధరింపఁ జే
సి రహిమహోత్సవంబు విల ♦ సిల్లఁగ నీదు విశాలనేత్రముల్
గరువము నొందు భాగ్యమును ♦ గాంచవు గావలయున్ నృపోత్తమా!

క॥ భరియింపలేని చింతను, భరతుం డిటు పనవి పనవి ♦ బాష్పాకులిత
స్ఫురితేక్షణుఁడై యొకవై, ఖరిఁ దేఱి వచించె నిట్లు ♦ కైకం గనుచున్. ౭౯౨

తే॥ తల్లియును తండ్రి గురువును ♦ దైవతంబు, జ్యేష్ఠుఁడును మేరమీఱిన ♦ శ్రేష్ఠగుణుఁడు
రాముఁడే కాన నతని పా ♦ దామలాబ్జ, ములకు మ్రొక్కక నామది ♦ యలఁత వోదు.

క॥ అనిన న్విని పిడుగుం బోలిన పలుకుల నారి తేఱు ♦ తేమ కయిక నా
తనయా! జానకితోఁ ద, మ్మునితో రాఘవుఁడు వనికిఁ ♦ బోయె ననంగన్. ౭౯౪

క॥ అడవుల నున్నాఁడని తలి, నుడువఁగ శుచి భ్రమింగు కరణి ♦ నొగిలి మఱియు నే
పొడుగులు నే వినఁదగినవి, కడమపడియెనో యటంచుఁ ♦ గంపము నొందెన్. ౭౯౫

చ॥ ఉలికి పడంకి భ్రమాను వడి ♦ యూర్చి యలందురి రాఘవుండు కా
ననలకు గమింప దోసము లో ♦ నర్చెనో? దైవము కోపగించెనో?
యల విధి దార్చె నేమి? మరి ♦ యూద తోలంగెనో? దేని చేతనో?
కలఁక తొలంగఁ దెల్పుము క ♦ కావికలమ్యో మదంతరంగమున్. ౨౯౮

తే॥ చెడుగులే రాముఁ డొక్కెడఁ ♦ జేయునేని, తల్లి కార్యంబు వోలె భ♦ద్రదమయగును
తండ్రి మరణించు పిదపనే ♦ దాశరథియు, వనుల కేగెనో? తెలుపవే ♦ యనుడుఁ గైక

చ॥ గురువులఁ దిట్టి కాదు మఱి ♦ కోపము చేతను కాదు దైవమున్
దొరయదు భానుఁ బోలి తన ♦ దొడ్డ కులంబునఁ బుట్టి నట్టి భూ
వరుఁడు సజీవుఁడై వెలయు ♦ పట్టుననే యతఁడే గెఁ గానలన్
ధరణి తనూజతోడఁ దన ♦ తమ్మునితోఁ జరియింపఁ బుత్త్రికా!

చ॥ అని తన తల్లి వల్కుటయు ♦ నాతఁడు దోసము లేద యేని యీ
మునఁ బగవారి కుట్రలును ♦ చోపవయేని విధి ప్రకారమున్
బొనరక తండ్రి యుండఁగనె ♦ పుత్త్రుఁ డరణ్యముఁ జేరుటెల? మా
జనకుఁడు పిమ్మటన్ విసివి ♦ చావఁగ నేల? వచింపవే వెసన్. ౨౯౯

ఉ॥ అనుటయుఁ గైక యిట్టులను ♦ నయ్య వరంబుల నీయఁ గాంచి నే
వనులకు రాము నంపితిని ♦ వారక రాజ్యము నీకుఁ గూర్చితిన్
దనయ వియోగమున్ మదిని ♦ తాళఁగలేక విభుండు స్వర్గముం
జెన నెను నీవు నా కనులు ♦ శీతల మంద భువిం భరింపుమా. ౩౦౦

భరతుఁడు కైకను దూషించుట

ఉ॥ కైక కటూక్తి కర్ణముల - గాఁడక మున్నె శ్రవంబు మూసె ని
భ్రూకుటి దాల్చె నగ్నివలె - వుచ్చెను కన్నులఁ జిందె నెత్తురుల్
వాకొన మూనె రోమములు - వహ్ని కణంబులఁ గ్రక్కెఁ జెక్కులన్
సోఁకె వడంకు కాళుల వ - సుంధర వ్రయ్యఁగ మోఁదె నార్భటిన్.

ఉ॥ కాళుల నేల గ్రుద్దుటయుఁ - గంపము నొందె జగంబు మేరువున్
గాలికి వారిధిన్ సుడియు - గంధ గజంబుల నావకై వడిన్
వేలుపులెల్ల భీతిలిరి - వెక్కస మందిరి దైత్యులెయ్యెడన్
గాలుఁడు కన్నులన్ మొగిచెఁ - గల్వల నూఁడును క్రుంకె జంకునన్

చ॥ కలఁగిన క్రూరకోపమున - గ్రాఁగిన యా భరతుండు పాప పం
కిలయగు నామె తల్లియని - గీల్కొను గారవముం ద్యజించి ని
ర్మలుఁడగు రామచంద్రుఁ డెడ - మన్నన సేయఁడ యంచుఁ జంపఁగాఁ
దలఁపక యీసడించుచుఁ బ - దంపడి యిట్లనియెం గటూక్తులన్. ౩౦౩

ఉ॥ రక్కసి వీవు నీ చెడు వ ♦ రంబునఁ దండ్రి గతించె నన్నయుఁ
దక్కక కాననంబులకుఁ ♦ దారెఁ దపం బొనరింప నిట్లు నీ
చిక్కులఁగూర్చు జిహ్వికను ♦ చీల్పక నెమ్మది విన్న యే నిటఁ
దక్కన యంచు రాజ్యమును ♦ తాల్చెడు వాఁడన కాన? పాపినీ!. ౧౦౪

ఉ॥ ఈవును సిగ్గు లేకెదుట ♦ నే నిలుచుంటివి క్రూరరాక్షసీ!
నీవిటులాడ వా తెఱవ ♦ నే ఛురికం గొని క్రుక్కకుండితిఁ
భూవలయంబుఁ గాచు పరి ♦ పూర్ణ గుణుండగు రాఘవుండు సఁ
గావలుఁ డంచుఁ దిట్టునని ♦ కాక క్షమింతునె తల్లి యంచెదఁ?. ౧౦౫

ఉ॥ క్రూర వచస్సుచేఁ బ్రభుని ♦ గూల్చితి వంపితి వన్నఁ గానకుఁ
గోరిక మీఱ రాజ్యమును ♦ కూర్చితి నాకయి మాయ లాఁడి! యీ
తీరొక ధర్మమార్గమని ♦ తేర్చెదొ? యిట్లగు నేని ధర్మముఁ
గోరక యుందుఁ గాక! జన ♦ కూటము కోరఁగ నిచ్చగించునే? ౧౦౬

ఉ॥ వంచకురాలు తల్లి చెడు ♦ పద్ధతిచేత సనాతనంబుగాఁ
గాంచిన వంశగౌరవముఁ ♦ గాటికి ముఁ భరతుండు పంపినాఁ
డంచు జగంబు దూఱ బిడి ♦ యంబున నా తలవంచి మానముం
ద్రెంచి చరించు పీనుఁగయి ♦ త్రిమ్మరు కంటె మఱేమి గాంతునో!. ౧౦౭

తే॥ తగు సతీత్వము ధర్మ ప ♦ ద్ధతిని వీడు, నిన్ను చేపట్టు పతిని ద్రుంచి ♦ దించి వరము
గాంచు నీవొక పెనుభుజంగమవు కాక, కలికివే? మఱి యెవ్వరిఁ ♦ గఱవ నుంటి? ౧౦౮

చ॥ పతి యసువుల్ హరించితివి - వ్యాధివొ? కావు పిశాచివీవు; జీ
వితము వహించు కంటె వడి - బిద్దుట మేలటు దోఁరు; నన్ను గాం
చితి స్తన మిచ్చి పెంచితివి - నింద దృఢంబుగఁ గూర్చితింక నే
వితమున నేమి గూర్చెదవొ? - ప్రేముడి తల్లివి మిన్న కుందువే? ౧౦౯

ఉ॥ సత్యము మీఱలేని జన - సన్నుతు నీవిభు నావిఁద్రావి యీ
నిత్య విలక్షణంబయిన - నిందను గాంచి ధరఁ హరించి సం
స్తుత్యముగా సుఖింతు మని - సాక్షి వాతఁడు వోవ దేనుకా
సత్యము న్యాయముం జెనయు - పౌరులఁ గాంచియు బుద్ధిమాఱదో? ౧౧౦

ఉ॥ ఇచ్చిన మాటకుం గొఱఁత - యెంచక తండ్రి గతించె రాజ్యముం
జెచ్చెర వీడుటే తగవు - సేయుట యంచుఁ ద్యజించె రాఘవుం
డచ్చుగ వాని తమ్ముఁడగు - నాతఁడు తల్లి కుతంత్ర బుద్ధిచే
వచ్చిన రాజ్యమేలెనని - వాడెదు దూఱును నే భరింతునే? ౧౧౧

చ॥ జనకుఁడు తద్వియోగమునఁ - జచ్చె బలుంగక కైక డెంద మీ
యనువున మార్పు నొందఁగత • మక్కట నేనని యెంచి నెమ్మదిన్
జన పరిపాలనంబు తగఁ • జల్పఁ గలాఁడని నమ్మి కానకుం
జనియెను గాక యొండయినఁ • జల్పునె రాఘవుఁడిట్టి పద్ధతిన్. ౮౧౨

చ॥ తరణికులాబ్ధిచంద్రుఁడగు • తండ్రి తలంపది యేదియైన నా
గురుత మదీయ సేవనము • కోరి యొనర్చుచు నుండినట్టి యీ
భరతుఁడె లోపలన్ గుటిల • భావము నూనెన యంచు రాఘవుం
డురవుగ నూహసేయ భవ • దుగ్రవరం బొకటైనఁ జాలదే? ౮౧౩

చ॥ వనముల నగ్రజుండు కర • భాజనుఁడై ఫలమూల సంతతుల్
దిన నిట నేను జీవములఁ • దేఁకువ దాల్చి సువర్ణ పాత్ర మం
దుప రుచులూరు నోగిరము • తుష్టిగ మెక్కుట గాంచి లోన నే
మని జన మీసడించు? నది • యర్హమె రామపదానుజన్మికిన్? ౮౧౪

చ॥ అడవులఁ జేరె రాముఁడను • నంతనె తండ్రి గతించెఁ గీర్తితోఁ
గడలి విసంబు నా నడరు • కైక వచించిన యీ తృణంబె నే
విడువక ప్రాణముల్ చెడుగు • ప్రీల్పక కన్నుల నీరు గార్తుఁ బ్రే
ముడి గలవారి పోల్కి నిది • బూటక మంచు జగంబు పల్కదే? ౮౧౫

చ॥ జగములు సమ్మతిం గొనునె? • చావక యే నపనిందఁ గాంతునే?
నగరము నందు లక్ష్మి చర • ణం బిడి నిల్చునె? యేరి తోడ నీ
తగవు తలంచి చేసితివి? • తప్పుడు త్రోవల నేరుచూపి రి
ట్లగడు గడించి పాడి మొద • లంటఁగఁ ద్రుంచి యదేమి గొంటివే? ౮౧౬

ఉ॥ నీ కొల నోటిచే జనకు • నిల్వనఁ జంపితి నింత మాత్రమా?
లోకము నాడి పోయఁ బెను • లుబ్ధత నన్ను నీ పాటఁ ద్రోలితిన్
లోకము లేల నిల్చితి వి • లుంఠిత బుద్ధి రవంత దోసముల్
నీకడఁ గల్గునే? తెగడు • నీఁగెడుమార్గము నాకుఁ గల్గునే? ౮౧౭

ఉ॥ ఏనొనరించు కార్యముల • నింక నుకొందఱు కన్నులారఁగాఁ
గానఁగ నిమ్ము; నాయెడఁద • గానక లోకము ఱట్టుసేయు; నే
జానున నన్ను మోము గనఁ • జాలుదు? వంశ వినాశినీ! గరం
బానని వానిఁ జంప దను • న్యాయము చెల్లెను నాదు మన్కికిన్. ౮౧౮

ఉ॥ పాపిని వైన నీనరక • భాజనమూ నుదరంబుఁ జేరి నేఁ
దోఁపఁగ నైన పాతకముఁ • ద్రోచి మనోవ్యథ లెల్లఁ దీఱ నం

స్థాపిత ధర్మదేవతయె ♦ సాక్షిగ లోకము చూచి మెచ్చ నేఁ
దాపసి వేష మూని బెడి ♦ దంబగు కానఁ ధపంబు పూనెదన్. ౧౯

ఉ॥ జ్ఞానులు పల్కు నీతి వచ ♦ నంబులె యాడితి నింతనైన నీ
ప్రాణము పీడితేని చెడు ♦ పద్ధతి యోచన సేయలేక యే
పూనిన దానవున్ వినుత ♦ పూత చరిత్రవు ధన్యురాలవున్
మానిని వౌదు దీని కిఁక ♦ మార్గము పాచిత మొండు గల్గునే? ౨౦

## భరతుఁడు కౌసల్య గృహమున కేగుట.

చ॥ అని వచియించి యా భరతుఁ ♦ డంతట నీ చెడు క్రూర కర్మముల్
పనివడి పూని కాఁ బలుపు ♦ పాపిని యొద్ద వసింపఁ జాల నా
కొనరిన దుఃఖముల్ దొలఁగ ♦ నుత్తమ శీలయుఁ గోసలేశ నం
దనయగు తల్లి పాద నలి ♦ నంబుల వ్రాలెద నంచుఁ జయ్యనన్ ౨౧

ఆ॥ వెడలి యచట రెండు ♦ విధముల కౌసల్య, యడలుచుండ నామె ♦ యడుగుల కడ
పుడమి పగులు పగిదిఁ బడుచు నమ్మా! యని; యవలఁ బలుక లేక ♦ యడలెఁ బెలుచ.

ఉ॥ నాకులు సంతపింపఁ గరు ♦ ణంబుగ నేడ్చుచుఁ బలుకుఁ, దండ్రి యే
లోకముఁ జేరె? సద్గుణ ని ♦ లోలుభుఁ డగ్రజుఁ డెందు పోయె? నే
కాకినయైన యేను వడి ♦ గాఁ జను డెంచుట గోడు చూడనే?
వ్యాకులపాటు దీర్పఁ దగు ♦ వారలు మీరలు గాక యన్యులే? ౨౩

ఆ॥ ధూళి భుజములంట ♦ దొరలుచు మాయన్న, చరణ యుగళిఁ గాంచఁ ♦ జాలనైతి
రాఘవుండు రాజ్య ♦ రమ పీఠఁ దగువాఁడె, వలదు నారు తప్పు ♦ సలిపినారు. ౨౪

తే॥ పాపు లెల్లరు కులమును ♦ పాడుసేయ, రేను తద్వాక్యముల నిశ్చ ♦ యింపలేదు
చెడుగు కడుపునఁ బుట్టిన ♦ చెనఁటి నౌట, మదిని తాపంబు దీఱంగ ♦ భ్రమనువాఁడ.

తే॥ చీఁకటులఁగొంగ మొదలుగాఁ - జెలఁగు శీల, వంశమున నొక్క - భరతుఁడు - దృఢవమునొంది
పూర్వగౌరవ మెల్లను - పాలియఁ జేసి, తార్చెనొక నింద నాచంద్ర - తారకముగ

ఆ॥ తండ్రి దివిని చేరఁ - దనయుండు వనిఁజొరఁ, గనులు లేని పగిదిఁ-గాంచి నాఁడు
ఘోర దుఃఖ జలధిఁ-గూలి తీరముగాన, కందె మునిఁగి మునిఁగి-యడలె ననుడు. ౨౭

తే॥ కులము నోర్పు సతీత్వంబు - కుదురుకొన్న, కరుణరూపిణి కౌసల్య - భరతుఁ గాంచి
రాజ్యము గోరఁడితఁడు ని-ర్మలుఁడటంచు, నిశ్చయించి యిట్లనియెను-నెగులుతోడ

తే॥ కలుష మింతయు లేని ని-ష్కపటి వీవు, కైక వంచన మెఱుఁగవు - గాద! యన్నఁ
గట్టువడిన సింగము వోలె - గర్జజేసి, భరతుఁడిట్లను ధర్మదే-వతయు నులుక. ౨౯

## భరతుఁడు శపథములు సేయుట.

సీ॥ ధర్మంబు చెడఁ బ్రయత్నము సేయువాఁడును, కరుణసుంతయులేని - కటికివాఁడు
పరుల వాకిటనిల్చి ♦ పరితపించెడు వాఁడు, పేదలపైనఁ గో ♦ పించు వాఁడు
ప్రాణిహింస యొనర్చి ♦ బ్రదుకు దుష్టాత్ముండు, చామలఁ గత్తితో ♦ జంపువాఁడు
సన్న్యాసులకుఁ గీడు ♦ సాధించు వాఁడును, బవరాన వెన్నిచ్చి ♦ పాఱువాఁడు
తే॥ యాచనాధనమును గొన ♦ నడరువాఁడు, హరిని పరమాత్మ కాఁడను ♦ నవగుణుండు
పోవు గతులకు నేనును ♦ పోవువాఁడ, రామునకు నెగ్గుదలఁచు దు ♦ ర్మతిన యేని. ౨౩౦
సీ॥ తల్లి యాఁకలిగొని ♦ తపియింపఁ దన పాడు, కడుపు నించుకొనెడు ♦ కావరుండు
తన నాయకుఁడు రణ ♦ స్థలినుండఁ జేవీడి, వెనుకకుఁ బాఱిన ♦ పిఱికిపంద
చరణంబులంబడి ♦ శరణు వేఁడినవాని, శత్రుల కొప్పించు ♦ స్వార్థ పరుఁడు
యతి నిందకుఁడు ని ♦ యతి దూషకుండును, తఱచుగా ధర్మంబు ♦ మఱచువాఁడు
తే॥ సభనుకూటసాక్ష్యమువల్కు ♦ సాహసికుఁడు, నొచ్చువానినిమఱియును ♦ నొంచువాఁడు
పోవు దుర్గతులకు నేను ♦ పోవువాఁడ, రామునకు నెగ్గుఁదలచు దు ♦ ర్మతిన యేని. ౨౩౧
తే॥ కలన భీతిల్లి ప్రాప్పడి - నిలుచువాఁడు, కొన్న శరణాంకమును లాగు- కొనెడువాఁడు
పోవు నరకంబులకు నేను- పోవువాఁడ, రామునకు నెగ్గు దలఁచు దు - ర్మతి నయేని.
సీ॥ అనఘుల యిండ్లకు ♦ నగ్గియిడెడు వాఁడు, నిసుఁగుల వధియించు ♦ నీచగుణుఁడు
ప్రాడ్వివాకుండయి ♦ పక్షపాతము పూను చెనఁటి, వేలుపు నింద ♦ సేయువాఁడు
క్రేపు కృశింపంగ ♦ క్షీరంబు గొనువాఁడు, నిల్లడ గొని హరి ♦ యించువాఁడు
తోడని వచ్చు పో ♦ లుకను దొంగలు బాధ, వెట్టఁ గాపాడక ♦ వీడువాఁడు
తే॥ తోడివారలాఁకొనఁదినఁ ♦ దొడఁగువాఁడు, కృతముమఱచినిందించుదు ♦ ష్కృతిపరుండు
పొందు పాపంబులేనును ♦ పొందువాఁడ, రాఘవున కెగ్గుదలచు దు ♦ ర్మతినయేని. ౨౩౩
సీ॥ ధర్మమార్గము తప్పి ♦ ధనహర్తయగుతేఁడు, నమ్మించి చెఱచు దు ♦ ర్ణయ పరుండు
తనకుల ధర్మంబు ♦ దప్పియేగెడు వాఁడు, చెల్లుననుచుఁ బీడ ♦ సేయువాఁడు
శరణు చొచ్చిన తన ♦ జనమును బాధించి, పాఱిపోవఁగఁ జేయు ♦ పాలసుండు
కన్యకం జెఱచిన ♦ కడు కావరుండును, గురుపత్ని మోహించు ♦ క్రూరకర్మి
తే॥ తగుమనని రణమాలను ♦ తాల్చి శక్తి, కొలఁది పోరక పాఱు భూ ♦ తలవిభుండు
పోవుదుర్గతులకు నేను ♦ పోవువాఁడ, రామునకు నెగ్గుదలఁచు దు ♦ ర్మతినయేని. ౨౩౪
సీ॥ మంచి వంటక మొంటి - మైఁ గుక్కవలెఁ దన, కడుపుచూచు కొనంగ ♦ గతుకువాఁడు
క్లీబుఁడా! యన సిగ్గు - కెరలించి తనకృత్య, ములను తొల్లిటి యట్ల - సలుపువాఁడు

పెద్దల పలుకులఁ - బెడ చెవినిడువాఁడు, పరుల దోషమె వెలి - పఱచువాఁడు
నిర్దోషవంశంబు - దుర్దోషయుతమంచు, వ్యర్థకల్పన సేయ - నడరు వాఁడు

తే॥ కలవృసక బీదలన్నంబు - చెఱచువాఁడు, జనుల నోరూర భక్ష్యముల్ - దినెడువాఁడు
పొందు దుర్గతు లేనును - పొందువాఁడ, రామునకు నెగ్గుదలచు దు - ర్మతిని యేని. ౮౩౫

తే॥ అస్త్ర శస్త్ర కార్యంబుల - వ్యర్థపఱచి, క్షణ వినశ్య శరీర ర - క్షణము గోరి
దయ దలఁచి యరులిచ్చు భి - క్షంపుఁదిండి, తినెడు వాఁడొందు గతినాకు - నొనరుఁగాత

తే॥ ఈయనని పల్కి తపియింపఁ - జేయకుండ, నున్నదని యిత్తునని చెప్పి - యురక యొకని
పలుమఱుల్ ద్రిప్పి యలయించు - పాపిగతికిఁ, బోవు వాఁడ రామునకెగ్గు - పూనియున్న.

తే॥ పగఱ గెలుచు ఖడ్గము కేలఁ - బట్టి వెళ్లి, నిత్య రోగాస్పదంబయి - నీచులూరు
నొడలిపై నాస సుదతులు - తోడరి నవ్వఁ, బగఱ కడఁగు దుర్గతులు నా - కగును గాక

తే॥ ధనములును గుల్లు పరిమళ్లు - పఱపియుండు, తన విలాతిని పరరాజు - లనుభవింప
సంకెలల పాదముల తోడ - శత్రునెదుట, నిలుచు హీనగతులు నాకుఁ - గలుగుఁగాక

తే॥ భూపిశాచ కార్యంబులే - నరసియున్నఁ, గుక్కనై రోఁత కూడాని - కుష్ఠువొంది
చదిసి చత్తునుగాక స - జ్జనుల కడరు, గూర్చువాని గతులు నాకుఁ - గొఱలుగాక. ౮౪౦

చ॥ ఇటు లకలంక మానస మ - హీన గతిం దెలిపించు వాక్యముల్
పటుతర రీతిఁ బల్క దన - పట్టి సుఖంబుల నీఁగి యోగి పి
మ్మటఁ జనుదేరఁ గాంచు గతి - మానిని తృప్తి వహించి యాతనిన్
దటుకునఁ గౌఁగిలించెఁ బరి - తాపము గూర్చితి నంచుఁ బల్కుచున్

తే॥ పరమ పూత చేతస్కుఁడో - భరతుచెయిది, కైక క్రౌర్యంబు కౌసల్య - గనినయంత
క్షీర యుగంబున దుగ్ధంబు - జాలువాఱ, శోక మోర్వక మోమూఁద - స్రుక్కియేడ్చె

తే॥ తలఁపఁ దలఁప మనసు క్రుంగి - తలరి కరఁగి, పసవు నాయుమ యుత్తమ - పార్థివేంద్ర
మీఁకులంబున నినువంటి, మేటిగుణులు, పుట్టలేదని దీవించి - యట్టె తడవె. ౮౪౩

తే॥ చిన్నతమ్ముఁడు మఱిమఱి - చిఱిమి లేచు, శోకమున విక్లబుండయి - సురిఁగి తల్లి
చరణముల వ్రాలఁ గౌసల్య - సరగనెత్తి, వత్సలత మీఱ నూరార్చె - వానికుందు

క॥ అత్తఱి వసిష్ఠుఁడచటికిఁ, జొత్తేరఁగఁ గాంచి తండ్రిఁ - జూపంగదె తపో
సత్తమ! యని పదములఁ బడఁ, జిత్తము తలరంగ భరతుఁ - జేర్చె నురమునన్. ౮౪౫

దశరథునకు శత్రుఘ్నుండు దహన సంస్కారాదులు సేయుట.

క॥ నాయన! మీనాయన చని, యీయెడ కీరేడుదినము - లేగెను పుత్త్రుల్
చేయంగఁ దగిన విధులం, జేయుదు గాకనుడుఁ దల్లి - చేయుమ యనియెన్. ౮౪౬

ఉ॥ ఆనతి యిచ్చు తల్లిచర - ణాబ్జములన్ శిరమందు చేర్చి య
మ్మౌని కులేంద్రు వెంటఁ జని - మానుగ ధర్మముఁగావ నీవముల్
దానముసేయు ధీర విను - తంబు సనాతన ధర్మమూర్తి నా
జానగు తండ్రి దేహమును ♦ జాలి దగుల్వడఁ గాంచె నొక్కచోన్. ౨౪౭

క॥ కని ధరఁబడి పొరలుచు రో, దన మొనరిచి యంతఁ జిన్ని ♦ దపుఁ జాయను పొం
దిన మేనిని కన్నిటన్, మును ము న్నాడించి పూత ♦ముగఁ గావించెన్. ౨౪౮

క॥ వేద విదులు పెను చింతను, భూదారు కళేబరంబు ♦ పొలుపగు రవముల్
మేదురముగ మ్రోఁగఁగఁగొని, యాదట బంగరు విమాన ♦ మందుంచి రొగిన్.

క॥ భూరమణ సమూహంబొక, తీరమువలెఁ దోఁచి కుమిలి ♦ తెరలుచు నుండన్
బౌరులు జలనిధి ఘోషము, తీరున రోదించిచుట్టు ♦ తీరిరి గుములై. ౨౫౦

క॥ సారథులు హితులు మంత్రులు, వీరులు సేనాధి పతులు ♦ విరివిగఁ గనులన్
నీరము గార్ప విమానము, వారణ పృష్ఠమున నుంచి ♦ పదిలించి రొగిన్. ౨౫౧

క॥ భేరీకాహళ మురజా, ద్యారవములు జాలి పుట్ట ♦ నడరుట చూడన్
బౌరాంగనాళి కన్నుల, వారక మోది కొని యేడ్చు ♦ వైసమ తోఁచెన్. ౨౫౨

క॥ హరులు కరులు తేరులు భూ, సురులు నృపులు నడవ రాజ ♦ సుదతులు వెనురా
నర విభుని ప్రేతముం గొని, సరయూ తీరంబు చేరె ♦ జన సంచయముల్. ౨౫౩

క॥ చేరి మహీసురులు తెలిపిన, తీరునఁ గార్యంబు లెల్లఁ ♦ దీరిచి భరతా!
రారమ్ము జనకునకు సం,స్కారము లొనరింపు మనుడు- సంయమి యనియెన్.౨౫౪

క॥ నీతండ్రి కై కవలనన్, చేతము రోయంగఁ గలఁకఁ ♦ జెంది ప్రతినమై
సీతోడి వాని త్రెంచెను, ప్రేతక్రియఁదీర్పఁ దగవు ♦ వీడుము వత్సా!. ౨౫౫

ఉ॥ నీవలనన్ గులానుగుణ - నీతి విపర్యయ మందె నన్న యా
భావము తెల్పునట్టి వహి - వానిని త్రెంచెన యన్న తోడనే
తా వికలత్వ మొంది ధరఁ - దాటెను; రాజటు వల్కెనప్పు డీ
పావన చిత్తముం దెలిసి - పాల్పడునే యిపు డట్టి బాసకున్? ౨౫౬

చ॥ ముని యటు పల్కు మాటవిని - మూర్ఛిలి కొండొక తేటి మేలు మే
లని కడు నూర్చి వెక్కి మది - నాఁపఁగఁబూనిన నాఁగకుండఁ బొం
గిన పెను వంతచేఁ గుమిలి - కీడ్పడి గద్గదిక స్వరంబుతోఁ
బనవుచు నెల్ల వారు వినఁ - బల్కెను రాలు కరంగు జాలితోన్. ౨౫౭

చ॥ తుదకిటఁ బ్రేత కృత్యములఁ - దూకొన న్వర్హుఁడఁగాని నీచుఁడన్
బదపడి రాజనై ధరణి - పాలన కర్హుఁడ నైతిఁ జెల్లరే!

పొదలిన సూర్యవంశ్యులగు - పూర్వులలో నొకరుండు నావలెన్
గొదరిన యిట్టి కీర్తిఁ గయి - కొన్న మహాత్ముఁడు కానవచ్చునే? ౮౫౮

ఆ॥ సొరిది వచ్చు మానవ ♦ సుంధరాధ్యులు తమ, విమల ధర్మమునను ♦ వేల్పులైరి
ఎన్న నేను పుట్టి ♦ పిన్ననాఁడే నడ, పీన్గునైతిఁ దనువుఁ ♦ బెంచి చెడితి. ౮౫౯

ఆ॥ కాంచి పెంచు తల్లి ♦ గాదిలిఁ గూర్చిన, మేలు బళిరె! యెట్టి ♦ మేల్మి గలది?
డిందు లేక గాచు ♦ టెంకాయ గెల గూబ, ద్రొక్కు కాయ రీతిఁ ♦ దోఁచినాఁడ.

తే॥ పలు విధంబుల నీరీతిఁ ♦ బలుకు చడలు, భరతు నూఱడఁ బల్కి త ♦ ద్వంశ గురుఁడు
తదను జన్ముని గాని చేయఁ ♦ దగిన కృత్య, ములను క్రమముగా జరపించి ♦ పూర్తిచేసె

చ॥ చలనము నొందు పూలతల ♦ చందము నొందిన రాణులెల్ల భూ
షలును తదంగముల్ మెఱయ ♦ శైల మయూర చయంబు పత్త్రిముల్
వెలయ నికుంజముల్ తుఁగ ♦ లించు వనంబునఁ జొచ్చు కైవడిన్
జ్వలనము నందు చొచ్చిరి వె ♦ సన్ మనముల్ పరితృప్తిఁ జెందఁగన్

ఉ॥ తమ్ముల వైఖరిన్ శశి వి ♦ ధమ్మున రాణుల మోము లంద చం
దమ్ములు దోఁప వహ్నియు ము ♦ దమ్మునఁ జందన శీలిగాఁగ డెం
దమ్ములఁ దృప్తిమైఁ బతి ప ♦ దమ్ములతోడ గమించు స్త్రీలు చే
తమ్ములు చల్లఁగాఁ గొను ప ♦ దమ్మును పొందిరి కాంతుఁ దీరఁగన్. ౮౬౩

తే॥ వారలకుఁ జేయఁదగు క్రియల్ - వరుసఁ జేసి, యరుగుదెంచెను శత్రుఘ్నుఁ - డన్నకడకు
నాఱుదూఱను నాకఱా - యూద ఱావ, భరతుఁ డింటికి నేఁగెఁ బె - న్వనట మునిఁగి.

తే॥ భరత శత్రుఘ్ను లంతటఁ - బది దినములు, యుగములం ద్రోచినట్లుల - నొగిలి త్రోచి
పైతృకంబుల విధ్యుక్త - భంగిఁ గొఱఁత, వడక పూర్తి గావించిరి - కడఁక చెడక

చ॥ నియమిత పైతృకం బెదుట - నిల్చి యొనర్చు వసిష్ఠ మౌని య
వ్యయ గుణశాలులైన ముని - వర్గముతో భరతుం గనం జనెన్
నయ విదులైన మంత్రులును - నాథుఁడు లేని విలాతి దుఃఖ సం.
క్షయములఁ బొందు నంచతని - గానఁగ వచ్చిరి వృద్ధపాళితోన్. ౮౬౬

## ౧౦ ప్రయాణ పటలము (౫౯)

క॥ కరుణాసుస్థిర చిత్తులు, వరమంత్రులు మౌని జన వి ♦ భావసుఁడు సభన్
బరఁగునని సంతసంబునఁ, బుర వృద్ధులతోడ వచ్చి ♦ మ్రొక్కిరతనికిన్. ౮౬౭

క॥ సిద్ధులగు మునుల తోడఁ బ్రబ, సిద్ధులు పండితులు నృపులు ♦ సేనాపతులున్
వృద్ధులు కవులును గాయకు, లిద్ధగుణుని భరతు బలసి ♦ యేర్పడ నుండన్. ౮౬౮

క॥ మతిమంతుఁడగు సుమంత్రుఁడు, తతమతి భరతునకుఁ దనదు ♦ తలఁపు విశదమౌ
వితమగు ముఖ చిహ్నంబులఁ, బ్రతిభా శాలియగు గురుని ♦ వదనముఁ గాంచెన్.

తే॥ మంత్రి సంజ్ఞలను వసిష్ఠ ♦ మౌని నోటఁ, గాక సంజ్ఞలతో బాగు ♦ గా నెఱింగి
ధరణిఁ బాలింపు మిదినీకు ♦ ధర్మమనుచుఁ, దెలియు నట్లుగ నిట్లని ♦ పలుకఁ దొడఁగె

చ॥ అరయుము నావచస్సు నుగు ♦ ణాకర! విప్రులు వృద్ధులున్ మునుల్
సురపతు లాదిగాఁగల జ ♦ నంబులు నీకడ కేగుదెంచుటల్
తిరముగ నీతియున్ దగవు ♦ త్రైవ్యక నెక్కొనఁ జేయుకోసమే
విరివిగఁ జెప్పనేల? యిది ♦ విశ్రుత పద్ధతి నీవెఱుంగవే?. ౨౭౧

చ॥ ధరణిని ధర్మమున్నె అయఁ ♦ దాల్చుట క్షత్రియధర్మమంచు నీ
వరయవె నీమనంబున? స ♦ మంజస రీతిగ నిజగంబునం
బరమున సౌఖ్యమిచ్చు నిది ♦ పావన మానసులైన వారలే
జరపఁగఁ దగ్గ కార్యమగు ♦ సజ్జన సన్నుత సద్గుణాన్వితా!

తే॥ అరసి చూడంగ రాజు లే♦నట్టి భూమి, నలినమిత్రుండు లేని ది♦నంబు సరణి
కలువ చెలిలేని రాతిరి ♦ కరణి జీవ్రుఁ, డెడలు నొడలి వడువునగు♦నృపకుమార!. ౨౭౩

తే॥ నాకలోకంబునను దైత్య♦లోక మందు, నిఁకను గల లోకములయందు ♦ నెన్నఁడేని
జీవులను గావ నొకఁడేఁడు ♦ చెలఁగఁడనుచు, వినఁగరాదింతఁదాఁకను ♦విమలచరిత!

చ॥ క్రమముగ నిశ్చయించి మఱి ♦ కాంచిన బ్రహ్మ సృజించినట్టి స్వ
ర్గమునను భూమియందును సు ♦ ఖ స్థితిఁ బొందిన జీవరాశియున్
సమసెడు ప్రాణికోటి యగు ♦ సర్వచరాచరముల్ విభుండు లే
కమరిక నుంట యే జనులు ♦ నారయ రప్పుడు నిప్పు డెప్పుడున్. ౨౭౫

మ॥ హరినాభీకమలోద్భవుండయిన బ్ర ♦ హ్మంబొట్టి పుణ్యాత్ములె
ల్లరు కీర్తించు యశంబుగాంచి సుజనో ♦ ల్లాసంబుగా నీ ధరా
తరుణిం జేకొని కాచిరింత దనుకన్ ♦ ధన్యాత్మ! యీ నాఁడు కా
పరుల న్నీఁగి పయోధిలోఁ బగులు నా ♦ వంబోలి యల్లాడెడిన్. ౨౭౬

మ॥ తనయా! తండ్రి గతించె నన్నయును కాం ♦ తారంబులం జేరె నీ
జనయిత్రీ వర సంగృహీత ధరణీ ♦ సామ్రాజ్య మిద్దాని నీ
వనుకంపన్ గుణసంపదన్ మనుపుమా ♦ యక్షీణ రక్షామతిన్
జనముల్ మంత్రులు మేము గోరిన యభీ ♦ ష్టం బిద్దియే నావుడున్

తే॥ కనులనిండ బాష్పమ్ములు ♦ గ్రమ్మనతఁడు, గరళముం దినుమంచు ని ♦ క్కచ్చిపలుప
వడఁకు వాని కంఠెను గొప్ప♦యడలుపూని, గడగడ వడంకి పుడమిని♦ పడియె నురిఁగి

ఆ॥ వడఁకి వడఁకి నాల్క ♦ తడఁబడ నయనముల్, ముడుఁగ నాఁడువారి ♦ మొగిని వగచి
ప్రాణములును వాడఁ ♦ బదపడి తెలివొంది, తన తలంపు దెలియ ♦ ననియె నిట్లు. ౪౩౯

ఆ॥ మూఁడు లోకములకు ♦ మూల కారణమగు, జ్యేష్ఠుఁడుండ నేను ♦ శీర్షకంబు
తొడువుటరయ గురులు ♦ నొడువు ధర్మంబయ్యెఁ, దల్లి కార్యమందు ♦ తప్పుగలదె?

ఆ॥ దుష్టురాలు కైక ♦ దొసఁగు సమగ్రించి, యుత్తములగు మీరె ♦ యొదవి పలుక
నడుమ రెండు యుగము ♦ లెడలఁ దుదనువచ్చు, కలియె డాసెననుచుఁ ♦ దలఁతునిపుడు

ఆ॥ రాజసభను నిలుచు ♦ రాజిత గుణులార!, నలువ మొదలు నేఁటి ♦ నరుల వఱకు
నన్నయుండఁ దమ్ముఁ ♦ డవని న్యాయంబున, నేలినాతఁ డుండె ♦ నేని చెపుఁడ. ౪౪౨

ఉ॥ నీతి తొలంగకుండు పెను ♦ నేమ మిదేయని మూదలించినన్
భూతలమున్ భరించుటకుఁ ♦ బూని యొడంబడు వాఁడనే? మహీ
నేతగ రామునే యిటకు ♦ నేఁ దొడి తెచ్చెద మత్కుల క్రమా
సీత కిరీట మాతనికె ♦ నెక్కొన నిచ్చెదఁ జూడుఁ డిందఱున్. ౪౪౩

శా॥ నాచే నయ్యది కాదయేని వని స ♦ న్నం గూడి పద్నాలు గేం
డ్లా చందంబున నారలున్ జడలు నొ ♦ య్యందాల్చి తృప్తిం దపః
శ్రీచెన్నారఁ జరింతు సద్గులు మజే ♦ రీతిం బ్రశంసించినన్
మీచెంతం ద్యజియింతు జీవములఁ జుం ♦ డీ యంచు వాక్రువ్వఁగన్. ౪౪౪

చ॥ భరతుని పల్కులన్ విని స ♦ భాసదులెల్ల సెబాసు! మేదినీ
వరుఁ డట మున్నె రామునకుఁ ♦ బట్టముఁ గట్టఁగ సమ్మతించెఁ దం
డిరి సురభూమిఁ జేర వగ ♦ డింది ధరారమఁ బ్రోచివైచి తు
ర్వర నిను బోలె మీకుల యు ♦ వ ప్రవరుండొకరుండు గల్గెనే?. ౪౪౫

తే॥ పుడమిఁ బాలించి ధర్మంబుఁ ♦ బ్రోచి జన్న, ములను కావించి పెంచంగ ♦ వలయునేమి?
ఈచతుర్దశ భువనంబుఁ ♦ లెడలి చనిన, నీదుకీర్తి సుస్థిరమయి ♦ నెగడుఁ గాక. ౪౪౬

తే॥ అనుడు భరతుండు తనతమ్ము ♦ నపుడపిలిచి, రాజపదయోగ్యుఁడైన శ్రీ ♦ రాముఁదోడి
తేర నరిగెద మని చాటి ♦ భేరి మ్రోఁగఁ, జేసి సైన్యంబు పయనింపఁ ♦ జెప్పు మనియె.

క॥ శ్రీకరుఁడు భరతునాజ్ఞ గు, ణాకర శత్రుఘ్నుఁ డంత ♦ నరయ ంజేయన్
శోకమునఁ బడిన ప్రజకా- వా కమృతముఁ బోల లేచెఁ ♦ బటు ఘోషంబుల్ ౪౪౭

ఉ॥ ఇంద్రియ నిగ్రహాత్ములు ము ♦ నీశ్వరు లాదిగ భూమిఁ గల్గు రా
జేంద్రులు వీరులున్ జనులు ♦ నెల్లరు రాముఁడు రాజటంచు ని
స్తంద్ర విఘోషణంబు విని ♦ తద్దయు నార్చిరి మోద సంభృతిన్
సాంద్ర నినాద మద్ది శ్రవ ♦ ణంబుల జుత్తు సురామృతం బొకో! ౪౪౯

మ॥ భరతుం డన్నను కేతనాంచల పటు ♦ ప్రాంచన్మహాభోగ సుం
దరమౌ నీ పుటభేదనంబునకు మో ♦ దంబారఁ దోడ్తేరఁగాఁ
దురగ స్యందన దంతి వీర భట సం ♦ దోహంబు వే లెమ్మనన్
బుర పాథోనిధి కట్టి చాటు చెనసెం ♦ బూర్ణేందు జన్మంబు నాన్ ౪౯౦

ఉ॥ ఎన్న యుగాంత కాలమున ♦ నేడ్తెఱ లేచు పయోధి సప్తకం
బన్న యటుల్ చమూ సమితి ♦ యానము సేయుచునుండఁ గాంచుడున్
మున్నుగఁ గైక యాస చెడి ♦ మూలము ముట్టఁగఁ బెల్లగిల్లె; నా
మన్నని యందు పౌరులకు ♦ మక్కువ పొంగఁ దొలంగె సంగదల్. ౪౯౧

తే॥ కరులు తేరులు తురగముల్ - ధరణిఁ గప్పె, ఘన పతాకలు గగనంబుఁ - గప్పివైచె
వాహినీ పాద ఘట్టనన్ - వడిగ లేచు, రజము సరసిజాసనుని నే - త్రములఁ గప్పె

తే॥ రుద్రుఁడీలోకములనెల్ల - రుత్త చేయు, దినమునం దోచు ధ్వనికంటెఁ - దివిరె ప్రమోత
రాముఁగాంచు నుత్సాహంబు - ప్రబలమైన, యానకంబెను సైన్యము - త్యధికమయ్యె

తే॥ రాజ్యమును వీడినట్లు పు - రంబు వీడి, వృక్ష సంకీర్ణమగు మహా - విపినమునకు
చామయనుమించుతోఁ జను - రామమేఘు, మిదియ యనఁ గరేణువులతో - నేగెఁగరులు

మ॥ అరవిందంబుల యందముం దెగడు స - మ్యక్పాదలై నట్టి సుం
దరులన్ మోచు కరేణు సంఘములు వే - దండంబులన్ వీడి యా
తరుణీ యాన విలాస సంపదలకుం - దథ్యంబుగా నోడి ముం
దరి పందెంబునకై వహించు కరణిన్ - దైవాజ్ఞ నప్పట్టునన్. ౪౯౨

తే॥ వేదనం గూర్చు భాస్కరు - వేఁడినార్ప, జలద శీకరంబుల వడిఁ - జల్లుచుఁ జను
తఱచు ధ్వజ పటావళులు కో - దండ పాణిఁ, గనక చింతించు కాంతల - గతిఁ జలించె

ఉ॥ ఉన్నత మూర్తియైన రవి - యొక్కటఁ జక్కగు రూపు లొందిపైఁ
దిన్నగఁ బూర్ణచంద్రు లరు - దేరఁగఁ గంధర సంఘ మూర్విపైఁ
బ్రన్నసఁ బర్వి యొక్కమొగి ♦ బంధుర రీతిఁ జరించె నన్న యా
చెన్నున వెల్లినారు నృప ♦ శేఖరు లెల్ల మదేభపాళిపై ౪౯౩

మ॥ ఒక పాథోనిధి తేర్లపై వెడలె వేఱొ ♦ క్కం డిభశ్రేణిపై
నొక నీలాంబుధి వాజి సంచయముపై ♦ నొక్కబ్ధి యుద్ధాత్రిపై
నకలంక స్థితిఁ బోవఁ గాహళ మృదం ♦ గాది ప్రణాదంబు మూ
ర్ఖ కదంబంబునఁ బండితాళి కరణిన్ ♦ రాణించె మౌనంబునన్. ౪౯౪

చ॥ సురుచిర లజ్జయున్ గుణము ♦ సొమ్ముగ సొమ్ములు దాల్చు పొల్పులై వే
సరి ధరియింపమిన్ సహజ ♦ చారుత వేలుపులున్ మరుల్గొనన్,

బెరసిన మందయాన లట ♦ విం గొను రాముని చూడఁ బోవు సం
బరమున నేగినారు కుసు ♦ మంబులు రాలిన వల్లులో యనన్. ౮౯౯

మ॥ చతురంభోధి పరీత భూతల మహా ♦ చక్రంబుఁ బాలించు భూ
పతి వంశాను గతాతపత్త్రము పఁయిన్ ♦ భాసిల్లమిం జేసి యా
పృతనా వారమునందు పిన్నగొడుగుల్ ♦ వే పర్వ నక్షత్ర సం
తతు లొప్పార విధుండు లేని నిసి నాఁ♦ దాల్చెం బ్రభాహీనతన్. ౯౦౦

చ॥ చను నడచేత దిక్కులును ♦ చాలిన విస్తృతి లేనివంచుఁ దె
ల్పిన గురు సేననే యచల ♦ లీల వహించిన దన్నచోఁ జతు
ర్వననిధి వేష్టితం బగుచు - వర్తిలు ధారణి నొక్క చానయుం
చు నబల యంచుఁ బల్కు మను-జుల్ నిజమారయ సత్యవంతులే? ౯౦౧

తే॥ గంద మగురువు కుంకుమ - కలపములును, తారహారముల్లేక లేఁ - తయును వలుద
యైన కుచములు వేఱు భూ-షాలిలేమి, నప్పు డెలనీరుకాయల-యంద మొందె. ౯౦౨

తే॥ తరుణి కుచలేపమైన చం - దనము చేత, నిరుల సరులచే మఱుఁగయి ♦ పరఁగకుంట
గుములు పొదలును లేనట్టి ♦ కొండలవలె, వీరుల బలిష్ఠ భుజములు- వెలసె నచట

ఉ॥ తావి పొగల్ గుబుల్కొనని ♦ తంబము నొంచెడు వేణులారు నే
ణ విమలాక్షు లయ్యెడ నఁ ♦ ణింప కలంక్రియలెల్ల మానఁగా
మేనిన యంజనం బధిగ ♦ మింపని కన్నులు, గెల్చి యావలన్
బోవిడఁ జాఅలర గడుగఁ ♦ బొల్చు కుఠారముఁ బోలి రాజిలెన్. ౯౦౪

తే॥ రణిత కింకిణీ విరహిత ♦ రథములట్లు, సఖుల పిఱుఁదుల మేఖలా ♦ స్వనము లేదు
మధుప రుతిలేని వికచ ప ♦ ద్మములరీతి, చిప్పరు టడుగుల నందెల ♦ రవము లేదు.

తే॥ తాల్పఁదగిన హారాదులఁ♦ దాల్పకుంటఁ, దలరు నడుము లూపిరి విడఁ♦దరుణమబ్బె
కైక పాడు వరంబు లీ ♦ కలువ కంట్ల, నడుములకు మాత్రమే మేలు ♦ తొడరఁబోలు

తే॥ రాఘవుఁడు వీడి చనుటచే ♦ రమణ చెడిన, సిరియుఁ దప మొనర్పఁగ దవ్వ♦ చెందెననఁగ
మరుఁడు మస్తర దుఃఖాబ్ధి ♦ మణిఁగె ననఁగ, లెక్క లేని సేన హారంగు♦ దక్కియుండె

కం॥ దివి భువి దిశలను ముంపఁగ, దవిలి యుబుకు నుదధి యుపమ ♦ దగునన నెల్లాఁ?
దివిరి నడచు చమువు స్వయం, భువు కనులను మనసు మించి ♦ పొలిచెన్ దారిన్.

కం॥ కడలి జలముఁ ద్రావుటచేఁ, బుడమి తిరముగాఁగ నిలుపఁ ♦ బూనుటచే గ
ట్టడఁచుటచే సైన్యము ద్రా, విడ భాషా స్రష్టఁబోలి ♦ విలసిల్లెఁ గడున్. ౯౦౯

తే॥ నెఱలు నా బాల గోపాల-మడరు జనము, సిరియు వీడుటచే సొంపు-చెడి యయోధ్య
అల యగస్త్యుఁడు జలమెల్ల - నాని విడువ, సురిఁగి చేష్పడి యుండిన - శరధిఁ బోలె

క॥ వనముల సుక్షేత్రంబులఁ, బెను గ్రామంబుల నదుల గిరులఁ ♦ బృథివిం గనుచుం
జను సేన త్రోవ నెఱిసే, యని సాకేతంబు వీథి ♦ యనఁ దగి యుండెన్. ౯౧౧

క॥ ఘన గజముల మదజల వా, సనఁ దక్కఁగ విరులొ సరులొ - చందనమో మేల్
పునుఁగో కస్తురియో కూ, ర్చిన కలపమొ తావి విరియఁ - జెందదు సేనన్. ౯౧౨

క॥ మనుజులు కలమెక్కి చనెడి, వననిధికంటెను విశాల - వాహిని యందా
వనితల మధ్యము దక్కన్, ఘన తాటంకాది కాంతి - గప్పదు కనులన్. ౯౧౩

తే॥ మురజ కాహళాదికములు ♦ మ్రోఁగకునికి, సరుగుచున్న చమూసమూ ♦ హమ్ముచూడఁ
బృథుల కుడ్యంబుపై నఁజి ♦ త్రింపఁ బడిన, ప్రభు బలంబును బోలి య ♦ ప్పట్లనుండె.

చ॥ అడవుల రామచంద్రుఁడు దు - రంత మనఃక్లమ మొందె నంచుఁ బూల్
ముడువ కలంకృతుల్గొనని - ముగ్ధల కన్నులనుండి వాఁడిమిన్
విడిచిన యమ్ములా యువక - విస్తృత వక్షములందు గాఁడి నె
వ్వడి నుసుఱాన లేదు మఱి - వజ్ర తనుత్రము లయ్యె వారికిన్. ౯౧౫

చ॥ మదనుని పంచ బాణముల - మానక మున్ను తపించు డెందముల్
సుదతుల చన్నుదోయి పయి - సూటిగ వ్రాలి రమింప వయ్యెడన్
హృదయములందు కైక యెడ - హెచ్చిరు కోప దవాగ్ని మండఁగా
మదమఱి యవ్వి మాఁడునని - మానెను కావలయున్ నిజంబుగన్. ౯౧౬

తే॥ ఇట్లు పెను సేన నడవఁగా - నిద్ధ గుణుఁడు, భరతుఁడును నారలు ధరించి - ప్రక్క వచ్చు
తమ్ము తోడ శతాంగంబుఁ - దఱిసి యెక్కి, పొడవు కొన్న నెవ్వగ తోడఁ - బోవుచుండె

తే॥ తల్లులును తపోధనులును - తండ్రిఁబోలు, మంత్రులును బంధుగులును సా - మంతవరులు
బ్రాహ్మణులు తోడరిక గాఁగ - బలసి రాఁగ, నగరి పెద్ద వాకిలి దాఁటి - నడచె నతఁడు

తే॥ మంథరయనుమ్రుత్యువు జనుల్ - మలయుచుండఁ, ద్రోసికొని పోవుచుంట శ ♦ త్రుఘ్నుఁడు
మండి పరుగిడి గర్జించి - మగువఁ బట్టి, త్రొక్కి నింగికెగుర వేయఁ ♦ దొడఁగునంత [గని

చ॥ భరతుఁడు చేయి పట్టికొని - పావన! పూర్వ నృపాల పద్ధతుల్
వఱదను గల్పి యిట్టి చెడు - పాప మొనర్చిన కైక దేహమున్
నఱకియె యుందుఁ గిన్కయఱ - నజ్జగ నజ్జగఁ గాని, రాముఁడీ
కఱకుఁదనంబు సైఁపఁడని - కాక తలంతునె తల్లి యంచెదన్? ౯౨౦

తే॥ కాన నీతిజ్ఞ! యంతము - లేని చింత, మనకు నెల్లరకును కూర్చు - మంథర పయి
నలుక పూనంగఁ దగదన్న! - యన్న కినియు, ననుచు నూరార్చి తోడ్కొని - యరిగెనవల

క॥ జనములు సేనయుఁ గ్రమముగఁ, జని చెంతనె చుట్టి నిలిచి - నంద్రము చంద
మ్మునను౦డ, రాఘవుఁడు తొలి, దినమున దిగు వనము నందె ♦ దిగిరో నతంఢున్,

శా॥ ఆ రేయంతయు నిద్రలేక నయ నా - నంతాశ్రుపూరంబు నం
దారం దోఁగి వనంబులం దొరకు కా - య్యల్ కూరలన్ మెక్కి యా
శ్రీరాముండు పరుండినట్టి పృథు లో - ర్వీన్ బర్ణ తల్పంబుపైఁ
జేరం దమ్ముఁడు చెంతనుండి తెరలన్ - జింతాకుల స్వాంతుఁడై

తే॥ రాముఁడట నుండి సన్న మా-ర్గమున నడచె, నని శతాంగ తురంగ సా-రంగములను
వెంట రాఁబంచి భరతుండు-విసుఁగు లేక, కాలి నడకతోఁ జనియె నా- కారు టడవి.

## ౧౧. గుహ పటలము. (౭౩)

క॥ కావేరీ తీరావని, కై వడిఁ గేదార ఫలము - ఘన కోసలముల్
వేవే కడచి చని చర, స్థావరములు నగవ గంగ - దరిఁ దారసిలెన్. ౯౨౫

తే॥ విరివియై జలపూర్ణమై - నెలయునదిని, కరి మదాంబుపూరంబులు - గలియు కతన
నళులకుందక్కఁ ద్రావను - జలక మాడ, నొదవదయ్యె నత్తఱిని గం - గోదకంబు

తే॥ తురగ ఖుర ఘట్ట నోద్ధూత - ధూళి పరగి, దివిజ శీర్షము లలముట- దెలియరాదు
కాని, జలమాను టీఁదుట - కడఁకఁబూరలు, కెచటఁ గాంచినఁ గాననై - యేపుమీఱె

క॥ గంగా వాహిని యమృతపు, రంగుగఁ దొలియట్లు తోయ - రాశిఁ గలియఁ జే
రం గాంచ దచట దగ యా, అంగం ద్రావినవి తత్త ♦ అంబున సేనల్. ౯౨౮

క॥ కానల కేగిన రాముని, గాన భరతు వెంటఁ జనిన - క్రందగు జనముల్
సేనలు లెక్కించునచో, నానిక నార్పదుల వేల ♦ యక్షౌహిణులౌ. ౯౨౯

క॥ జనములు గంగాతీరము, ననువుగఁ జేరుటను కాంచి ♦ యంబుధి జలముం
గొను మొగులుఁ బోలు శ్రీరా, ముని మీఁదికి వచ్చెననుచు♦మొగిఁ గుపితుండై.

తే॥ కాలకల్పుండు ధీవర ♦ పాలకుండు, గుహుఁడు కనులెఱ్ఱఁజేసి భ్రూ♦కుటి ముడించి
నాసికారంధ్రముల పొగల్♦ధూసరిల్ల, నట్టహాసమ్ముచేసి వి♦ల్లమ్ములు గొని. ౯౩౧

సీ॥ కెరలిపాపులఁ జంపఁ♦గేలఁ శూలము గొన్న, రుద్రమూర్తియె పెక్కు♦రూపులొందె
ననఁ బ్రాణి భీకర ♦ మైయొప్పు సైన్యంబు, గలవాఁడు బలువిల్లు♦గలుగు వాఁడు
సురియఁ జెరివి యాడు-గఱచుచుఁ బరుసుతోఁ, గ్రుద్ధనేత్రముల మి-ద్గుఱులు రాల
నలుకతోఁ గాంచి నేఁ♦ డాలంబు గలిగెన, కాయని భుజముల♦గ్గలికఁ బొంగ

తే॥ మొగిసి యరుదెంచు నీ చమూ♦మూషికములఁ, గాలభుజగమనై యూవి♦గాలిమ్రింగి
కాడుగాఁ జేయు వాఁడ నీ♦ కదనతలము, ననుచుఁ గటు వీర వాక్యంబు♦లాడికొనుచు

తే॥ పంచ నఖముల కై వడిఁ ♦ బరఁగుసేన, విలయ కాలాబ్ద నిర్ఘాత ♦ విధుల నార్చి
పెప్పు జల్లధులు పొంగిన ♦ సరణిలేచి, తన్ను బలసి రా నది వల ♦ దరినిచేరి ౯౩౩

క॥ సైన్యముఁ గని భరతునితో, జన్యం బొనరించి సేనఁ ♦ జంపి శమన రా
జన్యు పురి కంపి రాజ్యము, మాన్యత రామునకు నొసగఁ ♦ మది గుహుఁ గొంటెన్. ౬౩౪

క॥ విస్ఫారలును సమ్మతింపుఁడు, భేరులు మొరయింపుఁ డరులు ♦ వెడలక యుండన్
దారులు రేవులు చెఱుపుఁడు, తీరపు నావలను నీట ♦ దింపకుఁ డెసఁగన్. ౬౩౫

ఉ॥ ప్రాణహితుండు రాఘవుఁడు ♦ ప్రాయిఁడిగా భువినేల నీక ని
స్త్రాణునిగా నొనర్చి మహి ♦ సంపద వంచనఁ గొన్న భూపుఁ డ
క్షీణ బలంబుతో వనులఁ ♦ జేరిన యన్నను నొంప వచ్చె మ
ద్బాణ పరంపరన్ రిపుల ♦ భగ్నము చేసెదఁ జింతనూడ్చెదన్. ౬౩౬

ఉ॥ వీరలఁ గూల్పనేని పృథి ♦ వీతలమే నను గేలి చేయదే?
వీరలు గంగ దాఁటుదురె? ♦ భీతిఁ జలింతునె వీరి ధాటికిన్?
గూరిమి తమ్ముఁడంచు నను ♦ గొప్పఁగఁ జూచిన రాఘవేంద్రుకై
పోరిని జీవము ల్విడువఁ ♦ బోలదె? యింతకు నేను చాలనే? ౬౩౭

ఉ! అగ్రజుఁడంచు నుంత హృద ♦ యంబున నెంచఁడు వేఁగివంటి స
త్యాగ్రహుఁడైన తమ్ముఁడొకఁ ♦ డందు గలాఁడని లెక్క సేయఁ డ
వ్యగ్ర హితాత్ముఁడై గుహుఁడ ♦ వక్ర పరాక్రమశాలి మల్ల భూ
పాగ్ర సరుండు గల్గునని ♦ యైన మదిం దలపోయఁ డేలొకో? ౬౩౮

ఉ॥ దోసము సామగా నడరు ♦ దూఱును మిత్రులు వీరు శత్రు లీ
వేసమువారలంచుఁ బృథి ♦ వీ పతులెందును చర్చ సేయరో?
చేసిననేమి? చేయమిని ♦ చేసెడిదేమి? గుహుండు జీవముల్
పాసిన పిమ్మటం గద స్ప ♦ పాలుఁడు రామునిపైకిఁ బోవుటల్? ౬౩౯

ఉ॥ రాముఁడు నాడు పోవిడి య ♦ రణ్యములం దపియించుచుండ నీ
ప్రామిడి రాజ్యమేలుటయొ? ♦ ప్రాణము నాకు సుధాసనుంబొకో?
నేమహిఁ గీర్తి నిల్పి మర ♦ ణింపఁగ లేనె? యనుంగుతో వనీ
భూమికి నేగకుండుటయుఁ ♦ బోలెను నానెఱి నేఁడె తీర్చెదన్ ౬౪౦

మ॥ మదమాతంగ తురంగ సద్భట కదం ♦ బంబుల్ నదిం దాఁటుచోఁ
బిదపం జూతము మీఁది కార్య మిపుడే ♦ వే పోయి నౌకాతతిన్
నదిలో నిల్పక తెండు పొండు సమరా ♦ నందంబు డెందంబులం
బొదలం జేయుఁడు మిత్రుకంటె నసువుల్ ♦ ముఖ్యాడఁగా నొప్పదే? ౬౪౧

మ॥ మన వీరావలి కొక్కనాఁటి యునికై ♦ మాఱ్వోడ్డఁగా లేని యీ
మొన మీఁరేల సురాలి తాఁకిననునా ♦ పొల్పారు ♦ కైనున్న యీ

ఘన కోదండ ఘనాఘన ప్రసృత ని ♦ ర్ఘాంత ప్రభా పూర్ణమా
ర్గణ వర్షంబునఁ బేత భూమిగ నౌన ♦ ర్వం జాలనే వేల్మిడిన్? ౯౪౨

మ॥ పరమోదారుఁడు రామ భూవిభునకుం ♦ బట్టాభిషేకార్హ వే
ళ రహిన్ వల్కలముల్ ధరింప నిడు కా ♦ లవ్యాళ సంకాశకున్
వర పుత్త్రిండగు వీని సైన్యముల మ ♦ ద్బాణ ప్రఘాతంబులన్
మురియల్ సేయ శవంబులన్ జలనిధిన్ ♦ ముయ్యేఱు చొప్పింపదే? ౯౪౩

చ॥ రణమున వీరులం దునిమి ♦ రాముఁడు ప్రాకట ధర్మమూర్తి ధా
రణిఁ దగనేలనిచ్చి యమ ♦ రంబగు కీర్తి వహింపుఁ డీరు స
ద్గుణుఁడయి రాజ్యముం దనకుఁ ♦ గొంకక వీడిన యామహాత్ము దు
ర్గుణుఁడయి కాన నుండుటకుఁ ♦ గూడ సహింపక యెత్తెఁజెల్లరే! ౯౪౪

చ॥ యతులకుఁజుట్టమై యడవు ♦ లందు వసించు మదగ్రజుండు స
న్మతి మది నొచ్చునో యనుచు ♦ నాయెద జంకెడిఁగాని లేనిచో
శిత విశిఖాగ్ని చే నిపురఁ ♦ జేయనె సైన్యసముద్ర స ప్తకం
బితవగు లేత పైరు పసి ♦ కిమ్ముగ నచ్చిన చంద మేర్పడన్? ౯౪౫

తే॥ జెట్టివిలుకాఁడు రామునిఁ ♦ జెలిమికాఁడు, గుహుఁడుమూఁకతోనిట్లువా ♦ క్రుచ్చుచుండఁ
గని సుమంత్రుండు సింహాసం ♦ హనను భరతుఁ, జేరి మెల్లన నిట్లని ♦ చెప్పఁదొడఁగె.

సీ॥ ఈగంగ యిరుదరు ♦ లెలమి నేలెడివాఁడు, మగయేనుఁగుంబోలు ♦ మూఁబలుండు
లెక్కయిడఁగ రాని ♦ పెక్కునావలవాఁడు, రామ చంద్రున కతి ♦ ప్రాణ హితుఁడు
సాయుధ వాహినీ ♦ జలరాశిగలవాఁడు, గుహుఁడను విఖ్యాతి ♦ కుదురు వాఁడు
శైలబలుఁడు కరు ♦ ణాళుండు చీఁకటి, ముద్దఁ బోలినమేని ♦ మురువువాఁడు

తే॥ నీవు చనుదారి కెదురయి ♦ నిలిచి నాఁడు, నిన్ను చూడఁ దలఁచినాఁడు ♦ నిర్మలాత్మ!
బలము నందెల్లఁ గాంచిన ♦ బాహువులును, నీలనీరద తనుకాంతి ♦ నెగడు సుభగ!

తే॥ పితృసముని సుమంత్రునిపల్కు ♦ విన్నయంత, నలరి యనఘుండు రాముని ♦ యంతరంగ
హితుఁడ యగునేని ననుచూడ ♦ నేగుదెంచు, మునుపె నేఁబోయి కాంచెద ♦ ననుచు లేచి

తే॥ తమ్ముతో మది నుబుకు ప్రే ♦ మమ్ముతోడ, వెలలి సురనది దరిఁజేరి ♦ నిలుచు భరతు
గుహుఁడు గని వానివేషంబు ♦ గూడఁగాంచి, చెన్ను చెడిన మోమరసి ని ♦ శ్చేష్టుఁడయ్యె

ఉ॥ నారలఁగాంచి మేనిపయి ♦ నంగడు నిండిన ధూళిఁ గాంచి పైఁ
జారు తరాస్య బింబము కృ ♦ శత్వమునన్ జిగి పోక గాంచి యా
తీరు నిజంబుగాఁ గరుణ ♦ దేవత రూపును పోలఁగాంచి పెం
పారిన విల్లు జాఱి పడ ♦ నట్టులె నిల్చెను జాలి బొమ్మనాన్. ౯౫౦

చ॥ పురుష వరేణ్యుఁడౌ భరత ♦ భూవిభుఁడుర్ రఘురాము పోలికన్
బరఁగుచు నున్న వాఁడతని ♦ ప్రక్కనె నిల్చెను తమ్ము లక్ష్మణుం
డొరసిన వాఁడు వెక్కసపు ♦ దుఃఖ భరంబున కంతులేదు శ్రీ
ధరణిజభర్త తమ్ములును ♦ తప్పు లొనర్పఁ దలంపఁ బోరురే?

ఉ॥ తాపము నొందువాఁడు మదిఁ ♦ దాఁచని ప్రేమగలాఁడు రాముఁ బో
ల్తాపసి వేషముం దనరఁ ♦ దాల్చిన వాఁడగు కైక పుత్త్రి ను
ద్దీపిత భావమెల్ల మఱి ♦ తేట పడం గని వత్తు నుండుఁడీ
యోపికఁ ద్రోవఁ గాచి యని ♦ యోధుల కాజ్ఞయొసంగి యంతటన్.

చ॥ కల మొకఁడెక్కివచ్చి రఘు ♦ కాంతుని దిక్కు సమస్కరించు నా
యలఘుని చేరి మ్రొక్క నన ♦ ఘూత్ముల శీర్షహృదంతరంబులం
జెలఁగు యశస్కుఁడున్ విధియుఁ ♦ జేతులు మోడ్పఁగఁ దగ్గ యాతఁడున్
దలిరిచి కౌఁగిలించికొనెఁ ♦ దండ్రికి మించిన కూర్మి తోడుతన్. ౧౫౩

తే॥ భరతుఁ గాంచి గుహుండు నీ♦వచ్చు హేతు, వేమి? యన నతండను మామ♦హీశధర్మ
మందు నుండి తొలంగె మా♦యయ్య దానిఁ, బాప రాముఁ దోడ్కొనిపోవ♦వత్తుననుడు

తే॥ ఒనరు నవ్వార్త వినిగుహుం♦డూర్పుపుచ్చి, యుత్సుకతఫొంగఁ బూరించి♦యుర్వ్రివాలి
మరల భరతుని యడుగు దా♦మరలఁదనదు, హస్తములఁ బట్టియిట్లని♦ప్రస్తుతించె.

చ॥ విమల యశోవిశాల! తలి ♦ వేడఁగఁ దండ్రి యొసంగఁ బాపకా
ర్యము వలె రాజ్యమున్ విడిచి ♦ యానసమందున దైన్యమంది యీ
క్రమమున రాముఁ దోడుకొని ♦ క్రమ్మఱ నేగఁగ వచ్చు నీదు శీ
లము గన వేయి రాములు తొ♦లంకిన నీ సము లౌదురే మహిన్? ౧౫౬

ఉ॥ ఉత్తమశీలమే భుజ బ ♦ లోన్నతి గాఁగల ధీర! నీమహా
చిత్తవిశుద్ధి బోయ తెగఁ ♦ జెందిన నే వినుతింప నౌనె? రా
ట్సత్తమ సంస్తుతంబగు ప్ర ♦ శస్త దినేశ కులేశ కీర్తులో
కెత్తున మ్రింగి నాఁడవు గ్ర ♦ హేశుఁడు తక్కటి కాంతులంబలెన్. ౧౫౭

మ॥ అని పల్కాడి గుహుండు కైకసుతుపై ♦ నత్యంత సౌహార్దముం
గొనియెన్ ధారణి నెవ్వరాతని యెడం ♦ గూర్మిం బ్రమోదించి యుం
చని వారల్? మది నూహ కే యరిది యా ♦ సచ్ఛీలమే హేతువై
చనుఁగాదా? యట రాముపై గుహునకున్ ♦ సంగాతమున్ వర్ధిలెన్. ౧౫౮

మ॥ కరుణాశీలుఁడు కైకపట్టి యతనిన్ ♦ గౌరవ్య భావంబుతో
నిరవారం గని యన్న యీస్థలము నం ♦ దెచ్చోట నాఁడుండె నే

కరణిం నిల్చి వచింపుమా? యనుడు నో ♦ కాకుత్థ్స వర్యా! యిదే
యరయన్ రమ్మని తోడి తెచ్చి గుహుఁడ ♦ త్యంత ప్రమోదంబునన్. ౯౫౯

మ॥ భరతుం డయ్యెడఁ బండ్లపైనఁ దృణత ♦ ల్పంబంది యారేయి భా
స్కరవంశాంబుధి చంద్రముండు నిదురం ♦ గావించుటం గాంచి దు
ర్భర దుఃఖంబునఁ దత్తళించి ధరపై ♦ వ్రాలెన్ మహాభూజ ము
ద్ధుర వాతాహతిఁ గూలు చందమునఁ దా♦దోదూయమానాంగుఁడై. ౯౬౦

శా॥ ఈపాపాత్ముఁడు పుట్టు హేతువున నీ ♦ కీపాటు కైకేయిచే
నాపాదిల్లిన దంచు విన్నపుడు కా ♦ యల్ మూలముల్ మెక్కి నీ
శ్చాపల్యంబున నిందు కూరుకుట లేఁ ♦ చం గాంచుచో నిప్పుడున్
దీపో ప్రాణము వీడకుంటి నిఁకఁ బృ ♦ థ్వీ భారముం దాల్పనో? ౯౬౧

తే॥ తమ్ముఁడా! అన్న నిద్రించు ♦ తలమిదెనఁ, గూర్మిచే భోగ భాగ్యము♦ల్గాలఁ ద్రోచి
వెంట వచ్చిన యూర్మిళా♦విభుఁడు రాత్రి, గడపె నెచ్చటఁ గాన్పింపఁ♦గదవె యనుడు.

తే॥ సీతయును రాముఁడిచట వ ♦ సించి నిద్ర, సేయ నచ్చట విలు దాల్చి ♦చేతితోడ
వేఁడినిట్టూర్పుతో ఱెప్ప ♦ వేయకుండ, నిలిచి తెలవాఱు దాఁకఁదా♦నలఁగుచుండె

చ॥ అన విని మాండవీ పతి గు ♦ హాఖ్యున కిట్లను తమ్ములంచుఁ బు
ట్టిన ముగురందు నొక్కఁడ ఘ ♦ టించితి నంతము లేని సేగి నా
యనుజుఁడు దానిఁ దీర్చ స్వసు ♦ ఖావలి వీడుచు వెంటనేగె భూ
మిని కడుఁ బ్రేమకుం గలదె ♦ మేరయు? నాబ్రదు కేల కాల్పనే? ౯౬౪

చ॥ అని యట నాఁడు ధూళిపయి ♦ సంగముఁ జేర్చి పుళిందరాజ! ది
వ్యనదిని దాఁటఁ జేసిన న ♦ నంత నిరంతర చింత దీర్చి రా
ముని కడఁ జేర్చి యాపదను ♦ పూర్తిగఁ బాపిన పుణ్యమూర్తివౌ
దని భరతుండు కోరుటయు ♦ నాతఁడు సమ్మతిఁ జూపి యంతటన్. ౯౬౫

చ॥ సరియని బోయఱేఁడు తన ♦ సంగడికాండ్రను చేరఁ జీరి మీ
రురవడి నేగి యోడల మ ♦ హోన్నతి నాయిత పర్చి తెండనన్
హరు రజతాద్రి రాము విభు ♦ హస్త విభంజిత మేరు శైలమున్
నర తురగేంద్రు పుష్పకము ♦ నాఁ బలు రూపుల నొప్పు నావలున్. ౯౬౬

చ॥ ఆవలి వారి నీవలికి ♦ నావలి కీవలి వారిఁ జేర్చుటన్
దేవ మహీతలంబులకుఁ ♦ దేఁకువ జీవులఁ జేర్చు పుణ్యపా
పావలి నాఁగఁ జెల్వొలయి ♦ యాఱపు యాపముఁ బోలి యొత్తుగా
నావలు చేరె నందముగ ♦ నాకనదీ జలమెల్ల నాడుచున్. ౯౬౭

క॥ భరతుని గని గుహుఁడిట్లను, నరవర! లెక్కకును మీఱు ♦ నౌకలు వచ్చెన్
బరికింపుఁడన్న నతఁడును, త్వర నెక్కింపుఁడని తన ప్ర ♦ ధానికిఁ దెలుపన్. ౧౮

ఉ॥ ఏపగు నాజ్ఞ నౌదల వ ♦ హించి సుమంత్రుఁడు గుంపు గుంపుగా
నోపిన పద్ధతిం జలిపి ♦ యోడలఁ జేర్ప రథాశ్వ దంతి సే
నా పరివారముల్ మనుజ ♦ నాథులు బంధులు నెల్లవారు వీ
చీ పరిపాటి రత్నములు ♦ చిందు సురాపగ దాఁటి రయ్యెడన్. ౧౯

మ॥ విలయాంతంబున మేఘముల్ గదియఁగా ♦ వేలేచి గర్జాళితో
జలముల్ పూర్తిగఁ ద్రావఁ దోయధిని ప్రా ♦ ల్పొందంబునం బొందికన్
గలముల్ పెందెర కంబము ల్పొనర శీ ♦ ఘ్రుంబేగు నంగంబునన్
గలభంబుల్ పయికెత్తి హస్తముల గం ♦ గా వారి నీఁదె న్వడిన్. ౨౦

ఉ॥ సామజముల్ జలంబులను ♦ చప్పుడెసంగఁగ నీఁదుచుండ, ము
క్తామణులున్ దరంబులను ♦ దగ్గ ఝషంబులు లేవఁ ద్రోవఁ బ్రో
ద్యామ మహాబ్ధి తోయమును ♦ దివ్య నదింజొర, దేవ గంగయున్
రాముని చూచు కౌతుక భ ♦ రంబుననో వడి దాఁటెఁ గూలమున్. ౨౧

చ॥ ఘనమగు తేరులందలి యు - గంధర చక్ర యుగానుకర్షముల్
పనివడి యక్షమాదిగ న - వస్కరముల్ విడఁదీసి వానికిం
బనుపడఁ బూన్చు గుఱ్ఱములఁ - బట్టుగ నావలఁ బంపినారు చ
చ్చిన పిదపన్ శరీరములఁ ♦ జేర్చెదు కర్మములం బలె న్వడిన్. ౨౨

తే॥ పాలసుద్ద శరీరముల్, భయము ముద్ద, మనసు, కరువలి ముద్ద కా ♦ ళ్లును గలట్టి
పవన జవన తురంగిముల్ - బయలుదేఱె, నడకఁ జాఱు ముద్ద నాఁదగు ♦ నావలందు

తే॥ కలుకు లెదురెదు రయి యొత్తు - గాఁగఁ జేరి, కానవచ్చుటచే భద్ర ♦ గజ చయంబు
లొండొకటిఁ గ్రుమ్మసిలువఁగా ♦ నొప్పుమీఱు, దంతములభంగిను బ్బైన ♦ స్తనము లొప్పె

తే॥ ఉత్తరీయములం బోలి ♦ యొత్తుగాఁగ, నలలు లేవ దిగిన మద ♦ హస్తి నికర
శిరములం గుంభ వరములు ♦ చెలఁగెఁ జూడ, జాహ్నవీ స్తనములఁ బోలి ♦ జానుమీఱి

చ॥ ఉరవడి నావలేగు నెడ ♦ నొక్కటి నొక్కటి దాఁకఁ గోమలుల్
కరము మనః కలంకమునఁ ♦ గాతరలై యిరువంకఁ జూడ, దు
ర్భరమగు విభ్రమంబున, శ ♦ రంబులు త్రోవఁ జలించి భీతిమై
నుఱుకుచుఁ ద్రుళ్లు వాలుగల - యొప్పు వహించెను వారి చూడ్కుల్.

చ॥ చెరచెర రెండు ప్రక్కలను ♦ చేరికఁ దెట్లఁ గదల్చ లేచు తుం
పరలు వరాంగనా మృదుల ♦ వస్త్రములం దడుపంగఁ దోరపుం

బిఱుఁదుల కాంతు లుట్టి పడి ♦ వెల్వడ, డెందములందు కుంది ము
చ్చిరి తల వ్రాల్చు వీరులకుఁ - జింత రవంత తొలంగెన త్తఱిన్

శా॥ ఈ తీరంబునఁ గల్గు వాహినులఁ బై ♦ నెక్కించి కొంపోయి వే
ఱా తీరంబున డించి క్రమ్మఱెలు శూ ♦ న్యంబైన నౌకావళుల్
దాతృత్వం బలవోక యిచ్చి మఱియున్ ♦ దానంబు సేయంగ సం
ప్రీతిన్ రత్న నివాసుఁ జేరెడి ఘన ♦ శ్రేణిన్ విడంబించెడిన్.

ఉ॥ నమ్మిలి యీఁకలందనరి ♦ నల్లని ధూపము వోలె నాడు పొం
కమ్మగు కాఁడ లయ్యెడలఁ ♦ గంబములం బలె నిల్వ నాణి ము
త్యమ్ముల జంపు లుల్లసిల ♦ నల్లల నాడెడి నల్ల ఱెక్కముల్
క్రమ్మిన చాపలంబలె వి ♦ రాజిల నావలు వోయె నల్లనన్.

సీ॥ గంగ యాకాశంబు♦గాఁగఁ జిందిన ముత్తె, ములు విరాజిలు బుడు ♦ ములుగ నొప్ప
డెందమ్ములం బోలు ♦ నందంపు మోముల, మించుఁబోఁడులు పయ ♦ నించునావ
లెలమి జలము లాడి ♦ బృందారకాంగనల్, గమనించు సుర విమా♦నములఁ బోలె
తుంపురుల్ లేవఁగాఁ - ద్రోచు తెడ్లడుగుల, వలెఁ గానరాఁ జెల్వ♦లలరు నౌక

తే॥ వారిపాదంబులును వెలి♦ వచ్చితోఁప, ప్రాణములు పొంది నడచెడు ♦ పగిది నొప్ప
సేనలును పౌరవరులును ♦ చేడియలును, గంగ వెనుకఁ బడఁగ నట్లు♦కడచినారు. ౯౮౦

ఉ॥ తక్కువ జాతిచేత ఘటి ♦ తంబయి త్రోవఁగఁ బూను నావపై
నెక్కక కామ వేగమున ♦ నేపున మిన్నున ముానివర్గముల్
చక్కన నేగె, నిక్కముగ ♦ సత్ఫల మిచ్చెడు కృత్య మొక్కఁడే
నెక్కడ నేనియుం గలదె ♦ యిద్ధ తపంబున కంటె నిద్ధరన్?. ౯౮౧

చ॥ సుడులు గలట్టి వెల్లువలఁ ♦ జొప్పిలు గంగను దాఁటి యెల్లరున్
దొడరికఁ దీరముం గదియ ♦ దుర్ధన వాంఛలు వంచనంబులున్
విడిచి ప్రభుత్వముం జరపు ♦ వీరుల కీర్తులఁ గ్రింద చేసి యీ
పుడమి మహోన్నత స్థితిని ♦ పొందిన యా భరతుండు చెచ్చెరన్.

తే॥ అనుపమగుణిశత్రుఘ్నుఁడు♦జననులును, మంత్రుఁడును గుహుఁడెక్కఁగా♦మాన్యుఁ
భరతుఁడెక్కిన యంతనా♦ పడవ నడవ, సాగఁ దెడ్లను కాళ్లతో ♦ సత్వరమున. [డైన

సీ॥ బాంధవుల్ దేవతల్ ♦ ప్రణతులై సేవించు ♦ కోసలేంద్రాత్మజన్ ♦ గుహుఁడు గాంచి
యీమె యెవ్వరి తల్లి ♦ యెఱిఁగింపఁ దగునన, భరతుఁడిట్లను వేని ♦ వాకిలికడ
రాజులు మనవికై ♦ రహిఁగాచి యుందురా, దశరథేశ్వరు జ్యేష్ఠ ♦ దార యీమె
కమలజు నాభిని ♦ గన్న మహాత్ముని, ఘన తనుఁ గడుపారఁ ♦ గన్నతల్లి

తే॥ భువన తారకమగు రామ ♦ భూరిఫలము, కడఁక జగముల కొనఁగిన ♦ కల్పతరువు
అతనిఁ గనుటచే నొందు భా♦గ్యంబదెల్ల, నేను జనియించుకతమున♦నీఁగికొనియె. ౯౮౪
తే॥ అనుడు గుహుఁడామె యడుగుల♦నడలిపడఁగ, వత్సముంబాయు గోవునా♦వనరుదేవి
యాతఁడెవఁడనమాయన్న♦హితుఁడుమాకు, నన్నగుహుఁడనిభరతుఁడా♦యమకుఁదెలుప
ఉ॥ నాయనలార! దుఃఖమున ♦ ణంపుడు సత్య పరాక్రముండు భో ౯౮౫
గాయతనంబు రాజ్యరమ ♦ నందక కానకు నేగుటెన్న మే
లే యొనరం గతంబయిన ♦ దింక మహామతిఁ గూడి యెవ్వర
త్యాయత భూమి నేలు కొనుఁ ♦ డర్మిలి నొద్దికఁ జాలకాలముఁ. ౯౮౬
చ॥ అనుడు సుమిత్రఁగాంచి గుహుఁ ♦ డల్లన నిట్లనుఁ బ్రేమపూర్ణయీ
జనని నిగూర్చి పల్కుమనఁ ♦ జక్కటి పీడని చక్రవర్తి కొ
ప్పిన కడగొట్టు భార్య రఘు ♦ వీరుని సన్నిధి పాయకుండు నా
యనుజుని కన్నతల్లి సుగు ♦ ణాలయ యంచు నతండు దెల్పఁగన్. ౯౮౭
చ॥ తనపతిఁ గాటికంపి కుప ♦ థంబునఁ బుత్త్రుఁడు దుఃఖ వార్ధిలో
మునుఁగఁగ రాఘవుండు వన ♦ ముం జొర విష్ణువు గొల్చు లోకముల్
తనమది నున్న క్రౌర్యమునఁ ♦ దక్కఁగ గొల్చిన కైకఁ జూపి యీ
జననిని గూర్చి పల్కుమనఁ ♦ జయ్యన నా భరత ప్రభుం డనుఁ. ౯౮౮
ఉ॥ దొడ్డగు నెంజిలిఁ భువికిఁ ♦ దుందుడు కొప్పఁగ గూర్చి నిందయఁ
బిడ్డను పెంచుతల్లి పృథ ♦ వీస్థలి ప్రాణములేని పోల్కిఁ జే
రెడ్డఁ దపించుచుండ లవ ♦ మేని యలందురు చిన్నెలేని యీ
వెడ్డరి యెవ్వరో యెఱుఁగ ♦ వే? ననుగన్న మహాత్మురాలగుఁ. ౯౮౯
చ॥ అనియతఁ డాడు పల్కువిని ♦ యగ్గుహుఁడంతట వారికిం గ్రమం
బునఁ దనమేల్మి కేల్మొగిచి ♦ మ్రొక్కెను హంసి యొకండు తెక్కలఁ
గొనక జలంబు నీఁది దరి ♦ గొన్న వితంబున ద్రోణియుం దరిఁ
గొనకొని చేరె జాహ్నవికిఁ ♦ గూరిమిఁ జేతులు మోడ్చి రందఱుఁ ౯౯౦
తే॥ దిగిన జనులు ముగ్వురు ♦ తీరమందు, పల్లకీ లెక్కిచనఁగ నా ♦ భరతుఁడపుడు
క్రొత్త కన్నీటి వెల్వలఁ ♦ జిత్తభార, మడఁగఁ గాల్నడ గుహునితో ♦ నడచి నడచి
తే॥ కర్మ భరము జ్ఞానాగ్నిచేఁ ♦ గాల్చివైచు, వరబలుండగు మునిభర ♦ ద్వాజువనము
చేరె నమ్ముని వారల ♦ తీరుగాంచి, వృద్ధయతులతో నక్కడ ♦ కెదురు వచ్చె. ౯౯౨

౧౨ పాదుకా పటలము. (౧౪౧)

క॥ అరుదెంచిన యతివరుఁగని, భరతుఁడు తండ్రివలె నెంచి ♦ ప్రణతియొనర్పఁ
హరుఁ బోలిన యమ్మునియును, భరతుని దీవించెఁ బుత్త్రి ♦ వాత్సల్యమునన్. ౯౯౩

క॥ భరతా! నీకుం జేరిన, ధరణిం గిరీటము ధరించి ♦ తాత్పర్యమునన్
భరియింపక నారలు జడ, లిరవుగ ధరియించి రాఁగ ♦ నేమి కతంబో?. ౯౯౪

క॥ అనుడు మన మెరియఁగినుకను, మునివరుఁగని ప్రాంజలిలక! మొట్టమొదట ని
ల్లనువగు పనియొనరుపలే, దనుటయు మిము బోఁటివారి ♦ కర్హమె చెప్పుఁడీ!. ౯౯౫

మ॥ శ్రుతి శీర్షప్రతిపాదితాంఘ్రి యుగుఁడై ♦ శోభిల్లు శ్రీరామ భూ
పతికిం దమ్ముఁడనై నెఱిన్ విడిచి భూ ♦ భారంబుఁ గైకొందునే?
యతఁడే వెన్కకు వచ్చి రాజ్యము ప్రియం ♦ బారం గొనండేని ని
శ్చిత బుద్ధిన్ వనులంద యున్నకడ ని ♦ శ్చింతం బ్రవర్తించెదన్. ౯౯౬

క॥ ఆపలుకు భరతుఁ డాడఁగఁ, దాపస వరతనువు లుబ్బఁ ♦ దన్మానసముల్
ప్రాపిత హరిచందన కృత, లేపమ్మునఁబోలె మోద ♦ లీలలఁ దేలెన్. ౯౯౭

క॥ మునుకొను నెనరున భరతుని, తన శుద్ధకుటీరమునకుఁ ♦ దతమతిఁ గొని య
మ్ముని సేనకు విందులు పం, బిన వేడ్కనొనర్తు ననుచు ♦ వేలిమి చేసెన్. ౯౯౮

క॥ తలఁచిన యంతన దివియును, లలిత గతి న్నిలిచె జనము ♦ లకు వేఱొక పు
ట్టొలసిన గతి తమ ముందటి, నెలవు మఱవ సుఖ జలధి ము ♦ నింగిరి వారల్. ౯౯౯

తే॥ చెడని ధర్మ ఫలంబులఁ ♦ బడయువార, లంచు రంభాదు లెదు రేగు♦ దెంచి పొగడి
యిందు మండలములఁ బోలి♦యొసక మెసఁగు, సౌధములకుఁ గొంపోయిరి♦సకలజనుల

తే॥ గందవొడి మేనఁగూర్మి న ♦ లందినారు, విన్నువాఁకలో ముక్కగా ♦ వించినారు
శిరములం గల్ప సుమములఁ ♦ జెరివినారు, సుమములంబోలు వల్వలఁ ♦ జుట్టినారు

తే॥ కుసుమ లత కూనలం బలెఁ♦గునిసి నిలిచి, సుందరాంగులు నగలిచ్చి ♦ సొగసుచేసి
యొనర దేవ రాజాను పీ♦ యూష కల్ప, మైన యోగిరములు వెట్టి ♦ యలరఁజేసి

తే॥ హంస కేకి తూలిక లెత్తు ♦ నైన పత్తి, తెల్లదూది బూరుగదూది ♦ తీర్చిచేయు
పట్టుసెజ్జల హరిణుల ♦ పగిది దేవ, వనితలు పరుండ నెల్లరు ♦ కునికినారు. ౧౦౦౩

తే॥ పలికలు మొదలుగఁ బల్ల ♦ కీలు మోచు, వారివఱకుఁ గ్రమంబుగా ♦ గారవమున
సుఖము నొందిన విబుధుల ♦ మాడ్కినుపచ, రించి వారి యెడఁద లల ♦రించినారు

తే॥ ఇటులు రంభాదులైన బిం ♦ బాధరలును, వారియాజ్ఞల దాసుల ♦ వలె నొనర్ప
భరతుతో వచ్చుకాంతలు♦ భవ్యమైన, దివ్య భోగంబులంది సం♦తృప్తిఁ గొనిరి. ౧౦౦౫

తే॥ నందనవన నవ ప్రసూ ♦ నములతోఁ, గొనుచు నంధులు కేలూఁత ♦ గొని చరించు
కరణి నచ్చటి పిల్లతె ♦ మ్మెరలు పొలసె, సకలజనముల మనములు ♦ సంతసింప.

తే॥ క్షౌద్రమెత్కువ కలిపిన ♦ కబళములను, లేఁత వరియూకురాసి గ ♦ ల్పించి కల్ప
కంబు లొసఁగ భుజించెను♦గజచయంబు,మదజలము ద్రావిమధుపము♦ల్మదముగొనఁగ

తే॥ నరక బాధలఁ దొలఁగించు ♦ గురుతగలుగు, నీరముల వారణంబు లిం♦పారఁ ద్రావె
పచ్చతా లేతకాంతులు - పరిఢవిల్లఁ, బెరుఁగు కసవుఁ దురంగముల్ ♦ వేడ్కమేసె.

క॥ అందఱు నారీతిగ బలు, విందుల సురభోగ మనుభ ♦ వించిరి భరతుం
డందలి కాయల దుంపలఁ, బొంది యొడలు ధూళి నునిచి ♦ పోఁగడపె నిసిన్

తే॥ తెలివిగలుగుచో పీడెడు♦కలయుఁ బోలె, నమ్మహాభోగములు పూర్తి♦యగుడుఁ బుణ్య
ఫలము పొందిన జీవి క♦వ్వలి విధాప్తి, కరణి నిరులు తొలంగఁగఁ ♦ దరణి పుట్టె

తే॥ త్రికర ణైక్యంబుగాఁ బాడి ♦ తివిరి చేయ, కుండు జీవికి వలె భోగ ♦ యుక్తిమాత్ర
సురపదచ్యుతులై భువిఁ♦ జొచ్చువారి, వలెనె వారలు పూర్వభా♦వములఁ గనిరి౧౦౧౧

తే॥ నాఁటి యుదయమ్మునఁ బెనుత్రోవ♦నడచు సేనఁ, గాంచి దివ్యులు వననిధి ♦ గాదు భరతు
సైన్యమని యెన్న నయ్యది ♦ శైలవనము, లెల్ల దుక్కిగా మరుభూమి♦యెల్లఁ జేరె

క॥ పెరిఁగిన రజమున మఱఁగిన, తరణియు శీతకరుఁడగుచుఁ ♦ దాపము వీడెన్
కరుల మదజలము నడవం, బొరయని రొంపియయి యెడరు ♦ పొలముగ మాఱెన్.

క॥ రాజుల తెల్లని గొడుగులు, రాజిలె గురుతరుల నీడ - ప్రాపిన కరణిన్
రాఁజుకొను గులక రాల్గల, యా జగ మరు భూమి పంది♦రై యొప్పెనఁ గెన్.౧౦౧౪

తే॥ అధికరాజ్య సంపద గొను - మంచుజనని, పలుక నొందిన కినుక య ♦ గ్గలముగాఁగ
మొగమెఱుపు మేనునల్లనౌ-పుణ్యుఁ గాంచి, ప్రేమఁ గరఁగి యెండిన తరు-వితతి ననిచె

తే॥ జీవముల కంటె గొప్పది ♦ శీలమనుచు, సత్యవాక్కై మరణించు ♦ జనవరేణ్యు
దడము క్రూరమౌనెడరుఁ గే♦ దారమట్లు, దాఁటి చిత్రకూట శిఖరిఁ♦దఱిసె నంత.

భరతుని సైన్యమును కని లక్ష్మణుఁడు కోపించుట

సీ॥ అధిక భూరజము న♦శ్వాదులు రథములు, కోపానఁ జెలరేఁగు - కుంభిచయము
కలిగించు రవమును ♦ కాల్బలంబుల కల, కలమును విని గొప్ప - బలమె యనుచు
నేల యుబికి లేచు - పోలికఁ జనునొక్క, శైలాగ్ర మెక్కి ల♦క్ష్మణుఁడు చూచి
యిల శాశ్వతంబుగా - నేల నిచ్ఛించి దు, రాశచే దుర్బుద్ధి - యడర నిట్లు

తే॥ భరతుఁడే కూర్చుకొని సేన - పరశురాము, గెలుచు జోదుపై దాడి సా-గించెననుచుఁ
గ్రుద్ధుఁడై శిఖరంబు ను♦గ్గుగను ద్రొక్కి, దుమికి వడి నన్న యొద్దకుఁ♦దొడరి వచ్చి

చ॥ భరతుఁడు తోఁడఁబుట్టువను ♦ పాటియు నెంచక గొప్పసేనతో
నురవడి దాఁక వచ్చెనని ♦ యొత్తిన కిన్కఁ గటారి చెక్కి తోం
దొరగ ధనుస్సు నెత్తికొని ♦ తూణముఁ దాలిచి యన్న పాద పం
కరుహములన్ భజించి పలు ♦ కం దొడఁగెన్ మది తత్తఱింపఁగన్.౧౦౧౮

చ॥ ఇహపర సౌఖ్యముల్ విడిన ♦ యీ భరతోద్ధుర బాహుశక్తియున్
సహచర సైన్య సత్త్వమును ♦ సత్యపరాక్రమ! నీదు తమ్మును
త్సహాన మహా సహాయ బల ♦ సంపదయున్ ముదమారఁ జూడు దు
స్సహతర కష్టము ల్దొలఁగి ♦ నంతస మందెదు నేఁడు రాఘవా! ౧౦౧౯

ఉ॥ పీనుఁగు పెంట చేసి యిటఁ ♦ బేర్చిన తుంగ మతంగజంబులన్
జాను తొఱంగి పడ్డ రథ ♦సంఘముఁ బ్రేవులు చింద కూలు నీ
సేనల నుద్ధుగుడ్చి తెగి ♦ చిందఱ వందఱ యైన తేజులన్
మానగు రక్త వాహినుల ♦ మానక చూచెదు గాక రాఘవా! ౧౦౨౦

చ॥ తళతళ లొప్పు తూపు లడి ♦దంబుల చేతుల బొందడంబులం
దళమగు ఱొమ్ములం దొలిచి ♦ దద్దఱు ప్రాణము తోడ వీఁపునం
గళచెడ దుస్సి రక్తము ము ♦ ఖంబుల నొప్పగ వెల్ల దిక్కులన్
కళవళ మంద నేచుటలు ♦ గాంచెదు గాక ప్రసన్నరాఘవా! ౧౦౨౧

చ॥ జవస తురంగముల్ కెరల - స్యందన హాటక శృంగ పంక్తులం
దవిరళమై పిశాచము ల - హంకృతి నార్చుచు ప్రీలు కేడెముల్
దవిలి ధరించి హస్తములు ♦ దట్టుచుఁ బాటలు పాడు చాడుచున్
జవి గొన నల్లఁ ద్రావి కడు - జంపునఁ ద్రేన్చుట చూడు రాఘవా! ౧౦౨౨

తే॥ భరతు సేనా మహీజంబు - పాదుతోడఁ, ద్రుటిని పేరు లేకుండఁగఁ - ద్రుంచి వైవ
స్వర్గ పృష్ఠంబు విఱుగ స్వ- భార మిూఁగ, ధాత్రి యూఱట గొనుటయుఁ-దవిలి కనుము

చ॥ ఎససిన రక్త వాహినుల - నీఁదుటచే నొడలెఱ్ఱనైన శా
కినులును ప్రేత భూత తతి ♦ గిట్టి కబంధములున్ సమస్త ప
ట్టనములు నీ కరంబుల న ♦ డంగిన వంచు సురావళిం బలెన్
గని మసమందు సంతసిలి ♦ గంతుట గాంచెదు గాక రాఘవా!. ౧౦౨౪

క॥ కరులు హరులు బలియురు తెగ, నురవడిఁ బ్రవహించు రక్త ♦ ముదధిం గలియన్
శరధులు రక్త శరధులై, కొఱరయుటగని మనమునందు♦మోదింతు నృపా. ౧౦౨౫

చ॥ విఱుగ శతాంగముల రథిక ♦ వీరులు చావఁగఁ గైదువుల్ చెడన్
దఱిఁగిన దంతి వాజి భట ♦ తండ శిరమ్ములు నంఘ్రు లూరువుల్
బరులు కరంబు లొ డొకటిఁ ♦ బాసి రణస్థలి ఘోరభూమిగాఁ
బఱపు మదీయ బాణముల ♦ పద్ధతి గాంచెదుగాక రాఘవా!. ౧౦౨౬

చ॥ మురువగు ఱెక్కలున్ గనక ♦ పుంఖములుం గల మచ్ఛరంబుల
య్యురువుర ఱొమ్ములం దొలిచి ♦ యిచ్ఛమెయిన్ గగన స్థలంబునన్

దిరిగెడు కంక గృధ్రములఁ ♦ దీయుని విందొనరింపఁ బిల్వఁగాఁ
దొరకొరఁ బృష్ఠభాగమున ♦ దుయ్యుట గాంచెదు గాక రాఘవా! ౧౦౨౮

చ॥ ఒక సకియందు మోహమున ♦ నుర్వర నొంచిన రాజు నాజ్ఞచే
వికలుఁడు వొందినట్టి పృథి ♦ వీస్థలి నేలుట వీడి యిద్వైధిన్
ప్రకటిత రీతి నన్నపయి ♦ వైరముతో నిట వచ్చినాఁడు నా
రకమున కేగు వాఁడిపుడు ♦ క్రన్నన నావలనన్ రఘూత్తమా! ౧౦౨౯

తే॥ పుడమివీడి కాననములఁ ♦ బొందుసీకుఁ, గలుగు నాపదఁగని నిన్ను ♦ కన్నతల్లి
యడలుటం గాంచి మోదించి ♦ నట్టికైక, నేలఁబడి పొర్లి యేడ్చుట ♦ నేఁడుగనుము.

తే॥ ఒక్క త్రుటిలోనె యీ బల ♦ ముక్కడంచి, త్రిపురముల దహియించిన ♦ మృడుని భంగి
గ్రాలువాఁడ నటంచు లక్ష్మణుఁడు పలుక, నల్ల నిట్లను జానకీ ♦ వల్లభుండు. ౧౦౩౦

ఉ॥ తమ్ముఁడ! నీ తలంపులకుఁ ♦ దగ్గ విధంబున సర్వలోక జా
లమ్ముఁ గలంగఁ జేయఁగఁ ద ♦ లంచితి విప్పుడు దానినాఁప శ
క్యమ్మొకొ? దానిఁగూర్చి యిఁక ♦ నాడుట కేమియు లేదు సావధా
నమ్మున విందుగాక యొక ♦ జ్ఞాన వికాస విధాన కార్యమున్. ౧౦౩౧

చ॥ జగముబలంబు మెల్చిన భు - జంబులు గల్గిన వీర! సుస్థిరం
బుగ మనవంశ జాతులగు ♦ పుణ్యుల లెక్కిడ శక్యమౌనె? యా
సుగుణుల నొక్కరేని తమ ♦ సూనృత ధర్మములం ద్యజించిరే?
నిగమ హిత ప్రకారములు - నేర్చిన యాభరతుండు దుష్టుఁడే? ౧౦౩౨

చ॥ హితమతి సత్యవాక్యుఁడగు ♦ సీతఁడొనర్చు సమస్త కార్యముల్
శ్రుతి హితముల్; విరుద్ధములు ♦ చొచ్చుటగానమ; నీవు నాయెడన్
మితి చెడనుంచు ప్రేమమున ♦ మించి పరాచరిసింపకుంటి వె
వ్వితమునఁ జర్చసేయఁ గ్రుధ ♦ వెంచిన డెందము సత్కృతమ్ములన్?

ఉ॥ అడికవోవ నన్నయను ♦ నర్మిలి నాయెడ కేగుదెంచుచు
న్నాఁడు సమస్తభూతలము ♦ నాకొసఁగన్ మది నిశ్చయించి యు
న్నాఁడిది నీ వెఱుంగక ఘ ♦ నంబుగఁ బోరఁగ నెత్తివచ్చుచు
న్నాఁడని యెంచుటల్ మతి కొ ♦ నందగు పద్ధతి యౌనె? తమ్ముఁడా!

క॥ భరతుఁడు నేలను సేనల, సిరి నొసఁగి క్షమాపణంబు ♦ సేయఁగఁగోరన్
బరిణతి వచ్చె ననుట విడి, యిరవుగఁ బోరంగ ననుచు - నెంచుట తగునే? ౧౦౩౫

తే॥ తెలియుమా సద్గుణంబను ♦ తేరి చీల, ధర్మమూర్తి భరతు నిట్లు ♦ తలఁపఁదగునె?
యిచ్చటికి నన్నుచూడనే ♦ వచ్చువాఁడు, పిదపఁ దెలియంగఁ గలవిది ♦ వినుతసుగుణ!

## భరతుఁడు రాముని డాయ వచ్చుట.

తే॥ రాముఁడిట్టులు తమ్మునూ ♦ రార్చుచుండ, భరతుఁడచ్చట సేనన ♦ వ్వలనె నిలిపి
తన్ను వీడని యనుజుతో ♦ దగ్గఱించి, యన్నస్థితిఁ గాంచె నుమ్మల♦మధికరింప. ౧౦౩౭

ఉ॥ దోయిలి గూర్చు హాస్తముల ♦ తో వసివాడి కృశించు మేనితోఁ
బాయని దుఃఖవేధ జిగి ♦ వాసిన కన్నులతో జటాలితో
వ్రాయఁగ రాని దుఃఖమయ ♦ భావముతో నొక నారచీరతో
దాయఁగ వచ్చు నా భరతుఁ ♦ దప్పక రాముఁడు కాంచెఁ బూర్తిగన్.౧౦౩౮

తే॥ లక్ష్మణా! యిటు తమ్ము బ♦లంబు గలుగు,భరతు సంగర యోగ్య రూ♦పంబుఁ గంటె!
యనుచుఁ దమ్ముఁడు నాతని ♦ నట్టె చూచి, ప్రమానుపడి నిల్చెఁ గన్నీటి ♦వానతోడ.

తే॥ తాను నిందించు పలుకులు♦తనదు కినుక, నెంచి సిగ్గిలి డెందంబు ♦ సంచలింప
వింటితో వేఁడి బాష్పముల్ ♦పృథివిఁదొరఁగ, వాడిన మొగంబుతోఁ జిచ్చు♦వడుచునిలిచె

ఉ॥ న్యూనత లేకయుండఁ దప ♦ మున్నతిఁ జేసి ఫలంబు పొందుచో
భాను కులేశుఁడో మగనిఁ ♦ బాసి శుభంబులఁ బాసి శోకముం
బూని కృశించు రాజ్యరమ ♦ పూనిక నంపిన దూతవోలె మో
డ్పూనిన కేలుతో భరతుఁ ♦ డుత్కట దుఃఖము తోడ డగ్గఱెన్. ౧౦౪౧

తే॥ తఱిసి మరణించు తండ్రిని ♦ సరసినట్లు, కాంచి తగవు దలంపక ♦ కరుణ వీడి
నీతి మానితి వనుచు మై ♦ నెలవు తప్పి,పాదములఁబడె హా!యను♦రోదనమున.౧౦౪౨

తే॥ ఉసులు లున్నవో లేవో యం।చూహ సేయఁ, దగినతీరునఁగృశియించు♦తమ్ముఁగాంచి
నేత్ర కంజముల్ విడుచు క ♦ న్నీరు భరతు, నడల నించి పొరలి కాఱు ♦ జడిమ నిలిచె

తే॥ ఆదిదేవుఁడు ధర్మంబు ♦ నలము పగిది, నెల్ల నీతుల కిల్లయి ♦ యెసఁగు రామ
వరుఁడు నిట్టూర్పుపుచ్చి బా♦ష్పములు వీఁపు,సం బడఁగఁ దమ్మునాలింగ♦నంబొనర్చె

క॥ అలమికొని యతని వేషము, పలుమఱు గమనించి యరసి ♦ వత్సా! జనకుం
డెలమిని సుఖముం బొందునె? యిల నేలునె? దుఃఖ మొంద ♦ నేలా? యనుడున్.

తే॥ అన్న! నీవియోగ వ్యాధి ♦ యలము కొనఁగఁ, గన్నకైక వరంబను ♦ కాలువలనఁ
దనకుఁ దగిన సత్యంబును ♦ ధరణి నిలిపి, స్వర్గలోకంబు చేరెను ♦జనకుఁ డనఁగ.౧౦౪౬

మ॥ పరలోకంబునఁ జేరె నన్న పలుకుల్ ♦ బల్లెంబుఁ గాయంబులో
జొర దూటించిన యట్టులై చెవులలోఁ ♦ జొత్తెంచు మున్నె వెసన్
సురలోకోపరిలోక మేలఁదగు సు ♦ శ్లోకుండు హృన్నేత్రముల్
సురుఁగం గాలిపటంబు చుట్టు కరణిం ♦ జుట్టెన్ ధరన్ వ్రాలుచున్.౧౦౪౭

తే॥ మొదలు నఱకిన భూజంబు ♦ పుడమి వ్రాలు, నరణిఁ బడి పిడుగున కల్కు ♦ సర్పమువలె
తెలివి దప్పి యొకింతకుఁ ♦ దేఱి యూర్పు, పుచ్చి తపియించి యాఱిక ♦ పొగిలెనొగిలె

సీ॥ ఆఱని భాను కు ♦ లాలయ దీపమా! నిర్వ్యాజ గురు ధర్మ ♦ నిలయ! తండ్రి!
అరిమద గజసింహ ♦ మా! దయాలోల! యిం, కెవ్వరు సత్యంబు ♦ నేలువారు?
మాకు దిక్కెవ్వరు? ♦ మఱి తేర్చువారెరు? మరణించితే యిట్లు ♦ మమ్ముఁబాసి
యెవ్వరి నింకఁ దం ♦ డ్రీ! యని పిల్తుము, తగునె యిందఱ వీడి ♦ తరల నీకు

తే॥ మేటి ఋశ్యశృంగునిచేత ♦ మేల్మి వేల్మి, యొనరఁ గావించి ననుగాంచి ♦ యుర్వియందు
కన్న గొప్ప ఫలంబేది? కడకుమమ్ము, వీడి యింపైన ప్రాణముల్ ♦ వీడుటొక్కొ?

తే॥ ప్రాణులకుమేలుసేయు దా ♦ ర్ఢ్యంబు గలుగు, భూమి భారము నేఁదాల్పఁ ♦ బోడెముదిక్కు
హేతు విదియొకో? నీయాన ♦ యెగురఁగొట్టు, కాలుఁడై పుట్టితినె జగ ♦ మేలుకొఱకు?

తే॥ శంబరుం జంపి వజ్రికి ♦ స్వర్గమిచ్చు, పార్థివేంద్ర! పాలనము మా ♦ వశము చేసి
యింద్రియములు స్వవశముగా ♦ నెసఁగఁజేసి, తపము చేసిన విధమిదే ♦ తండ్రినీవు?.

ఉ॥ కోరఁగఁ దగ్గ పాలనము ♦ కోరిక నెల్లరు వేఁడఁ బూని యీ
ధారణి కెల్ల దుఃఖమును ♦ దార్చిన యల్పుఁడ నైతి మృత్యువుం
గోరుట దక్కఁ బ్రాణములఁ ♦ గూరిమి వీడని మేను వెంచి యే
నేరి మొగంబు గాంచుటకు ♦ నింకను మేదిని నుండఁ గోరుటల్?

తే॥ కోసలము వీడి యడవి నీ ♦ కొడుకు చేరె, ననుచు విన్నంతనే దివి ♦ కరిగితి వఁట
తండ్రి! నీమృతి వినియును ♦ తలరి తలరి, బ్రతికియే యున్న వాఁడను ♦ బ్రదుకుగోరి

ఉ॥ జానుగఁ బూర్ణ చంద్రునకుఁ ♦ జల్లఁదనంబు నొసంగు లోకన
మ్మాన సితాతపత్త్రనృప! మానము దివ్యుల కేని మాన్పఁగా
రాని బలం బుదారత తి ♦ రంబగు సత్యము నీతి ధర్మముల్
దోన యడంచు కొంచు నిటు ♦ తూఱితె యెల్లర వీడి స్వర్గముల్?. ౧౦౫౪

తే॥ ఇట్లు పలువిధముల నెలు ♦ గెత్తి యేడ్చు, రామ చంద్రుని తమ్ముఁలు ♦ రాజ వరులు
చేరి లేపి పట్టుకొన వ ♦ సిష్ఠుఁ డంత, హిత మితోక్తుల నోదార్ప ♦ నెంచుటయును.

తే॥ తాపస శ్రేష్ఠులగు భర ♦ ద్వాజుఁడాది, మునులు నేడు దీవుల లోని ♦ మనుజవరులు
మంత్రులును సైన్యపతులు రా ♦ మ విభుఁజేర, వచ్చిరి మనంబులారట ♦ పడుచునుండ

తే॥ మఱియు రాఁదగు నెల్లరు ♦ మలసి వచ్చి, నిలువఁ బరితపించుచునున్న ♦ నృపకుమారు
మోముఁగని బ్రహ్మసముఁడగు ♦ మునివరుండు, వాక్యకోవిదుఁడీరీతి ♦ పలుకఁదొడఁగె.

చ॥ తతమతి సన్న్యసించుటయు ♦ ధర్మమొనర్చుట దక్కనెమ్మదిన్
బ్రతుకఁగ గోరు పుణ్యులకుఁ ♦ బ్రాపగు సాయమొకండు గల్గునే?.

మృతియును పుట్టువున్ సహ ♦ జమే కద! ప్రాణుల కెల్ల భూమిపై
శ్రుతి హితపారగుండవు వి ♦ శుద్ధ చరిత్రుఁడవున్ స్మరింపవే?. ౧౦౫౯

తే॥ స్థిరములేని జన్మంబులు - దెలుపనేల? కోట్లకోటులఁదినూనవి కామ - కోపమోహ
దుఃఖసౌఖ్యములొందునీ-తోయమెఱిఁగి, యముఁడుదాక్షిణ్యయుతుఁడని-యనఁగదగునె

ఉ॥ పుట్టక మున్నె జీవములు ♦ పోవ జనించుట చూచుచుండమే?
పట్టగు విద్యకల్మి భువి ♦ భారము నర్వదివేల యేఁడు లి
ట్టట్టు చలింప కోర్చి నెల ♦ వారిఁ ధర్మము కీర్తి నించి యే
లిట్టట్ట గతింప నిట్లు వగఁ ♦ దీల్పడఁ బాడియె? రాజనందనా! ౧౦౬౦

తే॥ శీలమును ధర్మమును భువిఁ ♦ జెడక నిలిపి, శూలమును చక్రమును వాణి ♦ లీలఁదాల్చి
మూల పురుషులై వెలయుము ♦ మ్మూర్తులకును, కాలమను వలఁబడకుండఁ ♦ గావశంబె?

తే॥ ఇంద్రియంబుల కెఱుకయై ♦ యిలను వెలయు, నన్నిటికిని మూలంబులై ♦ యమరుపంచ
భూతములు నొక్కయప్పుడు ♦ పొలియు నవియె, యనఁగదీనికిఁ జింతింప ♦ నగునెచెప్పుమ?

తే॥ పూజ్యమగు పుణ్యమను నేయి ♦ పోసి కాల, మనెడి వత్తిడి విధియను ♦ నగ్గిచేత
జీవితమను దీపము నుద్దె ♦ సించి నిలుపఁ, గారణములు రెండును తీఱ ♦ నాఱు టరుదె?

తే॥ ఈజగంబున దుఃఖమం ♦ దేమునింగి, యాజగంబున నరకంబు ♦ నందె మునిఁగి
మరల జన్మించి చిక్కుల ♦ మలఁగుచుండు, పెక్కు వగల జీవుల లెక్క ♦ పెట్టనగునె?

తే॥ వినుత సద్గుణాకర! తండ్రి ♦ యనెడు కతన, సృష్టికర్తయాబ్రహ్మకుం ♦ జెందరాని
విష్ణులోకంబు నందున ♦ వెలుఁగుచుండె, నతనికీవు గావించు సా ♦ యంబిఁ కేది? ౧౦౬౫

ఉ॥ ఆతని పోకకై మదిర ♦ వంతయుఁ జింత యొనర్పరాదు పై
నాతని కింతకంటె నర ♦ యం గడ తేఱు పథంబు లేదు నీ
వాతని కింకఁ జేయఁదగు ♦ నయ్యవి యున్నవి శ్రద్ధతోడ నీ
చేతులతో నొనర్పు మది ♦ చిత్తము శాంతిలఁ గారణంబగున్. ౧౦౬౬

ఉ॥ వాన పడంగ నీటివడి ♦ భాసిలు బుద్బుద పంక్తిబోలు నీ
మేనులఁ గూర్చివింత మది ♦ మీఱుట వేఱిఁడి లక్షణంబగున్
మానక బాష్పముల్విడిచి ♦ మానిసి గాంచు ఫలంబు గానమున్
గాన జలాంజలి న్విడుము ♦ గాదిలి తండ్రికి జానకీశ్వరా!. ౧౦౬౭

తే॥ అనుడు శ్రీరాముఁడును చింత ♦ నవలఁద్రోచి, యాచతుర్వేద వేది మ ♦ హాతపస్వి
యగు వసిష్ఠుతో గంగకు నరుగుదెంచి, చేయఁదగు కృత్యముల భక్తిఁ ♦ జేయఁబూనె

తే॥ నూల జీవాత్మలకు నొకే ♦ చంద మొప్పి, యెఱుక నొసఁగు మహాత్ముఁడ ♦ య్యేటమునిఁగి
గురుఁడు తెలిపిన విధులెల్లఁ ♦ గొఱతలేక, సలిపి మమ్మాఱు తర్పణ ♦ జలము వదలె.

తే॥ చేయఁదగుక్రియలనుపూర్తి-చేసియవల, మాన్యులగుమంత్రులునునృపుల్-మానివరులు
తక్కువారలు తను చుట్టి - తరలిరాఁగ, జానకి వసించు నప్పర్ణ - శాలఁజేరె. ౧౦౭౦

తే॥ చేరునంతలో భరతుండు ♦ సీతయున్న, పర్ణశాలను గని యొంటిఁ ♦ బర్వఁగుచుంట
గని కరంబులతో మోఁది♦కొనుచుఁగనుల, రోదనముతోడఁ బడె నామె♦పాదములను

తే॥ ఇంద్రియములలో జలనిధు ♦ లేడునున్న, వనఁగ నెట్టనా కన్నులఁ ♦ బనవి పనవి
వెక్కి వెక్కి బాష్పంబువుల్ ♦ వెల్లువలుగ, విడుచుచుండెను భరతభూ♦విభుఁడు వెలికి

క॥ పెను దుఃఖంబున మునిఁగిన, యనుజుని తన పాదవుచేతు ♦ లమరిచి రాముం
డనువుగ నెత్తుచు సీతను, గని జనకుఁడు మనలవీడి ♦ కడచనె ననుచున్. ౧౦౭౩

క॥ వడఁకూను నెడఁదతోడన్, బుడమింబడి యడలి యడలి ♦ పొక్కుచుఁ బెలుచన్
గడలికవ యనఁగఁ గనుఁగవ, యెడపక బాష్పములు విడిచె ♦ నెన్నువతోడన్. ౧౦౭౪

క॥ కలకంఠంబున వనరెదు, జలజాక్షికి భర్త వెంటఁ ♦ జనిన యడవియున్
విలసిల్లెఁ బ్రోలుగా నిపు, డలరాణ్మృతి దుఃఖ జలధి ♦ నడుగుల నిలిపెన్. ౧౦౭౫

క॥ ముని పత్నులు తల్లుల వలె, జనక సుతను డాసి హస్త - సరసిజములతోఁ
గొని విమల జలములందున, మునిచి యడలు పోవఁ బలికి - మోదించి రొగిన్. ౧౦౭౬

క॥ నలువురు రాజ కుమారులఁ, బోలుపుగఁ. గను పూజ్యరాండ్రు ♦ ముప్వురతో వృ
ద్ధుల తోడ సుమంత్రుండును, కుల జలనిధి విధుని కడకుఁ ♦ గుములుచు వచ్చెన్. ౧౦౭౭

తే॥ మొదటి వాఁడగు నలువకు ♦ మొదటివాఁడు, తండ్రి వీడి వచ్చితిరె యో ♦ తల్లులార!
యనుచుఁ దచ్చరణాబ్జ చ ♦ యంబు లందు, వ్రాలి కన్నీటి కాల్వలోఁ ♦ బరితపించె.

క॥ వారలు నొక్కట రాముని, వారక కౌఁగిలిని చేర్చి ♦ వనట యుబుకఁగా
బోరున రోదించిరి యం, గారమ్ము వ నేయి కరఁగు ♦ కరణిఁ గరఁగుచున్. ౧౦౭౯

తే॥ అవల నవ్వీరులంగిన్న ♦ యవ్వలచటి, తీయని యెడంద గలుగు వై ♦ దేహిఁ జేరి
చెలువకబ్బిన యప్పటి ♦ స్థితిని గాంచి, కడుపు మండి కట్టుకొని పెల్లడలినారు. ౧౦౮౦

తే॥ యోధవరు లయోధ్యంగల - యోగ్యజనము, రాజబంధువుల్ తక్కిన-ప్రజయువచ్చి
క్లిశిత మానసములతోడఁ♦గిట్టిరాము, వేషమును స్థితిగని చాల♦వెగచినారు. ౧౦౮౧

చ॥ పడగల నీడఁబాఁప దణి - పాన్పునఁ బండుట మాని ధాత్రిపైఁ
బొడమిన లోక నాయకుఁడు - పొందిన తక్కుల నాథుఁ డాటచే
నడరిన యంటు వోమునిఁగి - యర్న్వా విధు ల్పొనరింప నేగె నాఁ
బడమటి వార్ధిలోమునిఁగె - భాస్కరుఁ డంతట లోక శాంతికై. ౧౦౮౨

## భరతుఁడు రాముం బ్రార్థించుట

సీ॥ **అనాఁడు** కడవఁగా - నవనీపతులు రాజ, బాంధవుల్ మునులును - బలసియుండ
శ్రీరామ చంద్రుండు-చెంతనెయున్న భ,రతుఁ గాంచి వత్స! యీ- హితమువినుము
జనకుఁ డవ్యయ పదం - బునకేగె నతనియా, జ్ఞానుసారముగ రా-జ్యంబు నీదె
మకుటంబు ధరియించి - మహినేల కీలిలఁ, దపసి వేసము నూనఁ - దగునె? యనుడు

తే॥ నీవు కాఱడవులఁ జేరి ♦ యిట్టులుండ, ధర్మమూర్తు లెవ్వరు? పురి ♦ ధర్మమేది?
పాడి నీకంటె మున్నెయీ ♦ వనము చేరె, దానిఁబడసి కొంపోవంగఁ ♦ బూనినాఁడ.

తే॥ మనసు సమ్మతింపని వర ♦ మున నెనిన్ను, తగని స్థితి నిల్పియంతట ♦ మగనిఁ జంపి
నట్టి కైకేయి కన్నట్టి ♦ పట్టిగాన, నాకు నీవేషముచిత మ ♦ న్యంబు తగునె?. ౧౦౮౪

చ॥ జగములు సంతపింప బలు ♦ జాలిని గూర్చిన దుష్టురాలి కిం
బుగ జనియించు పాపగుణ ♦ పూర్ణుఁడఁ గావున నాకుఁ జావఁగాఁ
దెగువయుఁ గల్గ లే దొడలి ♦ తీపియుఁ బోదు తపంబు సేయఁగన్
దెగడికనుండి తప్పి కడ ♦ తేఱద నింత యనుగ్రహింపవే. ౧౦౮౫

తే॥ కొలముపాడి వీడిన సతి ♦ గుణము, నోర్పు, పరఁగకుండు తపంబును, కరుణవిడిన
ధర్మమునను, పూర్వ వంశ ప ♦ ద్ధతులు నీఁగు, పాలనము కంటె మేలయి ♦ క్రాలునేమి?

చ॥ జననము తోడ నీకుఁగల ♦ స్వామ్యము, వీడఁగ రానిదా సనా
తన కులధర్మమా పదవిఁ ♦ దప్పఁగఁ ద్రోసి తపంబు పూనె దీ
వనునెడఁ బట్టుపట్టి నయ ♦ మాఱిచ ధర్మముఁ ద్రెంచి మ్రింగువా
రిని బలె రాజ్యపాలన వ ♦ రించి చరింతునె నీకుఁ దమ్ముఁడన్? ౧౦౮౬

ఉ॥ మేర యిడంగరాని పెను ♦ మేలిమి కూరిమితండ్రి చావఁగాఁ
గారడవిం జరించుచును ♦ కాయలు మెక్కుచు నీవు పోవఁగా
వేఱిమితోడ వంచనము ♦ వెంచి ధరాస్థలిఁ గవ్వికొంటకున్
జేరిమి క్రుంగి యున్న తఱిఁ ♦ జేరిచి నాఁచుకొనంగ వైరినే? ౧౦౮౭

మ॥ భువనాధీశ్వర! తండ్రి చేయు పొరపున్ ♦ బోరామి లోకాలకున్
దవులం జేసిన కైక కీడు భువిఁజెం ♦ దన్ రాక రక్షింపఁ బ్రా
భవ సామ్రాజ్యము నేల రమ్ము జగముల్ ♦ భవ్యంబులం బొంద మా
భవ బంధంబులు డింద నంచు నిటు వి ♦ స్పష్టంబుగా నాడఁగన్. ౧౦౮౮

తే॥ భరతు పల్కులు విని వాని - భావమెఱఁగి, చింతనము చేసియతని నీ - క్షించి వత్స!
నాదు పలుకొండు కలదు వి-నంగఁదగును,చాల యోచింప ధర్మసూ-క్ష్మంబు దెలియు

ఉ॥ శీలము సత్యముం దగవు ♦ చెల్మియు నీతియు వాంఛనీయమౌ
మేలిమి మున్నుగాఁగలుగు ♦ మెచ్చగు సత్పథవృత్తులెల్ల భూ
పాలుర శాసనంబులకు ♦ బద్ధములై భువి నిల్చుచుండు నీ
లీల మనంబు నందు పది ♦ లించి తలంపుము సద్గుణాకరా! ౧౦౯౧

ఉ॥ ఉత్తమ శాస్త్రముల్ వినుట ♦ యుత్తమ బుద్ధి గడించు చుండుటల్
ఉత్తమశీలముం గొనుట ♦ యుత్తమవృత్తుల నభ్యసించుటల్
చిత్తము దేవుపై నిడుట ♦ చింతన సేయఁగఁ బెద్దవారె కా
సత్తమ మార్గ దర్శకులు ♦ సత్యము నీవుఁ దలంచి చూడుమా. ౧౦౯౨

తే॥ ఆమహాత్ము లెవ్వారని ♦ యడుగ వలతె?, యెల్లవిధముల మనసున ♦ నెంచిచూడ
తల్లిదండ్రులు దక్క నీ ♦ ధరణియందు, వేఱవరు లేరు నిక్కంబు ♦ విమలచరిత!

మ॥ జను లభ్యాసము సేయు శాస్త్రముల వై ♦ శారద్యముం గొన్న పా
వన చారిత్రక! తండ్రి యాజ్ఞ గొని నం ♦ భావ్యాన్వయాచిత్యభా
వనతో దానిని సమ్మతించితివి నీ ♦ ప్రార్థించుటంజేసి వీ
డినచో నయ్యది సద్గుణం బగునె? పా ♦ టింపంగ లేవే మదిన్?. ౧౦౯౪

క॥ తనయులు తలిదండ్రులకున్, ఘన కీర్తిని కూర్చుటకో? య ♦ ఘంబగు నిందం
బెనుచుటకో నీవచెపుమా? జనియించిన ఫలము సుజన ♦ సన్నుత చరితా! ౧౦౯౫

ఉ॥ ఏను దురాశచే జనకు ♦ నీభవమందునఁ గల్ల రీనిగాఁ
బూనిచి ఘోరవంబున గు ♦ భుల్లునఁ ద్రోచి వినోదసౌఖ్యసం
ధానక రాజ్య భోగములఁ ♦ దాల్మిని పొంది రహింపనేరునే?
మానవుఁడైన వాని కిహ - మాత్ర సుఖంబులు సుస్థిరంబులే?

చ॥ ధరణి నొసంగి సత్యమునఁ - దప్పక నిల్చిన తండ్రి పల్కుచే
భరత! ధరిత్రి నీదెయగు- ♦ పాలన సేయఁగఁ దగ్గ సత్వముం
బొరసిన నీదెయౌ మహిఁ బ్ర ♦ భుత్వపు టర్హత నీకెయున్న దిం
కరమర లేల? యేలుకొను ♦ మయ్య జనంబులు సంతసిల్లఁగన్. ౧౦౯౬

తే॥అనుడుభరతుఁడిట్లనుజ్యేష్ఠుఁ♦డగుచుఁబుట్టి,మూఁడులోకంబులనుసాటి♦మొనయకుండు
నీవ నాదిరాజ్యంబని ♦ యెంచితేని, నీక యొసఁగితి రమ్ము మ♦న్నించి మమ్ము. ౧౦౯౭

ఉ॥ భూమి సమస్తముం గలఁగి ♦ ముచ్చిరు చుండఁగఁ జూచి చూచి పై
నీమనమందు దోఁచు లలి ♦ నే యొనరింతె? కలంకదేలఁగాఁ
ప్రేముడి వచ్చి మమ్ము కయి ♦ వీడక ప్రోవుమ యంచు దీనతన్
రామ పదాంబుజంబులు క ♦ రంబులఁ బాయక పట్టెఁ బట్టుదన్. ౧౦౯౮

తే॥ నెనరు మనసున నీ♦యిచ్చ ♦ నేర్చినట్లు, నేల యిచ్చుట కొనుటలు ♦ నీతియగునె?
నిందకై జంకి జనకుండు ♦ నీకునొసఁగ, నాఁడు సమ్మతించిన యేండ్లు♦నేఁడె చనెనె?

తే॥ సత్యమొక్కటి దక్క యీ♦జగము వేఱు, పూతగుణమున్నదని చెప్పఁ♦బూనునేమి?
సత్యమున నుండి జాఱు దు♦ష్కృత్యమయగుఁ,గాని వేఱొండగునె నీవ♦కాంచుమయ్య

క॥ ముదమున జనకుని యానతిఁ, బదునాల్గేండ్లేను వనుల ♦ వసియింపంగా
నదమలమతివై యంతకు, వదలక నాయాజ్ఞ నీవు ♦ వసుధం గొనుమా. ౧౧౦౦

తే॥ తండ్రి యపుడె కిరీటంబుఁ♦దాల్పు మనఁగ, నతని యాజ్ఞ మీఱఁగ జంకి♦యనుమతించి
నాఁడ నదియెంచి నావచ♦నంబు దాఁటఁ, దగునె? పని వినుఖుంకఁ జిం♦తనమువలదు.

వసిష్ఠుఁడు రాము నయోధ్యకు రమ్మని కోరుట

ఉ॥ తేజిత సత్త్వశాలియగు ♦ ధీరుఁడు రాఘవుఁ డిట్లు వల్క వి
భ్రాజిత కీర్తిశాలి ప్రతి ♦ భక్ భరతుండు వచింపఁ బూన నం
భోజభవాత్మజుం డనియెఁ ♦ బూర్వ నిరూఢ పరాక్రమాఢ్యులౌ
రాజుల సచ్చరిత్రములు ♦ శ్రద్ధను విన్మరియాట దీఱఁగన్. ౧౧౦౪

ఉ॥ తొల్లి వరాహమూర్తియయి ♦ తోయజ నేత్రుఁడు కోఱ పంట జా
బిల్లి కలంకి మట్లు కన - పింప ధరక్ జలరాశి నుండి యు
త్ఫుల్ల మనంబుతోడ జన ♦ ముల్ పరితోషమునొంద నెత్తి నాఁ
డుల్లసిత ప్రకాశమున ♦ నొప్పుచు నెప్పటియట్ల యుండఁగన్. ౧౧౦౫

మ॥ విలయాంతంబునఁ బంచ భూతములు ని - ర్వీర్యంబులై తేజముల్
వొలియక్ దత్త్వము లెల్ల లీనమగుడుక్ ♦భూతేశుఁడౌ విష్ణు వీ
జలరాశిక్ సృజియించి యందు బవళిం ♦ శ్రాంతిం గనంగోరి ని
ర్మలమా మేటి వెలుంగు రూపమున ని ♦ ద్రం జెందె మర్త్యాకృపై. ౧౧౦౬

తే॥ ఉన్నతులగు వేల్పులకుఁ బీ ♦ యూష మొసఁగు, కడలి వంటి నల్లని మేను♦గలుగువాని
నాభియందు పుట్టిన నలి ♦ నంబు నుండి, యఖిల జగముల సృజియింప ♦ నజుఁడుపుట్టె

తే॥ అవ్విరించి జగంబుల ♦ నివ్వటిల్లఁ, జేయుచోఁ గల్గెఁ దొలుత వి - శిష్టమైన
మీ మహాన్వయ మందలి ♦ మేదినీశ, వరులు నెఱి దప్పు వారలీ ♦ వఱకు లేరు

తే॥ శ్రుతులుశాస్త్రములిహపర♦సుఖములొందఁ,గఱపుగురుఁడెపోఘనుఁడుజ♦గంబులందు
తండ్రులై దుగురం దని ♦ తదజ్ఞు లంద్రు, నిక్క మిదియుఁ గుమారక! నీవెఱుఁగవె?

తే॥ నదమ లాత్మక! యేను శా - స్త్రములు పెక్కు, తెలమి నేర్చిన ఫలము నా♦కెనయునట్లు
నాదు పనుపు గాదనక వె ♦ న్కకును వచ్చి, రాజ్య భారంబు పూనుము ♦ రామభద్ర!

తే॥ అట్లు పలికిన కులగురు ♦ నరసి రామ, చంద్రుఁడీరీతిఁ బల్కు నం ♦ జలి ఘటించి
సర్వశాస్త్రార్థవేత్తలు ♦ సద్గుణులరు, కలవె మీఱెఱుంగని ధర్మ ♦ గతులు ధరణి?

చ॥ అగుదురు గాక సద్గురువు ♦ లౌదురు గాక విధాత సూనులే
యగుదురుగాక దైవతము ♦ లౌదురు గాకయుఁ దల్లి దండ్రులే
యగుదురు గాక సత్యసుతు ♦ లాడితొలంగమి కడ్డులాడుటల్
తగునొకొ? మిమ్ముబోఁటి గుణ ♦ ధన్యులకుం దలపోసి చూచినన్?

ఉ॥ తల్లి విధించెఁ జేయుమని ♦ తండ్రియు నుత్తరు విచ్చియయ్యెఁ బైఁ
జెల్లుదునంచు నియ్యకొని ♦ శీర్షమునన్ వహియింప కేగు నా
ప్రల్లదు పుట్టుకంటెఁ బడు ♦ పాటుల నెంచియుఁ జెడ్డ గాన కే
పొల్లగు లంపటన్ దిరుగు ♦ మ్రుక్కడి కుక్క భవంబు మేలొకో?. ౧౧౧౩

చ॥ ఎదుట విధించు పెద్దల య ♦ భీప్సితముల్ నెఱవేర్తు నంచు బెం
పొదవఁగ సమ్మతించితి న ♦ మున్నత మానస మందు మీరలా
పదపడి యిట్టు లాజ్ఞ యిడు ♦ వారలు! నేనెది చేయు టొప్పగున్
త్రిదశ మునీంద్రవంద్య! యుప ♦ దేశము చేయుఁడి ధర్మ సమ్మతిన్. ౧౧౧౪

చ॥ అనుఁడు వసిష్ఠమౌని యిఁక ♦ నాడఁగ నెయ్యది లేదయంచు శం
కను గొని యూరకుండె నటఁ ♦ గైక సుతుండను నట్టులైన మే
దిని పరిపాలనం జలుపు ♦ దిష్టము చిత్తము గల్గు వారలే
గొనకొని యేలనీ; యితనిఁ ♦ గూడి వనంబులనే చరించెదన్. ౧౧౧౫

తే॥ అనఁగ నత్తఱి వేలుపు ♦ లది యెఱింగి, గుంపులై తమ్ముఁడన్నను ♦ గొంచుఁ బోవ
మన తలంపులు సఫలమ్ము ♦ నెనయఁజాల, ననుచుఁ జింతించి యిట్లని ♦ రందఱు విన.

చ॥ వినుత గుణాఢ్యుఁడై నరఘు ♦ వీరుఁడు ధీరతఁ దండ్రి యాజ్ఞమై
వనులఁ జతుర్దశాబ్దము ల ♦ వారణ రీతిగ నుండువాఁడు స
న్మనమునఁ గైక పుత్త్రుఁడు జ ♦ నంబులఁ బ్రోచుచు రాజ్యమేలువాఁ
డినకుల వార్ధి సోములకు ♦ నియ్యది యుత్తమ ధర్మమై తగున్. ౧౧౧౬

ఉ॥ దేవత లిట్లు పల్క జగ ♦ తీ తనయా వరుఁ డంత నానుడుల్
త్రోవఁగ రాని వయ్య మది ♦ దొడ్డగ యోచన సేయ వయ్య నే
నీవని నుండు కాల మది ♦ యెంత? పదంపడి వత్తునయ్య ని
న్నీవిధి వేఁడికొందు నని ♦ యిచ్చ గ్రహించెను తమ్ము హస్తముల్. ౧౧౧౭

చ॥ ఇటులను నన్నకయ్యనుజుఁ ♦ డిట్లను నేమనువాఁడ నిందుపై
నటులె చతుర్దశాబ్దముల ♦ యమ్మఱునాఁడె పురంబు చేరఁగాఁ
దటుకున రమ్ము రాకయటు ♦ తప్పిన నీపదమాన సుమ్ము ప్రో
త్కటతర వహ్నిఁ జొచ్చి కడ ♦ గాంచెద నాఁడె సురల్ నుతింపఁగన్

తే॥ అట్లు శపథంబు చేసి హృ ♦ దబ్జమందు, నెగులు విడిచెను భరతుండు ♦ పొగడుగుడిచె
నడరు సత్కీర్తి తనకంటెఁ ♦ బొడవుగాఁగఁ,గాంచు రామచంద్రుఁడు సమ్మతించెనంత

చ॥ భరతుఁడు వేఱొకం డరుదు ♦ భావన చేసి మహాత్మ! పాదుకల్
స్థిరమతినిమ్ము తత్ప్రతిని ♦ ధిత్వము పూని ధరిత్రిఁ గాచి నీ
కరుణ గడింతు నన్నుఁ బద ♦ కంజములం ధరియించు వాని ని
ర్జరులకు నొందరాని స్థిర ♦ సౌఖ్యము లిచ్చెడు వాని నిచ్చినన్. ౧౧౨౧

ఉ॥ వారక బాష్పధార లొద ♦ వంగల కన్నులతోడ ధూళి యొ
ప్పారిన మేనితోడ నమ ♦ రాది సమస్త జనాళి దుఃఖ ని
స్తారక రామ పాదుకల ♦ నమ్మతి రత్న కిరీట లీలఁ జొ
క్కారముగా ధరించి రఘు ♦ కాంతుని వీడ్కొని యంతఁ గ్రమ్మఱన్.

క॥ జనులు బంధులు పెద్దలు, మునులును సచివులును పౌర ♦ ముఖ్యులు తక్కం
జనములు భరతుని వెంటనె, చనియెం జన లేక రామ ♦ చంద్రు నెడయుచున్.

తే॥ ధర్మశాస్త్ర విదుఁడు భర♦ద్వాజుఁడేగె, మరలె సింగిని కూడిన ♦ సురగణంబు
కూర్మి మిత్రుండుగుహుఁడు వీ ♦ డ్కోలువడసి,భరతు వెంటనెచనెదుఃఖ♦భరితుఁడగుచు

సీ॥ ఈపాదములె కదా ♦ యింద్రాది సురల కా, పదవేళ నొదవెడు ♦ పట్టుగొమలు
ఈ యంఘ్రులే కదా ♦ శ్రేయంబు కొనఁ గూర్చు, పావనగంగకుఁ ♦ బ్రభవ గృహము
ఈచరణములెకా ♦ యింద్రియ జేతలౌ, యతివర హృదయ గే ♦ హముల దివెలు
ఈపదములె కదా ♦ యింతి యహల్య పా, పంబుల మాన్పిన ♦ పరుస వేది

తే॥ అనుచు భరతుండు తనవింద ♦ కాదుకొనిన, పాదుకల మస్తకంబున ♦ భక్తిఁదాల్చి
గంగదాఁటి పాడై చెడు ♦ కాడుఁబోలు, పురము సాకేతమును చేర ♦ బుద్ధిగొనెక.

శా॥నందిగ్రామమునందు పాదుకల నం - దం బొప్పఁ దాపించె తా
ముందుం బోలెనె రామసన్నిభ సుఖం ♦ బుంబొంది రాజ్యంబు రా
జేందుల్ భక్తిని గొల్వ మోదమున కో ♦ కేశుల్ ప్రశంసింప స
ద్బృందంబుల్ సుఖయింప నేలె భువన ♦ శ్రేయంబు గేయంబుగాన్. ౧౧౨౮

ఉ॥ రాముఁడు చిత్రకూట శిఖ ♦ రంబున నుండెడిఁ జూత మం చయో
ధ్యామనుజుల్ ప్రియంబు మెయిఁ ♦ దప్పక వచ్చుచు నెమ్మనంబు డో
లామతి సేయువారని త ♦ లంచుచు నచ్చటు వీడి దక్షిణా
శాముఖుఁడై యతండు చనె - జానకితో ననుజన్ముతోడుతన్. ౧౧౨౯

అయోధ్యా కాండము సంపూర్ణము
శ్రీ రామచంద్రార్పణ మస్తు.
ఓమ్. తత్. సత్.

శ్రీ

# కంబరామాయణము - అరణ్యకాండము

## ౧. విరాధ వధ పటలము. (౭౨)

చ॥ మనుజవిభుండు సత్త్వగుణ ♦ మాన్యుఁడు జీవ హృదంతరాత్ముఁడై
మననము సేయఁ జేయ మహి ♦ మం బొనఁగూర్చెడు వేదముల్ విరిం
చనుఁడుఁ దపంబుసేసి కనఁ ♦ జాలని సర్వ జగత్ప్రభుండు మా
మనమున కందువాఁడె? పలు ♦ మార్గములన్ గమనించి చూచినన్.

ఉ॥ ముత్తియముల్ కుదించి నటు ♦ ముచ్చటఁ గూర్చు స్మితంబు మోమునన్
హత్తిన సీతతో యువకు ♦ లాదటఁ జిత్ర శరాసనంబులన్
జొత్తిలఁ దాల్చి పత్రఫల ♦ శోభితవాటి భవాబ్ధి పారగుం
డుత్తముఁ డైన యత్రి వన ♦ మొప్పుగఁ గాంచిరి వారుముందటన్. ౨

చ॥ గొనకొని భూమి భారము క ♦ కుప్పల నిల్చి వహించు మత్తవా
రణములఁ బోలె వారు ముని ♦ రాజు వనంబునఁ జొచ్చి ముప్పగన్
దునిమి ప్రశాంతిమైఁ దపము ♦ తొట్టగఁ జేయు మునీంద్రుఁ గాంచి వం
దన మొనరించి నిల్వఁ బ్రమ ♦ దంబును పొందె నతండు పొంగుచున్. 3

ఉ॥ బందుగు లెల్ల గేమునకు ♦ వచ్చినచో గృహమేధి సంతసం
బందు విధాన నత్రి ముద ♦ మంది కుమారకులార! మీర లి
ట్లొందఁగ దర్శనం బొసఁగ ♦ నొక్కట దేవతలున్ జగంబులున్
బొందుగ వచ్చి నట్లడరెఁ ♦ బుణ్యుఁడనైతి నటంచు మోదిలెన్. ౪

ఉ॥ ఆతనితోడ నాఁడచట ♦ నర్మిలిమై వసియించి సాధ్వియున్
బూత చరిత్ర యత్రిముని ♦ పుంగవు దేవ్యనసూయ సీతకుం
బ్రీతి నొసంగు గంధ ఫల ♦ వస్త్ర సుభూషణరాజిఁ గొంచు రా
మాతిలకంబు రా విబుధ ♦ మాన్యులు దండకఁ జేరి రంతటన్. ౫

సీ॥ మదవారణంబులు - పదునాఱు నంతెం, డంతల సంఖ్య పం - చాననములు
పదునాఱు శరభముల్ - గుదిగాఁగఁ గూర్చిన, ముమ్మొన వాలు చేఁ ♦ బూన్చి పట్టి
జుంజుఱు జేగుఱు - జొంపంపుఁ దలవాఁడు, విషగిరి నడచె నా - వెలయువాఁడు
క్రొమ్మొగుల్ వసియించు♦కొండలు కాలఁద్రొక్కుడు దూదివలె లేవ-నడచువాఁడు

తే॥ వ్రణము లట్లు ప్రకాశించు-కనుల నుండి,మిడుఁగుఱులురాల రవిక్రుంగ-మిన్ను వడఁక
నవనియును దద్దరిల్ల మహాబలిష్ఠుఁ, డైన యముని చేవయును కా-ర్శ్యంబు నొంద.

సీ॥ సింహసంఘము ప్రవే - శించి గర్జించెడు, శ్రవణ కందరముల - ప్రక్కలందు
నెల్లదిశల విల - సిల్లెడు మేరు శి, ఖరములు పోఁగుల - నొరయు చుండ
మొగుళులసందునఁ - బొడసూపు నెఱ్ఱని, యాకసమోయన . నతిశయిల్లి
నల్లచేఁ దడిసిన - నల్లని కాయంబు, చందన సిక్త - చంద మొప్ప

తే॥ వీరులను తురంగమముల - వారణముల, నరదములను సింగంబుల - వ్యాఘ్రములను
చిక్కవాని నెల్లను కొండ - చిలువలందు, గూర్చు దండలు కుత్తుకఁ-గొమరుమిగుల

ఉ॥ కొండలఁ బోలె శూలమునఁ - గ్రుచ్చిన యేనుఁగులం గరంబు లొం
డొండుగ నంది యాయఁగ మ - హోన్నత పర్వత కందరంబు నా
నుండెడి శాకినోట నొక - యొరను ముడ్చి మెదించి మ్రింగుచున్
మెండగు నాఁకటం దనివి - మీకొనకుండెడు బొట్టపొట్టతో.

ఉ॥ పన్నగరాజ రత్నముల - బంధురలీలఁ బొదింగి వానితోఁ
బ్రన్నన రాహు పాశమునఁ - బట్టి దిగీశ విమాన పంక్తులన్
గ్రన్ననఁ గూర్చి ఋక్షములఁ - గట్టిన మాలికలోన గాములన్
మన్ననఁ జేర్చితాల్చు జయ - మాలిక వక్షమునన్ రహింపఁగన్.

ఉ॥ సంజను వహ్నిఁ బోలి పరు - సం బయి యెఱ్ఱఁ దనంబు మీఱు నా
జుంజులు వెంద్రుకల్ విరియ - శోభన వారణ కుంభ మట్టులు
బ్బంజను ఫాలభాగమున - వాసవ సామజ ఫాల పట్టముల్
రంజిలు పొన్ను పొన్ను రద - నంబులు చొక్కముగా వెలుంగఁగన్. ౧౦

తే॥ నలుపు మీఱంగఁ గ్రూర గు-ణంబుపొంగ,నలుకఁ దగియున్న కొడిమెని-పొగ్నులట్లు
పొలయఁ దామసమను నిరుల్-పూఁతగాఁగఁ,బూసికొనివచ్చుకలికాల-మోయనంగ.

ఉ॥ చంపిన వేఁగిచర్మములె - సన్నని వల్వగ దంతి చర్మముల్
జంపగు నుత్తరీయముగఁ - జాలగు దిగ్గజ మస్త ముక్తముల్
పెంపగు నందుకంబులుగఁ - బెన్చిన లావగు కొండ చిల్వలే
సొంపగు కాసెగాఁ గయిఁద్రి - శూలము దాల్చి హరుండు నాఁదగన్. ౧౨

తే॥ ఫణి ఫణామణి ఖచిత కం - కణము లొప్ప, చేతులందున వలమురి - చింద మమరఁ
జేయు కడియంబులును దాల్చి - జీబులైన, మీసములఁ గిల్లువాసన - మిగులఁ గొలుప.

శా॥ కైలాసంబును మేరు భూధరము ను - గ్రస్ఫూర్తిఁ జెండ్లంబలెన్
దూలందన్ను బలిష్ఠ పాదములతో - దుర్వార వేగంబుతో
వేలావేష్టిత భూతలంబు తనతో - వెన్నంటి రా నాదితే
యాలోకంబుల నంతరంగముల న - ల్లాడించు రౌద్రంబుతో. ౧౪

ఉ॥ స్థూలములైన భూతములు - చొక్కముగా నొక రూపమందెనన్
పోలిక వాఁడు మేఘరవ - ముం దలపించు నెలుంగు వాఁడు గీ
ర్వాలసుఁ డిచ్చునిచ్చు నొక - లక్షయు నిర్వదియైదువేల నా
గాలి బలంబు గల్గిన య - జాండ భయంకర దుష్టకర్ముఁడున్. ౧౫

చ॥ బెడిదములైన గుంపు మగ - పిడ్గులఁ బోలిన క్రూరకృత్యముల్
నడపెడువాఁడు కూళుఁడు చె - నంటి విరాధుఁడు డాసి వృక్షముల్
బెడియుచుఁ బెల్లగిల్లఁ బృథి ♦వీ ధరముల్ వడి వ్రీల రేఁగి దుం
దుడుకున దొడ్డ ఒండ్లు గల - దోర్బలవీరులఁ గాంచి కేరుచున్. ౧౬

ఉ॥ కోఱలఁ జూపుచున్ బఱపు ♦ కొండ గుహంబలె నోరువిప్పుచున్
మీఁటి యదల్చి నిల్మనుచు ♦ మ్రింగెడు పోలిక వచ్చిటెప్ప ల
ల్లాఱుచునంతలోన ఒక ♦ చాంబుజ మందు వసించు హంసి నా
సారు వహించు సీతఁగొని ♦ చయ్యన వ్యోమ పదంబు ముట్టఁగన్. ౧౭

మ॥ పురుషశ్రేష్ఠులు వానిఁ గాంచి మిగులం ♦ బొల్చారు కోపంబుతో
శరముల్ విండ్లను గూర్చి వెంటఁ జనుచున్ ♦ జా వేఁడి యిట్లుల రా
జరుగంజూచెదు రాక్షసాధమ! యొకే ♦ చందాన నీవేగినన్
బరియల్ సేయక పీడఁ బోము నిలుమా ♦ పందా! యనన్ దైత్యుఁడున్.

మ॥ తొలి వేల్పిచ్చు వరంబుచేత నసువుల్ ♦ త్రుంగింపలేరెవ్వరున్
బలిమిన్ ముజ్జగ మొక్కటై యెదిరి నన్ ♦ భంగింపఁగా లేదు నే
నిల నేకైదువు లేకయే యెసఁగి నా ♦ యింతున్ సమస్తంబు మీ
కెలమిం బెట్టితిఁ బ్రాణ భిక్ష చనుఁడెం ♦ దే నీ చెలిన్వీడుచున్. ౧౯

మ॥ అన శ్రీరాముఁడు దంత కాంతు లొలయన్ ♦ హాసంబు గావించి యీ
దనుజుం డెన్నఁడు పోరెఱుంగఁడు భుజో ♦ త్సాహంబు దర్పంబు నొ
క్క నిమేషంబున నూఱడిల్లి సమయుం ♦ గాకంచు లోనెంచి ని
స్వన పూర్ణంబుగ నారి లాగుచు ధను ♦ ష్టంకారముం జేయఁగన్. ౨౦

## విరాధయుద్ధము

తే॥ విరిసి యూర్ధ్వని సాగర ♦ వేష్టితంబు, కుధర భరితంబునైన యీ ♦ కువలయంబు
నమర నాగాది లోకంబు ♦ లధిగమించి, యశనిపాతంబు చందాన ♦ నతిశ యిల్లె. ౨౧

తే॥ వంచక బిడాల వదన గ ♦ హ్వరము నందు, చిక్కి తపియించు చిల్కనాఁ ♦ జెలఁగుసీత
నిలను వదలి దైత్యుఁడు నుంత ♦ చలితుఁ డగుచు, నంజనాద్రిఁబోలినరాము ♦ నడరి తాఁకి

శా॥ బేతాళాదుల యాఁకలిం దనుప వి ♦ ద్విడ్బృంద కీలాలముల్
జేతః ప్రీతి నొసంగి వారి వినుతుల్ ♦ చేకొంచు నాదిత్య హ్రా
ద్భుతిం గూర్చుచు బాడబానల శిఖా ♦ దీవ్యత్ప్రభాయుక్తమై
చేతం దాల్చిన శూలముల్ విసరె నా ♦ శ్రీరాముపై నుద్ధతిన్. ౨౩

ఉ॥ దిక్కులు దిక్పతుల్ సురలు ♦ దిక్కరులున్ భువనంబు సర్వమున్
దిక్కఱి వెక్కసంపడ ను ♦ దీర్ణ హాలాహల మట్టురాఁగ, న
మ్మ్యక్కుల శైలమట్లు కన ♦ కాచల మట్లు వెలుంగు చాప మం
దొక్క యలుంగు గూర్చి చెవి ♦ యొందఁగ లాగుచు రాముఁ డేయఁగన్.

తే॥ అసుర కుల మెల్ల నేఁడె పోం ♦ గాఁ తె ననఁగఁ, బట్ట పగలునక్షత్రముల్ ♦ పడియెననఁగఁ
దుండ్లు తుండ్లయి శూలంపుఁ ♦ దుంట లెల్లఁ, జువ్వలట్టులఁ బఱచుచుఁ ♦ జొచ్చెదిశల.

చ॥ సురలకు మృత్యు హేతువగు ♦ శూలము త్రుంగుటఁ జూచి రక్కసుం
డురవడిఁ జేతులన్ మలల ♦ నూడ్చి రఘూత్తము పైనవైవ న
గ్గిరులను వజ్ర సన్నిభ ని ♦ కృంతన భల్లము లేసి త్రుంప నా
పరియలు వానిపై మరలఁ ♦ బాఱి శరీరము నొవ్వఁ జేయఁగన్. ౨౯

తే॥ దైత్యుఁ డంతట నొక మహా ♦ తరువు వెఱికి, విజ్ఞు లెవ్వని తత్త్వంబు ♦ వేడ్కఁ గాంత్రు
ధర్మ ముద్ధ రింపఁగ నేఁడు ♦ ధరకు దిగియె, ప్రణవ మంత్రార్థ మెవ్వఁడా ♦ రామునేసె.

క॥ వీరుఁడు రాముఁడు నాలుగు, నారసముల దానిఁ ద్రుంచి ♦ నాటించెను నా
ఱాఱు శిత శరము లసురుని, పేరురమున బాహువులను ♦ భీకర లీలన్.

తే॥ కంటకములు వేధింప ముం ♦ గాళ్ల తోడఁ, దీయనెంచి సంకటపడి ♦ దేహమును వి
దిర్చికొను నేదువలెఁ దన్ను ♦ దివిరినొంచు, ములుకులూడ మేనినివాఁడు ♦ ముడిచివిడ్చె.

ఉ॥ నిప్పుల వంటి ముల్కు లవ ♦ నీవిభుఁ డేయఁగ నవ్వి మేనిపైఁ
గప్పక దూఱి దూఱుటయుఁ ♦ గష్ట విచేష్టితుఁడైన కూళయున్
గుప్పున మేనినుండి వడి ♦ గ్రొచ్చిన గంటుల రక్త ధారలన్
దొప్పగఁ దోఁగి సత్త్వమును ♦ త్రుంగఁగఁ డెల్వి నశించి నిల్వఁగన్. ౩౦

చ॥ పిడికిటి పోరునందు బహు ♦ విశ్రుతవీరులు రామలక్ష్మణుల్
చెడని వరంబు గొన్న బల - శీలి యితండు శరాళిచేతఁ జా
వఁడు మరలన్ రణంబునకు ♦ వచ్చు నటంచు నరాసి దూసి కే
లెడయఁగఁ ద్రుంతమంచు ♦ ననురేశు భుజంబుల నెక్కనాతఁడున్. ౩౧

తే॥ పొంగిపాఱెడు శోణిత ♦ పూర మొప్ప, సుంత డెలిసి భుజంబుల ♦ శూరవరుల
నొక్కసడక పదింతలు ♦ మిక్కుటముగ, గగన వీథిని పఱచెన ♦ గ్గలిక మొఱయ. ౩౨

తే॥ కనకగిరిఁ జుట్టు చంద్రభా ♦ స్కరులఁ బోలి, యిరువురొప్పారన సురయం ♦ బరమునందు
రక్తకాయంబు తోడను ♦ ర్వడి గదించి, దిరిగె గిరగిర శరధి మం ♦ దరము మాడ్కి.

ఉ॥ బంగరు చాయ వాఁ డసిత ♦ వారిద వర్ణపు వాఁడు బాహులన్
రంగరుచుండ మింటికిఁ ద్వ ♦ రన్ నెగయంజను సోఁకు చూడఁగా
సంగడి నన్నలం గొనుచుఁ ♦ జయ్యన మింటికి నేగు పాడి రూ
పుంగొని యొప్పు పక్షికుల ♦ పుంగవుఁ దార్క్ష్యుని బోలె నత్తరిన్. ౩౪

క॥ కరుణాకరుఁడగు తనపతి సురరిపుచేఁ బడఁగ సీత ♦ ♦ సుడి వడి హంసన్
దొరఁగిన హంసిం బలె వా, డొరసిన సుమవల్లి వోలె ♦ నుర్వర వ్రాలెన్. ౩౫

తే॥ పదముపడి లేచి వేఱొండు ♦ పలుకఁ దోఁప, కునికి నడు మసియాడ నా ♦ దనుజునంటి
చనుచుఁ దల్లి బోలిన దయా ♦ గుణుల వీడి, తన్ను భక్షింపుమని సీత ♦ ధరణిఁ గూలె.

తే॥ పనవి పలుకులు తడఁబడఁ - బ్రాణములును, వాడఁ జేష్ట దక్కిన సీత - పగిది యెఱిఁగి
యన్నఁ గనుఁగొని లక్ష్మణుఁ - డార్య! దేవి, పరితపింప నిట్లుండుట - పాడియె? యన.

చ॥ జరుగఁగఁ దగ్గ త్రోవ యిటు - సాగుట మేలె యటంచు నెంచితిన్
దొరకొని వీనిఁ జంపుటది - దొడ్డయె? యంచు హసించి రాఘవుం
డురుతర పాదఘాతమున - నుర్వరఁ గూలఁగఁ దాఁప వాఁడు పెం
దరువు ప్రభంజనాహతికి - ధారిణిఁ గూలిన పోల్కిఁ గూలుచున్. ౩౬

చ॥ ధరఁబడి రోఁజుచుండఁ గని - దైత్యుని రాజకుమారు లిద్దఱు
ద్ధురతర బాహుమూలములఁ - ద్రుంచుచుఁ దూఁక విరాధుఁ డుగ్రుఁడై
యురవడి సూర్యచంద్రుల స - ముద్ధతి ద్రింగఁగ వచ్చు రాహు వ
ట్లిరవుగ రామలక్ష్మణుల - నెత్తుగడం గబళింప వచ్చెడున్ ౩౭

చ॥ వ్రణముల నుండి యోడిగిలు - రక్తము పై పయి వృద్ధినొంద దు
ర్గుణుఁడగు దైత్యు ప్రాణములు . క్రుంగమి రాముఁ డెడంద నెంచి ల
క్ష్మణుఁ గని గుంట ద్రవ్వుము ని - శాచరుఁ బూడ్చుట యుక్తమన్న స
ద్గుణయుతుఁ డొక్క పల్లమును - ద్రొచ్చెను బాణబలంబునన్ వడిన్

చ॥ నదుల జలంబునందు జత - నంబున దోషిని పాచితంబుకై
వదలక ముంచునట్లు రఘు - వర్యుఁడు త్రోవఁగరాని దొడ్డ యం
గదలఁ దొలంచు భక్త జన - కామదమైన పదంబు తోడ నా
మదయుతుఁడైన రక్కసుఁడు - ద్రుంగఁగ బల్లమునందు త్రోవఁగన్

చ॥ తొలుత నను బ్రహ్మయై నెగడి ♦ దొడ్డ యజాండము సృష్టిచేసి యం
దుల వడిఁ దానొకఁడుంగను ♦ తోఁచిన రాముని కాలి తాఁకుచే

నలఘుండు సోఁకు పూర్వమల ♦ కాధిపుఁ డిచ్చిన శాపశక్తిచేఁ
గలిగిన ఘోరరూపమును ♦ గ్రక్కున వీడి గమించె మింటికిన్. ४२

తే॥ ఎగిరి గంధర్వుఁడై నిల్చి ♦ యింద్రియముల, విషయములకు వశంబయి ♦ వీఁగుబుద్ధి
మాఱి సుజ్ఞానియై భక్తి ♦ మనసు నందు, గలుగ రాఘవు వినుతించె ♦ గౌరవమున. ४३

విరాధుఁడు రాముని వినుతించుట.

చ॥ శ్రుతులు నుతించు నీదగు ని ♦ శుద్ధ పదంబులు సర్వలోక సం
గతములు గాఁగ వ్యాప్తిగొనఁ ♦ గాఁ గడ మంగము లెట్టి వ్యాప్తిపో?
రతనపుఁ డెంకి యందునఁ ది ♦ రంబుగఁ గాక యొకండొకంటి తో
నతుకని పంచ భూతముల ♦ యందును నిల్చిన నిన్ ధరించు నే? ४४

మ॥ గజనాథుండు జలగ్రహ గ్రహణ దుః ♦ ఖంబంది కేలెత్తి యో
త్రిజగద్వంద్య! ముకుంద! దేవ! శరణా ♦ ర్థింజూడవే ప్రోవవే
భుజగాధీశ్వర తల్ప! యంచుఁ బిలువం ♦ బూర్ణాను కంపామతిన్
నిజ సంశీలత దంతిఁ గాచితివి ని ♦ ర్ణిద్రాప్ర మేయాకృతీ! ४५

తే॥ ఇహపరంబులు గన నడు ♦ నెడను నిలిచి, స్థిర కృపాకటాక్షంపు నీ ♦ చికలఁబరపు
దేవ! నీవొకో! ధర్మను ♦ స్థితిని మనుప, నొంటరిగ గాలిపడగ నా ♦ నొలయుచుంటి. ४६

ఉ॥ పుట్టుట గిట్టు టాటలుగఁ ♦ బూన్చిన దేవ! విరాగ పూరుషుల్
పుట్టిన వారి పూర్వగతి ♦ పోవునె? తక్కినవారి కైవడిన్
బుట్టుదురేమి? తొల్లి తమ ♦ పొందిన సంస్థితిఁ బొందు టబ్రమే?
యిట్టులమైన సద్యశము ♦ నెల్లెడ నించిన రాఘవేశ్వరా! ४७

చ॥ భయమును కూర్చునట్టి భవ ♦ వారిధి దాఁటఁగ నాశ్రయంబుగా
నయగతిఁ బూను సర్వమత ♦ నాయకులట్టి మతాధిదేవతల్
నియమిత తత్త్వరూపివయి ♦ నీవు జగంబుల నుల్ల సిల్ల నే
జయ మహిమంబు లొందుదురు? ♦ నల్పున దెయ్యది? రాఘవేశ్వరా! ४८

తే॥ బ్రహ్మ మొదలుగ నెల్ల ని ♦ ర్జర వరులకుఁ, దక్క ప్రాణులకు మొదలి ♦ తండ్రివీవ
యైనచో లోక ధర్మంబు ♦ ననుసరించి, కాంచి పెంచెడు తల్లిగాఁ ♦ గ్రాలు టెవరొ? ४९

ఉ॥ నీవె పరాపరంబు, గతి ♦ నీవె, సమస్త మహాండ జాలముల్
నీవె, చరా చరంబులును ♦ నీవె, విచారణ చేయఁ దేటుటల్
నీవె, మతంబు లన్నియును ♦ నీచరణావధులే, యిటేల మా
యావిధిఁ గ్రీడసేయ వల ♦ పా? మఱి దొంగ విధంబు లేలొకో! ५०

ఉ॥ రానరుదైన వానిక్రియఁ ♦ గ్రాలుచు వచ్చు మహేశ! ధేనువుం
గానని దూడ వత్సమును ♦ కానని గోవును లేవు; లోకజా
లానకుఁ దల్లి నీవయిన ♦ లాలిత రీతి నెఱుంగు డెల్లయుఁ
గానఁగఁ జాల దీ జగము ♦ గాంచిన తల్లి నిదేమి మాయయో? ౫౧

చ॥ జనములు పెక్కుదైవముల - సన్నుతి సేయఁగ నిచ్చగింతురై
సను నినుగాక యన్యమగు - నాయకదైవము గల్గునంట స
జ్జనుల కనర్హమా; కమల - జ త్రిపురాంతక నిర్జరావళుల్
వినుతి యొనర్తు రిన్నియుని - విఘ్నసమూహ మెఱుంగ కున్నదే? ౫౨

తే॥ శ్రీనివాస! రమేశ!నిద్రిద! జగతిఁ,బలుమతముల దైవములు ద్వంద్వములఁదగులు
వారివలెఁ దపించు; ని - ర్ద్వంద్వుఁడైన, యీావు సిద్ధింప కేవేమ - మేలకొంటి?. ౫౩

తే॥ మోయుచున్నాఁడ వహివయి , భూవరాంగి, నెత్తుచుంటివి పోత్రివై - యెలమితోడ
గ్రుక్కగొందు వాకొకపరి-కొలుచుచుందు,విద్ది శ్రీదేవి యెఱఁగిన-నెరియకున్నె?. ౫౪

తే॥ నీవు పుట్టించు జీవులు - నిజము నెఱఁగి, కొలల దానిచే నీకెంత - కొదువ పడునె?
శర్వునకు నిచ్చు భిక్షుచే - శంకవిడిన, వారు మర్త్యులమర్త్యులి - ప్పటికిఁ గలరు. ౫౫

మ॥ భువనోద్ధారణ! హంసవై నిగమముల్ - బోధించి తాబ్రహ్మకే
య్యవి నీ కెవ్వరు మున్ను నేర్పి? కలవా - రంతంబు పాటించిరే?
భువి జీవాత్మల వేఱయై యొకటియై-పొంకంబుగానుండు సం
భవ మవ్వానిని వీడియో? విడకయో? - భావింప నేమాయయో?. ౫౬

చ॥ అసదృశమూర్తి! నీవు తొలి - నాదటఁ బండిన పాలవెల్లిఁ బా
ప సకిన మంచము న్విడిచి - పాపుని దాసుని గాచుకై కృపా
రసము వహించి వచ్చి తమ - రఁ భవసాగర మీాఁదఁగంటి నిం
పొనఁగు భవత్పదాబ్జ మహి - మోన్నతి నేఁపని సంస్తుతింతునో? ౫౭

తే॥ ఇట్లు వినుతించు నతని నీ-తేశుఁడరసి, యిట్టిజన్మంబు రాఁగత - మేమి తెలుపు
మనుడు నాతఁడసత్య జీ - వనము తొలఁగ, జ్ఞానమొసఁగు పదాంక! నా-చరిత వినుదె?

తే॥ అలకవాసిని తుంబురుఁ - డనెడు పాఁడ, రంభ నాట్యగానంబు లా - రంగఁ గాంచి
వలచి కలియుటచే శ్రీదు-వలన నాకు, నిట్టిజన్మంబు సిద్ధించె - నేమి సెప్ప? ౫౯

తే॥ తొడఁగి జ్ఞానంబు మొదలంటఁ-మడిచివైచు,కామరుజనన్ను వెన్నంటఁ-గలుగుకతన
కరుణ మాని కుబేరుండు - కతన దైత్య, రూపి వగుమని తిట్ట నీ - రూపువచ్చె ౬౦

క॥ ఈశాప ముక్తి తెలుపఁగ, దే శంకరమిత్ర! యంచునే - వేఁడ భవత్
పేశల పద తాడనమున, నీశాపము దీఱునంచు - నెఱిఁగించె దయన్. ౬౧

కII స్వర్గపదం బెల్లెడల న, నర్గళ గతిఁ దిరిగి వేఁచు - నరహాంతకుఁడై
దుర్గముఁడై దానవకుల, మార్గుఁడగు కిలింజునకుఁ గు - మారుఁడ నైతిక్. ౬౨

కII మంచియుఁ జెడుగు నెఱింగెడు, నంచిత మతిలేక చెడుగె - యార్జించితిఁ గ్రా
న్పించిన ప్రాణుల పీడక, వంచి విఱిచి పొట్టఁబెట్టు - వంచనకతనన్. ౬౩

తే॥ నన్ను సద్గతికిం ద్రిప్ప - నున్ననాడు, పూర్వకృతపుణ్యమున నిట్లు - పొగడఁదగిన
నిగమ నిశ్రేణిగల పద - నీరజములఁ, బొంది తేఱితి నెప్పటి - పొలుపు గొంటి. ౬౪

తే॥ నన్ను క్రుంగించు పాప గ - ణంబులడఁచు, నిన్ను వెడఁగనై నేచేయు - నేరములను
మన్నన యొనర్చి ప్రోవు స-న్మాన్య! యనుచుఁ, గ్రన్న సెలవంది దివ్యవెు-గంబునొందె.

తే॥ సాధువుల బాధ సేయు ని ♦ రాధుఁ డీల్గె, ననుచు నలరిన విమలాంగి ♦ జనకజాతఁ
గూడి వేడుక వనములఁ ♦ బాడుచుండు, పక్షి రుతముల వినుచు న ♦ వ్వారుచనిరి. ౬౬

తే॥ కాలుఁ బోలు శరంబులు ♦ కరములందు, గలుగు రామ లక్ష్మణులు నాఁ ♦ డెలమి మిగుల
వేదములె రూపునొందిన ♦ విధిని వెలయు, మునుల వనముల మసలిరి ♦ ముదితతోడ.

## ౨. శరభంగ ముక్తి పటలము. (౪౪)

కII ఆరాత్రి వికచ సుమలత, సొగుగల మహీజ తోడ - సౌఖ్యంబుగ న
య్యారామమందు కడపి శు, భారంభకులు శరభంగు - నరయఁగఁ జనుదుస్. ౨౧

కII సునిశిత శరసంపన్నులు, ఘను లచటికిఁ జేరునంతఁ - గెలునల దొర పు
ట్టిన ముదుఁగని తమ్ములఁ బో, ల్కను లోకవెయి గలుగు ప్రోడ - గానఁగనయ్యెక్.

కII తెలిపిట్ట నడకగల వే, ల్పుల చెలువలు దాల్చినట్టి ♦ భూషణకాంతుల్
మిలమిల మని మిన్నున మెఱుఁపులు మెఱయఁగ వాని నడుమఁ ♦ బొలుపుగొలుపుచుక్

చII పెలుచగు నీలదేహమున ♦ వేల్పు పడంతుల యాస్య పద్మ కో
మల వన చారులోనయన ♦ మంజుల భృంగ సహస్రకంబుతో
గలహ సుఖాశిచే మహతి ♦ క్రమ నినాద మధుద్రవంబు ని
మ్ములఁ జవిచూచుచుండు శ్రుతి ♦ పుష్పలిహంబులతో ముదంబుతో

తే॥ శాస్త్ర సమ్మతముగఁ గ్రతు - శత మొనర్చి, నట్టి మేటరి; మూర్తిత్ర - యంబుదక్క
దక్కు వేల్పుల మకుటము.ల్దాఁకు నట్టి, గండ పెండరములు కాళ్లఁ - గలుగు వాఁడు.

తే॥ జలజవాసినిఁ బోలిన - శచిని గూడి, ముమ్మదంబుల చౌదంతి - నెమ్మినెక్కి
వెండికొండపై నగజతో - వేడ్కనుండు, లోకనాథుని శంభుని - జోక నెనసి. 23

తే॥ ఏను కలిగి వ్యర్థంబని - యెంచి విధుఁడు, బిడియ పడి కాంతి హీనుఁడై - వెల్లఁ బొఱ
స్వర్గమే గొడుగయి తన - పైన నిలుచు, డంబు పంబు శ్వేతాతప - త్రింబుతోడ. 24

తే॥ దిక్కరుల మదమును బంకఁ - జిక్కఁ జుట్టి, బవరముల యందు ధృతిచెడి _బడలి పోవు
సురవరుల కీర్తులఁబట్టి - యంటఁగట్టి, నట్టులున్న వింజామర - లండ జెరయ. ౭౫

తే॥ అరుణ కిరణుండు నిల్చిన - యట్టులున్న, మేటి బొమ్మి డీకము తల - మెఱయువాఁడు
కౌస్తుభంబు కై వడిని ప్ర - కాశ మమరు,రత్న హారంబు తొమ్మనఁ - గ్రాలువాఁడు

తే॥ భాను సంకాశ రంజిత ♦ వజ్రఖచిత, కవచ మవయవంబుల మీఁద ♦ గలుగువాఁడు
విజయలక్ష్మి మందస్మిత ♦ విధము దోఁచు, హార కేయూర భుజములో♦ప్పారువాఁడు

తే॥ లెక్కలేక రత్నంబులు ♦ చెక్కినట్టి, నగల జిగిమెల్ల నొక్కటై ♦ నెగడి చిత్ర
ఫక్కి వెలుఁగంగనింద్రచా♦పంబుతోడి, మొగులుకుప్పనాఁదగి డాలు♦మునుమువాఁడు.

తే॥ సకలజగములఁ బరవు వా ♦ సనలు గలుగు, మధువు చిందెడు క్రొవ్విరి♦మాలవాఁడు
మీల గెలిచిన వేలుపు మెఱుఁగుఁ బోండ్ల,కనులఁ బోలిన ఖడ్గంబు♦గలుగువాఁడు. ౭౮

తే॥ భువన కంటకుఁడగు పది ♦ మోము లతని, మీఁద వైవఁగ వరిముక్క ♦ మేరయేని
మొక్క వోవక కాంతియుఁ ♦ బొలియకుండు, పవిని చేపట్టు నింద్రుండు ♦ పజ్జనిల్చె.

తే॥ ఉరు తపోధనుఁ డెదురేగి ♦ యుపచరించి, వచ్చుపనియేమి యన వజ్రి ♦ పలికెనిట్లు
నీతపంబును మెచ్చి య ♦ బ్జాతభవుఁడు, తోడి తెమ్మన వచ్చితిఁ ♦ దోడరమ్ము. ౮౧

తే॥ స్రష్ట మీకిచ్చె నాతని ♦ సత్యలోక, మీరు వెంచేయ ధాతయు ♦ నెదురువచ్చు
శ్రేష్ఠ లోకంబనుచు దానిఁజెప్పవలెనె?, యీర లెఱుఁగరే యన నాతఁ ♦డిట్టులనియె.

తే॥ కదలఁజాలని బొమ్మల ♦ కరణినుండి, చెడెడు సత్యలోకంబు నేఁ ♦ జేరఁగలనె?
బాధ తపమూని పెక్కు క ♦ ల్పములు గడచె, నీవెఱుంగవె? యల్పంబు ♦ నిచ్చగింప.

తే॥ ఇట్టివారి నీవును వచి ♦ యింపఁ దగునె?, బ్రహ్మలోకంబు పడసియు ♦ ఫలముగలదె
బహుళ భాషలఁ కేల? త♦పః ఫలమ్ము, పొందు కాలంబు డగ్గఱె ♦ భువనవంద్య! ౮౪

తే॥ సుస్థిరంబయి నిలుకడ ♦ చొప్పు చెడక, పెరుఁగక నశింపక గుణము ♦ వేఱుపడక
సకల భూతముల్ నశియింప ♦ సమయకుండు, మోక్ష పదవిని నేనిప్డు ♦పొందువాఁడ.

రామలక్ష్మణులు శరభంగుని చూడవచ్చుట

తే॥ ఇట్లు శరభంగ ముని వచి ♦ యించునెడను, దృఢధనుర్ధరులటవచ్చి♦యెదుటఁగలుగు
కలకలంబును విని యేమి ♦ కతమొయనుచుఁ,దమ మనంబుల తొఁచించి♦దాసి కాంచి

తే॥ బలితమై వజ్ర ఖచిత సం♦బములు వెలయు, నాల్గు రదనముల్ గల సిత♦నాగముఁగని
యింద్రుఁ డిమ్మునీంద్రుని గన ♦ నేగుదెంచి, యుండునని మదిఁదలపోసి♦యుత్సహించి

క॥ హరిణాక్షిని తమ్ముని ముని, వరు నాశ్రమ వనముబయట ♦ వదలి యొకండే
హరివలె వృషభమువలె రఘు, వరుఁ డట కరుదెంచె వర త ♦ పస్వి గాంచన్

క॥ సురలోకనాయకుండీ, ధరనాలుగు వేదములకుఁ - దథ్య ఫలంబౌ
వరమూర్తి రామభాస్కరుఁ, బరుఁగాంచె సహస్రనయన-పద్మము లలరన్. ౮౯

తే॥ కాంచి మదినొచ్చుకొని తన్ను ♦ గాచుఁ తని, బ్రహ్మవిద్వరులకు నధి ♦ పతియునైన
రాము సతతంబుఁ బ్రొక్కు శి♦రంబుతోడ, భుజములను వంచి సాష్టాంగ♦ముగ నెఱంగె.

సీ॥ జయకేతనం బెత్తి ♦ శత్రులఁ బరిమార్చి, వేదార్థముల నేర్పి ♦ విశద ఫణితి
సద్ధర్మమును సదా ♦ సన్మార్గమునఁ ద్రిప్పి, సంపదనొసఁగి మో ♦ క్షంబు నిచ్చి
శరణాగతులకు వ ♦ జ్రకవచ మయ్యును, ప్రాణంబులయ్యుఁ ♦ దనంబు నయ్యు
నయనంబులయ్యు సు ♦ జ్ఞానంబు నయ్యు వే, ర్పడక రక్షించు శ్రీ♦రాముఁ జూచి

తే॥ యధిక సమ్మోద భరమున♦నవశుఁడగుచు, మనసుకరఁగఁ బజ్జనునిల్చి ♦మఘవుఁ డంత
నేమి తెలియని కరణిఁ దా♦నెటఁగి నంత, తెలియఁ బలుకుచు నిట్లు స్తు♦తింపఁదొడఁగె

## ఇంద్రుఁడు శ్రీరాముని స్తుతించుట.

సీ॥ ఎల్ల వస్తువులందు ♦ నేకరూపంబంది, యంటి యంటకయుండు ♦ నాత్మరూప!
నిస్సంగ నియత ము ♦ ని ప్రవరాధార! వేదాంత విద్యావి ♦ వేక వేద్య!
కరుణాసముద్ర! ర ♦ క్షణకార్య నిర్నిద్ర!, తల్లియు నీవ మా ♦ తండ్రి నీవ
దాసులమగు మేము ♦ దైత్యులచేఁ బడ, రాని పాటులు పడి ♦ దీనులమయి

తే॥ త్వత్పదంబులఁజేరి కా ♦ పాడవేఁడ, నాఁడొసంగిన యభయంబు ♦ నేఁడుపూర్తి
సేయ నిట్టులే తెంచిన ♦ చిన్మయుఁడవు, నీపదాబ్జాతముల భువి ♦ నితినొందె. ౯౨

సీ॥ క్షీరసాగర శయ ♦ నా! రమాలోల! నీ, కెవరు మిత్రులు? శత్రు ♦ లెవరు? రేయి
యెయ్యది? పగలెది? ♦ యెందు గెలవు బాల్య, తారుణ్యవార్ధక్య ♦ దశలు నీకు
నెదియాది? యెదిమధ్య? ♦ మెదియంత, మగుఁగాంచ? లింగవచన నామ ♦ లీలగలదె?
ముందేది? వెనుకేది? ♦ సందేది? యెడమేది? ♦ పొందేది? యెడయేది? చందమేది?

తే॥ అట్టి నీవిట్లు పురుషమో ♦ హనుఁడవగుచుఁ, జేతఁ గోదండమూని మా♦చేతములను
నొవ్వ నడవకుండిన నీకు ♦ నెవ్వగలదె?, చిత్తరంజన! మఱునేలు ♦ చెందఁగలవె? ౯౩

సీ॥ నీనాభిఁబొడమిన ♦ నీరజోద్భవుఁడు వి, లయ కాలముల నెల్ల ♦ లలితరీతిఁ
గొలత కట్టఁగఁజేసి ♦ పలుకల్పకాలముల్, గొలిచినఁదఱుఁగని ♦ గుణగణాఢ్య!
మున్ను మేదినికుంభ ♦ ముగ నీరు పెరుఁగుగా, మందరగిరి తరి ♦ ద్రమానుగాఁగ
నీహస్త పద్మంబు ♦ లోహాటింపక నొవ్వఁ, జిలికి పీయూషంబు ♦ చిక్కుదనుక

తే॥ దాని మాకు మాత్రమొసంగి ♦ దైత్యవరుల, మోసగించితి వలనషు ♦ మాసఁజేసి
దాసులము మేము వారు శా ♦ త్రవులె నీకు?, ధర్మవైరంబు నడఁగించు♦తలఁపుగాక

చ॥ మొదట నొకండవై సిదప ♦ మొత్తమవై తుది నొక్కొ బాలన
త్పద! గుణతత్త్వ భూజ సవ ♦ పల్లవ! మాయవెత దీర్ఘనాయకా!
కదియుచు సజ్జనావళులఁ - గాచెదు దుష్టులఁగోపగింతు; దు
ర్మద మొనరించు దుష్కృతియు - మాయురె! నీదగు సృష్టియే కదా! ౯౫

శా॥ మాయామా వేష్టిత తత్త్వమా! జనము నీ - మాయన్ బ్రభిన్నింప నీ
వే యధ్యాత్మ వటంచుఁ గాదనుచు ను - య్యేలాడు డెందంబులన్
నీమాధిక్యము సన్మునుల్ భృగునిచే - నిక్కంబుగాఁ జూచు చో
నీమోఘత్వ మెఱర్పఁ జేసితి జగ - న్నిర్మాత వంచేర్పడన్. ౯౬

తే॥ ఇట్లు బహుభంగులను నుతి-యించి యింద్రుఁ, డచటిమునికగు భాగ్యంబు-నరసియంత
వర మునీంద్రుని యానతి - వడసి తాను, వచ్చుదారిని మరలి ది - వంబు చేరె. ౯౭

క॥ తరలిన యింద్రుని మది బుమి, వరుఁడు దెలిసి రాముకడకు -వచ్చిన నతఁడ
ప్పరమ మునీంద్రుని పదముల, కెరఁగ ముదశ్రువులు పులక-లెగయఁగ నతఁడున్. ౯౮

క॥ సుకముగ వర్ధిలుమని జా, నకితో లక్ష్మణుని రమ్మ ♦ నన్ వారలు కౌ
తుకమున వచ్చిరి రాముఁడు, స్వకీయ పూర్వ సుఖ నిభ శు ♦ భంబులఁ దేలెన్. ౯౯

క॥ రాముఁడు సీతయు లక్ష్మణుఁ, డామాపమ్ముని వచించు ♦ న్యాయము లెల్లన్
బ్రేమమున వినుచుఁ గడపిరి, భాముం డుదయించు దనుకఁ ♦ బ్రమదాలసులై. ౧౦౦

తే॥ పరవి యుఅవగు కాంతులఁ ♦ బరఁగు భానుఁ, డొక్కటిగ నల్లుకొని యున్న ♦ దిక్కుడుంగ
మందు కరముల నాతప ♦ మను నరాసిఁ, గొని తమంబను తీఁగలఁ ♦ గోసివైచె. ౧౦౧

శరభంగుఁ డగ్నిం బ్రవేశించి శాశ్వతపదంబు నొందుట.

తే॥ తత్త్వవిజ్ఞాని! శరభంగ ♦ తాపసేంద్రుఁ, డతని యెదుట నగ్నిని చొర ♦ నాత్మ నిశ్చ
యించి యిధ్మ్య క్రమముగ వహ్ని ♦ యేర్చుఁడింక, నాకు సెలవిండనుచుఁ దన్మ ♦ నంబు విల్వె

ఉ॥ చాప విశారదుం డపుడు ♦ శాస్త్ర విశారదుఁగాంచి పల్కునో
తాపసచంద్ర! మీరిట ను ♦ దంబునఁ జేసెడు కార్యమేది? మా
కోపికఁ దెల్పుఁడన్న నతఁ ♦ డొయ్యన నిట్లను రామచంద్ర! నే
దీపిత వహ్నిఁ జొచ్చి ముగి ♦ తిం గొననెంచితి నాఁ గృపాళుఁడున్. ౧౦౩

తే॥ తాపసేంద్ర! నేవచ్చిన ♦ తరుణ మందె, చేయుటేల? యను కుమార ♦ సింహుఁగాంచి
మారజితుఁడై న తపసి రో ♦ మములు నిక్క, నిట్టులంపు మోదంబున ♦ నిట్టులనియె.

తే॥ విజయ శీల! నేనిచ్చట ♦ వేవిధములఁ, దపము సేయుచునుంటి నీ ♦ దర్శనంబు
గలుగునను నమ్మకంబుతోఁ ♦ గలిగె నేఁడు, ద్వంద్వములు నశియించె నేఁ ♦ దలఁతు ముక్తి.

తే॥ నిన్న మాపున వేల్పు మ ♦ హేంద్రుఁడు వచ్చి, బ్రహ్మమీరాకచేఁ దన సత్య♦పదము రండ
నంగఁ బరమపదంబు నొం♦దంగఁ గోరి, యంచటి కేగక నిలిచితి♦నయ్య! యనుచు.

చ॥ మనసునకున్ వచస్సులకు ♦ మానిత నైగమ శాస్త్రపాళికిన్
దనరఁగ నందకుండు పర ♦ తత్త్వముఁ గాంచిన మానిచంద్రుఁ డిం
పునఁ గరుణింపుమంచుఁ దన ♦ పొల్తుకతో ననలంబుఁ జొచ్చి తా
ననుపమ మోక్షభాగ్యరమ ♦ నందె జనంబు వెఱఁగు పొందఁగన్. ౧౦౭

ఉ॥ భావిమెఱుంగు పంకజభ ♦ వ ప్రభృతి త్రిదశాలిచేత వి
జ్ఞావలిచే మమత్వము న ♦ హంకృతి పూర్తిగ నుజ్జగించి ద్వం
ద్వావధి వీడి చేరఁదగు ♦ నట్టి మహాపదమున్ భజించె న
ప్పావని తత్త్వవేత్త శర ♦ భంగుఁడు పెన్నిధి రాము సన్నిధిన్. ౧౦౮

మ॥ ఒకచో నాడిన మాటవస్తువులఁ దా ♦ నుత్సంగ మందుంచు బా
లికపోల్కిన్ సకలాండజాలముల నో ♦ లిం గర్భమునం జేర్చు న
య్యకలంకేశుని నామ సంస్మరణపు ♦ ణ్యంబెన్నఁగా దన్న, నా
యకు శ్రీరాముని గాంచువారు కను భా ♦ గ్యంబద్ది సామాన్యమే? ౧౦౯

## 3. అగస్త్య పటలము. (౫౫)

తే॥ అట్లు శరభంగుఁ డంతంబు ♦ నందఁ గాంచు, కతన వ్యాకులతఁ బొంది ♦ ఘనగభీరు
లతని యాశ్రమస్థలి వీడి ♦ యవలి కేగి, రవనిజం గూడి విసుఁగుతో ♦ నాదతోడ. ౧౧౦

క॥ వనములు వృక్షంబులు నదు, లును గిరులును కొండచఱియ ♦ లును మనమలరన్
గనుచుఁ గుసిగుంపు వడయక, చని రమ్మువ్వురును దాఁటి ♦ సమ్మదలీలన్. ౧౧౧

తే॥ వలువమనుమలు వాలఖి♦ల్యులును మాన,యతులు బోడలు జటిలులు♦యతివరులును
దండకారణ్యవాసులు ♦ తపసులెల్ల, ముదమునంది రాముని గన♦నెదురుకొనిరి.

క॥ క్రూరగుణుల రాకాసుల, పోరుపడఁగ లేక క్రుంగి ♦ పొనుఁగు పడిన య
వ్వారలు రాముఁ గనిరి జల, ధారలఁ గనినట్టి మ్లాన ♦ తరువులఁ బోలెన్. ౧౧౩

క॥ పెలుకుటి రాకాసుల పే, రులు తడఁబడఁ బలికి దుఃఖ ♦ రోగులయిన మా
నులు మందు నడవి వెలువడి, తలిఁ గను క్షేపుల విధానఁ♦ దనిసి రెడఁదలన్. ౧౧౪

క॥ రాక్షసులు సేయు బాధల, మోక్షము గనలేక కుందు ♦ మునివరు లబ్ధిన్
రక్షింప నాక రా నుప, లక్షించిన పగిదిఁ గని తో♦లంచిరి కలఁకన్. ౧౧౫

క॥ తమ్ము తపమే పండెయి గా, రమున నెదురు వచ్చు పగిది ♦ రాముఁడు రా మో
దమున మునులు భవకారా, విముక్తి గను యోగులట్లు ♦ విలసిల్లి రటన్. ౧౧౬

క॥ కోరిన వారికిఁ గోరిన, కోరికలిడు తపము నూని ♦ గురుశాంతులునౌ
కారణమున రాకాసుల, పోరుపడగ లేక కష్ట ♦ ములఁ బడి రోర్మిన్. ౧౧౪

క॥ లేచిరి వచ్చిరి మేఘము, పూచిన ననఁబోలు రాఘ ♦ వుని డాసి రతం
డేచిన భక్తిని మ్రొక్కిన, నోచిన ఫలమొంద వరుస ♦ నొడివిరి జయముల్

తే॥ వారిఁ గొనిపోయి చక్కని ♦ పర్ణశాల, యొసఁగి యాతిథ్య మిడి తమ ♦ యునికికేగి
యవల సోఁకులవలన సం♦భవములైన, తొందరల దొంతరలఁ దెల్పఁ ♦ దొడరి చనిరి

ఆ॥ వచ్చు మునులఁ గాంచి ♦ చెచ్చెరఁ గూర్చుండఁ, బనిచి యాజ్ఞయడుగ ♦ వారుతనిసి
చక్రవర్తి తనయ! సమకుటినట్టి మా, నొగులు వినుమ యనుచు ♦ నుడివిరిట్లు. ౧౨౦

చ॥ కనికర మింతలేని మది గల్గిన రక్కసిమూఁక పాపవ
ర్తనమునఁ గష్టపెట్టి చెడు ♦ దారులఁ దీసితపంబు పాడుగా
నొనరిచి చేయరాని కడు ♦ నొప్పములం బొనరింప మాతపో
ఘనసథ ముజ్జగించి కడ ♦ గండ్లను పొందుచు నుంటి మిచ్చటన్. ౧౨౧

తే॥ పులులవనమున జింకల ♦ పోల్కి మేము, రేయిఁబవలు గగ్గోలొంది ♦ కృశతనంది
చితికి ధర్మపథంబు పీ ♦ డితిమి మాకుఁ, దలఁప ముక్తి యుఁగలదె కో♦దండపాణి!

ఉ॥ కాము తపోనియుక్తులము ♦ కాము శ్రుతుల్ చదివించు వారముఁ
గాము పఠించువారమును ♦ కాము మఖంబులు వేల్చువారముఁ
గాము పరార్థ చింతకులు ♦ కాము నియామక కార్యనిష్ఠులుఁ
గాము గురుత్వవర్తనులు ♦ కామిఁక బ్రాహ్మణులున్ రఘూత్తమా! ౧౨౩

తే॥ ఇంద్రుఁడో దానవుల యాజ్ఞ ♦ నొడఁదయందు, శిరమునందును తాలిచి ♦ చెలఁగువాఁడు
కాన మాతండ్రి! మాకడ ♦ గండ్లఁ దీర్చు, వారు లేరు మాభాగ్యాన ♦ వచ్చి తీవు.

తే॥ రాజరాజ సుతుండవు ♦ రాత్రివంటి, దుఃఖమున నేమి యెఱుఁగక ♦ దొరలుచుండఁ
దివిరి రవివోలె నీవరు ♦ దెంచి తయ్య, అభయమంటిమి కరుణామ♦యాత్మ! కావు.

శ్రీరాముఁడు మునుల కభయ మిచ్చుట.

తే॥ జనకజాజాని యిట్లను ♦ దను జవరులు, నన్ను శరణొందరేని యెం ♦ దున్న నేమి ?
మచ్ఛరాసన నిర్ముక్త ♦ మార్గణముల, నేలఁ గూలు వారలు దుఃఖ ♦ మేలమీకు?

ఉ॥ తండిరినాకమేగఁ, బిన ♦ తల్లి వరంబులు గోర, నాదు త
మ్ముండును నిందకై యడల ♦ భూరిగుణాఢ్యులు పౌరులేడ్వఁ, గో
దండము నూని సీతయును ♦ తమ్ముఁడుఁ దోనరుదేర, నిట్లు నే
దండకఁ జేరుటెన్న మదు ♦ దాత్త చిరంతన దిష్టమే సుమీ. ౧౨౪

ఉ॥ ధర్మపథానువర్తుల యు♦ దార మహత్త్వ మెఱుంగలేని యా
దుర్మతులన్ వధించి మహిఁ ♦ దోరపు ధర్మము నిల్పనేని నేఁ
గార్ముకమున్ ధరించి వృథ ♦ గాదె జగంబున సంచరించుటల్?
నిర్మల భాగ్యమన్న మఱి ♦ నెక్కొనునే యితరంబు నాకికన్? ౧౨౯

తే॥ ఘన తపస్విలరగు మీరుఁ - గష్టులైన, రక్కసుల కబంధములు న♦ర్తనము సేయ
ధనువుమోసిన నాబాహు - దండములును, దగిన విశ్రాంతి నొందుత - ధరణియందు.

తే॥ గోవులను విప్రులను దీన-కోటి శరణు, చొచ్చువారి రక్షింపముకై - చచ్చువారె
వేలుపులు గూడ వినుతింపఁ-జాలినట్టి, దేవతాశ్రేష్ఠులగుదురు - దివమునందు. ౧౩౦

తే॥ తారకారి త్రిపురవైరి - దనుజవైరి, వచ్చికాచిన, నెవరు దు-ష్పథులు వారి
వారివారిని తుదముట్ట - ద్రచ్చువాఁడ, శంకమాని సుఖంబుండుఁ-డింకమీరు. ౧౩౧

క॥ అనిన విని మదిని ముదమం, దినవారు త్రిదండములను - త్రిప్పుచుఁ బన్నా
లను పఠియించుచు నర్తన, మొనరించుచు నిట్టులనిరి - ప్రోత్సాహమునన్. ౧౩౨

క॥ లోకేశ! నీవు కినియఁగ, లోకంబులఁ బోలు కోటి - లోకము లెదురై
తాఁకిన నేమగు? నిక్కపు, సాకిరు లీ శ్రుతులు తపము - జ్ఞానము తగవున్. ౧౩౩

క॥ కావున నీగడువగు నేం, డీవనమున నిలిచి మా య - భీష్టార్థంబుల్
కావింపు మనఁగ రాఘవ, భూభుఁ డందు డ మోద - మున నీకొనియెన్. ౧౩౪

ఆ॥ వారలటఁ బదేండ్లు ♦ వసియించి యుండిరి, మానులు పిదప దీర్ఘ ♦ ముగఁ దలంచి
యుద్ధగుణుఁ డగస్త్య ♦ డెలమి వసించు న, వ్వనముఁ జేరుఁడన్న ♦ వారలేగి. ౧౩౫

సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణుం గాంచుట

ఆ॥ బీఁటలైన చోట్లు ♦ వెదుళులు గలచోట్లు, పొదలు దట్టమైన ♦ పదములందు
చనుచు వడి సుతీక్ష్ణుఁ ♦ డను బ్రహ్మతేజస్వి, తపమొనర్చుచున్న ♦ తలము గనిరి. ౧౩౬

ఆ॥ గర్వరహితులైన ♦ కాకుత్స్థవర్యుల, మ్మునికి మ్రొక్క నతఁడు ♦ ముదముతోడ
నిట వసింపుఁ డనుచు ♦ హితమతిఁ బల్కంగ వా, సిత సుగంధ వని వసించినారు. ౧౩౭

క॥ శ్రీరామునకుం దగు నుప, చారమ్ములు చేసి వత్స! సమ్మద మారన్
మీరిట కరుదేరఁగ నే, పారిన నాతప మదెంత ♦ యతిశాయి యయ్యెకో!. ౧౩౮

క॥ అనవుడు రాఘవుఁ డిట్లను, మునివర! బ్రహ్మన్వయమునఁ ♦ బొడమిన ఋషులన్
మునుకొని మీవలె ఘనతప, మొనరించిన వార లెవ్వ ♦ రు తమ చరితా!. ౧౩౯

క॥ సాధుజన దర్శనంబున, నేధన్యుఁడనైతి నన ము ♦ ని ప్రవరుఁడు ప్రే
మాధికత విందవగుచుఁ ద, పోధన మఖిలంబు గొనుము ♦ పూత చరిత్రా!. ౧౪౦

క॥ అను మునికి రామ భూవిభుఁ, డను మీకృప తపము కంటె ♦ నధికమయ్యెన్
మనమున నగస్త్యఋషివరుఁ, గన నెంచితి నదియు గోదువ ♦ గావింపుఁడనన్. ౧౪౧

క॥ రామా మేలే తలఁచితి, యే ముందే యదియ తెలుప ♦ నిచ్ఛించితి నీ
వా మహాసీయుం గాంచుము, క్షేమంబులు నీకు నెల్ల ♦ జేకుఱు నచటన్. ౧౪౨

క॥ అతఁడును నీరాకకు స, మ్మతిని ప్రతీక్షించుచుండు ♦ మానుగి సటఁజే
రితివేని జనులకును దే, వతలకు శ్రేయంబులగుఁ గృ ♦ పాపర! యనుచున్.

క॥ ఆదారి చూపి యాశీ, ర్వాదమ్ములు నేసి యనుప ♦ రఘురాముఁడు స
మ్మోదమునఁ దేనెవాఁకల, పాదులుగల యయ్యగస్త్యు ♦ వనముం జేరెన్. ౧౪౪

శ్రీరాముఁ డగస్త్యుఁ దెలిసి వచ్చుట.

చ॥ ధరణిఁ ద్రివిక్రముం బలెను ♦ ద్రావిడ భాషను గొల్చినట్టి స
ద్గురు వరుఁడౌ నగస్త్యుఁడు, క ♦ కుత్స్థకులేశులు రామలక్ష్మణుల్
హరువుగఁ గాంచవచ్చు నెడి ♦ యారసి పైపయి నుబ్బు మోద సా
గరమున జగంబు నిండఁ బడ ♦ కంజము లాతఁడు గొల్వఁగాఁ జనెన్

ఉ॥ మున్నొకవేళ రక్కసులు ♦ మున్గిన వారిధిఁ జూపి వీరలన్
మన్నిక గొనంగ వేఁడుకొను ♦ మార్గము లేదు కృపన్ వహింపవే
యన్న సురాళి కూయిడిని ♦ యంబుధి తోయము లెల్ల నొక్కచే
తిన్న ఱినుంచి త్రావి విశ ♦ దంబుగ నుమ్మినవాఁడు సిమ్మటన్ ౧౪౬

తే॥ వంచకుండగు వాతాపి ♦ నుచితముగ, మెసఁగి జీర్ణించికొని వాని ♦ యుసురు దీసి
వాని యనుజు నిప్పులుచేసి ♦ ప్రాణికోటి, నెఱిని గాచిన ధీరుండు ♦ కుఱుచవాఁడు.

ఉ॥ యోగులు విభ్రమం బొరసి ♦ యుత్కట సంకట మొంది వేఁడను
ద్యోగిత సూర్య చంద్రులను ♦ వ్యోమము నంటి పెరింగి యడ్డు విం
ధ్యాగముఁ గాలనూని భుజ ♦ గాధిపలోకము దాఁకఁ ద్రొక్కి పు
న్నాగము నెక్కు పోల్కి జత ♦ నంబున నెక్కిన యట్టి జాణఁడున్. ౧౪౭

ఉ॥ పార్వతి పెండ్లి వేళఁ ద్రిభు ♦ వంబుల ప్రాణులు చేరు హేతువై
యుర్వర క్రుంగి యోరగిల ♦ నొయ్యన దక్షిణ మేగు మంచు నా
శర్వుఁడు కోర దక్షిణ ది ♦ శంగల శైలము నెక్కి ధారిణిన్
సర్వసమంబుగా నిలుపఁ ♦ జాలిన తత్త్వ మహత్త్వ సత్త్వుఁడున్. ౧౪౮

తే॥ తనియ ముక్కంటి యొసఁగిన ♦ ద్రవిడ భాష, ఎనియె నేర్చెదు శ్రుతికంటె ♦ వేఁగటంచు
ఘనుల వాడుకఁ బట్టియుఁ ♦ గవితఁ బట్టి, చింతనము చేసి వెల్లడిం ♦ చిన ఘనుండు.

తే॥ స్వర్గ మర్త్య నాగములందు ♦ సకల జీవ, రాశి యెడఁదల బుఱ్ఱులఁ ♦ గ్రాలు నాతఁ
డితఁడ యని యెల్లరు తలంచు ♦ ధ్యేయవస్తు, తత్త్వమగు రాముఁగాంచును ♦ త్కంఠవాఁడు

చ॥ వినుతగుణంబుల న్నెగడు - వేదములం బఠియించి పెంచు జ్ఞా
న నికషమందు రాచి జత - నంబునఁ దోయజగర్భుఁడుం దుదిం
గనుఁగొనలేని తత్త్వమని - గారము రామునిపైనఁ జేర్చి యా
తనిఁగని పల్కు భాగ్య మది - దక్కుటకున్ ముదమందు నాతఁడున్.

తే॥ అనమదైత్య బలంబను ♦ వినము పేరు, తొట్టి మాయించు మంచి వై ♦ ద్యుండువచ్చె
బ్రదికి రమురులు మునులు జీ ♦ వములఁ గనిరి, ధర్మవర్తనులైనారు ♦ తక్క జనులు

తే॥ ఇతర జీవులఁదిన హరియిం - చు దైత్య, భయద నిర్ఘాత సంఘాత - పాత సదృశ
కోపవహ్నిఁ జల్లార్ప ర - ఘు ప్రవీరుఁ, డంచి తాంబుదమూర్తి యే - తెంచెననుచు.

ఉ॥ తీరుగ సర్వలోకములు - దిక్కులు దార్గతి నీఁగి సద్గతిం
జేర నుదారతన్ బహు వి - శిష్ట తపఃఫల జాతమైన కా
వేరిని కుండికం గొనుచు - వేడుకఁ దెచ్చు నగస్త్యమౌని యా
శ్రీరఘు వీరుఁగాంచి విల - సిల్లి ముదశ్రులు రాల్చినిల్చెనన్. ౧౫౭

తే॥ మస్కరీంద్రుని గనుచు న-మస్కరించి, సీతయును రామలక్ష్మణుల్ - చెలఁగినిలువ
ద్రవిడ భాషాప్రసిద్ధుండు - తనిసి యలఘు, స్వాగతము వచియించె స-ద్భాషణముల.

తే॥ యతివరులు పనసలు వేళ్క-యతనిఁ జుట్టి, తమకమండలు జలము మ - స్తమునఁ జిలికి
విరులు సల్ల నగస్త్యుండు - విశదమైన, తన ప్రశాంత వనమునకుఁ-గొనుచు నేగె. ౧౫౮

తే॥ వీరుఁడాతని పర్ణకు - టీరమందు, విందుప్రేమతోఁగొని హార్ద - మందియుండ
ఘనతపము సేయు మా తపో - వనముచేరి, తపము పూర్తిగావించి తు - దాత్తచరిత!.

చ॥ అని వచియించు మౌనిఁ గని ♦ యాతఁడు పల్కు సమస్తదేవతల్
మునులును వృద్ధులున్ నృపతి ♦ ముఖ్యులు నావలె మీకృపన్ భరిం
చిన ఘనులేరు లేరు పలు ♦ శ్రేయము లొందితి సప్తలోకముల్
మునుమిడి గెల్చినాఁడఁ బోలు ♦ పున్ గడియించితి జన్మధన్యతన్. ౧౫౯

చ॥ శశిధరసన్నిభుండయిన ♦ సన్ముని రాముని గాంచి యిట్లనున్
వశమయి * యష్టమంగళ గు ♦ ణంబు లెసంగిన రామభద్ర! స
ద్యశము గడించి తండ్రిని య ♦ థార్థ వచస్కు నొనర్చి దండకా
దిశ కరుదెంచు నాఁడె యరు ♦ దేరుదు వియ్యెడ కంచు నెంచితిన్. ౧౬౦

*అపహత పాప్మత్వము. విజరత్వము, విమృత్యుత్వము, విశోకత్వము, విజిఘత్సత్వము, అభి
పిపాసత్వము, సత్యకామత్వము, సత్యసంకల్పత్వము, అనునవి అష్టమంగళములు.

తే॥ ఇందు నీవుండు మిట వసి ♦ యించియున్న, మాతపంబు లభీష్టముల్ ♦ పూఁత్రపూచు
క్రూరులగు రక్కసులు వచ్చి ♦ కొడిమె సేయ, వారి వధియించి మాయెద్ద ♦ వనట దీర్తు.

ఉ॥ పాలనమున్ హలంబు గొని ♦ పాడియె పంటయొనర్చు రాట్సుతా!
శీలము నీతియున్ శ్రుతులు ♦ చెల్వగు ధర్మము వృద్ధి నొందెడున్
మేలు గడింత్రు వేలుపులు ♦ మృత్యువు గొంద్రు నిశాచరుల్ సదా
యోలల నాడు సమ్మద ప ♦ యోధి జగంబు నిజంబు నిల్వుమా. ౧౬౨

ఉ॥ అమ్ముని యిట్లు పల్కినని ♦ యాయతబాహుఁడు రాముఁ డిట్లనున్
సమ్మతి మీయనుజ్ఞఁ గొని ♦ చంపెద పోఁకుల దిమ్ము మాల్చెదన్
నెమ్మది గూర్తు మీకు నిది ♦ నిక్కము సమ్ముఁడు యాతుధాన సం
ఘమ్ము చరించు దిక్కుకడఁ ♦ గన్ మునుపేగుట యుత్తమాసనన్. ౧౬౩

అగస్త్యుఁడు రామునకు వైష్ణవ ధనువు నొసఁగుట.

ఉ॥ మంచిది పోయిరమ్మనుచు ♦ మానివరుండు రమా హృదీశ్వరుం
డంచిత రీతిఁదాల్చు జగ ♦ దప్రతిమాన శరాసనంబు పూ
జించుచు నుంటి నక్షయ వి ♦ శిష్ట నిషంగము తోడ నిత్తు దు
ర్వంచకులైన వారి సమ ♦ రంబునఁ ద్రుంపుమ యంచు నిచ్చుచున్. ౧౬౪

తే॥ ఈజగములెల్ల నొకతల ♦ యిద్ది యొక్క, తల యనఁగ నొప్పు క త్తియు ♦ దర్పకారి
నగ ధనువుగొని పుర దహ ♦ నంబు సేయు, ననదృశంబగు విశిఖంబు ♦ నమరనిచ్చి.

చ॥ కుజములు సైకతంబులును ♦ కొండలు నెత్తుగఁగల్గి ప్రక్కలన్
సజలములైన వాహినులు ♦ చల్లగనొప్పి ప్రశాంతభూమియై
సుజన మనోభిరామమయి ♦ సూన గుళుచ్ఛ వికాస భాగ్యమై
యజిర వినోదమై పరఁగు ♦ నట్టిది పంచవటీ స్థలంబగున్.

తే॥ అచటఁ దోఁక వద్దను తేనె ♦ యరఁటి పండ్లు, గలవు కావేరివంటి యే ♦ ఖులునుకలవు
జానకిం గూడి యూడ హం ♦ సలును కలవు, అందు వసియింపఁ దగుదు వీ ♦ వార్యవినుత!

తే॥ అనుడు నీలమేఘ శ్యాముఁ ♦ డతని కెఱఁగి, యాజ్ఞ గైకొని పికవాణి ♦ యైన సీత
యనుజుఁడగు లక్ష్మణుండు వె ♦ న్నంటి రాఁగ, నమ్మునీంద్రు మనస్సుతో ♦ నచటికరిగె.

౪. జటాయు దర్శన పటలము. (౪౮)

ఉ॥ చేరిక గల్గి నట్టివియుఁ ♦ జేరక వేఱుగనుండు భూమిభృ
ద్వారము గాంచి యెక్కుచును ♦ దాఁటుచు వేగయుతంబులైన వాః
పూరము లందు తెప్పపయిఁ ♦ బోవుచు దవ్వు తరించి కాంచి ర
వ్వారలు ప్రేమ వేగి పరి ♦ భావితవాయువు నజ్జటాయువున్. ౧౬౫

తే॥ కరఁచినట్టి బంగారంబు♦కరణి నుదయు, గిరిశిఖరముపైఁ జేరు భా♦స్కరుఁడు దిశలు
వెలయఁ గిరణపక్షంబుల ♦ విరియఁజేసి, యున్న మాడ్కి నుత్తేజుఁడై ♦యున్నవాని.

తే॥ నీలగిరిఁ బోలు కచ్ఛప ♦ నేత పైని, క్షీరవార్ధిలో శశికాంతి ♦ చేరియుండ
నిర్జరులు మథియింపంగ ♦ నిలిపినట్టి, మందరాగంబు కైవడి ♦మలయు వాని. ౧౭౧

కం॥ నీలాకాశ వికాసము, మూలంబడ రక్తకాంతి ♦ మొనయు పదములన్
నీలగిరి మీఁదఁ బొడవు ప్ర, వాళ లతలు పరవు వెరవు ♦ పరవిన వానిన్. ౧౭౨

ఉ॥ లోపము లేనివాఁడు గుణ ♦ లోలుఁడు సత్యయుతుండు శీలి సం
తాపము లేనివాఁడు నెఱి ♦ ధర్మపథంబు లెఱుంగు ధీరుఁడున్
గోపము లేనివాఁడు పెను ♦ కూరిమివాఁడు కుశాగ్రబుద్ధి దు
ర్లాపము లేనివాఁడు సుక ♦ లావిదుఁ డార్యుఁడు దూరదర్శియున్. ౧౭౩

తే॥ అనిశ మింద్రుఁ డంకుశధార♦నెనయుచంచు, పుటముతోఁ గ్రూరరాక్షస♦ఘటములను వి
దారణముచేసి యముసకుఁ ♦ బారణమ్ము, చేసి పిదప గాత్రముల భు ♦ జించు వాని.

తే॥ గ్రహచయము నేలు ధ్రువచక్ర♦గతిఁదనర్చు, రత్నఖచితహారము మెడఁ♦ గ్రాలువాని
మేరు గిరి మీఁద వెలుఁగొందు ♦ మిహిరుఁబోలు,ఘనకిరీటంబుశిరమునఁ♦గలుగువాని

తే॥ వర్ణనాతీతమగు కీర్తి ♦ వఱలువాని, నిరులు నశియింప నుదయించు ♦ నరుణు తనయుఁ
గల్పకాలముల్ త్వరలోనఁ ♦ గడపునట్టి, దినము లట్టులఁ జూచిన ♦ తెఱఁగు వాని.

తే॥ శైలమున నిల్చి యది మోవఁ ♦ జాల కిలకుఁ, గ్రుంగి నట్లుండు తోఁపిక♦కోఱలువానిఁ
గాంచి రామలక్ష్మణులు శం ♦ కా విలగ్న, హృదయు లగుచు నాతని దరి ♦ కేగి నారు.

కం॥ తన మునిఁయిక తాన వెదకి, కొని వచ్చిన రక్కసీని ♦ కుహనారూపం
బనియును బలియుఁడు గరుడుం, డనియును తలపోసి చూచి ♦ రలుకన్వానిన్. ౧౭౮

తే॥ దృఢ ధనుష్మంతులును వీర ♦ తేజులైన, రాకుమారులఁగని జటా ♦ రాజియున్నఁ
దాపసులు గారు వేడ్కకై ♦ ధరకు దిగిన,సురలొయని జటాయువువారి♦నరసిచూచె

ఉ॥ కాంచితి వాసవున్ సురలఁ ♦ గాంచుచునుందు నతంబు భక్తిమైఁ
గాంచితి మాధవున్ గనక ♦ గర్భుని శంకరు నిట్టివారలం
గాంచను మారుఁడేనియును ♦ కాంచిన సిగ్గిలి మూలదాఁగువాఁ
డంచితులైన వీరి చర ♦ ణాబ్జ పరాగము నేని పోలునే?. ౧౮౦

చ॥ గొనకొని మూఁడులోకములు ♦ కూడ ♦ భరింపఁగఁ జాలు భద్ర ల
క్షణముల దేహముల్వెలయు ♦ కార్ముకవీరులు లక్ష్మఁబోలు ని
వ్వనజదళాక్షితో హరుల ♦ వైనమునం జరియింపనేల? నా
మనమును చూఱగొన్నగుణ ♦ మాన్యు లదెవ్వరి పుత్త్రులోకదే? ౧౮౧

ఉ॥ ఒక్కఁడు చూడ నీలగిరి ♦ యొక్కరుఁడో యరుణాచలంబు పే
రక్కొని లక్ష్మికిన్నెలవు ♦ లందపుఁ గన్నులో పద్మపత్రముల్
చెక్కులు లద్దముల్ మఱియుఁ ♦ జెన్నగు మొక్కటులెల్లఁ జూడ నా
మక్కువకాఁడు కోసలర ♦ మాపతి పోలికలే కనంబడున్. ౧౫౨

తే॥ ఇట్లు యోచించుచున్నంత ♦ నినకులేశు, లతని జూసి రంత జటాయు ♦ వాదరమున
ధనువులం దాల్చి మునులచం♦దమునవచ్చు,వీరులార! మీరెవ్వారు♦వినుచుండనుడు.

తే॥ సత్యమే తక్కవేఱు కాం ♦ చని కుమార, వరులు ధారణి నేకాత ♦ పత్త్రముగను
దివిజవైరుల గుండియల్ ♦ దిగ్గురనఁగ, పాలనము సేయు దశరథ♦ప్రజలమనిరి. ౧౫౪

జటాయువు దశరథ మరణము విని శోకించుట.

తే॥ అనుడు నానంద వననిధి ♦ మునిఁగి లేచి, ప్రీతి వారలఁజేర్చి ప ♦ రిష్వజించి
జనకు దీర్ఘ బాహులు బలి ♦ ష్ఠ ముతె చెప్పు, డింపుమై నన నవ్వార ♦ లిట్టు లనిరి.

క॥ అనుమాటను మఱి తప్పుట, యనుచితమని జనకుఁ డేగె ♦ నమరపురికి నం
చను నంత నాజటాయువు, వనటన్ భరియింపలేక ♦ వ్రాలెన్ ధరణిన్. ౧౫౬

క॥ ఇరువురు కరములఁ బట్టి, శ్వారు లేవఁగనెత్తి బాష్ప ♦ జలముల మొగమున్
బరిమార్జన మొనరింపఁగ, మరలఁ దెలివి నొంది యతఁడు ♦ మఱుఁగుచు వంతన్

ఉ॥ త్యాగము ఛత్రమున్ శమము ♦ దాల్చిన నిన్ గని సిగ్గునొందు క
ల్పాగము చంద్రుఁడున్ భువియు ♦ నందఁగరాని ప్రమోదమంద, యా
గ్తాగుణపాళి ధర్మమును ♦ నన్నును దుఃఖపయోధి ముంచి మా
కేగతి చూపి పోయితి? నృ♦పేంద్ర! యశస్కర! సత్యభూషణా! ౧౫౮

చ॥ జగముల కెల్ల నీడనిడు ♦ ఛత్రము దాల్చిన చక్రవర్తి! యీ
జగములఁ గాచు కార్యమొక ♦ చక్కని వీడి మదీయ మైత్రి నీ
వగఁ బరికింప నేగితివొ? పాపపుఁ బుంజమనైన యేను గ్ర
ద్దగ జనియించి ధర్మములఁ ♦ దప్పి యడంగక యుంటి నిచ్చటన్ ౧౫౯

ఉ॥ శంబరుఁద్రుంచు కాలమున ♦ సర్వ జగంబు లెఱుంగ నీవు ప్రా
ణంబులు నేను దేహమని ♦ నమ్మఁగఁబల్కుట తప్పవే కదా?
వెంబరయా కృతాంతుఁ డవి ♦ వేకముచేత ననూత్కరంబు భూ
మింబడ దేహముంగొని భ ♦ మించి దివంబున కేగె నేమొకో? ౧౬౦

తే॥ కీర్తి వ్యాపింపఁగా నగ్ని ♦ కీలలఁబడి, మాఁడవలయునుగాక యి ♦ మ్మాడ్కి నబల
యట్లు దుఃఖింపఁ దగునె? యం♦చతఁడులేచి,వత్సలార! వినుండని♦పల్కె నిట్లు.౧౬౧

సీ॥ దక్షప్రజాపతి ♦ తనయులఁ గాంచె నేఁ, బండ్ర వారల నొక్క ♦ పగిదినున్న
పదుమువ్వురను కశ్య ♦ పప్రజాపతికిచ్చె, వారిలోఁ దిలకమై ♦ వఱలు నదితి
ముప్పదిమూఁడు కో ♦ ట్లొప్పు సురలఁగాంచె, దితియను సతి పూర్వ ♦ దేవతాళి
నఱువది యాఱుకో ♦ ట్లడరంగఁ గనియెను, దనువను చెలిగనె ♦ దానవులను

తే॥ మనుజతతిఁ గాంచె మఱియను ♦ సుడఁతి, సురభి, కాంత కామధేనువుతురం ♦ గంబులాది
మృగములం గాంచె, సింహక్ర ♦ మేల గార్ద, భాదులను క్రోధవశయను ♦ సతివపడసె.

సీ॥ వినతా వనితగాంచెఁ ♦ బిడుగుల మెఱపుల, నరుణుని గరుడు ది ♦ వాంధములను
కంకంబు లాదిగాఁ గల పెనుపక్షులఁ, దామ్రయను పడఁతి యొం ♦ దంగఁగనియెఁ
బిచ్చుకల్ పూరేళ్లు ♦ బెళవలు కౌఁజులు, మున్నగు పినపిన్న ♦ పులుఁగు తెగలఁ,
గళయను నామె తీఁ ♦ గలు చెట్లుగుల్మముల్, మొదలగు నుద్భిజ్జ ♦ ములను పడసె

తే॥ భయద ఫణములుగల యహి ♦ ప్రతతిఁగాంచెఁ, గద్రువయను వెలందినా ♦ గములుతక్కు
వానిఁ గనె సుతయనునది ♦ తానరిష్ట, యుడుము లుడుతలు తొండలు ♦ పడసెఁ బుడమి

సీ॥ జలచరంబులఁ గాంచె ♦ నిలయను నెలనాఁగ, యట్టులా చెలులు చ ♦ రాచరముల
విరివిగాఁ బడసిరి ♦ వినతా సుతులలోన, నరుణుండు రంభ యం ♦ దమరఁ గాంచె
మమ్ము, మాయన్న సం ♦ పాతి యన్ను జటాయు, వంద్రు దివౌకసు ♦ లందు నుండి
తక్కుజాతుల వేఱు ♦ లెక్కించు కాలాన, జనియించి నాఁడ మీ ♦ జనకహితుఁడ

తే॥ నరుణుఁ డెందెందు వర్తించు ♦ నందు నందుఁ, దిరుగనేర్తు నెదురులేక ♦ దివ్యతేజు
లార! మిము గంటి మీతండ్రి ♦ నారఁ గాంచి, నట్టులయ్యె మనంబున ♦ నలరు మిగిలె

తే॥ ఆతఁడిటు వల్క రాఘవు ♦ లంజలి గొని, యుబుకు వంతచే బాష్పంబు ♦ లురలఁ గీర్తి
నిచటనిల్పి నాకంబున ♦ కేగుతండ్రి, మరలి రాఁజూచు కైవడి ♦ మసలినారు. ౧౯౫

ఉ॥ అత్తఱి రామలక్ష్మణుల ♦ నర్మిలిఁ బక్షములందు చేర్చి రా
జోత్తములార! నాకుఁదగ ♦ నుత్తరకార్యములెల్ల మీరలే
యిత్తఱిఁ జేయఁగావలయు ♦ నిద్దఱు మూర్తులకొక్క జీవమై
హత్తిన మిత్రుఁడేగ భర ♦ మైకను దేహము నగ్ని నీఁగెదర్. ౧౯౬

క॥ అను పక్షిరాజు పలుకుల, ఘనులగు రాఘవులు వినుచుఁ ♦ గైమోడ్చి వెనర్
గనులను ముత్తెంబుల యను, పున బాష్పము లురల ననిరి ♦ పొక్కుచు వనటన్.

తే॥ కడఁక ఘ్నాజీవిత సహాయ ♦ కారివైన, తండ్రి సత్యవాక్యంబుకై ♦ తరలె దివికి
నిప్పుడీవును మము డించి ♦ యేగునెడల, మాకు దిక్కెవ్వరింక నీ ♦ లోకమందు?

ఉ॥ వీడఁగరాని ప్రేమపద ♦ విశ్రుత రూపులఁ దల్లిదండ్రులన్
వీడితి మాప్తబంధువుల ♦ వీడితి ముద్ధతమా నయోధ్యయున్

వీడితి మెల్లసంపదలు ♦ వీడని కానలలోని కష్టముల్
వీడితి మేము మీవలన ♦ వీడుట పాడియె మీరు నిచ్చటన్? ౧౯౯

తే॥ అని తపించుచు నిల్చిన♦ యనఘులఁ గని, యిపుడు నేను దేహము వీడు♦టింపు గాక
యున్న మీరయోధ్యకుఁ జేరు ♦ క్రన్నవించి, దశరథుం జేరు వాఁడనో♦తనయులార!

మ॥ జనకుండుం దివికేగఁ బూజ్యమగు రా ♦ జ్యంబీరు పాలింప కి
వ్వనికిం రాఁగతమేమి? యేమి జరిగెం ♦ బల్కుఁడు దూపిల్లు నా
మనముం నిర్జరదైత్య పన్నగ రిపు ♦ త్రైనాథు లేరేని నే
గిని గావించినఁ దీర్చి మీకు నభిషే ♦ కింతుం మహీంద్రమ్మటన్. ౨౦౧

తే॥ జనకుఁడైన జటాయువు వీ ♦ నరణిఁ బలుక, సన్న తమ్ముని గ్రేఁగంట ♦ నరయునంత
నతఁడు పినతల్లియగు కైక ♦ కతనఁ జరగు, వృత్తమెల్ల స్పష్టంబుగా ♦ విన్నవించె.

తే॥ తండ్రి సత్యవంతుం జేసి ♦ తల్లి పలుక, తలను దాల్చి రాజ్యమ్మును ♦తమ్మునకు నొ
సంగు త్యాగమూర్తి! తండ్రి! సంతనగను, నీ పనుల్ మతి యేరిచే ♦ నెగడు? ననుచు.

తే॥ కమలనేత్రుని కగియారఁ ♦ గౌఁగిలించి, శిరము మూర్కొని యశ్రువు♦లురలఁగాంచి
యోసమర్థ కుమార! నీ ♦ వీసరణిని, పితరునకు నాకు యశము ♦ గావించి తనుచు.

తే॥ గాజులం దాల్చు నొక హంసి ♦ కరణి నున్న, జనకజం గాంచి యీతన్వి♦చందమేమి?
కుసుమకోమలి మీతోడఁ♦గూడి రాఁగఁ, గారణం బేమి? యనుడు ల♦క్ష్మణుఁడు పలికె

చ॥ తమిగమిఁ బోలి ఛకోలుపు - తాటకిఁ జంపుట గోలె శంభు ధ
ర్మముగొని తుండ్లు సేయుటయు - మైథిలి పెండ్లియుఁ బట్ట భంగముం
తమ పపినాగమంబు పితృ - తర్పణముం బొనరించు దాఁక స్ప
ష్టముగ వచించెఁ బక్షికుల - చంద్రముఁ డెల్ల నెఱుంగునట్లుగన్. ౨౦౬

క॥ భోగకర రాజ్యమెల్లను, భోగి కుబుసమూడ్చు పోల్కిఁ - బోవిడిచిన వై
రాగులు మీరీవనమున, నాఁగుడు రక్షించుచుండు - ననవరతంబుం

చ॥ అని విహగేంద్రుఁడాడ విని - యార్యుఁడు రాముఁ డగ స్త్యమౌని చె
ప్పిన దగు గౌతమీ తట వి - విక్త తలంబున నుందుమన్న న
య్యనఘుఁడు లెస్సయయ్యెఁ దగ ♦ నాస్థలమందె తపంబు సేయుఁ డ
వ్వనిఁ గనిపింతు రండనుచుఁ - బక్షము నీడనె కొంచుఁ బోవుచుం. ౨౦౮

తే॥ అమలహృదయుండు గుణనిధి♦యగుజటాయు, వెదుట నున్న పంచవటి న♦య్యుద్ధగుణుల
కెఱుక పఱచి చనిన యంత ♦ నినకులేశు, లవ్వనంబునఁ జేరి ర ♦ త్యాదరమున. ౨౦౯

ఉ॥ అచ్చటనున్న రాక్షసుల ♦ యాశ్రయ సత్త్వములెల్లఁ జక్కఁగా
నిచ్చ నెఱింగినట్టి విహ ♦ గేంద్రుఁడు క్రొత్తడియైన జానకిం

మచ్చిక నక్కుమారులను ♦ మాటికి మాటికి వచ్చి పిల్లలన్
ముచ్చటఁ గాంచు నండజము ♦ వోలెఁ గనుంగొనుచుండె నంతటన్. ౨౧౦

## ౫. శూర్పణఖా పటలము. (౧౪౩)

ఉ॥ వీరులు రాఘవుల్ గనిరి ♦ పృథ్వి కలంకృతియై సమస్త సం
భారము లిచ్చి పార్శ్వములఁ♦*బంచ విధంబుల పంట భూములన్
దారిత పాతకంబులగు ♦ దారుల రంజిలి యా త్తలక్షణో
దార కవిత్వ పద్ధతిని ♦ హారి వినిర్మలయైన గౌతమిన్. ౨౧౧

చ॥ కమల ముఖంబులన్ గలువ ♦ కన్నులఁ గాంచి తరంగహస్తముల్
క్రమముగఁ జాఁచి పుష్పములు ♦ క్రిందుగ వారలపై విడుర్చుచున్
భ్రమద విహంగ రావముల ♦ స్వాగతపద్యము లల్లుచుండె గౌ
తమి యతిథుల్ రఘూత్తములు ♦ తన్ను రయంబునఁ జేరఁ గాంచుచోన్.

ఉ॥ మిక్కిలి ప్రేమ సువ్రతులు ♦ మేదిని నాయక పుత్త్ర రత్నముల్
చక్కటికై వనంబులకు ♦ సాగిన కష్టముఁగాంచి యోర్వలే
కక్కటికంబుచేఁ దరఁగ ♦ లన్ కరముల్ గొని మోఁదుకొంచుఁ బే
రక్కలినొంది యుత్పల క ♦ టాక్షములన్ వడిఁగార్చె బాష్పముల్. ౨౧౩

### సీతా రాముల గౌతమీ తీర విహారము

ఉ॥ నాళయుతంబులైన నలి ♦ నంబులపై వెసఁ జక్రవాకముల్
వ్రాలుట గాంచి రాఘవుఁడు ♦ వారికి సీత కుచంబులం గనున్
ఆ లలితాంగియున్ విభుని ♦ యంగద బాహుల సౌరు గాంచి ర
త్నాల మెఱుంగు లీను గిరి ♦ నాయకముం గనుచుండు లీలమై. ౨౧౪

తే॥ హంసి యటఁదొలఁగుట గని ♦ హంసకులుఁడు, సీత నడకను గాంచి హా♦సింప నామె
సీరు ద్రావి నివర్తిలు ♦ గౌరు నడక, గాంచి రాము నడక చూచి ♦ కడఁక నవ్వె. ౨౧౫

తే॥ తీవియలు కదలుట గని ♦ తీవఁబోఁడి, నడుము గాంచె రాముఁడు, సీత ♦ నాథుతనువు
నల్ల కలువల నడిమి యుత్ఫుల్ల వనజ, యుగము నెగదిగ నిట్టట్టు♦లారసి చూచె. ౨౧౬

ఉ॥ అట్టి వినోద దాయక మ ♦ హానది గౌతమి చెంతఁ గొండలం
బుట్టిన నిర్ఝరంబులును ♦ ముచ్చట గూర్చు శకుంత రావముల్
పట్టుగ మ్రోఁగు పంచవటి ♦ బంధుర లీలల లక్ష్మణుఁ డెడం
గట్టిన గట్టి పర్ణకుటిఁ ♦ గాంచి వసించిరి వారలంతటన్. ౨౧౭

---

* (1) కుఱింజి=కొండయు, కొండక్రింది నేలయు. (2) ముల్లై=అడవియు, అడవిప్రక్క నేలయు (3) నెయ్దల్=కడలియు, తీరభూమియు. (4) మరుదం=మాగాని. (5) పాలై=మరుభూమి.

## శూర్పణఖ రాముసందము గాంచుట

ఉ॥ జీవముతోడ దేహమునఁ • జేరి క్రమంబున వృద్ధినొంది యా
జీవముతోడ దేహమును • చీల్పఁ దలంచి గమకించు దొడ్డ రో
గావృతిఁ బోలునట్టిదియు • నచ్చపుఁ బచ్చలకొండవంటి యా
రావణు మూలముట్టుగఁ గ • రంబు వినాశము సేయు జాణయుక్. ౨౧౮

తే॥ జేగుత్తెన వెంద్రుకలును • చిట్టిగొన్న, రాహువును పోలు దేహంబు• గ్రాలునదియు
, విబుధవరులకు మునులకు • విశ్వజనుల, కొక ముగింపు సన్వేషింప• నూను నదియు

తే॥ భావి కలుషంబులకు నొక • పట్టుగొమ్మ, అడవి నెప్పు డొంటరిగఁ జ • ట్టాడుకొమ్మ
వడిగ లోకమెల్లఁ దిరిగి•వచ్చు బోటి,శూర్పణఖ యను జోటి య•చ్చోటికేగె. ౨౨౦

తే॥ చెట్ట తన బందుగులకు సూ • చించు గోతి, చుప్పనాతి నాకులు వేడ•సోఁకుమూకఁ
జంపఁ బాఁప సెజ్జను వీడి • జగతి యందు, నవతరించిన శ్రీరాము • నరసి కాంచె.

చ॥ మదనుఁడె యందమౌ యొడలు • మాఁడిన దెన్నఁడో! యింద్రుఁడందమౌ
పొదలవు వేయి కన్నులు! భ • వుండని యందమ ఫాలమందు క
న్నొదవదు! నాభి పంకజము • నుండి జగంబుల సృష్టిసేయు ల
చ్చి దయితుఁ డందమౌ యలరు • చేతులు నాలుగు లేవు కాంచఁబోన్.

క॥ భవు కంటి మంటచే నివు, అవు మారుఁడు నాఁటఁగోలె • న సుదగు తపముల్
దవిలి యొనరించి యిట్టి వ, పువుఁ బొందంబోలుఁ గాక • పోలుపుగ నిలపై. ౨౨౩

మ॥ అసమానంబగు లీల జానువుల నొ • య్యందాఁకి సొంపైన యి
య్యసమేషు ప్రతిమాన బాహులకుఁ గ • ల్పాగంబు హేమాద్రి యొ
ప్పెసలారన్ సరిగావు బల్లిదములై • యేపారు దిక్కుంభి హ
స్త సమంబుల్ సుకుమార సుందరములై • దర్పించు దోర్దండముల్. ౨౨౪

తే॥ పురువ వక్ష్య బాహువులకు•ముదిరియున్న, నీలగిరిసాటియగుఁదక్కు • శైలములును
రాలుగలయవి మేరువు • రసమయంబు, గాన నిసుమంతయును సాటి • కావుకావు.

తే॥ కమల దళములఁ బోలిన • కన్నులొప్పు, కొండవంటి యీపురుషుని•గురు భుజములఁ
గాంచ నా కనుల్ దీర్ఘముల్ • గాకపోయె, నంతకంటెను వెడంద లో - మ్మమరుఁగదవె!

చ॥ అల్లనికి మించి కాంతు లల • రారు మనోహరు శౌర్య తేజముల్
తోలఁకెడు నెమ్మొగంబునకుఁ • దోయజముల్ సరి తూఁచరాదు లే
జలజ విరోధి మోమునకు • సాటియె యన్నఁ గలాక్షయం బటన్
గలుగును నిండుచందురుఁడో • కందొకఁ డొందినవాఁడు చూడఁగన్.

ఉ॥ ఏమి యొనర్ప నెంచి యితఁ ♦ డిట్టి మనోహర రూపమొందెఁ? నీ
కోమలికంబు పాడుగ నొ ♦ కొండు తపంబిటు లేల సేయు? దై
త్యామర సిద్ధ సాధ్య మను ♦ జావళి లోఁగొనఁ జాలు ధీరుఁ డి
ట్లీ మహిలోఁ దపింపఁ దప ♦ మే తపము బొనరించెనేమొకో!. ౨౨౮

తే॥ ఏణలోచన గిరికుచ ♦ యిభ్యయాన, సైకతశ్రోణి ఘనవేణి ♦ జలజపాణి
వనధిచేల భూదేవి యీ ♦ నరుని పదము,లంటి శాద్వల రోమాంచ ♦ యగుచునుండె

తే॥ ఈ సుభగు కాంతి దినకరుఁ ♦ డెటులఁ గఁడే మొ? భువనమందు స్వల్పంబగు ♦ పొల్పునించి
బిడియ మొందక నభమున ♦ నడచువాఁడు, తాన యసమ తేజస్వి గాఁ ♦ దలఁచినాఁడు?

తే॥ దాఁట నరుదైన గిరులను ♦ సాటి గొనని, యున్నత భుజంబు లొప్పు నీ ♦ వన్నె కాని
యధరమునకుఁ బ్రవాళ సా ♦ మ్యంబు వలుక,జను లిసీయ సమతియేది ♦ సవతుగలదు?

క॥ చక్కని నిండు కళలతో, నిక్కు నిశానాథుఁ డెగడు ♦ నీటరి కటిపైఁ
జెక్కిన వల్కలముం బలెఁ, బెక్కువ తపియింప వేమొ ♦ పీతాంబరముల్?. ౨౩౧

తే॥ మొగులు దొంతుల కరణిని ♦ మొనలు దిరిగి, దట్టమై నల్లనై యున్న ♦ జుట్టు విడిచి
జడలఁ బూనఁడయేని చం ♦ చలములగుచుఁ, జెలుల మాన ధనంబులు ♦ చెడకయున్నె?

తే॥ తారహారముల్ మల్లికా ♦ దామ వితతి, నిలఁడు దాల్చిన జిగియున్నె ♦ యింతకంటె
ఘనతరోజ్వల మాణిక్య గౌరవంబు, వేఱు రత్నంబుచే నభి ♦ వృద్ధియగునె? ౨౩౪

ఉ॥ భద్రగుణాలి యెల్ల బహు ♦ భంగుల నేర్చి విరించనుండు సా
ముద్రిక లక్షణంబుల న ♦ మున్నతిఁ జూపు నిమిత్త మిట్లు ని
ర్నిద్రత వీనిఁ జేసియును ♦ నిందను పొందె సమస్తలోక సం
పద్రతి వజ్రి యొందెఁ దన ♦ పాద రజంబును పోలకుండియున్. ౨౩౫

ఉ॥ వెలువలున్ సముద్రములుఁ ♦ బిన్నవిగాఁ గనుపట్ట డెందమం
దల్లిన మోహమున్ జలధి ♦ యామెను ముంప, దరిద్ర దూషణల్
పెల్లుగ నోర్చి యెంత విల ♦ పించిన నొక్క తృణంబ యేని యీ
నొల్లని లోభికీర్తివలె ♦ నుం కెడు శీలము గల్గు దైత్యయున్. ౨౩౬

చ॥ వడలి తపించి కుంది రఘు ♦ వర్యుని యున్నత దోర్యుగంబుపైఁ
బడఁ దన చూపుల న్నిలిపి ♦ వాని మరల్పఁగలేక శిల్పి నే
ర్పడర లిఖించు బొమ్మయన ♦ నట్టె చలింపక నిల్చి యేదియున్
బొడఁగనఁగాఁ బొలుపోక మది ♦ తుంపెసలాడఁగ దైత్యయువ్వలన్. ౨౩౭

ఉ॥ వీని విశాలవక్షమును ♦ బిగ్గ గవుంగిలిఁ జిక్కఁ గొందుఁ గా
దే నమృతంబు నిచ్చిన క్షు ♦ యించుట సిక్కము మిన్న కేఁగఁగా

లేను మదీయ దిష్టము ఫ ♦ లింపఁగ నీ నవమూరు సన్నిధిన్
మానుగఁ జేరు టెట్లనుచు ♦ మంతన మొందఁగఁ జేసి యంతటన్ ౨౩౭

చ॥ కుటిల కరాళ దంత, బహు ♦ కోటుల జీవుల వై చికొన్న యు
త్కట కుహరోప మోదర, య ♦ తర్కణ మిట్లు దలంచి యాతఁడీ
కటుతర రూపమున్ మదిని ♦ కై కొనఁ డంచు నెమిళ్లు కోకిలల్
పటుమతి వెంటనంటఁ దగు ♦ భవ్య తరాకృతి గాంచ నెంచుచున్. ౨౩౮

శూర్పణఖ కామరూపిణియై రాముకడ కరుగుట

తే॥ నీరజాలయ నెడఁద ధ్యా - నించి తనకు, సిద్ధమై యున్న మంత్ర మా-చెలి జపింప
నబ్జుఁ దెగడు మొగము తోడ - నంగకాంతి, దెసలఁ బర్వ సుందరియయి-తేజరిల్లె

తే॥ ఎఱ్ఱ ప్రత్తియుఁ జిగురాకు-నీల గొనఁగఁ, దగ్గ చరణాబ్జములు గల్గి - తనివి నసఁగ
మాటలాడు మయూరి నా - మానసౌక, మఁగ లేఁడీఁగ యన విన-మనఁగ వచ్చె

తే॥ లక్ష్మియందంబునీలోత్ప లములసొబగు, గలుగునయనకుంతంబులు-వెలుఁగు మొగము
నళులయువతిరూపముఁగొన్న-వాస్త్ర మొందు, మెఱపుతోఁగాకమింటితో-నెఱఁ గెననఁగ

తే॥ కల్పకముగన్న యొలదీవ ♦ కై పుగలిగి, కామదంబగు మధుర వా ♦ క్యములుగలిగి
యందగత్తెయై భీత ♦ మృగాక్షియగుచు, నమిలి నడచిన కయివడి ♦ నడచివచ్చె. ౨౪౩

తే॥ రశనయును నూపురములు వ ♦ స్త్రము ను కురుల, విరుల బంభరముల రొద ♦ వి స్తరింప
నింతి యొకతె వచ్చెడు నని ♦ యెంచి రాముఁ,డా దెసను దృష్టిసారించి ♦ యరయసాగె.

తే॥ ఒక్క యమృతంబు నాకస ♦ మొసఁగె ననఁగఁ, గుచభరంబున మధ్యంబు ♦ కునియరాఁగఁ
దలఁపు నిచ్చియజ్ఞానంబు ♦ తలఁగఁద్రోచి, జ్ఞానదృష్టి నిచ్చెడువాఁడు ♦ సకియఁగనియె.

మ॥ సురలోకంబున నాగలోకమున నీ ♦ క్షోణిన్ గనన్ రాని యా
వరరూపంబును కాంచి రాఘవుఁడు భా ♦ వంబంద యూహించె నె
ల్లర సౌష్ఠవ్యము లీమె యంద యడఁగెన్ ♦ లక్షించి వీక్షించినన్
సరిపోల్పందగు చామలుంగలరె యీ ♦ సౌందర్యవారాశికిన్? ౨౪౬

చ॥ తనమది రాఘవున్ వలచు ♦ దైత్యయు నాతని సుందరంపు మో
మును తలపోయుచుం జరణ ♦ ముల్ తన హస్తములన్ మొగిడ్చి మ్రొ
క్కనిడుపు క్రేవ చూడ్కిఁ దిల ♦ కించియుఁ జూడని యట్లు సుంత ల
జ్జను గొని యేణి యట్టులొక ♦ చక్కఁదొలంగి మలంగి నిల్వఁగన్. ౨౪౭

ఉ॥ ఆగతయైన శూర్పణఖ ♦ నాగమవేద్యుఁడు కాంచి పల్కు దూ
రాగత పద్మగంధిరో! శు ♦ భావహ మయ్యెడు నీదురాక నీ

కీగతి నిందు రాఁ గత మ ♦ దెయ్యది? యెయ్యది వాసభూమి? నీ
బాగు వదింపు నామమెది? బంధువులేరు? వినంగఁ గోరెదన్. ౨౮౮

తే॥ అనుడు నయ్యది యిట్లను♦ నబ్జగర్భ, పౌత్త్రి పుత్త్రిని త్రిపురారి♦మిత్త్రుఁడగుచు
దిక్కరులగెల్చి తారాద్రిఁ ♦ దివిరి యెత్తు, ఘనుని చెల్లెల నాపేరు ♦ కామవల్లి

తే॥ అనిన రాముఁడు సందేహ♦మంది దీని, నడత చెడ్డది యగునైన ♦ నరయుదమని
రావణుని చెల్లెలైన నా ♦ రజపు రూపు,గలిగె నెవ్విధిఁ దెలియంగఁ♦బలుకు మనఁగ

చ॥ తడఁబడకుండు వాక్యముల ♦ దానవి యిట్లను రామచంద్ర! ప్రము
క్కడులును మోసగాండ్రు నగు ♦ కర్బుర సంఘము తోడి జీవితం
బెడయఁగ రోసి నా యెడఁద ♦ నింతవివేకము గల్గ ధర్మము
న్నడపుచుఁ బాపమూడ్చి సుమ ♦ నస్కులచేఁ దగఁ గొంటి నీయెడన్. ౨౯౧

ఉ॥ ఆ పలు కాలకించి సుగు ♦ ణాఢ్యుఁడు రాముఁ డనుర్ మహేంద్రుఁడుర్
బ్రేఁపఱ లొంగి సేవలొద ♦ వింపఁ ద్రిలోకము లేలు వానికిర్
జాపలనేత్ర ! చెల్లెలయి ♦ సంగడు లెవ్వరు లేక యొంటివై
నీపగిదిర్ వనంబులకు ♦ నీ వరుదేరఁ గతంబు తెల్పుమా. ౨౯౨

తే॥ అనిన రాముని ప్రశ్నకు ♦ నసృతవాది, ని యగు నాపె యిట్లను రాజ! నీచదైత్య
సంగతిని మాని దేవప ♦ క్షంబు నూని, వచ్చితిని కార్యమొండు నీ♦వలనఁ గలుగ

సీ॥ అనఁడు స్త్రీలమానసములు♦గనఁగఁదివుట, యోగ్యములు కావనుచు నెంచి♦యువతి! యే
పని గలదు తెల్పు మయ్యది♦భావ్యమేనిఁ, తప్పకయొనర్తు నని పల్కఁ♦జుప్పనాతి. [మి

తే॥ తాముపొందిన వలవంత ♦ తామె తెలుప, మానినులకుఁ దగనిదైన ♦ మాఱు దిక్కు
లేకయుంటి మన్మథుఁ డద♦లించి సేయు, సిలుగులం ద్రోచి నన్ను ర♦క్షింపు మనిన.

క॥ వాలికలై కన్నులు పెను, పోలికలై తిరుగుచున్న ♦ పొలఁతి తలంపుల్
చీలికలై సిగ్గఱి వల, పేలికలై చెడిన వనుచు ♦ నెంచుచు నుండన్. ౨౯౬

తే॥ తేంట్లు పోరాడు వేణి నొం ♦ దిన వెలంది, మానమున నున్న రాముని♦మనము నెఱుఁగ
లేక ప్రేమించి నన్ను పా♦లించు నొక్కొ, కాదనునొ యంచుఁగలఁగియా♦కరణిఁబలికె.

ఉ॥ రామ! యలేఖ్య సుందర! స ♦ రాగముతో నిట కీవు వచ్చుటల్
నే మును కానకే మునుల ♦ నేమకముల్ పొసరించుచుంటి నా
కామనకామినీత్వమును ♦ గారపు యౌవన మింత కాలముర్
గౌముది కానఁ గాయు క్రియఁ ♦ గాసట బీసట యయ్యెఁ గాంచితే? ౨౯౮

ఉ॥ నిందితురాలు దైత్యసతి ♦ నీతిని మాలి యిటుల్ వచింప రా
జేందుఁడు వేఱుకార్యమున ♦ కిట్టులు వచ్చిన దంచు నెంచి యో

సుందరి! బ్రహ్మవంశమున ♦ జాటివి నీవు నరేంద్రవంశ్యుఁడన్
బొందిన వర్ణధర్మములు ♦ బూదిని గల్పుట యుక్తమా? యనన్ ౨౫౯

ఉ॥ తండిరి బ్రహ్మవంశజుఁడు ♦ తల్లి యరుంధతిఁ బోలు నామె దై
త్యుండు సుమాలి కూఁతురగు ♦ దోషము లేదు వృథా వివాదముల్
మెండుగఁ బల్కి యిట్లు కడ ♦ మీఁటుదు వేని భరింపఁ జాల నీ
దండనె ప్రాణము ల్విడుతుఁ ♦ దప్పదు పాపము నీకు సుందరా! ౨౬౦

చ॥ వలపెద నగ్గలం బగుడు ♦ వారక రావణు చెల్లెలీగతిం
బలుకఁగ సుస్మితంబను ప్ర ♦ భా తరళంబగు మించులోడిదా
జలదము భాతి శోభిలు ప్ర ♦ జాహిత చిత్తుఁడు ధీలనారతిన్
జెలువ సురారి కన్యకను ♦ చేకొన మర్త్యుని కొప్పునే? యనన్. ౨౬౧

చ॥ తలఁపఁగ దగ్గ శ్రద్ధ ప్రమ ♦ దం బగు భక్తి ఫలంబు పెద్దగాఁ
దలఁపక తొందరం దవిలి ♦ దైత్య వరాంగిని పంక్తికంఠు చె
ల్లెల నని పల్కుటే తెలివి ♦ లేమిగ నెడ్డఁ దలంచి గొప్ప వే
ల్పుల వరశక్తి దైత్యతను ♦ పూరిగ నీఁగితి నంచుఁ బల్కఁగాన్. ౨౬౨

చ॥ ఇనకుల చంద్రుఁ డిట్లు వచి - యించు సుభాసిని! నీదు సోదరుల్
ఘను లొకరుండు వీరత జ - గంబుల నేలెడి ధీరుఁ డొక్కఁడో
ధనదుఁడు వారు నిన్ను ప్రమ - దంబున నిచ్చినఁ గేలు పట్టుటల్
పనియగుఁ గాక యన్యమగు - పద్ధతి యుక్తము కాదుచుమ్మనన్. ౨౬౩

తే॥ మరునిచే నైక్యమెయున్న - మనసులొప్ప, స్త్రీలకును మగలకు శాస్త్ర-సిద్ధమగుచు
వఱలు గాంధర్వవిధి యట్లు - జరుగు పిదప, నన్నలును సమ్మతింతురు - వన్నెకాఁడ!

చ॥ ఋషులపయిన్ విరోధము వ - హించు సురారులు నిన్నుగాంచి వి
ద్విషుఁడని వైరమూనరు మ - దిం దలపోయ నొకండ వుంటి వీ
విషయమె వంశమైత్రికొక - వేడుక వారధి గాఁగనొప్పు న్వ
ర్విషయము నీయధీన మొన - రింతురు మిక్కిలి మేలు గూర్తురన్. ౨౬౫

చ॥ అనవుడు రామచంద్రుఁడను - నంగన! నీ సుఖమందితిన్ బలా
శనుల కృపం గడించితిని - సంపద నొందితి మేలుపొందితిన్
జనపదముం ద్యజించి విపి - నంబునఁ జేయు మహాతపంబు గాం
చిన ఫలమొక్కఁడా? యనుచుఁ - జిర్నగవుం బొనరించు నంతలో ౨౬౬

## శూర్పణఖ సీతను కాంచుట.

సీ॥ త్రిభువనవాసుల - దృష్టిభూషలచేత, వెలయుచు వాసనల్ - వీచుచుండు
నాకు గీమున నుండి - యన్నుల మిన్న ని, ర్జరులు పొందిన మహా - వరము ఫలన

భూమిలో రత్నంబు - పోలిక నుద్భవిం, చిన సీత యచటికిం - జేరరాఁగఁ
గాలెడు ఘోరంబు - గతికి పాక్కిన యూస్య, మొప్పిన మతిహీన - చుప్పనాక

తే॥ కాయమున వెల్వడిన సూర్య-కాంతివంటి, కాంతి యొక్కండు ప్రక్కనఁ- గ్రాలనరసి
ధరను నింగిని నిండిన- క్తంచరాట, వులను కాల్చు పతివ్రతా - నలముఁగాంచె. ౨౬౭

ఉ॥ తావి కురుల్ గలట్టి వసి ♦ తామణి సీతఁడు తోడఁగొంచు ని
ట్టీ వని కేగుదేరఁడు మ ♦ హీతలమం దిటువంటి సుందర
శ్రీ విలసిల్లు కామినులు ♦ చెందరు లక్ష్మియె సద్మమైన రా
జీవము వీడి భూస్థలిని ♦ చెన్నగు కాళులు తేయ వచ్చెనో? ౨౬౮

చ॥ అని భ్రమియించి చూచి కమ ♦ లాసను సృష్టి మతింపు మీఱు సం
చున నొక హద్దులేని బలు ♦ సోయగముం గలదంచు నెంచి క్ర
న్నన నొక యూఁడుదాన నగు ♦ నాకె కనుల్ మనమున్ మరల్పఁగాఁ
బనుపడకుండె నింక మగ ♦ వారలు గాంచిన నేమి యౌదురో?. ౨౬౯

ఉ॥ రాముని చూచి చూచి మఱి ♦ రామను తప్పక చూచి చూచి యూ
తామరసాసనుండె యొక ♦ తావునఁ గాంచఁగఁ దగ్గ యట్లు చే
తో ముద మొందఁగాఁ దలఁచి ♦ తోన యజాండమునందు గల్గు న
క్కోమలికంబు లొక్కయెడఁ ♦ గూరిచి చేసెను వీరి నిద్దఱన్. ౨౭౦

ఉ॥ కుందనముం బలెం బురుడు ♦ గూడని నీలపయోద గాత్రుఁ డీ
సుందరమూర్తి యీతనికి ♦ జోడగు నేమిది నన్నువోలె? నీ
చందనగంధి నావలెనె ♦ చయ్యన మధ్యనె వచ్చెఁగాదె? దీ
నిం దొలఁగించి త్రోవ నిత ♦ నిం బురికొల్పెద నంచు రాముతో ౨౭౧

చ॥ సుగుణగణాఢ్య! యీచెలువ ♦ చూడఁగ రక్కసి మాయలాఁడి దీ
ని గుణ మెఱుంగరానిది గ ♦ ణింపఁగనేల? పలాశి దీని సో
యగమును నమ్మఁ బోకు నిజ ♦ మైనది కాదిది నీకు హాని గూ
ర్పఁగఁ దఱి వేచియున్నది త్వ ♦ రన్ దొలఁగింపుము మేలు కోరినన్. ౨౭౨

చ॥ అనవుడు రాముఁ డిట్టులను ♦ నాసురికిన్ దరలాక్షి! మేలు! నీ
సునిశిత బుద్ధి మెచ్చితిని ♦ సూక్ష్మమతి న్నిను గెల్చువారు భూ
మిని కలరేమి? నీ పలుకు ♦ మేలున నీ హృదయం బెఱింగితిన్
గనుపడ దీనిదైత్యయని ♦ కాంచెదు గాకని నవ్వె నల్లనన్. ౨౭3

చ॥ సుధయు వసిష్ఠు దానయును ♦ జోడనఁదగ్గ వరాంగి సీత రా
మ ధరణినాథు దగ్గఱఁగ ♦ మండెడు నిప్పులఁ బోలు కన్నులన్

గ్రుధ గొనఁ జుప్పనాతి కని ♦ కుచ్చితురాల! విలాసవేళలోఁ
బ్రధనము సేయ వచ్చితివె ♦ పానక మందలి పుల్ల కై వడిన్. ౨౬౪

ఉ॥ చంపెదఁ జూడుమంచుఁ బరు - షంబునఁ జూడ భయంబునంది యా
చంపకగంధి సీత కడు - సన్నని కౌను వడంక దూఁది చం
దంపుఁ బదంబు నొవ్వ జల - దంబున మించును బోలె రాము నా
డెంపు భుజాంతరంబునఁ బ - డెం జెదుగా జమపూని యత్తఱిన్. ౨౬౫

ఉ॥ దుష్ట గుణంబులే యడరు - ధూర్తులతోడిది ఖేలయయ్యెఁ బైఁ
గష్టములే వెలార్చు నని - కార్ముకవీరుఁ డెదం దలంచి నీ
యిష్టము గానయ్యె సుద - తీ! యిట నిల్వకు లక్ష్మణుండు నీ
చేష్ట లెఱింగనేని తగు - శిక్ష యొనర్చును పొమ్ము వే యనన్. ౨౬౬

చ॥ జలగిరి పద్మసద్మలును - శంబరవైరియుఁ దక్క వేలుపుల్
జలగిరి పద్మ సంస్థితులఁ - జాలఁ దపింతురు నన్ను బొంద, నీ
చెలువ రచించు మాయ వలఁ - జిక్కితి మోసము వచ్చె నీకు నా
పలుకులు నమ్మమం చసుర - పల్కుచునుండఁగ రాఘవేంద్రుఁడున్.

తే॥ తగులు నీతోడ వలదను - పగిదిఁ దెలుప, మెఱుపు వెన్నంటు మేఘంబు - కరణి సీత
వెంట శ్రీరామచంద్రుండు - వెడలి పర్ణ, శాల లోనికిఁ జనియె ని - శ్చింత మెయిని.

తే॥ తెలివి నశియించి నిశ్చేష్ట - యొలయు దైత్య, యంత శ్వాసంబువిడువక-యంతరంగ
మవశ మగుడుఁ గోపించి యీ - యతివయందు,గాఢమగుప్రేమగలదని- కలఁకనొంది

మ॥ ఉరుసౌందర్య పయోధియైన రఘు వ - ర్యుం బొందు మార్గంబు లో
నరయం జూచుచు నేగు శూర్పణఖ య - వ్యాపన్నతన్ వీని పే
రురమున్ గౌఁగిటఁ గూర్పనేని తను వు - ద్యోగింతు వీడంగ నం
చిరవౌ స్ఫాటిక కందరంబునకుఁ దా - నేగెన్ విచారంబుతోన్. ౨౭౦

## శూర్పణఖ సంతాపము

ఆ॥ జలజ హితుఁడు గ్రుంకె - సాంధ్యరాగము గ్రమ్మె, శూర్పణఖకుఁ గ్రూర-సర్పవిషము
వోలె దేహమెల్ల - దూల వ్యాపించె న, మ్మరుని వలని బాధ-మరులు వోల్కి. ౨౭౧

క॥ తాటక వక్షంబున మును, నాటిన శ్రీరాము మార్గ - ణము వలె మరుఁడున్
గాటముగ నేయు బాణము, నాటుటచే సంకటంబు - నం దూపిల్లెన్. ౨౭౨

క॥ మలయూ నిలమును నస్త్రము, విలయూవేదనము గూర్ప ♦ వెలవెల గొనుచున్
నెలతేని వ్యంజనంబుగ, వలతేనిం దినఁదలంచె ♦ వడి నాతురయై. ౨౭౩

తే॥ సంకటము గొల్పు వార్ధి ఘో ♦ షంబడంగఁ,గొండలంద్రోచపూఁడ్పంగఁ♦గోరియంతఁ

గువలయాప్తుండు తన్ను సం♦ కోచ పఱుప, మాని తాపంబుచేఁజాల♦మాఁడుచుండె

తే॥ విరులు పొడియగు నట్టు లీ ♦ పృథివి గలుగు, వనములనుధ్వంస మొనరింప♦వాంఛచేసి
జక్కవలు కవగూడిన ♦ చంద మరసి, వాని ధ్వని విని మది క్రుంగ ♦ వడఁకుచుండె

తే॥ కడఁగి శశి క్రమింగ నొక భుజం ♦ గంబుఁ దెత్తు, ననుచుఁ గోపించి చను దోయి♦నంటిచల్ల
గాలి సోఁక సంకటపడి ♦ కడఁకమాను, రాముపైఁగల వలపున ♦అంపె లాఁడి. ౨౮౯

తే॥ ఉడుకు చనుదోయిపై మంచు♦నుంచు కొనియెఁ, గామశరవహ్ని మేన మి♦క్కుటము
వేఁడి బండపై నుంచిన♦వెన్న ముద్ద, మాడ్కిఁ గరఁగి నీరయ్యె న♦మ్మగువకదియు. [గాఁగ

చ॥ జలనిధిఁ గ్రూరుఁడౌ కుసుమ ♦ సాయకు దాఁచి యడంప యోగ్యమా
స్థలమిది యంచు నెంచి యసు ♦ నంచయ మూఁగుచునుండు దుస్థితిన్
గలిగి స్మరాగ్నికిన్ జడిసి ♦ కంధిని మున్గి మునింగి నట్టి యా
జలమును వేఁడియాటఁగని ♦ చామ బిడెంబును పొందె నత్తఱిన్. ౨౯౦

తే॥ చెమ్మగల నెలతాలు ను ♦ ష్ణమ్మునొంద, మదిఁ దపించు దైత్యాంగన ♦మరులుసోఁకి
కారు మొగుళులు నీలంపుఁ ♦గంబములును, కానవచ్చినఁ గేల్మోడ్చుఁ ♦గళవళించు.

తే॥ మారుతమ్ము దోషాకర ♦ మన్మథులును, తన్ను చూడకుండఁగ భయ♦ దంపుదంష్ట్ర
లుండు సర్పముల్ వసియించు♦చుండునట్టి, కొండ గుహాలోనఁ జేరె ర ♦క్షోమృగాక్షి

క॥ అట వీచు మారుతము మును, పటికంటెన్ మించి వేఁడి ♦ పాటి చనులు గా
లుటచేతఁ గర్జ మెఱుఁగక, తటమట పడి చిగురుటాకు ♦ తల్పమునఁ బడెన్. ౨౯౧

క॥ రాముని రూపము గనఁబడఁ, జామయు నుత్కంఠనొందు ♦ సంకోచించున్
సోము గొని సోలు సిగ్గిలు, రాముఁడు మఱుఁగైన మరుని ♦ రాయిడి మఱుఁగున్.

ఆ॥ కారు మొగులుఁ గాంచి♦కాకుత్స్థుఁడని యెంచి, చనుల నాన నలమి ♦నంతసించు
వేఁడిచేత నదియు ♦ విరియంగఁ జాఱిన, నడలు, దానియలఁత ♦ కంతు గలదె? ౨౯౩

క॥ విలయాగ్నిం బోలు స్మరా, నలమునఁ గ్రాఁగియును శూర్ప ♦ణఖ రాముని మే
నలమి మనునాస జీవం, బుల విడువఁగ లేదు వలపు ♦ పొలుపెట్టిదియో? ౨౯౪

క॥ అంజన గిరిసన్నిభ! యిటు, నెంజిలిగొను నా యెడంద ♦ నిలిచి కరుణతో
రంజిలు మంజిలి యిదెయని, నంజు గొనినదాని పోల్కి ♦ నడుఁకు నడలునన్. ౨౯౫

ఉ॥ ప్రాణము పోయినన్ మరులు ♦ పాయని మాయిని చుప్పనాతి సం
త్రాణము లేదటంచుఁ గోల ♦ దాఁకిన కై వడి సంతపించు న
ద్యేణ విలోలనేత్ర భువి ♦ నిందిర కంటెను సుందరాంగి గీ
ర్వాణ నుతుండు దాని విడి ♦ పాపిని నన్ను పరిగ్రహించునే?. ౨౯౬

ఉ॥ ఇచ్చటనున్న సుందరియు ♦ నిందిరయేయగు; నాకుఁగల్గు నీ
మచ్చిక వానికింగలదె? ♦ మారుఁడు చూపెను పక్షపాత మం
చెచ్చిన బాళిఁగుందు నెడ ♦ నీతఁడు రాక్షసలోక తామసీ
గ్రచ్ఛఁఅభ్రమింగు భాస్కరుఁడె♦కా! యని చూపఁగఁ బుట్టెభానుఁడున్. ౨౯౭

శూర్పణఖ సీతను పట్టఁబోవ లక్ష్మణుఁడు దాని ముక్కు సెవులు గోయుట

మ॥ ఉదయం బందుట గాంచి శూర్పణఖ లో ♦ నుత్సాహముం బొంది యి
మ్ముదితారత్నము చెంతనుండు వఱకు ♦ న్మోదింపఁ డీతండు నా
చదురుల్, దీనిని దాఁచియుంచి యితనిన్ ♦ సంతృప్తిమైఁ బొందినన్
బ్రదుకంగల్గుదునంచుఁ బొంచి చనియెన్ ♦ రామామణింబట్టఁగన్. ౨౯౮

ఉ॥ అంగన, రాముఁడొక్కసర - మం దుదయాదిక కృత్యముల్ పొన
ర్పంగను పోయియుండుటలు - బాగుగఁ జూచెను పర్ణశాలచెం
తం గనిపెట్టి లక్ష్మణుఁ డ - తంద్రతఁ జీఁకటియైన తోఁట నుం
టంగనలేక సీతను క - డంక గ్రహింపఁగఁ బోయె నెవ్వడిన్. ౨౯౯

ఉ॥ ఒంటరియై లతాంగి యిట - నున్నది నాతలఁపుల్ ఫలించె నీ
దంటను పట్టి దాఁచెద న - తండు నిజంబుగ నాకు లొంగు నా
కంటను పడ్డ యిక్కలువ - కంటియుఁ జిక్కక పోనె? యంచు వె
న్నంటెను లక్ష్మణుండు నను - రాంగన వచ్చుట గాంచి యుగ్రుఁడై. 300

శా॥ ఓసీ! యెచ్చటి కేగె దింక నిలు నీ - యుద్యోగముల్ చాలు రా
కాసీ! యంచుఁ దురీలునం బఱచి త - త్కాంతాత్వముం గాంచి బా
ణాసం బూనక కీలఁబోలు కురులన్ - హస్తంబునం బట్టి బ
ల్గోసం బారఁగ వస్తిఁదన్ని కరవా - లుం బూని యుగ్రాత్ముఁడై. 301

శా॥ ఉత్సాహంబునఁ దన్ను మోచి కొనుచున్ ♦ వ్యోమంబునం జేర ను
ద్యత్సంరంభము నొందు దానివడిఁ గ్రిం♦దం ద్రోచి కోపాన దు
ర్మాత్సర్యంబులు మానుమంచుఁ జెవులున్ ♦ రంగారు ముక్కుం జనుల్
తత్సౌందర్యము పోవఁగోసి విడిచెన్ ♦ దైత్యాంగనం దిట్టుచున్. 302

తే॥ అప్పుడా దైత్య వాయెత్తి - యఱచు నఱపు, దిశలనిండి దివ్యుల చెవిఁ - దివిరిసొచ్చెఁ
గాఱునెత్తుట భువి నాని - కరఁగఁజొచ్చె, ననఁగ దాని పడిన పాటు - నరయవశమె?. 303

తే॥ చంపఁ బుయిలోడి రక్కసి - చనులు ముక్కు, నాన గోసిన కార్యమె - న్నఁగ దశాస్య
రత్నముకుటమస్తకభూధ - రములఁ ద్రెంప, వరముహూర్తంబుగుఱుతించు - కరణినొప్పె.

తే॥ పృథివి యదరఁగఁబడి కాళ్లు - విదిరిచికొని, యఱచురక్కసి ఖరవధ - కొఱకు లేచి
రక్తవర్షము గురియు నీ - రదము పోలెఁ, బెరిఁగి రోసంబు నవమతి - పెనఁగొనంగ. 304

ఉ॥ ఎన్నఁడు జంతుకొంతు వెత - లించుక యొందని పూర్వదేవ సం
పన్నఁ కులంబునం బొడము - పైదలి యింటికి లేచు ధారణం
దన్నఁదపించుఁ జూకురు న - ధైర్యమునందుఁ జలించు వందుఁ గే
ల న్నలఁచుఁ విదుర్చు వెత - లం బడు నుత్తలమందు సిగ్గిలున్. ౩౦౬

ఉ॥ ముక్కును చేతనద్ది తడ ♦ ముం గొలిమిం గల మంట కై వడిన్
మిక్కిలి యూర్చుఁ గేలఁ బుడ ♦ మిం గడు మోఁదుఁ గుచంబు లంటుచున్
దిక్కట మక్కటంపడుచు ♦ దిక్కులు సూచుఁ జెమర్చు వెక్కు వే
చొక్కును పండ్లు గీఁటు నలి ♦ చున్ బఱచున్ వెఱచున్ దలారుచున్

చ॥ జొట జొటఁ గొండ యూటవలె ♦ జొబ్బిలు రక్తము చేతనైన యు
త్కటతర పంకమందు తడ ♦ కట్టుగఁ జుట్టుచుఁ జుప్పనాతి సం
కటపడి వేల్పులున్ జముఁడుఁ ♦ గాతర సెందఁగఁ దగ్గ రాక్షసో
ద్భటులను పేరుకొంచుఁ బలు ♦ వార్తలఁ బల్కుచుఁ బిల్వ మేకొనెన్.

చ॥ అనలము చేతఁబట్టు నిట ♦ లాక్షుని శైలము నెత్తిపట్టి యో
దనుజవరేణ్య! నీవు ప్రమ ♦ దంబున మేదిని నుండ మానులున్
ధనువులఁ దాల్చి క్రుమ్మరుట ♦ తక్కువకాదె? విరోధి వర్గముల్
మునుకొని నవ్వ నీకు మొగ ♦ ముం గనిపించుట యెట్లు? కానవో? ౩౦౯

చ॥ విలయము వేళనైనఁ దగ ♦ వేసట నొందని బ్రహ్మ విష్ణు శం
భులకును నిర్జరాళికిని ♦ భోగుల దైత్యుల కంటె మేటి దో
ర్బల! పులి యుండఁగా నిసుఁగుఁ ♦ బట్టఁగ నౌనె? యటంచు లోకులన్
పలుకులు నేఁడు నాయెడ స ♦ బద్ధము లయ్యె నికేమి చెప్పుదున్? ౩౧౦

మ॥ అమరానీకము చుట్టిరా ముదముతో ♦ నైరావతం బెక్కి యు
ద్ధము గావించిన యింద్రు నోర్చిన బలో ♦ ద్యద్డంబరున్ శంబరున్
సమయం జేసిన యాజి నాజిఁ బఱవం - జాఁగించు నో రావణా!
యమరేన్ నీకపకీర్తి దొడ్డదిగ ర - మ్మా కాంతు గా కిచ్చుటన్. ౩౧౧

మ॥ భవుచే ఖడ్గము గాంచు వీర! వరుణున్ - వైవస్వతున్ బావకున్
దివిజౌఘంబు నవగ్రహంబుల జగ - ద్విఖ్యాతిగా సేవకుం
దవులం జేసిన విక్రమం బిపుడు చెం - దం గల్గెఁ బెన్నింద మా
నవులన్ వీరి నెదుర్పఁ జాలమిని స - న్న్యాసుల్ పిసాళింపఁగన్ ౩౧౨

మ॥ మద దిగ్వారణ దంతరాజి విఱుగన్ - మాఁటాటముం జేసి దు
ర్మదులన్ కొండలు పిండిసేయు బలవీ - రా! రూప సౌందర్య సం

పదలన్ మన్మథు మీఱు వారయిన సం - యద్భూమి నీ కాలి చె
ప్పుదవం బోలని యీ నరాధములపై( - బూనింపవో కోపమున్.   ౩౧౩

తే॥ సురల దెసలకుఁ దోలిన-యరిది బలము, వఱలు రావణునకును సో - దరుల కిపుడు
చేగ సమసెనా? దనుజుల - కోగిరంబ, మైన యిమ్మానవుల కడ - నడఁగెనేమి?

మ॥ భవుఁడో ధాతయొ వెన్నుఁడో యని తలం ♦ పం దగ్గ తేజమ్ము సం
స్తవ రీతిం బొలుపారుచుండు ఖర! కాం - తారమ్ములం దాఁగుచున్
యవలన్ మెక్కెడు వగ్గు తాపసుల వీ - ర్యంబో ? మనుష్యాద దా
నవ హంవీరుల యోటయో? యెఱుఁగవే - నన్నిట్లు వీరేఁచుటల్?

మ॥ దివిషన్నాథుఁడు బ్రహ్మయున్ విబుధు ల - ర్థిం గొల్వ నింద్రాణి గౌ
రవ చిహ్నంబులఁ బాడ సప్తజగముల్ - ప్రాగల్భ్య మగ్గింపఁ బ్రా
భవ మొప్పన్ ధవళాతపత్త్రము పయిన్ - భాసిల్లఁ గొల్వున్న నీ
కవురా చూపఁగఁ గూడునేమి? విక్రుతా - స్యంబున్ జను ల్నవ్వఁగన్

చ॥ ఇది ఖరుఁడున్న కాన మఱి - యిచ్చట నిట్టి పరాభవంబు నా
కొదవఁగ మీకుఁగాదొ? బల - మొగ్గఁగ నన్ను ధరాస్థలిం బడన్
జదుపుచు ముక్కు గోసిన భు - జంబుల నిక్కనఁ జూచికొంచు దు
ర్మదుఁడయి మానవాధముఁడు - రాజిల మీ భుజశక్తి గాల్పనే?   ౩౧౪

ఉ॥ దిగ్గజ వేగముల్ తఱుఁగ - దీకొని పోరి తదీయ దంతముల్
నుగ్గుగఁ జేసి సద్యశము - నూల్కొన మెచ్చిన బావ సత్త్వ! నే
డ్రొగ్గిన యొక్క యాసగొని - ముక్కును నీఁగితి రట్టు నొందితిన్
సిగ్గెడి నైతి దీనసగు - చిన్నతనంబును నీది కాదొకో?   ౩౧౫

చ॥ త్రిదశుల గెల్చి దేవవిభు ♦ శృంఖలలన్ దగిలించి నొంచి యొ
ప్పిదమగు సేవలం గొనిన ♦ విశ్రుత మల్లుఁడ! యల్లుఁడా! వనిన్
మదమున నిక్కి గ్రుమ్మఱుచు ♦ మానవు లిద్దఱు నన్ను ద్రోచి సి
గ్గొదవఁగఁ జేయ నేఁ గుమిలి ♦ యూరక చచ్చుట నీకుఁ దృప్తియే?౩౧౬

తే॥ అఖిల భువనముల్ గడగడ♦లాడ నన్ని,దిశల నోర్చి యింద్రుని గెల్చి♦త్రిపురు మేఘ
నాద! యీమానవుల చేవ♦నఱుమ రమ్మ, వీరిఁ గూల్పక నీకీర్తి♦వృథయె చుమ్మ.

ఉ॥ కొండలు పిండిసేయు రణ ♦ కోవిదులార! ఖరా! త్రిశీర్ష! దో
ర్దండ పరాక్రమాఢ్యులయి ♦ రాజిలు సేనలఁ గూడి కుంభక
ర్ణుండును పోతె నిద్రగొని ♦ బ్రుంగుచు నుంటిరొ? నేను బోలుటల్
కొండొక యేని మీచెవుల ♦ కున్ వినరాదొకో? యింత జాలమే?   ౩౧౭

తే॥ ఇట్లు పలువిధంబులఁ బల్కి ♦ యీసుగొన్న, చుప్పనాతి భూమింబడి ♦ స్రుక్కుచుండ
నరవరేణ్యుండు గౌతమీ ♦ నదిని నియత, కృత్యములఁ దీర్చికొని యట ♦ కేగుదెంచె

## చుప్పనాతి మరల రాముని బతిమాలుట

ఉ॥ వచ్చిన రాముఁ గాంచి దశ ♦ వక్త్రుని చెల్లెలు కద్పు నల్పుచున్
బెచ్చుగ బాష్పధారలను ♦ భీకర శోణిత ధారతో భువిన్
రొచ్చుగఁ జేయుచున్ నృపశి ♦ రోగ్రణి నీసొగసైన రూపమున్
మచ్చిగఁ గోరి యీగతిని ♦ ద్రుందితిఁ జూడుమ యంచుఁ జూపఁగన్.

ఉ॥ ద్రీలఁగ వ్రేలు వెంద్రుకల ♦ వెక్కురు రక్కసి క్రూరచేష్ట యే
దో లలిఁ జేసి యుండు నని ♦ యున్ దన తమ్ముఁడె చేసియుండు నం
చోలిఁ దలంచి నీవెవతె ♦ వాయ్యన నియ్యెడ కేల వచ్చితీ
లీల నొనర్చి రెవ్వరు చె ♦ లీ! వివరింపుమ యంచు వేఁడనన్.   ౩౨౮

ఉ॥ రక్కసి పల్కె నన్నెఱుఁగ ♦ రా! పగవారను పేరె యక్కడన్
నెక్కొననీకొనర్చె రజ ♦ నీచరనాథుని చెల్లెలన్న, నీ
యిక్కల రక్కసు ల్వదల ♦ నిచ్చట మేము తపించుచున్న యీ
చక్కటి కేల వచ్చితివి? ♦ సంఘటనం బిది యేలొకో యనన్.   ౩౨౯

చ॥ కుమిలెడు వేఁడి కామ రుజ ♦ కుం దగు మందగు రామ! నిన్ననే
సుమశరు బారి ద్రగ్గి వడ ♦ స్రుక్కుచు వచ్చుట విస్మరించితే
కమలదళాక్ష! యన్న రఘు ♦ కాంతుఁడు జేగుఱు రేఖలొప్ప మీ
నముల క్రియం జలించు నయ ♦ నంబులతో నరుదెంచు టేకొకో?   ౩౩౦

తే॥ అనుడుఁ జెవులుముక్కునుపోవ ♦ నంగు చెడదె? యనుచు రక్కసి పల్కె, నో యనఘ! యాత్ర
పడి యిటేల చేసితి వని ♦ పలుకు నన్నఁ, గాంచి కేలోడ్చి నుడివె ల ♦ క్ష్మణుఁడు మెల్ల

చ॥ పలుచవు లూరఁగా నమలి ♦ పారణ సేయుటకో? మతేమొ? కా
వలి గల రక్కసుల్ కఱపి ♦ పంపిరొ? కానఁగరాదు గాని ని
ప్పులు గురియంగ మావదినెఁ ♦ బొంచుచుఁ బట్టఁగఁ బోయె నన్న ప
ల్కులు విని యంతకున్ మరులు ♦ క్రుంగక రక్కసి పల్కె నీగతిన్.   ౩౩౧

తే॥ ఆఁడునత్త మండూకము ♦ నండ నుండఁ, గాంచి చూలైన మండూకి ♦ కలఁతపఱచు
పుష్కరిణి గల కోసల ♦ భూప! నవతిఁ, గన్నపుడు మదిలో నల్క ♦ గలుగకున్నె?

చ॥ పొలఁతికి రాముఁడిట్లను న ♦ పుంసకు లట్లు మఱుంగు నుండి పో
రులు పొనరించు రాక్షసుల ♦ రూపడఁగింపఁ బ్రతిజ్ఞపూని యి

వ్వాలనికి వచ్చినార మిటు ♦ వ్యర్థ వచస్సులు వల్కి యూరకే
పాలియుక వేగ పొమ్మనుడు ♦ పోవక మూర్ఖతఁ బల్కునిర్విధిన్. 330

చ॥ ముదిమియుఁ జావులేని యజ ♦ ముఖ్య సురాళి దశాస్యుఁ గాంచఁగాఁ
గొదుకుచుఁ గాన్కలిచ్చి పడి ♦ కొల్తురు వాని యనుగ్రహంబుకై
మదిగొన కిట్లు మీరు మతి ♦ మాలి యొనర్చితి రిట్టి చేఁతలన్
బ్రదుకఁ దలంతురేని యొక ♦ పల్కు వినుండది మీకు లగ్గగున్. 331

చ॥ చెలియలి ముక్కువోయెనని ♦ చెప్పెడి వారల నాల్కఁ గోయు దో
ర్బలునకు మేరలేని తల ♦ వంపుగ నాదగు ముక్కుగోసి నా
చెలువము గడ్డిఁ జిందఁగను ♦ చేసి భవత్కుల రూప సంపదల్
పొలియఁగఁ గోసికొంటి రిఁకఁ ♦ బోవున యెట్టులుఁ దప్పి దాఁగఁగన్. 332

ఉ॥ నాకముఁ గాచువారలును ♦ నాగముఁ గాచెడు వారు భూమి న
స్తోకమతిన్ భరించు బల ♦ శూరులునేని త్వదీయ శీర్షముల్
కాకులు గ్రువ్వకుండ నిటుఁ ♦ గాచు సమర్థులు కారు మీరు న
న్నీకొని కాతురేని మిము ♦ నేనును కాచెదఁ బ్రాణమిచ్చియేన్. 333

మ॥ తమ మానంబును తామె గాచికొను కాం ♦ తల్ పల్కఁగా నేర్తురే
తమయుత్కర్షము? నైన నేనె దెలుపన్ ♦ దక్కొంటి మీమీఁది ప్రే
మముచే నియ్యది నిర్జరీగళ చల ♦ న్మాంగల్యవిచ్ఛేది దై
త్యమహీశాను చెల్లెలంచుఁ దెలుపం ♦ దార్కొమ్ము సీతమ్మతో. 334

సీ॥ పెనుపోరులందు కా ♦ తును మోచికొని మింటఁ, జనుదు నెచ్చటికేని ♦ క్షణములోన
మాంసమ్ముమంటి క♦మ్మని ఫలములఁ దెచ్చి, యిత్తును కోరిన ♦ దీయఁగలను
రక్షించువారిఁ ది♦రస్కరించుట మేలె? కోమలి సీతచేఁ ♦ గూడునేమి?
వలఁతుల నైనచోఁ ♦ బలుకుఁడీ జగమున, స్వర్గంబునందున్న ♦ సతులలోన

తే॥ జాతియందుఁ గోరిన దిచ్చు ♦ నీతియందు, నేర్పునందును గుణముల ♦ పేర్పునందుఁ
బలుకులందు సుఖమునందుఁ♦గులుకులందు, యౌవనమునందు నాసాటి♦యరయఁగలరే?

ఉ॥ ముక్కును కోసినై చితిరి ♦ మూర్ఖత నైనను లోపమేమి? నన్
మక్కువఁ గొందురేని క్షణ ♦ మాత్రములో మఱుముక్కు గొందు మే
ల్చక్కఁదనంబునొందుదును ♦ సత్కృప గల్గినఁ జాలుఁ దక్కువే
ముక్కిఁడి స్త్రీత్వసంపదకు? ♦ మూరెఁడు ముక్కు వికారమేకదా? 335

చ॥ మనసు కవింపకున్నఁ గద ♦ మానినిఁ గోరఁగ రాదటంద్రు మీ
మనమున నేను కోరఁబడ ♦ మానము ప్రాణము మీఁదికాదె? కాం

చిన జనులెల్లఁ గోరఁదగు ♦ చెల్వముకూడ విషంబయౌఁగదా?
కొనియెద నీవు సమ్మతిలు ♦ కోమలికం బవలం గ్రహింపవో? ౩౩౭

మ॥ మృదుఁడును పద్మగర్భుఁడు ర ♦ మేశుఁడు వజ్రియు ధాత్రినొక్కచో
పొడమిన యట్టులున్న రొయిఁ ♦ పుర్ మెఱపుర్ గల వన్నెకాఁడ! దీ
టడరని పుష్పబాణమున ♦ సందఱఁ జంపెడు మన్మథుండు త
మ్ముఁడె యగునేమి? లక్ష్మణుని ♦ పోలిక నిర్దయుఁ డయ్యె నాయెడన్. ౩౩౮

సీ॥ ఈరూపమున నిడి ♦ యిచ్చటనేయుండు, నెచటికి వెడలఁ బో ♦ దెవరుఁ గొనరు
అనియెంచియే యిట్టు ♦ లూనరించి నారలు, కాకదీనికి వేఱు ♦ కతము కలదె?
యీకు తప్పొనరింప ♦ రేనది యెఱిఁగియే, రెట్టింపు ప్రీతిఁ జే ♦ రితిని తెలివి
లేనిదాననె? యుగ్రు ♦ లొ నరాదు లెఱింగి, కోపింప జగమెల్లఁ ♦ గూలిపోవుఁ
తే॥ దగు కులీనులు ధర్మంబుఁ ♦ దలఁచువారు, లోకనాశకార్యములకు ♦ లోనుగారు
అరసి నన్నేలి మీకగు ♦ నగడు ద్రోచి, కూడి సుఖయింపుఁడని వేఁడి ♦ కొనుచునిలిచె.

ఉ॥ ప్రల్లద మిట్లు పల్కెడు ♦ రక్కసిఁ గన్గొని రాఘవుండు నీ
తల్లికిఁ దల్లివంటిదగు ♦ తాటకఁ గూల్చిన బాణమున్న దే
నుల్లమునం దపంబె కడు ♦ నూఁకువఁగాఁ గొని రాక్షసావళిన్
ద్రెళ్లఁగఁ జేయవచ్చితిని ♦ దెప్పరమౌఁ జుమి చేష్టచేసినన్. ౩౪౦

చ॥ అసదృశుఁడైన కోసల ధ ♦ రాధిపు పుత్త్రిలమేము తల్లియా
జ్ఞ సకల సంపదల్విడిచి ♦ చయ్యనఁ గానకు వచ్చి చేరి తా
పసు లిట నర్థిమైఁ గొనర ♦ వాసము చేయుచునుండి క్రూర రా
క్షస కులమెల్లఁ జక్కడఁచు ♦ క్రమ్మఱువారము మా పురానకున్. ౩౪౧

చ॥ చెఱవడినారు దేవతలు ♦ చిక్కి సురారుల కోడి వీర లి
ద్దఱు నరులంచు లెక్కడక ♦ దంటవయేని క్రుధాసమేతులుం
గఱకరులున్ బలాఢ్యులగు ♦ కర్బుర సంఘము యక్షకోటి న
క్కఱగొని తోడితెమ్ము వెసఁ ♦ గ్రచ్చఱఁ జంపెద నీదు ముందఱన్. ౩౪౨

సీ॥ అని రాఘవుఁడు పల్క ♦ నాసురి యనుఁ జై పె, దని ప్రీలిపండ్లెల్ల ♦ దంతురముగఁ
గనఁబడు వా గల ♦ కామిని యని తలం, పక నన్ను నెమ్మని ♦ వలఁతువేని
సోఁకులఁ జంప వ ♦ చ్చును వారి మాయల, నెఱుఁగంగ వచ్చు జ ♦ యింపవచ్చు
నన్నియు సాధ్యంబు ♦ లొ సీత వదలవ, యేని నేనుంటయు ♦ నెక్కువగునె?
మాయులగు రక్కసులు మీకు ♦ మఱుఁగు నుండి, పఱపుమాయలఁ దోలఁగింతుఁ ♦ బాము
స్వామి తెఱుఁగు నక్ సామెత ♦ ప్రభుఁడ వినవొ, నన్ను చేకొను నీకిది నయముసుమ్ము[కాళ్లు

ఉ॥ నెమ్మది నాపయింం జొరఁగ ♦ నీయక జానకి యున్న దన్నచో
ముమ్మరమైన యుద్ధమున ♦ మువ్వురముం దలపడ్డ దైత్య శి
క్షమ్ములఁ ద్రుంపవచ్చు నిది ♦ చక్కటియంచు నెఱుంగలేని మీ
తమ్ముఁనికిం దగం బలికి ♦ శూర్పము రావణు లెక్కసం గొనన్. ३४४

ఉ॥ మీరలు కోసలంబునను ♦ మేలుగ నేగెడువేళ నేను మీ
కోరిన రూపు గైకొనెదఁ ♦ గోపి సుమిత్ర సుతుండు ముక్కుఁడిన్
జేరఁగఁ దీయఁ జాలనని ♦ చెప్పిన మధ్యములేని సీతతో
నారకయుందుఁగాదె? యని ♦ పల్కుము నీ వనుచుండు నంతలో. ३४५

ఉ॥ రక్కసఁ జంపఁగా నొక శ ♦ రంబును లక్ష్మణుఁ డోరకంటితోఁ
గ్రిక్కనఁగాంచి యార్య! యడఁ ♦ గించెద దీనిని చంపకున్నచో
మిక్కిలి పీడసేయు నన ♦ మేచకదేహుఁడు పోవకుండుచోఁ
ద్రెక్కొన వచ్చు నన్నఁ గను ♦ ద్రిప్పుచు దానవి లేచి యుగ్రయై.

ఉ॥ చక్కని ముక్కు వీనులును ♦ చన్నులు వోయియు మిమ్ము గూడి నే
నిక్కడ నుండ నొక్క క్షణ ♦ మేని సహింతునె? మీగుణంబు ల
మ్మక్క! గ్రహింపఁగోరి యిటు ♦ లాడితి వాయువు నగ్ని మీఱు నా
మొక్కలి మీ యమున్ ఖరుని ♦ పోఁడిమిఁ దెచ్చెద నంచు వే చనెన్. ३४८

౬. ఖరవధ పటలము (౧౬–౨)

ఉ॥ పూని చలంబు శూర్పణఖ ♦ భూరి జవంబునఁ బాటి యా జన
స్థానమునన్ వసించు ఖర ♦ దానవు పాదములందు వ్రాలె జా
లూనిన నెత్రుతో ముఱికి ♦ యూడ్చెడు కాలువఁ బోలు ముక్కుతో
వేనలి వీడ సంజ జిగి ♦ పేర్చిన విప్పగు మబ్బుకై వడిన్. ३४७

తే॥ విలయ మిదియని జముని సం ♦ ప్రేరణమున, మ్రోఁగు భేరినాఁ రోదన ♦ ముంబొనర్చి
పిడుగుచేఁ గాలి సంకట ♦ పడెడు త్రాఁచు, పోల్కి నేలపైఁబడి వడిఁ ♦ బొరలి యేడ్చె.

తే॥ మాటతోఁ గూడఁ బొగలేవ ♦ మండి ఖరుఁడు, నిన్ను చూచి భీతిల్లక ♦ నిబ్బరమున
నిట్లు చేసినదెవఁడోవాఁ ♦ డెఱుఁగఁబలుకు,యమునితలఁదన్ని శివునెత్తి ♦ నుమియువాఁడు

చ॥ అనవుడు దైత్య యిట్టులను ♦ నన్న! మనుష్యులు మానివేషులై
ధనువులఁ దాల్చి క్రాలుదురు ♦ దర్పక సుందరు లాజి పుత్త్రికుల్
ఘనభుజు లున్నతాంగులును ♦ కయ్యము సేయఁగ దానవావళిన్
వనముల రోయుచున్ దిరుగు ♦ వారలు సింహపరాక్రముల్ బలుల్.

ఉ॥ ధర్మమునం జరింతురఁట! ♦ దానిని నెక్కొనఁ గూరురంట! వే
దుర్మదులైన రక్కసుల ♦ దోర్బలయుక్తిని త్రుంతురంట! మీ

వర్మకృపాణ బాణ ఘన ♦ బాహు బలోద్ధతిఁ గీటు పుచ్చు స
త్కర్మకులంట! వారి బల ♦ గర్వములన్ వివరింప శక్యమే? ౩౫౨

చ॥ ఇరువురతోడ నొక్క చెలి ♦ యిందును వేల్పుల నెందు నేరికిన్
దొరకని యూత్న సుందరత ♦ తో విలసిల్లు మదీయ చక్షువుల్
పొరసి తరింప లేక యటఁ ♦ బొర్లుచు నుండె వచింప శక్యమే
తరుణి విలాస సంపదలు ♦ ధాతకు నాతని తాతకేనియున్? ౩౫౩

తే॥ ఇంతిఁగాంచి లంకాపతి ♦ కిత్తుదీని, నని చలించిన బుద్ధితో ♦ నచటి కేఁగఁ
గోపమున వారు నాముక్కు♦గోసినారు, చూడుమా యన ఖరుఁడుచి♦చ్చువలెమండి

చ॥ ఎదురుగఁ జూచు వారల ద ♦ హించెడు తీరున గ్రుడ్ల నార్చుచుం
బదరుచు ముంజెలూడ్చు పిద ♦ పం గల తాళఫలంబు లొత్తు ల
ట్లదరక ముక్కు గోసిన దు ♦ రాత్ములఁ జూపుము చీలుఁగూల్చుఁ జం
పుదు నుఱుమాడుదుం బొడుతుఁ ♦ బుల్లని పచ్చడిచేసి మ్రింగుదున్. ౩౫౪

చ॥ నిలిచి సమస్త లోకముల ♦ నీరుగఁ జేయఁగఁ జాలు కంటి ని
ప్పులు చెదరంగ మండిపడి ♦ ముద్దుల సోదరిఁ గాంచి యా దురా
త్ములు మనుజాధముల్ మతి వి ♦ దూరులు నావలన న్నశించినన్
జెలియరో! యీ శలంకము న ♦ శించునె మేదిని యున్న యంతకున్? ౩౫౬

ఖర సేనాపతులు పదునల్వురు రాముచే మడియుట

సీ॥ రథముఁ దెమ్మనిన మా ♦ త్రన హస్తముల తోడి, నీలాద్రులఁ బోలి ♦ నిలుచువారు
పృథివి నొక్కొక్క చేతఁ ♦ బెకలింపఁగలవారు, మమ్మంపుడని చుట్టుఁ ♦ గ్రమ్మువారు
పరశు పట్టిస శూల ♦ పాశ గదా తోమ, రాది సాధనముల ♦ నలరువారు
చతురబ్ధి వేష్టిత ♦ జగతీతలంబెల్ల, వడఁకించు హుంకృతి ♦ వఱలువారు

తే॥ హాలహాలమె రూపొందిన ♦ యట్టివారు, చెలఁగి సేవ ధన్యముగ నీ ♦ క్షింపు మధిప!
యనుచుఁ బదునాల్గు వెల్వల ♦ కధిపులైన, వారు ఖరు నధిక్షేపించి♦పలుకుటయును.

ఉ॥ లెన్న వచించినారు కడు ♦ లేబర మాఁగద స్వచ్ఛకీర్తి యా
తుస్సులతోడ నే రణము ♦ తూకొనుచో విబుధుల్ హసింత్రు రం
హస్సున మీరలేగి మను ♦ జాధములన్ వధియించి వారి యం
హస్సమయంబు లాఱిచి త ♦ దంగనతోఁ జనుదెందు పొందనన్. ౩౫౭

తే॥ ఖరుని యాజ్ఞ సేనాపతుల్♦కడఁకమ్రొక్కి, సిగ్గుఁడియుజముదూతనాఁ♦జెలఁగుచుప్ప
నాతి ముందేగ శుభశకూచ ♦ నముగ వార, లినకులేశ్వరుఁడున్న తా ♦ వునకుఁ జనిరి.

తే॥ విమల శశ్వత్సహస్ర నా ♦ మములు గలిగి, క్షీరసాగర శాయియౌ ♦ శ్రీముకుందు
పాదపద్మముల్ స్మరియించు ♦ పద్మనేత్రుఁ, జూపెఁ జేసన్న వారికిఁ♦జుప్పనాక.

తే॥ వీనిఁబట్టి నింగికెగుర ♦ వేయవలయుఁ, జేతనందు కోవలయును ♦ చీల్పవలయుఁ
గట్టవలెఁ గొందవలెఁ గడి ♦ కండలుగను, రండు రండని రక్కసుల్ ♦ రాముఁగదియ.

తే॥ లక్ష్మణుని గాంచి యార్యుఁడీ♦లలనఁ గాచి,యుండుమనికల్పకము పూచి♦యున్న పగిది
నొప్పుకరమున గొనయమె♦క్కించినట్టి,కార్ముకంబందికొనె నిషం♦గములతోడ. ౩౬౭

తే॥ తోయజాక్షుఁడా వింటినం ♦ దుకొని తూణ, ములను తాల్చి పర్ణకుటి య♦వ్వలకునేగి
యిచ్చటికి రండనును వారి♦నెల్లఁ బిలిచి, తొడఁగె యాతుధానులతోడ♦దురముసేయ

తే॥ ప్రళయ కాలాగ్నిఁ బోలిన ♦ వారిపాశ, బాణ శూలాదికములఁ గం ♦ బములవంటి
యిరువదెనిమిది భుజముల ♦ నఱకి వైవ, మ్రోడులం బోలువారలు♦మోహరించి.

తే॥ వారిశస్త్రాస్త్రములతోడ♦బాహువులును, తునుఁగనురములబలిమిచే♦దురముసేయు
రక్కసులతలల్ సునిశితా♦స్త్రములఁద్రుంచి,పాఱఁజూడ ముక్కిఁడియును♦పాఱిపోయె

తే॥ కనలు సింహాంబుచేఁ గరి ♦ ఘటలుగూల, హస్తమును నెత్తిపైకెత్తి ♦ యఱలిపఱచు
కరిణిఁ బోలి శూర్పణఖ యా ♦ ఖరునికడకుఁ,బోయి జరిగిన వృత్తాంత♦మునువచించె.

క॥ వృషవాహనునకు నరుదగు, విషమనఁదగు ఖరుఁడు దనుజ ♦ వితతి మడిసెనే?
విషధరుఁడు గరుడు మ్రింగెనె?, విషమించెనె? యనుచుఁ గనుల ♦విషముంగ్రక్కెన్.

తే॥ సింగములును భీతిల్ల గ ♦ ర్జించి ఖరుఁడు, రథముఁ దెండుసైన్యంబుల ♦ రండనుండు
త్వరగ వాయింపరేమి ప్ర ♦ స్థానభేరి, తెండుతెండని వడిఁ గద ♦ లించె సేన. ౩౬౮

తే॥ స్వర్గపాతాళములు వడ ♦ వడ వడంక, భేరిమ్రోఁగ లెక్కిడరాని ♦ వారిదములు
కెరలు కరణి యుయుత్సుజి ♦ గీషువులగు, రథికులెల్లరు గుంపులై ♦ ప్రబ్బినారు. ౩౬౯

తే॥ గురుతరాభీల ఘాంకృతుల్♦ఘోషములుగ, వీఁగు భుజములె యలలుగా♦విలయవేళ
పెద్దకడలి ప్రభంజన ♦ ప్రేరణమున, రేఁగినట్లు విజృంభించెఁ ♦ బృథులసేన. ౩౭౦

ఉ॥ ఆఁకలి యింకదీఱునని ♦ హర్షముతోఁ దిరుగాడు శాకినీ
డాకినులట్లు దట్టమయి ♦ డంబుగ మిన్ను మఱుంగుచేసి య
స్తోకగతిన్ వెలుంగు కడుఁ ♦ దోరపుఁ డెక్కెము లోలిఁ బర్వఁగా
నాకులు భీతినొందఁ గద ♦ నంబునకుం జనె సైన్యసంఘముల్. ౩౭౧

తే॥బంధములఁద్రెంచికొనిస్వేచ్ఛ♦బరుగువాఱు,రెండుతొండముల్ గలుగు వే♦దండములనఁ
గ్రాలు దానవకరముల ♦ ఖడ్గనికర, ఘర్షణమున నగ్నులు పుట్టి ♦ కాన యెరియ. ౩౭౨

క॥ పంబల రొదతో నేమిా, శంబరవము గలియ నిరుల ♦ సంఘాతంబుల్
పంబి కమలాప్తుతో సమ, రం బొనరుప వచ్చునటుగఁ ♦ గ్రాలెన్ సేనల్। ౩౭౩

క॥ అహిరాజు మేను గుదివడ, మహి నిలుకడ దప్పి క్రుంగ♦ మార్త్రొడ్డి మహా
మహి ధరము లొక్క వరుస ని, వహముగ రఘురాముపైకి♦ వచ్చినవనఁగ౯. ౩౭౪

తే॥ పులుల గుంపులో? వారిద♦ పుంజమొక్కొ?, వారణాళియొ? పర్వత♦ పంక్తియేమొ?
కాదు కాదు హర్యక్షుని♦ కాయమనఁగ, సాయుధీయ బహుళసైన్య♦ చయములరిగె.

సీ॥ అరికట్టరానట్టి♦ యమునిఁబోలిన యనే, క సహస్ర వితతులౌ♦ కొల్బలములు
శరనిధియో యనఁ♦ బొరలి వచ్చునపుడు, శరభ సింహ గజ భీ♦ కర లులాయ
శార్దూల జంబుక♦ శ్వాన భూత పిశాచ, గంధర్వ కిటి వృష♦ గార్దభములు
కట్టంగఁ బడినవి♦ కంటికందిన యంత, దవ్వుగాంచెడు గృధ్ర♦ తండయుతము

తే॥ లగుచు జయశంఖ నినదంబు♦ లడరుచుండు, రథచయంబులు సూక్ష్మనే♦ త్రములు రక్త
వదనములు గల వారణ♦ వ్రజము వాయు, గమనమొప్పు తురంగముల్♦ గములుగట్టె.

సీ॥ పరశువుల్ శక్తులు♦ వజ్రఖడ్గంబులు, ముసల తోమర శూల♦ ముద్గరములు
దండముల్ వంకర♦ దండముల్ పాశముల్, వక్రకుంతంబులు♦ వజ్రములును
చక్రముల్ కుంతముల్♦ శంఖముల్ బాణ బా, ణాస నాంకుశ గదా♦ ద్యాయుధములు
భానుఁడగ్నియు సిగ్గు♦ పడనొప్పు కాంతులు, రక్తమాంసములతోఁ♦ గ్రాలునవియు

తే॥ వేలుపుల కెల్లబాధ గ♦ ల్పించినవియు, విజయ చిహ్నంబులం గూడి♦ వెలయునవియు
నైన హేతి సందోహంబు♦ లన్నియెడలఁ, గిఱుకఁ దళతళమనుచుఁ గ్రి♦ క్కిఱిసి మెఱసె.

సీ॥ బయలు దేఱినసైన్య♦ పతులనొక్కొక్క, వేయి గౌరుల చేవ♦ వెలయువారు
భూమండలము నొక♦ ముద్దగాఁ గొనువారు, క్రూరాగ్ని వంటి క♦ న్గ్రుడ్లవారు
పదునలువురు వారి♦ బలమొక్క రొకరికి, నలువది లక్షలు♦ పఱఁగుచుండు
పలువురు చతురంగ♦ బలమెనిమిది కోట్లు, నలువది లక్షలు♦ గలుగుననియు

తే॥ ఒక్కొకని దళమొక కోటి♦ లెక్కయనియు, పదునలువురు నాయకులకుఁ♦ బదియునాల్గు
కోట్లసైన్యంబులనియుఁ బె♦ క్కురువచింతు, రమితమై లెక్కయిడరాని♦ దదినిజంబు.

సీ॥ బలయుతుల్ పిడుగుల♦ వలె బొబ్బలిడువారు, విసరుకైదువు కేల♦ వెలయువారు
బ్రహ్మచే వరములఁ♦ బడసిన వారలు, మొగుళులు గిరులనఁ♦ దగినవారు
దురహంకృతులు తమ♦ దోర్బలశక్తికిఁ, దగువారు లేరని♦ నెగయువారు
ఆకాశమును కొల్వ♦ నగు నొడల్గలవారు, కఠిన విశాల వ♦ క్షములవారు

తే॥ ధరణిఁ గొల్వంగఁ దగిన పా♦ దముల వారు, విబుధులు మతింపు సేయఁ గా♦ వించు సమర
మిదియటంచు వీరావేశ♦ మెనయు వారు, మొగి సహంపూర్వికగ నని♦ మొనయువారు

సీ॥ అమరులు వైచిన♦ యాయుధముల నుగ్గు, గావించు దృఢ దోర్యు♦ గముల వారు
యముఁడును సేవించి♦ యడఁగి యుండఁగఁ జేయు, చండశాసనఘులఁ♦ బలికినారు

హాలాహలంబుగ్ని ♦ యుపరి రూపొందిన, గతి నున్న కాయముల్ ♦ గలుగువారు
రక్తకేశములు క్రూ ♦ రత్వంబు పక్రదం, తమ్ములు మిడిగ్రుడ్లు ♦ తనరువారు
తే॥ కాటుకయుఁ దెల్పయనఁదగు ♦ కత్తివారు, బలిమి బెడిదంబుగని పిత్ర ♦ పతియుఁ దనకు
మిత్తులనుచు భీతింజెంద ♦ మిడుకువారు, జడుపు దయసుంతయును లేని ♦ యెడఁదవారు.

సీ॥ గండపెండెరములు ♦ కాళులఁ గలవారు, పుష్పహారములచేఁ ♦ బొలుచువారు
కవచులు రత్నకం ♦ కణు లురుదంష్ట్రిలు, జ్వాలలవంటి కే ♦ శములవారు
సంగరోత్సుకులు తు ♦ రంగముల్ సింగముల్, క్రోఁతులు భూతముల్ ♦ ప్రేతములును
శరభ భల్లూకముల్ ♦ శార్దూలములు సార, మేయంబులను శంక ♦ మీఱువారు
తే॥ నిప్పులం బోలు మొగముల ♦ నెగడువారు, కాలకూటంబుఁ బోలిన ♦ కనులవారు
కాలుసేతులు మొగములు ♦ గణనసేయ, మూఁడు నాల్గైదు లేదులై ♦ పొనరువారు. ౩౮౧

తే॥ వజ్రియును కోపఘూర్ణిత ♦ వదనమరసి, బెడిసి వెన్నుచూపఁగఁదగు ♦ బెట్టిదులును
బవరమే లేమిఁ గఁడూతిఁ ♦ బడసియున్న, భుజగిరులు గలవారలు ♦ భూరిబలులు.

సీ॥ యక్షులనుండి కొ ♦ న్నవి రాక్షసేశు లి, చ్చినవి దేవతల వం ♦ చించి లాగి
కొన్నవి గంధర్వ ♦ గుహ్యక సిద్ధుల, బాధించి కైకొన్న ♦ ధ్వజచయంబు
జాలరు గొడుగులు ♦ చామరంబులు స్యంద, న వితానములు నిండి ♦ కవియుకతన
మార్తండు కిరణముల్ ♦ మఱుఁగు పడంగఁ జ, తుర్దశ లోకముల్ ♦ తొడరి గెలుచు
తే॥ దణులు పదునల్వురును వారి ♦ దళపతులును, ఖడ్గఖేటక శూలాది ♦ కములు దాల్చి
పులులవలె సింహములవలెఁ ♦ జలము మెఱసి, దాడి వెడలిరి జగములు ♦ తల్లడిల్ల. ౩౮౩

తే॥ విండ్లు కత్తులు గలవారు ♦ పెనపులపయిఁ, బండ్లు కనఁబడు వారలు ♦ పైఁడికొండఁ
బెల్లగించు వారలు దైత్య ♦ మల్లునాజ్ఞఁ, దీర్చుటయె ముఖ్యమైయుండు ♦ దీక్షవారు.

చ॥ త్రిశిరుఁడు దూషణుండు పెను ♦ తేరులనెక్కి జయేందిరన్ వెనన్
వశ మొనరించినట్టి ఘన ♦ పాశ గదాదులఁ దాల్చి యుద్ధక
ర్కశులగు వీరవర్యులు స ♦ కాశమునన్ విజయాంక గీతముల్
విశదముగాఁ బఠింపఁ గడు ♦ వీఁకను వచ్చిరి సంగరార్భటిన్. ౩౮౫

ఉ॥ మిక్కుటమైన మల్లభట ♦ మేఘ కదంబము భేరి మ్రోఁతతో
జక్కరజేఁడు మిన్నొరయు ♦ స్వర్ణగిరిం దగఁ జుట్టినట్టులై
మొక్కలులైన రక్కసులు ♦ ముంగల వెన్కల నన్ని ప్రక్కలన్
నిక్కుచు రాక్షసుండు పయ ♦ నించె జగంబులు బెగ్గడిల్లఁగన్ ౩౮౬

మ॥ మదమాతంగ ఘటల్ తురంగ చయముల్ ♦ మాల్యంబులున్ దేరులున్
మద ఫేనార్ద్ర మహీతలంబునఁ జరిం ♦ పం ద్రొక్కుడై యొండొరు

ల్లిదమై ధూళి వియత్తలంబు పరవన్ ♦ లీలన్ జగద్బంధు ప
చ్ఛాదనంబంధిన గుఱ్ఱముల్ రథము న ♦ చ్చంబయ్యె వీక్షింపఁగన్. ౩౮౭

ఉ॥ సాగర ముల్బణంబయిన ♦ చందమునన్ మితిమీఱి కాల్బలం
బాగతి సాగఁ బాఱఁగ వ ♦ నాంతరమెల్లను దుక్కియయ్యె శై
లాగములందు మింటఁగల ♦ నబ్దములన్నియు నెండెఁ; బూఁడెఁబో
సాగరమన్న రాత్రిచర ♦ సైన్యరజంబు వచింప నెట్లగున్?. ౩౮౮

ఉ॥ కొండలమీఁద వేఱుపెను ♦ కొండలు వింతగ నెక్కురీతి వే
దండ శిరంబులందు సెగ ♦ దాఁకు విసంబును పోలి హింస లు
ద్దండతఁ జేయు రక్కసులు ♦ దాఁటుచు మీఁటుచు హుంకరించుచున్
దండితనంబుఁ జూపుచు ము ♦ దంబున నేగిరి కొండ ఉద్ధతిన్. ౩౮౯

శా॥ మాయాబంధము పూర్తిగాఁ దోలఁచు స - న్మాన్యాళికిం ద్రోవ నే
చాయన్ శక్యముగాక తోడనె నివా - సంబంది ప్రాణంబులం
బై యామ్యేశున కందియిచ్చు రుజశే - వన్ సైనికాగ్రంబునం
దాయుర్వర్ధన సూచకంబుగఁ జనెం - బ్రావేశమై విగ్రయున్. ౩౯౦

ఉ॥ భేరి రవంబుచే గగన-వీథిఁ బయోదము లోట నొందఁగా
జ్యారుతికిం గడుం జడిసి - ప్రాదినులుం బయిలోడి పాఱఁగాఁ
బేరులివ్రుల్ వినంబడఁగ - వెన్నుని ఱంకియు లజ్జనూనఁగా
వీరవరేణ్యులున్న యట - వీస్థలిఁ జేరె సురారిసైన్యముల్. ౩౯౧

చ॥ పరచిన సేనఁగాంచి మృగ - పక్షులు చూపులు దిగ్భ్రమింపఁ, ద
త్తఱపడి నోరులెండఁగ, రు - తంబులు గీడ్పడ, మేలుసోల, దె
ప్పరిలుచు రోఁజుచుం బఱచెఁ - బార్థివ పుంగవు తోడ శత్రు భీ
కర ఖరసేనరాక వడి - గా మును దెల్పెడు వేగులో యనన్. ౩౯౨

### శ్రీరాముఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట.

చ॥ ఘనులగు రామలక్ష్మణులు - క్రన్నన ధూళిదివంబు గప్పుటల్
దనుజుల పాదఘట్టనఁ బొ - దల్లు మహీజము లుక్కుకూలు ని
స్వనములు భీతిఁ బాఱు మృగ - పక్షుల గందరగోళ పాటు చూ
చిన తఱి దైత్యసైన్యములు - చెచ్చెర వచ్చెనకాఁ దలంచుచున్. ౩౯౩

శా॥ తూణీరంబులు పూని ఖడ్గకవచా ♦ దుల్దాల్చి హాస్తంబునన్
బాణాసంబు ధరించి లక్ష్మణుఁడు కో ♦ పస్వాంతుఁడై రాము గీ
ర్వాణ ప్రార్థిత జన్ముఁగాంచి నను సం ♦ గ్రామార్థి నంపుండి యా
యేణీలోచన తోడ నిందలరి నా ♦ యోపుం బరీక్షింపుఁడీ. ౩౯౪

మ॥ అనుడున్ రాముఁడు తమ్ముఁగాంచి వినుమ ♦ న్నా! మున్ను నన్నర్థిమై
మునిసంతానము ఘోర రాక్షస బలం ♦ బు న్నేనె మాయింతుఁగా
కని పంతంబును పూనియుంటిని మదీ ♦ యంబైన పల్కుల్ వృథా
చన కుండం బరిమార్తుఁ గావు మిట భూ ♦ జాతన్ మది న్నెమ్మదిన్. ౩౯౬

మ॥ అని తమ్ముం గడు బుజ్జగించుచు నర ♦ ణ్యంబెల్ల నాశంబుగా
నని సేయం జనుదెంచు నద్దిఖర సై ♦ న్యంబంచు నూహించి క్ర
న్ననఁ గోదండ తనుత్ర తూణములు పొం ♦ దం దాల్చి సన్నద్ధుఁడై
యనుజుం గ్రమ్మఱఁ గాంచి యిట్లను ఘన ♦ శ్యాముండు రాముం డొగిన్.

శా॥ అన్నా! క్రమ్మఱు టక్కజంబయిన యీ ♦ యాయోధనం బందు వ్యర్థ
గ్రన్నం దాఁకిన దైత్యమర్త్యసురనం ♦ ఘంబుల్ బలంబేది యా
పన్నత్వంబునఁ గ్రుంగి క్రుందునని చె ♦ ప్పన్ లేదు దోస్సత్త్వ నం
పన్నత్వంబున ప్రాలుమాలికఁ దొలం ♦ పం బంపుమా వేఁడెదన్. ౩౯౭

ఉ॥ నావుడు లక్ష్మణుండు రఘు ♦ నాథు పరాక్రమ సత్త్వసంపదల్
వావిరిఁ గాంచు వాఁడగుట ♦ భ్రాతృ నిదేశము మీఱకుండ సం
భావనసేయు వాఁడగుట ♦ మాఱు వచింపఁగ లేక మ్రొక్కి బా
ష్పావిల నేత్రయైన జన ♦ కాత్మజ చెంగట నిల్చె భక్తిమై. ౩౯౮

శా॥ తాటంకంబులఁ దాల్చు పూర్ణశశి నొం ♦ దం బూచు పూఁ గొమ్మకున్
సాటింజెందిన సీత పోలిపడ ని ♦ ష్పాపంబు తోడ న్నిరా
ఘాటం బొప్పు మహాగుహన్ వెడలు సిం ♦ గం బట్లు రాముండు దో
షాటుల్ గర్జిల వీడెఁ బర్ణకుటి నిం ♦ ద్రాదుల్ ప్రహర్షింపఁగన్. ౩౯౯

చ॥ నిడుపు వెదుళ్ళఁ బుట్టు చెడు ♦ నిప్పడవిం దమ వంశ సంతతిన్
బాడవఱఁ జేసి తీలుపడు ♦ పోలిక నొప్పిన చుప్పనాతి త
ల్లడపడి రాముఁగాంచి మన ♦ లం బరిమార్పఁ బ్రతిజ్ఞఁ గొన్నయా
దుడుకఁ డితండె యంచుఁ దన ♦ తోయము వారికిఁ జూపె నాతనిన్. ౪౦౦

ఉ॥ నింగిని రశ్మిఁ గ్రుంచి రవి ♦ నిల్వ విమానములన్ జరించు వే
ల్పుం గమినోర్చి కీర్తి పొలు ♦ పుం గడియించు ఖరుండు భూమిభృ
త్పుంగవుఁ గాంచి రాక్షసుల ♦ తోడ వచించు మనుష్యు సీతనిన్
బ్రమంగఁగఁ జేసి నే విజయ ♦ మాల ధరించెదఁ జూచుచుండుఁడీ. ౪౦౧

చ॥ దుడుకఁ డొకఁడు వీఁడు! మన ♦ దుర్దమ సైన్యములెల్ల నిల్వ నీ-
ధుడవియె చాలకున్నది! న ♦ యంబున నేఁ గొనుగెల్పు గొప్పదే

యుదరునె? యల్పకార్యమిది ♦ యందఱుఁ జూచుచు నుండుఁడేనె యొ
క్కఁడుపున వీనిఁబట్టికొని ♦ ప్రాణము తోడుత ద్రిుంగివైచెదన్. ౪౦౨

చ॥ ఖరుఁడిటు పల్కుచుండఁగ న ♦ కంపనుఁడన్ బుధ తల్లజుండు సం
బరమున నడ్డువచ్చి విను ♦ మా యొకవాక్యము దైత్యనాథ! సం
గరమున మిక్కిలింగినుక ♦ గాంచుట మంచిదె కాని నేఁడు దు
స్తరతర దుర్నిమిత్తములు ♦ తార్కొనెఁ గాంచుమ యంచు నిట్లనున్. ౪౦౩

అకంపనుఁడు ఖరునకు దుర్నిమిత్తములఁ దెలుపుట.

తే॥ తోయదములు గర్జించి నె ♦ త్తురులు గురిసె, నర్కబింబంబు పరివేష♦మమరెఁ జూడు
నీధ్వజముమీఁదఁ గాకముల్ ♦ నిగిడి పోరి, పడుచుఁ బసవృచుఁ బొరలాడు♦ పగిదిఁ గనుము

తే॥ ఖడ్గధారలపై మక్షి♦కములు ముసరె, నెడమ కనులు బాహులు వీఁగె♦ నెక్కటులకుఁ
గుదిరలెల్ల నిల్వనె తూఁ♦గుచును పడియె, నూళవెట్టెఁ గుక్కలు నక్క♦ లొక్కటగుచు

తే॥ మదజలముగార్చెఁ గరిణులు♦ మదకరులకు, విఱిగెఁ గొమ్ములు మహితూలఁ♦ బిడుగులురలె
దెసలు మండె శిరంబులఁ ♦ గుసుమచయము, పొలసువాసన వీచె నీ♦ పొలముగనుము.

తే॥ ఇట్లగుట వీని నరుఁడని♦ యెన్నఁ దగదు, వీనిఁ జూడఁ దోఁచునవి యొ♦ న్నేని గలవు
పన్ను మన మాయలిచ్చటఁ ♦ బనికిరావు, మీఁదు కినియక నన్నుక్ష♦ మింపవయ్య.

మ॥ అనుడు జగంబు లొక్కపరి ♦ యల్లల నాడఁగ నవ్వి యా ఖరుం
డను విబుధావళుల్ మెదుగ ♦ నాజిని నూఱఁగ నన్నె పాత్రముం
జెనసిన మద్భుజాగ్రములు ♦ చెచ్చెర మిక్కిలి బూరటిల్లె నా
వినుత పరాక్రమ స్ఫురిత ♦ వృత్తి మనుష్యుల కంత చుల్కయే? ౪౦౮

క॥ అనుచుండ సింహమును గవి, సిన సామజములను పోలి ♦ శ్రీరాముని దై
త్యునిసైన్యము దట్టముగాఁ, జెనసె ముడిసె నార్చెఁ బేర్చెఁ ♦ జిడిముడి పడుచున్.

ఉ॥ విండ్లులు వంచినా రసుర ♦ వీరులు పిమ్మట రాఘవుండు కో
దండము వంచి బాణములు ♦ దట్టముగాఁ బఱపంగ ధారలై
దుండిగ వ్రారువంబులకుఁ ♦ దున్నెఁ బదంబులు పిడుపాటుచేఁ
గొండలఁ బోలెఁ దొండములు ♦ కోల్పడి కూలె మతంగజంబులున్. ౪౧౦

తే॥ విఱిగ శూలముల్ ఖడ్గముల్ ♦ మురిసెగదలు, తెగియె భిందిపాలంబులు ♦ ద్రెవ్వె విండ్లు
తునిగెఁ జక్రముల్ దండముల్ ♦ తుంగెఁ దోమ, రములునుగ్గయ్యెఁ గేడెముల్ ♦ వ్రయ్యెఁ [బడియె

క॥ చెడియెం గర్ధల పద్ధంబులు, పడియెం గంకణము లారయ ♦ భల్లకరంబుల్
మిడిసెం దళ్ళల మల్లలు మళ్ళీ, భేదిసె శతాంగములు భిన్న ♦ భిన్నాంగములై. ౪౧౨

చ॥ ఖరువుల దున్ని యుండఁగల ♦ గంధగజంబుల దున్ని వే డిగం
తరములఁ జొచ్చురాఘవుని ♦ దారుణ శాత శరాళిచేత ని
బ్బరముగ వీరలక్ష్మికి ని ♦ వాసములౌ దనుజాళి వక్షముల్
విరిసెను శీర్షముల్ తెగియె ♦ వెల్లువలై ప్రవహించె రక్తముల్. ౪౧౩

తే॥ కంజనేత్రుని యస్త్రమొ ♦ క్కండు నూర్లు, వేలు లక్షలు కోటులై ♦ పెరిఁగి గిరులొ
గిరుల శిఖరములో యనఁ ♦ బరఁగు సోఁకు, మూఁకలం గూల్చి వీనుల ♦ ప్రోఁగుచేసె.

ఉ॥ ప్రాఁకులు కారుటగ్గిఁ బడి ♦ ప్రాలుచునున్న తెఱంగునం దలల్
ప్రేఁకన త్రుంగ మొండెములు ♦ ద్రెళ్లెను రక్తమయంబు లౌచుఁ బై
నాకసమందు పాఱు కమ ♦ లాక్షు శరావళి వారి ప్రాణముల్
వీకున మ్రింగ వెంటఁబడి ♦ వీడక యేగిన చందమై తగెన్. ౪౧౫

ఉ॥ స్త్రీల కనుంగవం బలెనె ♦ దీర్ఘములై బెడిదంబులైన శ్రీ
లోలుని వాఁడి తూపులరి ♦ లోకము ఖడ్గ కరంబు లుర్లఁగం
ఠాలి తెగఁ జిరాలు విరి ♦ యంగఁ బదంబులు ద్రెవ్వఁ జాపముల్
సోలఁ జెదర్చె దిక్కులకు ♦ సోఁకుల వింతగు శీర్షరాసులన్. ౪౧౬

మ॥ క్షితిభృద్వీర మహేంద్ర చాప శరవృ ♦ ష్టిన్ జాఱు కీలాల సం
హతిదై తేయ కబంధబంధవృతి యై ♦ పారన్ మహాఘుంబులై
తత విస్ఫార వనాశయాళిగ వనాం ♦ తం బెల్లఁ దత్పూర్వ సం
స్థితి మార్పం బడి యెప్పటట్ల వెలసెన్ ♦ జిత్రంబుగాఁ జూచుచోన్. ౪౧౭

క॥ ఆ రక్త సాగరంబున, శూర శిరో బాహుదండ ♦ శూల పతాకా
వారణ రథగజ ఘోటక, వారంబులు దేలియాడెఁ ♦ బరిపరి విధులన్. ౪౧౮

క॥ అప్పుడు బలియురు కొందఱు, నిప్పులు గ్రక్కుచును చూచి ♦ నిగుడుచుఁ గొండం
గప్పిన జీమూతము లనఁ, గప్పిరి శరవృష్టి తోడఁ ♦ గాకుత్స్థవరున్. ౪౧౯

క॥ వారల బాణాసారము, వారక యాఁతఁడు వారించి ♦ పఱపి దెసలకున్
ధారుణి నడుము విఱుగఁ గాం, తారము నిండంగ నఱకె ♦ దైత్యుల శిరముల్.

తే॥ అట్టులాడెఁ గ్రొన్నెత్తుట వారులు కరులు, మునిఁగె దైత్యవరుల క్రొవ్వు ♦ ముక్కు వఱకు
మెసవి క్రక్కుచు భూతముల్ ♦ మేలుమోవ, లేక మెల మెల్లఁ గాల్గద ♦ లింపసాగె.

తే॥ కల్లు మత్తు వంచనమును ♦ గలుగు నసుర, వరుల నేత్ర రత్నంబులఁ ♦ గరట చయము
కొల్లగొనె; ధర్మ సత్త్వమ ♦ కుంఠితంబు; దుష్టులకుఁ జేటుమూఁడుట ♦ కష్ట తరమె?

చ॥ ఇరులఁ దొలంచు భాను క్రియ ♦ నేచిన రాఘవు మీఁద నీఁటెలం
దొరసిన రోష దృక్కులను ♦ దొందడి సేసి యుగాంత కాల భీ

కర జలదంబు లొగ్గి వడ ♦ గండ్లు వెలార్చిన లీల యామినీ
చర నికరంబు లొక్కమొగిఁ ♦ జల్లె వెసన్ సకలాయుధంబులన్. ౪౨౩

సీ॥ వీరువై చినవారు ♦ వీరు వీచినవారు, వీరు వేయఁ దలంచు ♦ వారలనియు
వీరు నేర్చినవారు ♦ వీరునేరనివారు, వీర లెక్కటి పోరు ♦ వారలనక
నిలిచిన వారల ♦ నలిగిన వారలఁ, గాందిశీకులఁ దిట్టి ♦ కలఁపువారి
రేఁగెడు వారల ♦ రేఁపు వారల నెది, రించు వారల హుంక ♦ రించు వారిఁ

తే॥ గసి మసఁగి త్రుంపఁగా మస్త ♦ కములుకొన్ని, మేఘమండలమునఁగొన్ని ♦ మిథునరాశి
గొన్ని ఋక్ష మండల మునఁ ♦ గొన్ని గిరులఁ, గానలోఁ గొన్ని కొన్నిది♦క్కరులఁజేరె

చ॥ తరఁగల తోడి శోణిత న ♦ దంబులఁగూర్ప సురారి శైల కం
దరములఁ దొల్చు రామవిభు ♦ దారుణ శాత శరాళి భూమిపై
గిరుల పయిం బయోదములఁ ♦ గీల్కొనెఁ గొన్ని పయోధిఁగొన్ని క
ర్బురుల తను ప్రాణంబులను ♦ గ్రుచ్చుచుఁ గొన్ని యెలర్చె నెల్లెడన్. ౪౨౫

ఉ॥ హారయుతుల్ మహోజ్జ్వల దృ ♦ గంచితు లాయుధ హస్తు లుత్కట
స్ఫార శరీరులౌ మగలు ♦ భానుకులేశు శితాస్త్ర పాళిచే
నురలి తునింగి నుగ్గయి శ ♦ రోద్ధత ఘోర సమీరణంబునన్
శరధిని చేర నిర్జరులు ♦ సంతస మందిరి నింగి నార్చుచున్ ౪౨౬

చ॥ ప్రబల తురంగ సంహతి త ♦ రంగ వితానము గాఁగ రక్తమున్
కబరజలాన గుండెలను ♦ కంజ వనంబు రహింప వారణా
లుబికిన నక్ర బృందముగ ♦ నూడిన ప్రేవులు శైవలంబుగా
గబగబ భూతరాజి దుము ♦ కన్ విలసిల్లె రణోర్వి సంద్రమై. ౪౨౭

ఉ॥ కొందఱు కుయ్యివెట్టి రొక ♦ కొందఱు సోలిరి కొందఱీల్గఁగాఁ
గొందఱు పొట్ట ప్రీల మఱి ♦ కొందఱు కాళులు చీల ఱొలుచుం
ొందఱు దొర్లి నెత్తురునఁ ♦ గొందఱు మున్గుచుఁ జచ్చి తేలఁగాఁ
ొందఱు పాఱఁ గొందఱటఁ ♦ గుందిరి రాముని బాణవృష్టిచే. ౪౨౮

ఉ॥ వ్రంతల భీతిఁ బాఱు సుర ♦ వైరులఁ గాంచుచుఁ దిట్టి నవ్వి కా
లాంతకుఁ బోలు రాక్షస గ ♦ ణాధిపతుల్ పదునల్వు రొక్కటన్
ద్రుంతము శ్రుంతమంచు ఘన ♦ దోర్బల గర్వమునన్ మహేశ దు
ర్దాంత విషంబు నా నడరి ♦ దందడిఁ జుట్టిరి రామచంద్రమున్. ౪౨౯

తే॥ శివుని కవిసిన త్రిపుర దా ♦ నవుల కరణి, రాముఁ గవిసి మతింపక ♦ రాఁజు కనలుఁ
గనులఁ జూపుచు మేఘంబు ♦ నెనయు ధనువు, కేలఁ గొన్న యాతనిఁగొట్టఁ ♦ గిట్టినారు

చ॥ ఒకరుఁడు ఖడ్గమున్ వయిచె ♦ నొక్కఁడు చక్రముఁ ద్రిప్పి వీడె వే
ఱొకరుఁడు పాశమున్ విసరె ♦ నొక్కఁడు తోమరమేసెఁ జేన నిం
కొకరుఁడు కొండలం బఱపె ♦ నొక్కఁడు దండము వీచె నుగ్రుఁడై
యొకరుఁడు కేరి తిట్టె మఱి ♦ యొక్కఁ డదల్చె నొకండు హుమ్మనెన్.

చ॥ వెలువడు రామ శాత శర ♦ బృందముచే రథ రథ్య వర్గముల్
పొలిసె మతంగజంబులును ♦ భూమికి మ్రొగ్గెఁ దురంగ సంఘముల్
తలలను కోలుపోయె నవి ♦ తామరసాప్తుని చుట్టె గుబ్బ నాఁ
దొలఁగిన సోఁకుమూఁకయును ♦ దోరె రణస్థలి పీన్గు కుప్పగాన్. ౮౩౨

ఉ॥ సోలిన దైత్య దేహముల ♦ శోణితముల్ వ్రణరంధ్రముల్ విడన్
జాలుగఁ జిట్టిన న్నెగసి ♦ వ్యోమతలమెల్లను కప్పివైవ దే
వాలియుఁ గేల మూసికొనె ♦ నక్షియుగంబుఁ గృతాంత దూతలుం
గాళులు నొవ్వఁ గాఁపడము ♦ కాఁచుచు మోచిరి ప్రాణబృందమున్. ౮౩౩

ఉ॥ ఓలి పిశాచము ల్దిరుగు ♦ యుద్ధము నున్మద వృత్తిఁ గోరు దై
త్యాళుల వక్త్రగహ్వరము ♦ లందు శునీతతిచొచ్చెఁ దచ్ఛరః
పాళుల నక్కలెక్కఁ దమ ♦ వాత శరంబులు గ్రువ్వ వారి ము
ద్గలముఁ జేరు కర్బురని ♦ కాయము ప్రోదినులట్లు గ్రమ్మతెన్. ౮౩౪

చ॥ తలలురలెన్ గనుల్ప్రెదరెఁ ♦ దన్నయనంబుల నిప్పుకల్ వడెన్
మలలుగ నేల ద్రొళ్ళినవి ♦ మత్తగజంబులు దిక్సమూహ మ
ల్లుల పడెఁ గొల్మినట్లు మిడుఁ ♦ గుర్లెగసెన్ సమసెన్ వరూథినుల్
లలిత నృపావతంసు శర ♦ లాఘవ మెట్లు వచింప శక్యమౌ? ౮౩౫

తే॥ స్యందనములతో నాయుధ ♦ చయముతోడ, దళపతులు పదునల్వురు ♦ తక్కువారి
పై నికనికాయ మెల్లను ♦ సమసి పోలసు,కంపుగలరక్త జలధిలోఁ ♦ గలిసిపోయె.౮౩౬

ఉ॥ వారలు సంగరాంగణము ♦ వారకచూచి శరంబులోడి వా
శేరును లేమి రాముపయి ♦ నేపునమందుచుఁ బండ్లు గీఁటుచున్
మోరలు నిక్కఁగా నరద ♦ ముల్ రఘువర్యుని క్రేవఁద్రోలుచున్
ధీరత హుంకరించుచు మ ♦ దించుచు గర్వపు మాటలాడుచున్.

ఉ॥ వచ్చినఁగాంచి రాఘవుఁడు - వాఁడిశరంబులు నాఁటనేసె యొ
క్కచ్చునఁ దచ్ఛతాంగముల - నర్వ్వదుసేయ గుఱాలు సారథుల్ •
విచ్చిన నేము లచ్చులును - వ్రీలిన చక్కములున్ యుగాంత మం
దెచ్చిరు గాలిచే నెగసి - మేగదు పోలిక దోఁచె మింటిపై. ౮౩౭

తే॥ స్యందనమ్ము లట్లు నమయఁ బ్ర - చండ భంగి, నవుడుగఱచుచు భూమియు-నగలునట్లు
క్రిందికిం దన్నాఁకి ధనువులు ♦ కేలఁదాల్చి, పిడుగులం బోలు శరములు ♦ విడిచినారు.

తే॥ దిశల భేదింపఁ జాలిన ♦ నిశిత విశిఖ, తతుల నడుమన ఖండించి ♦ దాశరథియు
వారి బాణాసనంబుల - వరుసఁ బెట్టి, విఱిచి మానిచె వారల - వింటిపోరు. ౪౪౦

క॥ కోపమున వారు కొండల, నేపున బెకలించి కొని ది - నేశుని తేజం
బేపు చెడ ♦ నెత్తి పయికా, టోపంబున వైచి రుగ్రుఁ ♦ డుర్ దిగులూనన్. ౪౪౧

క॥ గొనయముతోఁ గను బొమ్మలు, నినకులునకు వంగె వాహి ♦ నీశుల తలలుర్
ఘన గిరులతోడఁ బడె మే, దినిపయిఁ గరలాఘవంబు ♦ దివ్యులు పొగడన్. ౪౪౨

క॥ ఈలాగు వారు గూలఁగ, మూలబలము గడిసి రాము ♦ ముట్టం బెలుచర్
బోలఁగ దివి భువి దెనలని, తేలికఁ దెలుపంగరాక ♦ తికమక పడఁగర్. ౪౪౩

తే॥ దుందుభులతోడ నేనుఁగుల్-క్రందునలిపెఁ,గటుగుణధ్వనితోడ శం-ఖములు మొరసె
తురగ హేషలతో రణ - దోహలులగు, రక్కసుల పేరెలుంగులు -పిక్కటిల్లె. ౪౪౪

ఉ॥ అంబర వీథి నిండె నను - రావలి కైదువు లెల్ల వాని మ
ధ్యంబునఁదూఱి రామవిభు - దారుణ మార్గణరాజి నుగ్గునూ
చంబుగఁ ద్రుంపఁగాఁ బెటిలి - చయ్యనమింటికి నేగ నిర్జరా
ఘంబులు పాఱె దిక్కులు - కన్నులనార్చ్చె జగంబు బెగ్గిలెన్. ౪౪౫

త్రిశిరుని సంగరము.

మ॥ బలవంతుండు పసిండి బొమ్మికము లు ♦ ద్భాజిల్లు వాఁడుం గడుర్
దళము లగ్గినవాఁడు మూఁడు తల లు ♦ ద్యద్దీతి రాజిల్లు సోఁ
కులమన్నీఁడు ఖరానుజుండు గిరిశ ♦ క్రూర త్రిశూలంబు నాఁ
జెలఁగెర్ రాక్షససేనమధ్య శరవృ ♦ ష్టింగూర్చు చాపంబుతో. ౪౪౬.

మ॥ లయకాలాంబుధిరొంపి యనంగ జగముల్ ♦ మ్రోగ్రోమ్రఁగ శబ్దించుచుర్
భయద ప్రోద్ధతిఁ దన్నుచుట్టికొనఁ జా ♦ పప్రక్షేప్త మాత్రంబు తో
డయి యొక్కండుగ నిల్చు రాఘవ విభుం ♦ డవ్వేళ నొప్పెం దమో
మయ రంగస్థలి వెల్గు దీపమన న ♦ మ్యగ్రీతి యుద్ధావనిన్. ౪౪౭

మ॥ శరఖడ్గాదులతోడ భీకర ధను ♦ ష్టంకార హుంకార ని
ర్భరరావంబులతోడఁ గ్రూర నయన ♦ వ్యాపారుడై ఁ రాముఁడా
ఖరుతమ్ముంగని వానిసేనను పృష ♦ త్కక్రూర కాఠిన్యముర్
వరదోస్సారముఁ గానిపించె సమరక్ష ♦ భాగల్భ్య మేపారఁగర్. ౪౪౮

తే॥ తెగెను కాళ్లులు తలలును♦తెగెను కేలు, తెగెను తొడలును నడుములు♦తెగెను వ్రేళ్లు
తెగెను మోకాళ్లు పాదముల్♦తెగె గొడుగులు, తెగెనుపాశాదికంబులు♦తెగెరణోర్వి.

తే॥ అరదములు పతాకలును ర♦థ్యములతోడఁ, ద్రుంగిపుడమినిపడియెదుం♦దుభులతోడఁ
దుండములు తెగి కుత్తవే♦దండచయము, పిడుగుచేఁ గూలుగిరులట్లు♦బెడిసిపడియె.

క॥ తలలు తెగువారు తెగుటలు, తెలియక శరవృష్టి గురిసి♦తీఱుదు రిలపైఁ
దలదెగని వారు రేఁగుచు, జలదము క్రియఁగురియుచుంద్రు♦శరవర్షంబున్. ౪౫౧

చ॥ కరములఁ గేడెము ల్దనరఁ♦గాటుకకొండలవంటి కర్బురో
త్కరము కబంధముల్, కనక♦కంకణ నూపురముల్ ధ్వనింపఁగా
మురియుచు నాడు వేలుపుల♦బోటులు జన్నపు రోవెలందులుౕ
వెఱఁగు పడంగ నాట్యములు♦పెక్కువిధంబులఁ జల్పె నయ్యెడన్. ౪౫౨

చ॥ గొడుగులు చామరాలు నురు♦గుల్ కరులుౕ దెగు బాహువర్గముల్
సుడులుగఁ డెక్కెముల్ పడవ♦సోలుపులై తగ రక్తవాహినుల్
కడలిని చేర నుప్పనయి♦క్రందుగనున్న సముద్రశీలముౕ
విడువఁగఁజేసి నూత్నమగు♦పేరిమి గూర్చె రణప్రకారముల్. ౪౫౩

తే॥ రామశరములచే శరీ♦రములు విడిచి, వక్రదంతులు రక్కసుల్♦స్వర్గవాటి
నమరనారులతోఁ గూడి♦తమ కబంధ, ములు నటించు నాటకము లిం♦మ్ముగను గనిరి.

ఉ॥ వేలుపు టింతులం గలిసి♦వేడుకఁగా ననిఁ జూచు పూర్వదే
వాలి ధరౕ రఘూత్తము శ♦రావలిఁ ద్రెళ్విన స్వీయ బాహులౕ
వాలి పిశాచపాళి యొక♦వంకకు శ్వానము లొక్కవంకకుౕ
గ్రోలుచుఁ బోరి లాగుటలు♦గోరికఁ గాంచుచు నవ్వి రయ్యెడన్. ౪౫౪

శా॥ జ్ఞానాస్త్రంబులు సోకఁ జీలిన హృద♦బ్జాతంబులౕ దైత్యుల
జ్ఞానావస్థఁ దరించి పాపముల నో♦జం గోసి దివ్యాత్ములై
ధ్యానాసక్తత నద్వితీయుఁడయి యు♦ద్ధంబాడు శ్రీజానకీ
ప్రాణేశుంగని రద్వితీయ పరత♦త్త్వంబంచుఁ జిత్తంబులన్. ౪౫౫

ఉ॥ తుండ యుగంబుతోడి కరి♦తోయము నొందిన రామచంద్రు కో
దండ ధనుర్విముక్త నిశి♦త ప్రదరంబులు మూల ముట్టుగాఁ
ద్రుండము లొనర్చి నొంచినవి♦దుష్టులఁ గాంచిన వారి నెల్లరన్
జండి యశాంతిమై నవృత♦సాక్ష్యము వల్కిన వాక్కులంబలెౕ. ౪౫౬

ఉ॥ రాజిలు తెక్కంశొప్ప భ్రమ♦రంబు లభించిన కీటకంబు ను
ద్వేజిత రీతిఁ గాంచి తన♦తీరు నొసంగిన భాతి పూత ధా

త్రిజ మనోహరుండు తన ♦ తీవ్ర శిలీముఖ రాజిచేత ర
క్షోజన కీటకంబులను ♦ శోభిలఁ జేసెను ఖేచరాళిగన్. ౪౮౮

చ॥ కడుబెడిదంపు టాముననొ ♦ కానొక మానిసి సాహసించి యు
క్కడముగ దైత్య సంఘములఁ ♦ గాడుగ బీడుగఁ జేసె నంచు ను
గ్గడువునఁ బంక్తి కంఠునకుఁ ♦ గార్యము దెల్ప ననంగ నచ్చటం
దుడిచిన దానవాంగముల ♦ తోఁ జనె లంకకు రక్తవాహినుల్. ౪౮౯

చ॥ బలసిన మోహరంబుగల ♦ వాహిని రాఘవు నస్త్రరాజిఁ బో
ర్కలనునఁ ద్రుంగఁ గాంచి త్రిశి ♦ రస్కుఁడు మీఱిన కోప మానిపై
కలసిన రక్తమందు మునుఁ ♦ గం బడు తేరును త్రోలు మంచు ని
ట్టలముగ నార్చి యాజికిఁ గ ♦ డంగెను దుస్సహతేజుఁడై వెసన్. ౪౯౦

తే॥ సత్యమునకు నెల్లరకును ♦ సాక్షియైన, రామచంద్రునిపై ముఖ ♦ రంబులైన
శాత సాయక ములు గుప్పి ♦ చంద్రసూర్యు, లకును రాఘవుఁ గనరాని ♦ లలినొనర్చె

తే॥ త్రిశిరుఁ జేసిన తూపులఁ ♦ ద్రెంచివైచి, మరలరాముఁడుపదునాల్గు ♦ మార్గణములఁ
గనక రథము ధ్వంసము చేసి ♦ కడఁగి యొక్క, భల్లమున సారథి శిరంబు♦డుల్ల నేసె.

తే॥ మఱియు దేవత లార్వంగ ♦మనుజవిభుఁడు,స్వర్ణపుంఖబాణమునరా♦క్షసునిమీఁదు
తలల నొక్కటి ఖండించి ♦ ధరణిఁ బడక, మునుపె రెండవ తలగూడఁ♦దునియనేసె.

తే॥ రథము విరుదల వోఁ ద్రిశి ♦ రస్కుఁడనెడు, పేరు చెడినను బలిమియు ♦ బిగువు చెడక
గగనమున నిల్చి తన కార్ము ♦ కంబు వంచి, విశిఖ వర్షంబు గురిసె భూ ♦విభునిమీఁద

తే॥ భ్రుకుటి వికటంబుగాఁ జూచి♦భూవరుఁడు, కారుమేఘంబుమెఱుపులోఁ ♦గానఁబడఁగ
గాలిఁ జెల్లా చెదరులైన ♦ కరణి వాని, యంప వానను తూలించె ♦ నాశుగముల.

చ॥ మఱియును దొడ్డ సాయకము ♦ మాటి త్రిశీర్షుని విల్లుద్రుంపఁగా
వెఱవఁడు మోము కాంతియును ♦వీడఁడు బాహుల సత్త్వ సంపదం
దొఱఁగఁడు కోప దృష్టులను ♦ దోర్పఁడు కొండలువైచు పోఁడిమిన్
దఱలఁడు వీరవాక్కుల వ ♦ దల్పఁడు వాని కడంక యెట్టిదో? ౪౯౧

ఉ॥ మాయలు వన్ని యొక్కఁడౌ సు ♦ మాళమునన్ బలుమంది పోలికన్
జేయుచు సింహగర్జనలఁ ♦ జేయుచుఁ గ్రూరతఁ బోరుచుండు దై
తేయుని రెండు పాదములఁ ♦ ద్రెంచుచు రెంటను రెంటఁ జేతులన్
మాయఁగఁ జేయ నంతటను ♦ మ్రాలక రాముని బిట్టదల్చుచున్. ౪౯౨

ఉ॥ కాళ్లును గేలు పోయినను ♦ కర్బుర వీరుఁడు విక్రమంబునన్
ద్రుళ్లుచు శీతభానువయి ♦ దూఁకెడు రాహువు పోల్కి నెత్తిపై

సుళ్లను గోలుండు గుహ ♦ చొప్పునఁగన్పడు బాకి నోటితో
మళ్లక వచ్చువాని దయ ♦ మాలి వధించెను రాముఁ డత్తఱిన్. ౪౬౮

చ॥ త్రిశిరసుఁడన్ మహీధరము - దివ్య రఘుప్రవరాఖ్యగోత్ర భి
న్నిశిత శరాశనిం దెగుడు - నిల్వక దూషణుఁ డడ్డగించినన్
వశమటి రక్తవాహినుల - వారక తూఱుచుఁ గాలి పండెముల్
పిశితము ప్రేవులుం దవిలి - వెక్కస పెట్టఁగఁ బాటి రందఱున్. ౪౬౯

ఉ॥ కొందఱు దేవతా వితతి - గొల్లన నవ్వఁగ భూమి పల్లమం
బొందఁగ దూఁకి పాటి యటఁ - బూఁడిన క్రొవ్వునఁ గాళ్లు జాఱఁగా
నందె మునింగినారు చది - యంబడు పీనుల నెక్కి జాఱఁగా
నందుల ద్రమ్మఁడుచుం దొరలి - చావక కొందఱు తప్పి రయ్యెడన్. ౪౭౦

ఉ॥ కొందఱు మధ్య బాణములు - గ్రుచ్చి పదంబులఁ ద్రెంచి క్రుంచఁగాఁ
గుందుచుఁ గూలినారు మటి - కొందఱు నెత్తురు టేళ్ల మున్ని క్రొ
వ్వొందిన పంకమందు దిగి - యోపిక లేవఁగలేక కొందఱున్
దందడి రక్త పూరముల - దాఁటఁగలేకయె యీల్గి రెందఱో ౪౭౧

చ॥ నడుములనుండి జాఱి చర - ణంబుల పైఁబడి త్రెంచుచున్న పే
రడిదములం గణింపక భ - యం బురు వానిన రీతి బుద్ధియుం
జెడి పరుగెత్తు రక్కసులు - చెచ్చెర రాఘవుఁడేయు నంపఱుల్
విడువక వక్షము ల్దొలువ - వీఁకను రాక తొలంగి రా పథిన్. ౪౭౨

చ॥ పరువిడుచున్న రక్కసులు - ప్రవిస్సి గుహాంతర సీమ కై వడిం
బరఁగిన వారణోదర ని - వాసములం భజియించి సన్నిధిన్
దొరసిన మొండియమ్ముల నొ - దుంగుచుఁ గాంచి వయస్య! వీరలన్
దురమునఁ జూడలేదను మి - దో కయివారము లందు రొంటునన్. ౪౭౩

దూషణుఁడు దురమునఁ బాఱు సేనలఁ బ్రేరేఁచుట.

ఉ॥ దూషణుఁడందు నిల్చి తమ - దోర్బల శక్తులు గ్రుంగఁ బాఱుచున్
రోషము దక్కి రాక్షసుల ♦ రూక్ష దృశం బరికించి తాపస
ప్రేషిత మానవాధముని - బీరము నోపఁగ లేక పాఱు నో
యోషితలార! నావచన - మొండు వినుం డిది వీరధర్మమే? ౪౭౪

చ॥ పిఱికి మనుష్యులం గనుచు - భీతిలి పాఱుచు నిందమోచు న
మ్ముఱకులఁ గాంచి గాజులను - మోదముతో ధరియించు కాంతలున్
వెఱవరు నిబ్బరంబనెడి - పేరణయే పదిలంబు గాంచు పె
న్ను అవు; భయంబు ప్రాణముల - గొప్పిన తొఘగ్నునే వహింపుఁడీ. ౪౭౫

తే॥ జిష్ణులోఁ బ్రియమూర్తులతోడఁ - జెనకి చేయు,యుద్ధమున నిశాచరు లెవ్వ - రోడినారు?
పిఱికి తనమును మీరోడి - వెఱచిపాఱు, వేలుపులయొద్దఁ గొంటిరే - వెడఁగులార!.

చ॥ సుకమున గాంచి యెల్లపుడుఁ ♦ జొక్కిన రక్కసులార! యందు మీ
రొక నరుచేత నోటువడి ♦ యొక్కరి నొక్కరు ద్రోచి కొంచుఁ బొం
దికగఁ బురంబు చేరఁగ మ ♦ దిం దలపెట్టితి రేమి? యందు మీ
సకుల పయోధరంబులను ♦ చయ్యనఁ గౌఁగిలిఁ గాంచఁ గందురే? ౪౭౭

ఉ॥ జేగురు చూపు వెల్లనఁగఁ ♦ జేకొని పాఱెదు పందలార!మీ
రాగిణులైన కాంతలు క ♦ రణ్యములం జనువేళ వీఁపులం
దోఁగిన కత్తి గీట్లు రణ ♦ దోహలతం గను పోటు లందురో?
మేఁగిన వక్షముల్ తొడరి ♦ గ్రిింగిన తూపులఁ జూపికొందురో? ౪౭౮

చ॥ జగములు కూడి మార్కొనఁగ ♦ సాధ్యముకాని భవత్కులోత్తముం
డగు దశకంఠు చెల్లెలికి ♦ సంగము పోయిన నింద చాల కీ
వగ ననిఁ బాఱి మోములను ♦ వంతురె పెద్దల ముందు? మర్త్యుఁడే
మగఁడయి పోరునప్పు నవ ♦ మానము వేఱొకఁ డింతకుఁడు నే? ౪౭౯

శా॥ వీరావేశము తోడ యుద్ధముల వి ♦ ద్విడ్వ్రాతముం గూల్చి త
త్క్రూరాస్త్రంబులఁ బుచ్చికొన్న విలస ♦ ద్దోర్వీర్యు లారా! యిఁకన్
మీరల్ ముత్తెము లమ్ముఁ వర్తకము కై ♦ మేకొందురో? లేక భూ
దార ప్రక్రియ కాయుధంబుల నొగిం ♦ దట్టింతురో కత్తిగన్? ౪౮౦

ఉ॥ మీరలు నా ధనుర్బలము ♦ మిన్నక చూచుచునుండుఁ డాతనిన్
మారుతు నేన యంచు జన ♦ మాన్యుని మార్కొనియెన్ భయంకరా
కారుని దూషణుండు సురలు ♦ గాంచి యెడందలయందు దిగ్భ్రమం
బారిరి కాచుకొమ్మని యు ♦ దగ్రుఁడు రాముఁడు నిల్చె ముంగలన్.

రాముఁడు దూషణుని వధించుట

చ॥ దురమున నాయుధంబులును ♦ తుండములున్ రదనంబులున్ గిరుల్
బఱియలుగాఁగఁ ద్రుంగె రథ ♦ వర్గము కేతనముల్ శిరోగ్రముల్
పరిపరి త్రోవలయ్యె వరి ♦ వైరుల కోఁతలఁ బోలెఁ గుత్తుకల్
దఱుగఁ దురంగ సంఘములు ♦ దట్టముగాఁ బలువై ధరం బడెన్. ౪౮౧

సీ॥ రామధనుర్ముక్త ♦ భీమ సాయకములు, ప్రాణంబు లున్నట్టి ♦ పట్లువెదకి
వారి యాయుధములు ♦ బంధుర కవచముల్, చెండుచుఁ గొండల ♦ నుండి పాఱు
నదులకై వడి రక్త ♦ నదులుబ్బి పాఱంగ, డాలుల యందు మై ♦ చాలులందు
తూఱుచుఁ బ్రచ్చుచు ♦ ద్రుంచుచుఁ దజ్జీవ, ములతోడ నచ్చటఁ ♦ గలిసెఁ గొన్ని

తే॥ యట్లు కలిసి పోనొల్లని ♦ యర్ధచంద్ర, కాండములు గొన్ని కత్రించెఁ ♦ గంఠవితతిఁ
గొన్ని వంచకహృదయముల్ ♦ గ్రొచ్చివైచె, దాసి బొమ్మల వీఁపుల ♦ దూసెఁ గొన్ని

తే॥ దూషణుఁడు వేయు శరములు ♦ తునుఁగునట్లు, వానిసేనల కై దువుల్ ♦ వ్రయ్యునట్లు
యుద్ధ ఖేలఁ గావించి స ♦ మిద్ధ తేజుఁ, డా చమూ సాగరము వట్టి ♦ యడఁగఁ జేసె

తే కాంచి వేలుపు లార్చి మో ♦ దించినారు, రుధిర పూరముల్ చెట్లతోఁ ♦ గుధరములను
గూడఁ బెకలించికొని పాఱెఁ ♦ గ్రూరశరము, లన్ని దెసల సోఁకుల ధర-నడఁచి వైచె

తే॥ మరము గోరి నిల్చిన వారు-కెరలు చుండ, వారి జీవము గ్లొనిపోవు-పనిని దవిలి
పిసిఁగి వేసరి శోషిల్లెఁ - బ్రేతరాజు, చెలఁగి పీనుఁగుఁదిండ్లాట - చెప్పవలెనె? ౪౮౬

చ॥ కరులు గుఱాలు తేరులును - కార్ముకముల్ తలలుం గబంధముల్
గురువులు దేఱు నెత్తురులు - క్రొవ్వు మెదళ్లును కాలుగేలు నొ
డ్డొలికముగాఁగ నిండిన ర - ణోర్విని దాఁటి రథంబు రాము ద
గ్గఱ కదలించి తోలుమని - కర్బురవర్యుఁ డదల్చె సారథిన్. ౪౮౭

చ॥ తగవునె చంపఁగాఁ దిరుగు - దానవదేహ పరంపరాద్రు లె
త్తుగఁ బడియుండియుం రథముఁ- దోలఁగఁ గల్గిన గాలిచేతఁ బె
ల్లెగసెను గాలిగుమ్మటము - లేగినకై వడి నట్టి దారిలో
దిగిన రథంబు వొందుగతి - తీరుగ నెట్టులు పల్క శక్యమౌ?

చ॥ తమముఁ దొలంచినట్టి హిమ-ధాముని పోలికవెల్గు రామచం
ద్రముని నిశాత బాణమను - ధగ్మని సన్నిధికిం స్వయంబుగాఁ
దమిఁగొని పోవు జీవువలె - దర్పముతోడుత నిర్వదై దు గు
ఱ్ఱములను పూన్చు తేరిపయి - రాసెను దూషణుఁ డాజి రాఘవున్.

తే॥ దాయు నరదంబుఁ జాపంబు-దాల్చు శైల, సరణిఁ దేరిపైఁ బొలుచు దూ-షణునిగాంచి
నీదునిలుకడ మేలు! ని - న్మెచ్చవచ్చు, ననెడునంతలో సోఁకు మూఁ - డమ్ములేసె.

చ॥ మురువుగ దిక్కుల న్నిలిచి - మోయు గజేంద్రుల తోడ సాయమై
బరువు వహించు కచ్ఛపము - పన్నగ రాజులలోన నొక్కరిం
ధరణిని మోవ నిల్పి మఱి - తక్కురుఁ దోడుగఁ గొన్న జానకీ
వరు నుదుటన్ ధరించు జయ - పట్టముఁదాఁకె శరత్రయం బటన్

తే॥ దూషణుఁడు వైచు సమయంబు-దొడ్డకడిమి; లెస్సయని రామభద్రుండు-లేఁతనగవు
తోడ వాఁడి యలుఁగుగొని ♦ తొడరియేసి, తునియఁగ వానియరదంబు ♦ ధనువుదునిమి

తే॥ తపసు లాశీర్వదింప వే ♦ లుపులు పొంగ, వలఁతి వై తేని గుఱి దప్పి ♦ బ్రదుకుమనుచు
వాఁడి యమ్మేయ హాఁడును ♦ పండ్లు గీఁటు, క్రూరదృష్టులతోఁ దలఁ ♦ గొలుపు పోయె

తే॥ అనుజాతలతెగుటయురాముఁసంపవాన,మునుఁగుస్పైన్యంబు గని కదుఁ•గినిసి ఖరుఁడు
కొమ్ములం గల్గు దిక్కరి • కొమరువిల్లు, నాయుధమ్ములు దాల్చిన • హస్తమెత్తి.

ఖ రు ని యు ద్ధ ము .

క॥ యముఁడును భీతిల్ల దనుజ, చమూ జలధి తోడ రేఁగి • చందురుని మొగుల్
గము లలము లలిని కోదం, డముఁ దాల్చిన రాముపైన • దరి వేష్టించెన్. ౪౯౫

క॥ అక్షీణ పాప కర్మలు, రాక్షస వరు లొక్కపెట్ట • రథ గజ హరులన్
దక్షత ఫణిరాజ ఫణము, లక్షమమున నవియ నడపి • రతి రభసమునన్. ౪౯౬

శా॥ శ్రీరామ ప్రభు శాత సాయక హతిం • జీకాకులై యేనుఁగుల్
లీలన్ నేలకు వ్రాలె వారువములున్ • దేరుల్ రజంబయ్యెఁ గే
యూరాంచద్భుజముల్ తునింగె మకుట • ప్రోద్యత్స్ఫురచ్ఛీర్షముల్
చేరెం ధారిణిఁ గాళ్లు త్రుంగె గుదులై • జీరాడె నాంత్ర చ్ఛటల్ ౪౯౭

క॥ మీటిన ఖడ్గాటవి శూ, లాటవి ధనురటవి తోమ • రాటవి గురుబా
హాటవి మున్నగు దను వం, శాటవి శ్రీరామ శర ద • వాటవి నడఁగెన్. ౪౯౮

క॥ తగవే రూపొందిన గతిఁ, దగు రామ శరౌఘ మపుడు • తారాపథమున్
దగ దూసి చనియె నన మృదు, వగు తనువులఁజొచ్చి దుసి • యరుగుటయరుదే?

క॥ చుట్టును ముట్టిన మూఁకలు, తెట్టెలుగాఁ గూల నేగు • దివ్యాస్త్రంబుల్
నెట్టన న్యాయసభను కదు, దిట్టలు కపటమునఁ బసలఁ • దిగుచుటఁ బోలెన్

క॥ ఖరుఁడను క్రూరాభిఖ్యుఁడు, ఖర గుణులగు నసురలెల్లఁ • గడతేఱుటచే
గురు కోపి యగుచు శోణిత, శరధిని మందరము వోలెఁ • జక్కన నిలిచెన్

తే॥ నల్ల కడలిని చనునొక • నావయనఁగ, నొప్పు నరదంబుపై నెక్కి • యుగ్రదృష్టి
మిడుఁగుఱులు రాలఁజూచుచు • మింటసూర్యు,కరణివెలుఁగుచురామునిఁ•కడకువచ్చె

చ॥ భువనము లెల్ల నొక్కపరి • బూది యొనర్పఁగ లేచు నగ్నినా
నెవడి సుతీక్ష్ణుఁడై ఖరుఁడు • నిల్చిన యంత నుమేశు చాపమున్
దివిరి భువింబడంగ వడిఁ • ద్రెంచిన దోర్బల వీర్యశాలి రా
ఘవుఁడు నిశాత మార్గణ ని • కాయము లేర్చి ధరించి నిల్చినన్. ౫౦౩

క॥ అనల జ్వాలలఁ గురిసెడు, నవిల జవము గలుగు వాఁడి • యమ్ములు వేయిన్
జనవరుపైఁ బఱపఁగ నా, ఘనుఁడును నట్టివియు విడిచి • ఖండించి వేసెన్. ౫౦౪

క॥ లోకైక నాయకుండగు, కాకుత్స్థుఁడు తొమ్మిదింట • గర్బురు నేయన్
ఫీకున వాఁడును నథుమనె, తేఁకువ ఖండించి నవ్వె • దిక్కులు వడఁకన్ ౫౦౫

శా॥ దుష్టుండంతటఁ బోక మానవుఁడసా ♦ ధ్యుం డంచు మాయా విధా
వష్టంభుండయి మీఱి దానవుఁడు స ♦ త్త్వస్ఫూర్తి శోభిల్ల దు
శ్చేష్టన్ మేఘమునన్ శరంబులను వ ♦ ర్షింపంగ నిర్నిద్రతా
ధృష్టుం డాద్యుఁడు కిన్కఁ బూని ధనురా ♦ కృష్టిం బ్రకృష్టంబుగన్. ౫౦౯

మ॥ ఒక బాణమ్మున వీని యాలము ముగిం - పొందింతు నంచున్ వెసన్
బ్రకచస్ఫూర్తి శరంబు దొడ్గి గుణ మా - కర్ణంబుగా లాగఁగా
ర్మకమున్ ఫెళ్లున ద్రీలె నిర్జరులు మా - పూర్ణాశలున్ గర్వమున్
వికటంబయ్యెనె యంచుఁ జింతిలిరి వి - ల్వోటొండటన్ లేమికిన్. ౫౧౦

తే॥ ధనువు విఱుఁగుట కొంటిమైఁ - దనరుటకును, కలఁత నొందక రాముఁడు - క్షత్త్రధర్మ
విధిని తన దీర్ఘ బాహుల - వెనుక వంకఁ, జాఁచి నిల్చిన వరుణుఁ డా - నడి మెతింగి

ఆ॥ చెంత కేగుదెంచి - చింత వలవదంచుఁ, దొలుత జామదగ్న్య-గెలిచినపుడు
కొనుచు నిల్లడగను - తనయొద్ద నునిచిన, వింటి నంది యిచ్చె - విబుధు లలర. ౫౧౧

ఆ॥ విల్లు నందికొనుచు ♦ వినతిమైఁ గేల్మోడ్చి, వంచి యెడమ చేతఁ ♦ బట్టి నంత
ధర్మదూరులైన ♦ దానవావళికెల్ల, నెడమ కనులు భుజము - లెగయ నదరె

ఆ॥ త్రుటిని నారిఁగూర్చి - దురమున యమువంటి, వారు మెచ్చ నొడ్డి - పోరు సలిపి
ఖరుని రథము నూఱు - కఱకుటమ్ములచేతఁ, దుత్తునియలు గాఁగఁ - ద్రుంచివైచె

తే॥ అరద మట్టులు చెడ ఖరుఁ - డార్భటించి, చలము వీడక యంబర - స్థలికి నెగసి
రాము భుజగిరుల్ మునుఁగనా-రాచవృష్టి, మొగులుకై వడిఁగురియించె-మ్రోఁతతోడ.

తే॥ తగ్గుచున్న తూణము నుండి - యగ్గివంటి, శరములం గురియించెడు - ఖరుని చేయి
యక్షయ నిషంగమందుండి-యందుకొనిన, యొక్క-యిషువునరాఘవుఁ-డుర్విఁగూల్చె.

తే॥ కుడికరము పడిపోవఁగ - నెడమ చేత, నొక్క యినుప రోఁకలి గొని - యుక్కుమీఱ
వైచినంతనె జానకీ - వరుఁడు దాని, నడుమఁ దుండ్లుగా నొక కోల - నఱకివైచె. ౫౧౪

తే॥ తాఁకరాని విసముగల ♦ దంష్ట్రిలూడు, పాము బుసపెట్టి నట్టులా ♦ బలియుఁడూర్చి
వృత్తుమొక్కండు గొనిరాము ♦ వేయునంత, మొగి నొకశరమున దాని ♦ నెగురఁగొట్టె.

మ॥ వరగర్వంబున మాయలం బలిసి స ♦ ప్తద్వీపముల్ సప్త బం
ధురలోకంబుల బాధసేసిన మహా ♦ దోషంబులం బొందఁగా
ఖరుహా సంబును పోలె వాని తలయున్ ♦ ఖండించి శ్రీరామ భూ
వరుఁ డొప్పారెను మంచువో నలరు భా ♦ స్వన్మండలంబో యనన్. ౫౧౫

తే॥ ఖరుఁడు పడుటను గని సుర ♦ వరులుగూడి, యాడిపాడి యానందించి♦యడరిపొగడి
పారిజాత సుమంబులా ♦ పంకజాక్షు, మీఁద నొత్తుగఁగురియించు ♦ మిడిసినారు. ౫౧౬

తే॥ ఋష్యులుచేరరా లక్ష్మణా♦గ్రిముఁడు ముదము, నందిఘోరయుద్ధమునకుఁ♦బ్రాణ మొండె
వెడల నొంటిపై నున్నట్టి ♦ యొడలి వంటి, క్షోణిజాత యెదురుచూచు ♦ చోటికరిగ

ఉ॥ మింటికి నేగి డాఁగు మిడి ♦ మేలపు సోఁకుల మేని నెత్తు దు
మ్మంటిన యంఘ్రియుగ్మము ము ♦ దశ్రుల ధావనచేసెఁ దమ్ముఁ డా
యొంటికి నంటు ధూళియు వ ♦ నోత్థిత వేదనవోవ నిష్ఖళం
బొంటుఁ గవుంగిలించె నను ♦ వొందఁగ జక్కవచంటి సీతయుఁన్. ౫౧౯

తే॥ ఒక ముహూర్తమాత్రంబున♦నుక్కడఁగిన, యసుర రక్తవాహినులు ది♦గంతములకు
నడరెఁ గదలి ఘోషంబు నా♦నమరులార్చి, పొగడ రాముఁడు సంతోష♦మునుభజించె

తే॥ రావణుని చెల్లెలైన శూ ♦ ర్పణఖచూచి, చేతఁగడుపు మోఁదికొని ని♦ శ్చేష్టఁగుడిచి
ఖరునిపైఁబడి నెత్తురు ♦ వఱదఁబొరలి, రోదనముచేసెఁగనుల న ♦ శ్రువులుదొఱఁగ

చ॥ మనసున నాస నుంచితిని ♦ మానవుపై నది ముక్కుదీసె సి
గ్గున మదిలోఁ దపించి మృతిఁ ♦ గోరన కోరక మిమ్ము రేఁపి మీ
తనువుల మంటఁ గల్పితిని ♦ దారుణ కర్మము నాచరించితిన్
బనుకుచు నింక నేపనికిఁ ♦ బొల్పదు దానినొ యంచు నేడ్చుచున్. ౫౨౨

మ॥ జయమాలల్గొను నాయుధంబులను హ ♦ స్తంబందు సంధించు దు
ర్జయులౌ రక్కసులుం దదీయ కులముల్ ♦ అంపిల్లు పాపంబులున్
క్షయముం జేయఁగఁబూని శూర్పణఖ ఝుం ♦ ఝూమారుతంబట్లు వా
త్యయుఁ బోలెన్ మది తత్తఱింపఁ జనియెన్ ♦ ద్రాఁచుంబలెన్ లంకకున్.

౭ మారీచ వధపటలము. (౫౨౩-౫౭౨)

మ॥ బలవంతుల్ చనిపోక శూర్పణఖ భా ♦ వంబందు చింతింపకే
జలదశ్యాముని మేనిసొగ మదిలోఁ ♦ సంధించి లంకేశుఁడా
కలికిన్ రాఘవు దేవిఁ గైకొను వహిం ♦ గావింతునేనిన్ మను
ష్యులలామున్ దగఁ బొందవచ్చు నను నూ♦హంజేరెఁ దా లంకకున్. ౫౨౪

సీ॥ నశ్వరంబగు భువ ♦ నంబును సచరాచ, రముగ సృష్టించిన ♦ బ్రహ్మకైన
నరుదయు విజ్ఞాన ♦ వరమార్గమునను శ్ర, మంబొంది చేయుధ ♦ ర్మంబుపగిది
మయుని నైపుణ్యాక ♦ ర్మంబు పూర్తిగఁ దెల్పు, రత్నఖచిత సభా ♦ రంగమందు
దిగ్దంతిదంత వి ♦ దీర్ణ భుజాంతర, సీమ పూర్వాద్రినాఁ ♦ జెలఁగుచుండ

తే॥ ద్వాదశార్క బింబమ్ము లి♦ర్వదిగ నగుచు, వెలయుకరణిని కర్ణకుం♦డలము లలర
బాహుపురి మణుల్ వింశతి♦బాహులందు, వహ్ని పర్వత శిఖరాల♦పగిది వెలుఁగ. ౫౨౫

సీ॥ వ్యాఘ్రచర్మాజినుండు పీ ♦ తాంబరుఁడును పంక, జాసనుండేనొక♦వీనమేని
శ్రుతులింపఁ జాల ర ♦ నంగఁ జప్పిడివేల్పు, లాకలెక్కయని ♦ యొగిగి నిలుచ

సన్నని నడుములు ♦ స్తనహేమకుంభమ్ము, లెల్లనిరేఖల ♦ నెనఁగు కనులు
చెలువారు చెలువలు ♦ చెనయు నల్కకును వం, గని కిరీటాంచిత ♦ మణులు తళుకఁగ

తే॥ శేషమణి ఫణావళి యట్లు♦చెలఁగుభుజము,లడరఁ జుక్కలన్నియుఁజుట్టి♦యులడుచుండ
గ్రహములను పట్టియుంచిన ♦ కారవోలె, నిండురత్నహారంబులు♦నీటుగులుక. ౫౨౯

తే॥ సాటిలేని పరాక్రమ ♦ శాలులైన, రాక్షసుల రత్నమకుటముల్ ♦ రాయు కలన
నఱిగి యఱిగి మహిమనొంది♦యడుగులందు, రత్నకటకముల్ మిక్కిలి♦రవమొనర్ప

తే॥ మూఁడులోకంబులందును ♦ ముఖ్యులైన, పెద్దలొసఁగు నుపాయన ♦ బృందమునఁగ
దేవతలు రాక్షసులు భక్తి ♦ దిక్కులందు, చల్లిన సుగంధ పుష్పసం♦ చయము వెలయ

తే॥ ఇచట నీతఱిఁ గనునని ♦ యెఱిఁగి శిరము, లందు చేతులు జోడించి ♦ వందనములు
చేసి వరుసలు వరుసలై ♦ చేరి నిలిచి, కొలుచు విద్యాధరులు చుట్టి ♦ నిలిచియుండ

తే॥ చెప్పినది స్త్రీల విషయమై♦చెలఁగుచున్నఁ, దమ్ముఁగూర్చియే యనియెంచి♦తలఁగి మ్రొక్కు-
వారు భయభక్తులును కల ♦ వారునైన, సిద్ధవరులు సింహము లట్లు ♦ చేరినిలువ.

చ॥ సచివులఁగాంచి పల్కిన వ♦ చస్సులు తమ్ముఁగుఱించి యంచు న
డ్కుచు, ముదలన్ గ్రహింప మదిఁ ♦ గొంకుచు నిల్చి భజించు కిన్నరుల్
విచలితులై పరేతవిభు ♦ వీక్షణ గాంచిన జీవులం బలెన్
బ్రచుర వికంపన స్థితికిఁ ♦ బొల్పడు నాగులు చుట్టి నిల్వఁగన్ ౫౩౦

తే॥ దిక్కరుల గెల్చి భవుఁడును♦ తెగడుకొండఁ, వెండిమల నెత్తి స్వర్గంబు ♦బెండువడఁగ
నింద్రుని జయించు భుజముల♦రుంద్రకీర్తి, తుంబురుఁడు పాడి ప్రభుని సం♦తుష్టిపఱుప.

తే॥ వినెడి వారల కరములు ♦ వివశతమెయి, తాళములు వేయ నారద ♦ తాపసేంద్రుఁ
డొప్పు మీఱఁగ మహతి చే ♦ నూని వాణి, విధిని వాయించి చెవులకు ♦ విందుచేయ.

ఉ॥ వారిధి నేత కల్పవిట ♦ పంబులఁ బూచిన క్రొత్తపూవులన్
దీరగు పొన్నపూలఁ గల ♦ తేనియతోడఁ బరీమళించు ప
న్నీరు గ్రహించి సుందరుల ♦ నెమ్మెయి సోకునొయన్న భీతితో
వారిధరాఖ్యఁ జెన్నెసఁగు ♦ భస్త్రికలం జిలికించుచుండఁగన్. ౫౩౪

చ॥ రకముగ బొమ్మడీకములు ♦ రాచుకొనం బడు మౌక్తికావళుల్
వికసిత సూన మాలికల ♦ వ్రీలు లతాంత నికాయముల్ భువిన్
చకచక రాలు మున్నె భయ ♦ సంభ్రమముల్ మది నూల్కొనంగ జా
రుకొని సభాంతరంబును మ ♦ రుత్తుఁడు శుభ్రమొనర్చుచుండఁగన్. ౫౩౫

తే॥ కంచుకులు పైఁడి బెత్తముల్ ♦ గలుగువారు, పలువు రందందు నిల్చిన ♦ పార్థివులకు
క్రమముగా వెండి బంగారు ♦ గద్దెలిచ్చి, శీఘ్రగతి గౌరవంబులు ♦ సేయుచుండ ౫౩౬

తే॥ రోమయుత చర్మ దుందుభి ♦ మ్రోఁగునపుడు, యముఁడు శూలదండాదుల ♦ నవలవీడి
కేల నోరుమూసికొనుచుఁ గ్రేవనొదిఁగి, నిలిచి ప్రశ్నించు కాలంబు ♦ దెలుపుచుండ.

తే॥ తావినేయి కప్పురము మ ♦ ర్దన మొనర్చి, సన్న ప్రత్తితో ముట్టించి ♦ సరసులందుఁ
దామరలు పూచినట్టి ప ♦ ద్ధతిగఁ జెలుఁగు, మించి దీపపంక్తులను వె ♦ ల్గించు చుండ. ౫౩౮

తే॥ కల్పతరులు చింతామణి ♦ కామగనియు, నవనిధులు కోరినవి యెల్ల ♦ నవ్యములుగ
నిచ్చుచుండఁగఁ బ్రభునకు ♦ నీయఁదగిన, వేళ యెఱిఁగి సురారు ల ♦ ర్పించుచుండ.

తే॥ కుండలములు మున్నగు మేటి ♦ మండనములు, దట్టమగు కాంతు లొలయఁగాఁ ♦ బట్టపగలె
కాక రేయియుఁ గలదెయో ♦ లోకమందు, చూడఁడనుచు సభ్యులు వా ♦ ర్తలాడుచుండ

తే॥ గంగ కావేరి మున్నగు ♦ నంగనాళి, స్తన భరంబునఁ గౌనులు ♦ సంచలింప
నడచి కెంగేల బుక్కుగ ♦ ణంబుఁ బోలు, కుసుమ లాజాక్షతంబులు ♦ కోరిచల్ల.

తే॥ భావరాగ తాళంబులు ♦ పరిఢవిల్లఁ, జూపరుల హృదయంబులు ♦ చూఱఁ గొనుచుఁ
గారు మొగుళులఁ గన్నమ ♦ యూరమట్లు, మించి యూర్వశి సభను న ♦ టించు చుండ

తే॥ దుర్భర తపంబుచేతను ♦ దోర్బలమునఁ, ద్రిజగముల జయించిన దశ ♦ గ్రీవుఁడొప్పెఁ
గలువకనుఁల ధనువువంటి ♦ కన్నుబొమలు, గలుగు చెలువల చూపుల ♦ గములయందు.

శూర్పణఖంగాంచి రక్కసులు వాపోవుట.

తే॥ తలను కేలుంచుకొని ర ♦ క్తధార వలన, నిండు చనులతో ముక్కుతోఁ ♦ గుండలములు
లేని చెవులతోఁ గార్మొగు ♦ ల్మొగడియుఱుము, చొప్పునఁ బోలు నోటితోఁ ♦ జుప్పనాక

ఉ॥ డాలులు చుట్టుఁ బర్వ మకు ♦ టంబులు మిక్కిలి రాయ రాజు లు
ద్వేలముగాఁగఁ గ్రిక్కిఱియు ♦ దీపిత తన్మఖశాలఁ జేరి క
ల్లోల పయోధికై వడి వి ♦ లూన కుచశ్రవనాస యుగ్రతన్
బోలుచుఁ జేరవచ్చెను పి ♦ ఱుందన దైత్యులుగాంచి దూపిలన్. ౫౪౫

తే॥ లంకయందలి రాక్షస ♦ లలనలెల్లఁ, ముజ్జగంబుల జేనికి ♦ ముద్దు చెలెలు
ముక్కు వోఁగొట్టుకొనఁ దాల్మి ♦ మొనయఁగలరె?, యెదురఁగడుపు మోఁదికొనుచు ♦ నేడ్చి

ఉ॥ అక్కజమంది కాంచి యసు ♦ రావళి యాయమతోడఁ బల్కఁగా [నారు.
ముక్కయుఁ దోఁపకుండుటను ♦ మాతులు జేగుఱువాఱ నూర్పుచున్
గక్కస మందుచున్ మెఱయు ♦ కన్నుల నిప్పులు గ్రక్కుచీగతిన్
ఱక్కిన వాఁడెవండొ గద ♦ రా? యని చేతులు నల్పుచుండఁగన్. ౫౪౬

ఉ॥ ఈగతిఁ జేసి యీల్గుటకు ♦ నెంచినవాఁడు సురేంద్రుఁడో మహా
భాగుఁడు బ్రహ్మయో హరియొ ♦ భర్గుఁడొ యెవ్వఁడొ యంచుఁ గొందఱున్

బాగుపడ౯ మదిందలంచు ♦ వారలొనర్చరు శాత్రవుల్ జగ
త్త్యాగము నందు లేర యిది ♦ పోలునె యేరికి? నంచుఁ గొందఱున్. ౫౪౮

ఉ॥ రావణు చెల్లెలంచు విన ♦ రంబుగఁ దెల్పినఁ దల్లి! యోర్చుమెం
బ్రోవుమ యంచుఁ బాదముల ♦ ముట్టుట మాని యిటులొనర్తురే?
యేవగ నెవ్వఁడేని యిల ♦ నిట్టులొనర్పఁగ సాహసించునే?
కావరమంది చేసికొనెఁ ♦ గావలెఁ దానె యటంచుఁ గొందఱున్. ౫౪౯

ఉ॥ పాక విరోధి పేరుచెడఁ ♦ బాదము లొత్తుచు నున్నవాఁడు ల
క్ష్మీకలితుండు చేవచెడి ♦ క్షీరపయోధిని పవ్వళించె గా
రీకమునుండు తారక గి ♦ రిం భజియించె నిటులొనర్చువాఁ
డే కలుషాత్ముఁడో? తనకు ♦ నెంత దిటంబొకొ? యంచుఁ గొందఱు౯. ౫౫౦

ఉ॥ ఊరును పేరులేని యొక ♦ యుక్కివుఁ డిట్టులు చేసెఁ దెంపుమైఁ
బేరుగలట్టి వారు పిఱు ♦ వీఁగకొనర్తురె? అంపులాఁడి యీ
స్వైరిణి వంశకీర్తి చెడఁ ♦ బాపిన దంచు ఖరుండె యల్కతో
సౌరు చెడంగఁ గోసి యిటు ♦ సాగఁగ నంపెనొ? యంచుఁ గొందఱు౯. ౫౫౧

తే॥ తాపమునఁ గ్రుంగి సోలు త్రి ♦ దశుల పోల్కి, దెబ్బ దినని వారలు మతి ♦ తెరలువారు
మూఁడు జగములు నశియించు ♦ ముప్పొనర్పఁ, దలఁచినారనికొందఱు ♦ తలఁచినారు

ఉ॥ నూతన కల్పమింక భువి ♦ నూల్కొను నంచుఁ దలంచికాక యీ
పాతకముం బొనర్ప మగ ♦ వారలు పాల్పడ శక్తిమంతులే?
యాతత నిష్ఠమై వనుల ♦ యందు తపంబొనరించు తాపస
వ్రాతము పొందు కోప దవ ♦ భారతరస్థితి యంచుఁ గొందఱు౯. ౫౫౩

## పౌరస్త్రీలు చుప్పనాకంగాంచి పలవించుట

చ॥ పలుకుచు నుండ లంకఁగల ♦ భామలు గాజులు మ్రోయఁ బల్లవం
బులఁ దలపించు హాసములు ♦ పొక్కఁగ నల్పుచుఁ జేమిరిడ్డ పా
ల లలిని నిల్పు లేమిని ప్ర ♦ లాపము లాడుచుఁ బాఱు తెంచుచు౯
బెలుకుటఁ గాంచి రే మనుభ ♦ వించితె? యంచుఁ గవుంగిలించుచు౯. ౫౫౪

తే॥ పటహ వీణా మృదంగాది ♦ బహుళ రవము, తక్క వేఱు నినాద మె ♦ త్తఱిని లేక
విభవముల నొప్పు లంకలో ♦ వెక్కు గోల, నాఁడు మొదలయ్యె నాచుప్ప ♦ నాతి కతన.

ఉ॥ మద్యము లొప్పు గిన్నియల ♦ మధ్యమునం దిరుగాడు తుమ్మెదల్
మద్యముమీఁది డెందమొక ♦ మార్గము వట్టఁగ దైత్యనారులా

యుద్యమముల్ త్యజించి నెఱ ♦ యోడికలంబలె నీరుగార్చి వి
ద్యుద్యుత వారిదప్రతతి ♦ యోజ నలందురి రొక్క పెట్టునన్. ౫౫౬

తే॥ విభుల పైఁ బొలయల్కలు ♦ వీడకుండు, కఠిన నెట్టుఁ బొఱిన కనుల్ ♦ కలఁకఁ జెంది
మఱియు నెత్తునై కన్నీటి ♦ వఱద లొప్ప, శూర్పణఖ పాదములఁ బడి ♦ స్రుక్కినారు

తే॥ తమ శిఖల యందు పచ్చలు♦దాల్చుకరణిఁ, బోఁక ద్రాక్షకులశిఖరముల్ ♦పొలుచుచుండ
మణుల గొలుసుల యుయ్యేలల్ ♦ మలయనూఁగు, చెలులు విసిగి వీథికివచ్చి ♦ చేరినారు

తే॥ ఒలయఁ బెనఁచిన విభుల బా ♦ హువుల వీఁడి, మీనములఁ బోలుకన్నుల♦మిట్టిపడెడి
ముత్తెములఁబోలు బాష్పము♦లొప్పరలుచుండఁ, గొందఱాయమఁగనిలోనఁ♦గుమిలినారు

తే॥ వైరిభీకరాయుధముల ♦ వఱలువాఁడు, భువనవిజయుండు దైత్యవి ♦ భుండు దీని
నెఱిఁగెనేని జగములెల్ల ♦ నేమి యగునొ?, యనుచు నేల దొరలి చాలఁ ♦ బనవినారు.

తే॥ మధు మదంబున సోలిన ♦ మగువలెల్ల, మగల వలని సౌఖ్యంబులు ♦ మఱచి కేశ
బంధములు వ్రీల నీవులు♦వదల జనులు, త్రుళ్ళ నడచుచు నేడ్చిరి♦దొరలిరచట. ౫౬౧

తే॥ తారగిరి లీలనెత్తిన ♦ దైత్యు చెల్లె, లిట్టి గతి నొందెనే యని ♦ యేడ్చి కేశ
పాశములు వీడఁ గెంగేల ♦వలుఁద చనుల, మీఁద మోఁది కొనిరి వంత♦మీటుచుండ.

ఉ॥ రావణ పాలితం బయిన ♦ రాజ్యమునందు మృగంబులేని ము
న్నెవగఁ జింత నొంద విటు ♦ లేర్పడె నేఁడిఁక నేమి యబ్బునో?
పైఁ బ్రివడి పోయెఁ గీరుతులు ♦ బాధలు నొందఁగ నుంటి మంచు నే
త్రావిల బాష్ప పూర్ణలయి ♦ యంగదలం బడి నొచ్చుచుండఁగన్. ౫౬౩

శూర్పణఖ రావణుతో మొఱయిడుట

తే॥ పలువిధంబుల లంకలోఁ ♦ బౌరు లడల, సభను నిల్చిన వారును♦జాఱఁ దలఁపఁ
గొండక్రిందఁ జేరిన కాకో ♦ గులు విధమున, నంగనాచి రావణు చర♦ణముల వ్రాలె.

క॥ కులగిరులు గదలె శేషుఁడు, తలలను వంచెను తమంబు ♦ దశదిశ లలమెన్
దలఁకుచు రవియుం బఱచెను, తలరేన్ దిక్కరులు తలలు♦దాఁచి రమరులున్. ౫౬౫

ఉ॥ అంగదముల్ చెలంగెడి భు ♦ జార్గళముల్ వడిబూరటిల్లఁ బై
నంగడి జ్వాలలం గురియు ♦ చక్షుల చెంగట వక్రదంష్ట్రముల్
వంగి రహింపఁగా భ్రుకుటి ♦ ఫాలము దాఁకఁగఁ జూచు రావణున్
ముంగలఁ గాంచి సేవల స ♦ మున్నతిఁ జేయఁగ జంకిరెల్లరున్ ౫౬౬

చ॥ పితృపతితోడ వేలుపులు ♦ భీకరవృత్తినిగాంచి నేఁడు దు
ర్గతి మనకో మఱేరికో తొ ♦ అంగద యంచుఁ దపించి జీవనం

తతులును దేహముల్ నిలుక ♦ దప్పివడంకుచునుండ భూజముల్
మతిచెడి యేమియన్న బరి♦మార్చునొకో యని తూలుచుండగన్. ౫౬౭

ఉ॥ మూసిన యాస్యకందరల♦ ముమ్మరమై పొగగ్రమ్మ రోమముల్
మీసములుం గగుర్పొగొన ♦ మిక్కిలి యార్చుచు నాడునొక్కపెం
రోసముతోడ దంతముల ♦ రోచులు దిక్కులందూఱ మేఘగ
ర్జాసమ వాక్కులంగినిసి ♦ రావణుడెవ్వరి చేష్టయుద్దినాన్. ౫౬౮

చ॥ అవనిని గాచువారు కుసు ♦ మాస్త్రుని బోలినవారు భూమిపై
దివమున నాగలోకమున ♦ దేహముగల్గిన వారిలోన నీ
డెవరును లేనివారలు న ♦ రేంద్రులు కానకు వచ్చి క త్తితో
దివ్రుచుచు నన్నెకాదు భవ ♦ దీయ యశంబును గోసి రుద్ధతిన్. ౫౬౯

చ॥ మనుజులొనర్చిరంచసుర ♦ మానిని పల్కగ బిట్టునవ్వి యే
మని వచియించితే యని ద ♦ శాస్యుడు కన్నుల నిప్పులుర్లగా
మినిగనుగొంచు నల్పులగు ♦ మేదినివారలగూర్చి నీవు ప
ల్కనదిటులా? యసంగతము ♦ గ్రొచ్చక సత్యమునే వచింపుమా! ౫౭౦

చ॥ అని దనుజేంద్రుడాడ జెలి ♦ యల్ వచియించును మారుబోలువా
రును దృఢబాహుసత్త్వమున ♦ గ్రుంగగ మేరువు నూడ్వజాలువా
రని పలుకంగనేల? విలు ♦ నమ్ములచే క్షణమాత్రలోన నీ
వనజభవాండమెల్ల నుల ♦ భంబున బూదియొనర్ప నేర్పరుల్. ౫౭౧

చ॥ మునుల యెడన్ విధేయులు ప్ర ♦ పూర్ణ నిశాకరు వంటి కాంతి మం
డన ముఖు లుల్లసిల్లు నలి ♦ నంబులబోలిన నేత్రయుగ్మముం
దనరినవారు కోమల ప ♦ దంబులు చేతులు గల్గువారు స
న్మని జనులందు వారికి స ♦ ముల్ గలరే త్రిజగంబులారయన్? ౫౭౨

ఉ॥ నారలు దాల్చినారు చర ♦ ణంబుల బెండరముల్గలారు వి
ల్వీరులు జన్నిదంబు దగి ♦ లించినవారలు సత్యవాక్యులుం
శూరులు నీకు లోబడరు ♦ చూడ నినుం దృణలీలనెంచు వా
రీ ధరులు శాస్త్రమట్లు తుది ♦ తేలని యక్షయ తూణధారులున్. ౫౭౩

ఉ॥ వారల జేరి మౌని జన ♦ వర్యులు రాక్షసబాధముఖ్గి యు
న్నారము ధీంద్రియ ప్రకట ♦ నంబగు జ్ఞానము లేనివారమై
నారము కావరే యనుడు ♦ నాకవిరోధులద్రుంచి భూమిను
ద్ధారణ సేయువారమని ♦ దారుణమైన ప్రతిజ్ఞ చేసిరిన్. ౫౭౪

మ॥ ఒకచో నిద్దఱు మారులీ భువనమం ♦ దున్నారు సత్యంబు వా
రికి విల్విద్దను మించు వారలు గలా ♦ రే యన్నిలోకాలఁ? వా
రికి నీడై తగు వారలుం గలుగరీ ♦ పృథ్వీతలంబందు వా
రొకరొక్కండె త్రిమూర్తి సన్నిభు లహో ♦ యుద్ధక్రియా పారగుల్.

తే॥ ధరణి యెల్ల నేకచ్ఛత్ర ♦ నరణినేలు, ధర్మపరతంత్రు దశరథు ♦ తనయులైన
వారు నిర్లోపులగు వారు ♦ ప్రభునియాజ్ఞ, గాన నున్నారు రామల ♦ క్ష్మణులనంగ.

చ॥ చెలియలి నాసికం దునియఁ ♦ జేసిన వారు నరుల్ సజీవులై
వెలయుచు నున్న వార లట ♦ విం మఱియేటికి నేను గల్గియూ
తులువలు తెంపుమై వనులఁ ♦ దోఁచుచునుండఁగ సిగ్గువీడి యి
య్యల మనినాఁడ నంచు దను ♦ జేంద్రుఁడు మండె మనంబులోపలన్. ౫౭౭

చ॥ పెలుకుఱ లోకముల్ గెలిచి ♦ భీకరతేజుఁడనై నమ స్సముం
బొలుపుగ నేలు నాకుఁ దుదిఁ ♦ బొందిక నబ్బె నపాఖ్య కీర్తికిం
జెలువగు స్తోత్రపాఠములు ♦ చిచ్చున మాడ్చితి లోకమంతటన్
గలిగినవీ కులం దునిమి ♦ కాల్చిన నీ యపకీర్తి మాయునే? ౫౭౮

ఉ॥ శాశ్వతనింద నా కునుపఁ జాలిన మానవు లుండిరంట! నా
కీశ్వరుఁడిచ్చు కైదు వొక ♦ టిచ్చినదంట! నరుల్ సజీవులై
నశ్వరమొంద కుండిరఁట! ♦ నాకును వింశతిబాహులుండె నీ
విశ్వమునందు నేను నను ♦ బృందముతోడుత నుంటిఁ జెల్లరే!

మ॥ మనసా! మాయని క్రొత్తనింద మన వం ♦ శంబందుఁ బ్రాపించెనే
యని లజ్జంబడి కుందుటేల? యవదూ ♦ అత్యంతమున్ మోవఁజా
లిన కేలుం దల లిర్వదిం బదియు నో ♦ లిం దార్ఢ్యసత్త్వంబులో
డనె యొప్పారెడిఁ గ్లేశమందకుము హా ♦ ప్రస్థైర్యముల్ పొందుమా. ౫౮౦

చ॥ అని వికటంబుగా నగి న ♦ హాయబలంబులు లేని యిద్దఱి
ట్లనువుగఁ గానయం దెనడ ♦ యాడ ఖరాదులు శౌర్యమానవ
ద్దనుజులు వారిఁబట్టికొని ♦ దారుణభంగిని చీల్చిమింగ కి
ట్లనువు పడంగ వీడిరొకో? ♦ యన్నఁదదగ్రజుఁ గాంచి ఇన్నయై. ౫౮౧

తే॥ కనుల బాష్పప్రవాహముల్ ♦ గార్చునదియు, వక్షముం బాఁదుకొనునది ♦ వసుధఁబొరలు
నదియు నగు శూర్పణఖనెత్తి ♦ యందుచేతు, లుఁగుచుకొని వారలేర్వ వం ♦ చించెనిట్లు.

ఉ॥ నాయవమానముం దనుజ ♦ నాయకు లెల్లరుఁ గాంచి క్రుద్ధులై
యాయుధినీతులుం దునుమ ♦ నప్పుడ సాయుధులై ఖరాది నం

స్థేయులు వచ్చిచుట్టి సర ♦ సీజదశాత్మజుని రయోంటి వింటిచే
నాయమరావతిం గదిసి ♦ రక్కట! రయొక్కముహూర్తవేళలోన్. ౫౮౩

ఉ॥ వ్యూహబలంబుచే నడరి ♦ యుర్వరగెల్చిన దైత్యసైన్యసం
దోహముతోడ నాఖరుఁడు ♦ దూషణుఁడున్ త్రిశిరుండు దోస్సమి
ద్దోహలు లొక్కమానవుని ♦ దోర్మలసంపదచే నశించి ర
య్యాహవమంద యన్న విష ♦ యంబునకై యొడలుం జెమర్పఁగన్. ౫౮౪

చ॥ కలిగిన కోపచింతలు వి ♦ కావిక సేయుచు వహ్నివర్ధిలన్
జిలికిననేయివోలెఁగడుఁ ♦ జీఁదఱ వృద్ధియొనర్ప వారలి
ట్లలుకను నీదు ముక్కుమొద ♦ లంటఁగఁ గోయఁగ నీవు వారికిన్
జలిపిన నేరమేమి? యది ♦ చయ్యనఁ దెల్పుమ యన్న నామెయున్. ౫౮౫

శూర్పణఖ సీత చెలువమును ప్రశంసించుట.

మత్త॥ వేరిచేతను వ్రాసి చూపఁగ ♦ వీలుకాని వరాంగుతో
సారసంబును వీడి వచ్చుచు ♦ శంపనుండియు కౌను బం
గారు నుండి శరీరముం బథ ♦ కంబుగా గ్రహియించి యా
కారు కానను చేరు కామిని ♦ కై జనించెను నావుడున్. ౫౮౬

మత్త॥ రామ యెవ్వరి కాంత యంచును ♦ రావణుం డను నంతలో
నామె యిట్లనుఁ బల్కుమాటల ♦ నార నారసి చూచు కో
మ్మామనోహరి గబ్బిగుబ్బలు ♦ హాట కోఖలు పాదముల్
భూమి నోచిన భాగధేయము ♦ ముగ్ధనామము సీతయా ౫౮౭

చ॥ భ్రమరుల గీతముల్ తెలిమ ♦ రందముఁ బోలిన తీయనైన వా
క్యములు సుగంధకేశములు ♦ గల్గి సురాదులు సంస్తుతించు చం
దముగల లక్ష్మియుం దన యు ♦ దాత్తతకుం దగు చేటి కాదనన్
బ్రమదమనోజ్ఞకత్వములు ♦ పల్కెడ నంటయు మాధ్యమే యగున్. ౫౮౮

సీ॥ వ్రాలిన కేశముల్ ♦ వర్షధారలఁబోలు, మృదు పదంబులు ప్రత్తి ♦ క్రియనుపోలు
వ్రేళులు మేలైన ♦ విద్రుమంబులఁబోలు, సొగసైన వాక్కులు ♦ సుధనుపోలు
వదనం బలోపమా ♦ పద్మంబుఁ బోలును, కడలికంటెను మించి ♦ కనులు వెలయు
కందర్పుఁ డామెను ♦ కాంచి తపించి ని, క్కచ్చిగా మాటాడఁ ♦ గడఁగియె చుమి

తే॥ దీర్ఘరోగవ్యథను పొంది ♦ దినదినమ్ముఁ, గార్శ్యముంబొంది సఫలతఁ ♦ గాంచకునికి
మాఁడి మసియయి తుది రూపు ♦ మాసెఁగాక, హరునికంటిమంటనశించె ♦ ననుటకల్ల.

చ॥ పగలు వసించు స్వర్గమును ♦ బాగుగాఁ జూడు, ఫణామణిచ్ఛటల్
జిగిగల నాగలోకమును ♦ చేరికఁ గాంచుము కంధి మేఖలా
జగముఁ బరీక్ష సేయు మెటఁ ♦ జక్కనఁ గన్నను గాంచ లేవ య
మ్మగువ ధరిత్రిలోని దె సు ♦ మా విలిఖింప నశక్యమే యగుఁ. ౫౯౦

చ॥ భుజములఁ గూర్చి పల్కుదున? ♦ మోమును కన్నులఁ బల్కరింతునా?
నిజముగ సారె గుబ్బలన ♦ నీటగు చన్నులనే వచింతునా?
గుజగుజ నాడు కొట్టుకొని ♦ కొంకుచు నూరక యుంటగాక ప
ల్కఁ జనదు రేపె కాంచెదవు ♦ గాని మఱొక్కటి విన్ము పల్కెదన్. ౫౯౧

సీ॥ బొమలు శరాసన ♦ మ్మును పోలు నన్నను, కనులు కుంతంబుల ♦ నెనయు ననిన
దంతముల్ ముత్యాల ♦ బంతిఁ జెనయు నన్న, విద్రుమంబుల నేలుఁ ♦ బెదవులనినఁ
దొడ లంటి కంబాల ♦ దొరయున వన్నను, కమఠంబువంటి మీఁ ♦ గాళ్ళులనిన
ముక్కు చందము నువ్వుఁ ♦ బువ్వు సరి యానన, గళంబు సొగసైన ♦ కంబువన్న

తే॥ పలుకు సరిపోలుఁగాని త ♦ ద్వస్తు తత్త్వ, మెన్న సరిపోవునే? వరి ♦ తృణముఁ బోలు
ననుట పొసఁగునె? యుపమ♦లయ్యనుపమాంగి, కెచటదొరకును దైత్యకు♦లేశ చెపుమ

తే॥ ఇంద్రుఁ డింద్రాణిఁ బడసె మ♦హేశుఁ డుమను, పడసె హరియు రమాసతిఁ♦బడసె సీత
నీవుఁ బడసితి వారికి - నేడ సుఖము, నీకసుఖము నిజంబుగ♦ నిర్జరారి! ౫౯౩

తే॥ ఒకఁడుసామేననుంచె వే♦ఱొకఁడురమున, నుంచె మఱొకఁడాస్యంబున♦నుంచుకొనియె
నీవు సౌందర్యసదనయౌ♦నెలఁతఁగొన్న, నెచట నుంచి సుఖింతువో♦యెఱుఁగరాదు.

చ॥ తరుణిని నీవు గాంచిన ప ♦ దంపడి నేలను నిల్వఁబోవు నీ
యురవగు నెల్ల సంపదల ♦ నుగ్మలికై విడువంగలాఁడ వె
ల్లర కగు మేలు నీకమర ♦ లాభము నేఁగలిగింతుఁగాని నీ
గరితలకుఁ సుదుఃఖ తతి ♦ గల్గఁగఁజేయుదుఁగాదె చూడఁగన్. ౫౯౪

ఉ॥ వేలుపు లోకమందు పృథి ♦ వీ తలమందును కల్గుస్త్రీల గ
ర్భాల జనించినట్టి జవ ♦ రాలదిగాదు సురాసురుల్ మహా
భీలముగాఁగఁ జిల్కతఱి - ద్వీపవతీపతి పంకజాసనుఁ
బోలఁగఁ జక్రికిచ్చెనని ♦ భూమియు దీని నొసంగె స్పర్ధమై. ౫౯౬

ఉ॥ అంబుధి మేఖలా జనము ♦ లౌననఁ దుమ్మెదలాడు క్రొమ్ముడిం
డంబుగఁ గల్గు రాఘవు ప ♦ డంతుక యుఁ హారిణంబుతోడ నీ
వింబుగ నాడు మేను కసి ♦ యొదగ నాడఁగ నీదు ఖడ్గ స
త్త్వంబు జగంబెఱుంగ నిన ♦ వంశ్యుని నాకు నొసంగుమా రహిన్. ౫౯౭

చ॥ తపసులు నేనియుర్ విధిని ♦ దాఁటఁగ లేరు లభించు వేళ ల
భ్యపడు నమస్తముర్ దొరకు ♦ నవ్వి లభింపని వేళలందు ల
భ్యపడవు చేతు లిర్వదియు ♦ నాస్యములుర్ బది మీనమహా నురం
బు పడసినట్టి భాగ్యమును ♦ పొందుట నీ వికమీఁదనే సుమీ. ౫౯౮

ఉ॥ సీతను గొంచు నీకడను ♦ చేర్పఁ దలంచియొ పట్టఁబోవ దు
ర్జాతుఁడు లక్ష్మణుం డకట! సంభ్రమ మందుచు నడ్డువచ్చి వే
వే తొలి ముక్కుఁగోసె మను ♦ వే చెడిపోయెను నీకుఁ దెల్పి త
ర్వాతనె ప్రాణము ల్వదల ♦ భావన చేసితి నన్న! నావుడుర్. ౫౯౯

రావణుఁడు సీతచందమువిని విరాళిచేఁ బరితపించుట.

సీ॥ కోపంబు వీర్యంబు ♦ గురుతరమానంబు, బలిసిన నెంజిలి - బలమువలనఁ
శాపంబు పండు తా ♦ వలమున సంపదల్, తొలఁగిన కరణిని ♦ తొలఁగిపోయె
దీపంబు మఱియొక ♦ దీపంబుతోఁ జేరు, నపుడుండు రీతిగా ♦ నాదలోని
తాపంబు కామంబు ♦ తనరనొక్కటియయి, ప్రాణంబునంద యొ ♦ ప్పారఁ గలిసె
తే॥ ధరణిజాతను మఱవని దైత్యరాజు, ఖరుని మఱచెఁ జెల్లెలి ముక్కు ♦ తఱిఁగినట్టి
నృపుల బలమును మఱచెను♦నిందమఱచెఁ, బ్రసవశరునిచేఁ పూర్వశా♦పమునుమఱచె

చ॥ జనకజ నామముర్ మనముఁ ♦ జక్కన నొక్కటియై లయించు నా
వెనుక నొకం డొకళ్లు విడి ♦ వేఱొక దానిఁ దలంప వేఱుగా
మన మొకఁడుండునే? మఱచు ♦ మార్గమిఁ కెయ్యది? పండితాళికిర్
మనము నడంచు జ్ఞానమది ♦ మాఁడగఁ గాము జయింప శక్యమే? ౬౦౧

క॥ లంకాధిపతి మయూర వి, శంకట గమనర్ మహీజ ♦ సాధింపక ను
న్నంకిలి పడు నెడఁదఁ గడుర్, సంకట పడి యెండ వెన్న ♦ చందంబందెర్. ౬౦౨

చ॥ తనవిధి బల్మిచే జరుగఁ ♦ దగ్గ పరిస్థితిచేత లంకకుం
బనుపడు చేటుచే మతి య ♦ వారణ సంభ్రమ మొందుచుంటచేఁ
జెనకిన దొడ్డ కామ రుజ ♦ చెల్లఁబరింపని మూర్ఖుఁ డజ్ఞతం
బొనరుచు చెట్ట కై నడిచె ♦ పూవులు పండులు గాఁగ వర్ధిలెన్. ౬౦౩

ఉ॥ బంగరుబొమ్మ సీతఁ దన ♦ భావమునం జొరనిచ్చు త్రోవచే
బంగిని ద్రావు వానిక్రియ ♦ భ్రాంతిని మై వివశత్వ మొందుటర్
రంగుగఁ గాంచి మారుఁడు శ ♦ రంబుల నొంప సమర్థుఁడయ్యె వా
నిం గొను కామభావననె ♦ నిల్చె బలంబు కుదించు శక్తియుర్. ౬౦౪

చ॥ కొలువును వీడ రావణుఁడు ♦ కూరిమి దీవనలిచ్చినారు పె
ద్దలు చెలువల్ సుమంబులను ♦ దండడిఁ జల్లిరి శంఖ దుందుభుల్

చెలఁగ సభాషణముల్ చనిరి ♦ చెడ్డ మనంబు తపించి తొందరం
జలుపఁగ హేమరత్నమయ ♦ సౌధముఁ జేరె సురారి చింతమై. ౬౦౫

మ॥ సుమతల్పంబులఁ జేరకే సతులపైఁ ♦ జూడ్కిం బ్రసారింపకే
ప్రమదారత్నము లుల్లసిల్లి పలుకం - బల్కింపకే యొంటిమైఁ
దమి నొండొక్కట నిల్చి సీతసయిఁ జి ♦ త్తంబుంచి తా విన్నత
ద్రమణీయాంగముల న్స్మరించె మది సం ♦ తాపంబు పెంపొందఁగన్.

మ॥ తొలఁగింపంగ నశక్యమౌ తమి మదిం ♦ ద్రొక్కాడి యుబ్బొత్తగాఁ
గలఁగింపంగఁ బరీమళ ప్రసవ నం ♦ ఘాత ప్రకీర్ణస్ఫుర
త్తలిమం బందలి పూలువాడి యొడలుం ♦ దప్తంబుగాఁ జిత్తముం
మలఁగం బ్రాణము తల్లడిల్ల మఱిఁగెన్ ♦ మారప్రహారంబులన్. ౬౦౬

ఉ॥ చల్లని గందముం గినల ♦ సౌరభ పుష్పములన్ వెలందుకల్
మెల్లనఁ గొంచుఁ జేర నవి ♦ మించిన నిప్పగు మందుచే నొడల్
తల్లడ మందు రీతిఁ గడుఁ ♦ దాపముఁ గూర్పఁగఁ గొల్మిగుంట రా
జిల్లెడు నగ్నినా మిడుఁగు ♦ చిందఁగ నూర్చుచు నుమ్మలించుచున్. ౬౦౭

చ॥ మునుపు మనంబు నెమ్మదిని ♦ పొందిన రావణుఁడిప్డు పాపమున్
దనికెడు నిందయుం బగయుఁ ♦ దా మది నెంచక యబ్ధి కుంత మా
ర్గణ హరిణోత్పలంబుల హౌ ♦ రంగు జయించిన కన్నులొప్పు నా
జనకజఁ గాంచఁ గోరి తమిఁ ♦ జాలఁ దపించె మనోజవేదనన్. ౬౦౮

తే॥ దిగ్గజంబుల నొంచిన ♦ ధీరుఁడపుడు, తరువులం దొలిచెడు బెండు ♦ పురువులీలఁ
గంతు తూఁపులు తనదు వ ♦ క్షంబుఁ దొలువఁ, గుంది సోలి కుమారిలి ♦ క్రుంగి కూలె.

తే॥ ప్రసవముల తోడి లేఁగొమ్మ ♦ వంటిదొకతె, వచ్చిమదిఁ జేరెనని భ్రమ ♦ పడెడియసుర
వరుఁడు మరు నమ్ముపలె నెద ♦ వ్రయ్యసోఁకు, మలయ పవనునిపైఁ జాల ♦ మండిపడును.

తే॥ పొక్కిపొరలి కర్తవ్యతా ♦ మూఢుఁడైన, రావణుఁడు లేచి వడిఁ బలు ♦ రకములైన
వీణలను కేరు పలుకుల ♦ వెలఁదులెదుర, దీపికలు గొని రా నొక ♦ తోఁపుఁ జేరె. ౬౧౦

సీ॥ మావిచెట్లకు హీర ♦ మణులు పనసలకు, మాణిక్యములు పోఁక ♦ మ్రాఁకులకును
నీలముల్ కురువింద ♦ మోలి సాలములకు, గోఁగుల కరవింద ♦ రాగమణులు
నరఁటి కంబములకు ♦ మరకత రత్నంబు, లేపి భూజములకు ♦ హేమరాశి
పాటల తరులకుఁ ♦ బగడముల్ పున్నాగ, ములకును శశికాంత ♦ ములును నారి

తే॥ కేళములకు వెండిని పోల్పఁ ♦ దేలుఫలము, గల దెలిమిన్నంటఁ బెరిఁగి పూ ♦ వులకుఁ బ్రక్క-
రికలకు వేర్చి గనరాశి ♦ నిక్కియుప్ప, వనమునం దొక శయ్యపై ♦ వంతఁ జేరె. ౬౧౧

## రావణుని విరహతాపము.

మ॥ ఫల పుష్పంబులనుండి వచ్చు మధువుల్ ♦ వాటంబుగాఁ ద్రావు చె
ల్వాలు పైకంబులు బంభరంబులును చి ♦ ల్కల్ పిచ్చుకల్ శారికల్
పలుకుల్ రజ్జులు మాని దానవ జగ ♦ త్ప్రఖ్యాత వీరప్రభుం
డలుకం బూనునొ యంచు మూఁగల క్రియల్ ♦ వ్యాహారముల్ సేయఁగన్.

చ॥ శిశిరముచేత గాలియును ♦ జిల్లను మంచును గూడి మెల్లఁ బం
చశరుని తూపులుచ్చి యెడ ♦ సందులఁదూఱఁగఁ గాలుసేతులుం
బ్రశమన మింతలేక సభు ♦ పం దొడఁగన్ 'ఋతు వెద్దిరా' యనన్
శిశిరము వోయె భీతిమెయిఁ ♦ జెచ్చెర వేసవి వచ్చెఁ జిచ్చునాన్. ౬౧౫

ఉ॥ లావగు పెద్ద మ్రాఁకులు శి ♦ లాతలముల్ గిరులున్ హిమస్థలుల్
ప్రోవుగ మండిపోయెననఁ ♦ బోడిమి వేసఁగి వేడి యిట్టిదం
చేవిధిఁ బల్క శక్యమగు? ♦ నిట్టలపు న్వాలపన్విమంబునే
త్రాపిన మందులుం గలవె? ♦ తాఁకె నెడంద సుఖంబు దుఃఖమున్. ౬౧౬

చ॥ అతని మదిం జనించిన స్మ ♦ రాగ్ని దిగంతము దాఁకఁ గాల్పఁగా
వెతల భజించి యెండయును ♦ వేదన గూర్చెను దీనిఁ దోలి మున్
ఋతువునె దెండియున్న నది ♦ యేడ్జల రా నొడలుం దపింప నీ
ఋతువును కాల్చుచున్నదిది ♦ యెప్పటిదే యని చీఁదలంగొనన్. ౬౧౭

తే॥ దైత్యచంద్ర! మీయాజ్ఞను ♦ తప్పినడవ, ఋతువులెల్లను భయపడి ♦ కొంతుకుననుడు
ఋతువులెవ్వియుఁ బనికిరా ♦ విచటనాకుఁ, దఱిమి వేయుఁడీభటులార! త్వరగననియె.

చ॥ వలదను నంతలోనె ఋతు ♦ వర్గము ధర్మములెల్లఁ దప్పి యో
గులవలె సర్వసంగములు ♦ గొబ్బున వీడెను దేశమంతయున్
బలుపగు రోగముల్ జనస ♦ బంధము వీడి తపస్సులొందునాఁ
కలియును దప్పిలేని దివి ♦ కైవడి దోఁచె మనంబులోపలన్. ౬౧౯

చ॥ ధరణిని వేఁడియుం జలియుఁ ♦ దగ్గ దశాస్యు శరీరమెల్ల దు
ర్భరముగ నేయిలేక ప్రభు ♦ రంబుగ మండెడు వహ్నిభంగి నా
తరముగ మండెఁ గాలమది ♦ తార్చునదొక్కటియా? స్మరాగ్ని ము
మ్మరమగు మంట జ్ఞానమున ♦ మాయును గాక దానసానా క్రోః

ఉ॥ ప్రబ్బిన మబ్బు నాఁ దనరు ♦ రావణుఁ డప్డు బిసంబులన్ రసం
బబ్బిన పూలమాలల హి ♦ మాంబువు చల్లిన లేజివుళ్లతో
జొబ్బిలు చందనంబు నిడి ♦ చూచియు నోర్వక మేలు గోరువా
రుబ్బున గొబ్బునం బఱచి ♦ రౌషధి నాథుని పట్టితెండనన్. ౬౨౧

చ॥ అలుకయె శీలమై తగు ద ♦ శాస్యు పురంబు పయిన్ భయంబునం
బొలయక యవ్వలం దొలఁగి ♦ పోవు నిశాకరుఁ గాంచి రక్కసుల్
పిలుచుచు నున్నవాఁ డసుర ♦ వీర వరేణ్యుఁడు రావణుండు నీ
వలుకక రమ్మటెమ్మన హృ ♦ దబ్జము ఝల్లన లేచె మెల్లనన్. ౬౨౨

శా॥ శంకం బొందుచు వెన్నెలల్ పరవు నా ♦ సంద్రంబుపై నిల్చి తా
సంకోచించుచు గుంద్రఁడన్ వదలి మున్ ♦ శాత్రవ్యుచే నొచ్చువాఁ
డంకాపాంకముతోడఁ దగ్గ యదనఁ ♦ దంకించు చందాన నే
ణాంకుం డప్పుడు దోఁచె రావణునకున్ ♦ యామ్యేశు తోయంబునన్. ౬౨౩

ఉ॥ అంబరవీథి వచ్చి కిర ♦ ణావళి పర్వఁగఁ జంద్రుఁడొప్పె మో
హాంబుధి మున్గు నాతఁడు శ ♦ శాంకుని దూషణ సేయుచుండ త్రీ
రాంబుధిఁ బవ్వళించిన ము ♦ రారి తటిం బరికించి దైత్యరా
డ్డంబర జీవము ల్గొనఁ గ ♦ డంగి విధించు సుదర్శనం బనన్. ౬౨౪

మ॥ తన పుట్టింటను చెంతనుండు సుధ మో ♦ దం బారఁగాఁ ద్రావి చ
ల్లన వ్యాపించిన చంద్రు వెన్నెలలు, క ♦ ల్కాం బాటీ రక్తాక్షుఁడై
జనిత భ్రూకుటి ఫాలభాగుఁడగు దో ♦ షాచార భూజానికిన్
దనరెన్ వహ్నిఁ గరంగు వెండిఁబయిఁ జిం ♦ దం బోయు చందంబునన్.

శా॥ భూరిప్రాభవమై రమాలలితమై ♦ పుణ్యంబు నిండారు కే
దార శ్రీమిథిలేశు నల్లుఁడగు నీ ♦ తానాథు సౌందర్య పా
థోరాశిన్ వినినంతనే కడచె నం ♦ తోషంబు మాఁడించె ర
క్షోరాట్చంద్రము నద్ది మానితు రిపు ♦ శ్లోకంబు చందంబునన్. ౬౨౬

ఉ॥ కూరులు ధర్మరాజు మది ♦ స్రుక్కఁ దపింపఁగఁజేయు రావణుం
డారభటించి నా లెలఁపు ♦ నారసి చల్లని చంద్రుఁ డెమ్మనన్
క్రూరవిషంబు గ్రక్కు పెను ♦ కోఱలఁ గల్గిన త్రాఁచువంటి యీ
సూరుని దోడితెచ్చిన ప ♦ సుల్ బలుశుంఠలు వారలేరనన్. ౬౨౭

ఉ॥ సేవకు లంగముల్ ప్రిదిలి ♦ శీర్ణతనొంద వడంకుచుం బ్రభూ!
దేవరయాజ్ఞ లేని యొకుఁ ♦ దెచ్చుట పల్కఁగఁ బోలునేమి? రా
జీవ హితుండు తేరిపయిఁ ♦ జెందక రాఁడిటు క్రూరచేష్టలన్
మైవడి నేఁచు నాతఁడు వి ♦ మానయుతుండగు చంద్రుఁడే యనన్. ౬౨౮

చ॥ పరిణతి నీరసంబయిన - భామలపొందున కిచ్చగించి నం
భ్రమపడు కోడకాంగ్రుడు వల ♦ వంతల నొంధు మనోగదంబు నై

ప్పురుసునఁ గానట్టి సుర ♦ వైరి కులేశుఁడు కాల్చుచుండు వై
ఖరిని గ్రహించి శీతకరుఁ ♦ గాంచి దయామతి తోఁప నిట్లనున్. ౬౨౯

శా॥ నక్షత్రేశ! కృశించితేమి? కడు వి ♦ న్నంబోయి యున్నాఁడ వీ
వక్షీణవ్యథ నొందెదే? మఱిఁగదే? ♦ యంగంబు కందమ్మె మీా
నాక్షీ సీతను నన్నుఁబోలె నిని యి ♦ ట్లార్తిన్ మదిం బొందితే?
యాక్షేపింపక నన్నుఁగావ నెవర ♦ య్యా! యున్నవా రీయిలన్? ౬౩౦

మ॥ విరహం బేఁచఁగ బుద్ధిచే సణఁచు స ♦ ద్విద్వాంసులుంగల్గరే?
దొరయ న్నాదగు జీవపాళికిని మృ ♦ త్యుప్రాయమై యున్న యా
తరుణీకైరవయుక్త పద్మసునకుం ♦ దథ్యంబుగా నోడి యి
ట్లెరుసుం బొంది కృశింప గెల్వు గొనదే ♦ యీామీాఁద? జైవాతృకా! ౬౩౧

తే॥ అనుచు నలఁతనుపొంది రే♦యినిశశాంకుఁ, దొలఁచి పగలును బ్రొద్దును♦కలుగుఁగాక యనినయంత నెరేయియు♦హరియుఁదొలఁగె, పగలుసూర్యుండుఁదోఁచిర♦ప్పట్టునందు

మ॥ క్రతుకుండంబునఁ బోయు నేయివలె బం ♦ గారంపుఁదీవల్వలెన్
తత ఖద్యోత మయూఖము ల్పరవఁ బ ♦ ద్మంబుల్ ప్రకాశించెఁ ద
త్క్రతుకుండాగ్నిని పోలి కల్వలు మహా ♦ ద్రవ్యంబులంబోఁది యు
ద్ధతిఁ గొన్నాళ్లకె రిక్తుఁడౌ వెడఁగు చం ♦ దంబందె నప్పట్టునన్. ౬౩౩

చ॥ ప్రతత మయూఖ భూషణుఁడు ♦ పద్మహితుండొక ప్రక్క లేవఁగా
మతి బిడియంబు నూని జిగి ♦ మాసి వడంకుచుఁ గ్రుంకె యామినీ
పతి యొకవంక యామినియుఁ ♦ బజ్జనె యేగెను సార్వ భౌము నా
నతిఁ జరియించు చిన్న నర ♦ నాథుని చందము నొందె యయ్యెడన్. ౬౩౪

తే॥ రాక్షస స్త్రీలు రేయి భ ♦ ర్తలను చేరి, పొలయలుక వీడి పువ్వు శ♦య్యలఁ బరుండి కలల యందును కౌఁగిలి ♦ కడపకుండి, త్వరితగతి రేయి పోవుట ♦ యెఱుఁగరైరి.

తే॥ తెల్లవాఱిన నడురేయి ♦ వల్లభులును, తొలఁగిచనఁ దృప్తినొందని ♦ చెలువలపుడు విరియు కలువలు తేనెను ♦ వెలుచు రీతి, బాష్పములు గార్చిరా రేయి♦పగలెయగుట.

క॥ కొందఱు శయ్యలపైఁ దరు, బృందముఁ జుట్టిన ప్రవాళ ♦ వీరుధములన్
గ్రొందలిరు చేతులన్ మగ, లం దగిలిచికొంచు నిద్ర ♦ లం బడి రచటన్। ౬౩౭

తే॥ కల్లు కడవల మూఁగిన♦గండుఁదేంట్లు,నడికి రేయి వింతగఁ బొద్దు♦ పొడుచు టెఱుఁగ కుండ నిద్రించె మత్త వే♦ దండ చయము, త్రాగుఁబోతుల కరణి ని♦ద్రాళులయ్యె.

తే॥ కలఁగుచుండు ప్రోషిత భర్తృ ♦ కల మొగంబు, వోలె దీపంబు లన్నియు♦నోలిమందు ఘుండి తైలంబు కొఱఁతలే ♦ కుండియు జిగి, తగ్గి వెలవెల వాఱుచుఁ ♦ గగ్గుచుండె.

తే॥ వేకువను వికసించెడు ♦ విరిదళములు, ప్రొద్దు పుట్టియు విప్పను - పొందకుండె
సెజ్జలందు నిద్రించెడు - చెలుల నేత్ర, పద్మములు వికాసములేక - పరఁగు పగిది. ౬౪౦

తే॥ పవటియందును నిద్రింపఁ - దివురువారు, కనులఁ దెఱవరు గావునఁ - గళుకుఁగనులు
బిచ్చమిడని లోభుల యింటి_వీదితలుపు, లెపుడుమూయఁ బడెడు తీరు-నెనసియుండె

తే॥ ఒక్క రేయి ఘల్ల వియోగ-మోర్వరాక, వంత గుందు జక్కవలు రా-వణుని కరుణ
నంతరమున సుఖించు భాగ్యంబు నొంది, చెఱను విడివడు నరులట్లు - చెలఁగుచుండె

తే॥ నడుమనేర్పడు నాజ్ఞచే - నాఁడు విధుఁడు, తొలఁగ వికసింప కుండెడు-తొగలఁజేరి
యళులు గౌరవకార్యముల్-సలుపకుండు, ధనులఁ జేరు గాయకు లట్లు-దైన్యమొందె

తే॥ అర్క కిరణముల్ రత్న గ♦వాక్షములను,తూఱి మేల్కొల్ప నిద్రచేఁ ♦దూఁగి లేచు
చెలులు జ్ఞానంబుచే నిజ ♦ స్థితి నెఱుఁగక, కలఁచు నజ్ఞులవలె మూర్ఖ♦గరిమ నుండ్రి

తే॥ అసురనేతృ నాజ్ఞాబల ♦ మరయలేక, దినఫలంబులఁ దెలుపు జ్యో ♦ తిష్కసమితి
జాములం దెల్పుకోళ్లు న♦జ్ఞానదశను,మలఁగి తమకార్యములఁ దాఱు♦మాఱుగుడిచె.

తే॥ ఇట్లులోక విపర్యయ ♦ మెనయుచుండ, దైత్యవిభుఁడు రవిం గని ♦ తనమనంబు
నిప్పుచేఁ గాల్చుచున్న యీ♦నిష్కరుణుఁడు, చంద్రుఁడే యగునని పల్క♦సరసవారు.

తే॥ చంద్రుఁడీతండు గాఁడు ప ♦ చ్చని గుఱాల, తేరుగల వేఁడివెలుఁగగుఁ♦దివిరియితఁడు
కాల్చునేగాని చల్లని ♦ కైరవాప్త, కరణిఁ జల్లదనంబును ♦ కాంచఁడనిరి. ౬౪౮

తే॥ కొమ్ములంగల్గు కాటుక♦కొండఁబోలు,దైత్యవిభుఁడు క్రూరుని సూరుఁ♦దఱిమివైచి
సాగరధ్వనిఁ దొలఁగించి ♦ సంజవేళ, వెలయులేఁజందురుని వేగ ♦ పిలువుఁ డనియె.

తే॥ అశనివంటి పల్కువిని షో ♦ డశకళాప్త, పూర్ణుఁడగు చంద్రుఁడప్పుడే ♦ శీర్ణుఁడగుచు
విదియ జాబిల్లియై మింట ♦ వెలసె; దుష్ట, శాసనంబన నిట్టిదే ♦ జగతియందు. ౬౪౯

తే॥ అసురపతి కాంచియిదిబడ♦బాగ్ని యేమొ?,ధరణిమోచు శేషుని విష♦దంష్ట్రియేమొ?
కాళ నాపైన దొడ్డయ ♦ ల్కను వహించి, సంజయే కత్తిగొని యిట్టు♦ జరుగఁబోలు.

తే॥ పాలకడలి మధ్యమున నీ ♦ పద్మవైరి, మొలచినట్టి వేళనె హాలా ♦ హలము కంఠ
మందుధరియించుహరుఁడు వీఁ♦డంతకంటెఁ,గ్రూరవిషమని యేయుంచు♦కొనియెఁదలను

తే॥ అతికరాళ విషంబున్న♦ యహులయందు, పెద్దదని పిన్నదని రూప ♦ భేదమేల?
పెద్దచంద్రుఁడేపిన్నయై♦పిడుగువోలె,మిడుకు మ్రింగునప్పటికంటెఁ♦జెడఁగలేదు. ౬౫౩

తే॥ చాలుమానిసి నన్నిట్లు ♦చంపువాఁడు, లోకములఁ గాల్పఁడంచుఁబ♦ల్కుటలుతగునె?
ద్యుమణియేమేలు వీనిని ♦ క్రోవ్వుఁడింక, గుబులుకొను నిరులిప్డు క♦న్గొంద మనియె.

తే॥ అపుడు నర్వంకషంబయి ♦యంధతమము, సురుడులను గొనివస్తువుల్ ♦చూడ నగుచు

హార్యములననంఖ్యాక దీపాళులొప్ప, గాఢముగఁగ్రమ్మె దెసలెల్లఁ గానఁబడక.

ఉ॥ అక్షయవస్తు తత్త్వమది ♦ యార్యులచేఁ దగనాలకించి య
జ్ఞక్షయమొంది జ్ఞానమను ♦ చక్షువువిప్పని గ్రుడ్డివాని దు
ర్లక్షణ నిష్కృపా హృదయ ♦ రంగముకంటె మహాంధకారమే
పక్షమునందు తక్కువని ♦ పల్కఁగఁగ్రమ్మె ధరాతలంబునన్. ౬౫౫

ఉ॥ చీఁకటియన్ జముండదటు ♦ చెంది జగంబులు నిండి యందుపై
నాకస మంటఁగాఁబెరిఁగి ♦ యంతట సత్కృపవీడి మ్రింగ నీ
లోకములెల్ల వ్యర్థముగ ♦ లోగ్గడివై నశియించునంచు లోఁ
గైకొనకిట్లుతోఁడుగొనఁ - గంఠ విషంబు హరుండు గ్రక్కెనో? ౬౫౬

చ॥ హరుఁడు గ్రసించినట్టి హాల - హాలము నందిది క్రాంగియుండునే?
ధరణిని స్వర్గమున్ రసనఁ - దాఁకుచు లేహనముం బొనర్చు భీ
కర విలయాగ్ని మెండుకొని - కర్కశ రీతి నెదుర్చు చండ దు
ర్గరళము మ్రింగి నల్లనయి - క్రాలినదీ తిమిరంబు చెల్లరే!. ౬౫౭

చ॥ శరములు నగ్నియుంజొరఁగఁ - జాలని సాంద్రతమంబు లోన నొం
టరినయి యుందు నా కుఱఁగ - టన్ బయిమేఘముఁబొప్ప సాటికం
బొరయని విద్రుమంపు లత - పొందిక లే యెడనీరుకాయలం
దిరముగఁ దాల్చి చంద్రుఁగొని - దీపము నా వెలుఁగొందెఁ జూచితే. ౬౫౮

చ॥ చతురతఁ బూని చూపుఁ జొరఁ - జాలని చీఁకటిలోనఁ గుండలాల్
వితముగఁదాల్చి నల్లనగు - వేణికతో నొక చంద్రబింబ మీ
తతిఁ గనవచ్చుచున్నదిది - తన్మయరీతిని గల్గుభ్రాంతియో?
సుతనుఁడు క్రొత్తచందురుఁడో? - సుందరమీ నవ దృశ్యమేదియో? ౬౫౯

చ॥ ఉరమును పూర్తిగా నలమి - యుబ్బు పయోధరముల్ పిఱుందులున్.
మురువగు బంధురంబు నడు - ముం గనరావు నిజంబు తక్కనుం
దర తరుణాంగముల్ గని ము - దంబు గడించితి నిద్దమెల్లఁగా
గరగరికైన కాంతయయి - గట్టిగ నామది నున్నదే చుమీ. ౬౬౦

చ॥ మునుపె సమస్త లోకముల ♦ ముగ్ధలఁ గాంచితి నిట్టి రూపముం
గనివిని యుండలేదు ఘటి ♦ గల్గునె యిట్టిది వేఱొకండు? క
ల్గిన దని చూపువారెవరు ♦ లేరిట నాచెలియల్ వచించు మా
రుని తురగం బపుష్పమగు ♦ రోపము నిక్కవ మామె యామెయే. ౬౬౧

ఉ॥ ఏఁ గొను కామవేదన స ♦ హింపదు దీనిని రోసి తెచ్చె న
న్నిఁగని చెల్లె శూర్పణఖ ♦ యిందొక భేదము సేయఁ బూనునే?

వేఁగుచు నున్న నాకడకు ♦ వే చనుదెంచిన సుందరాంగి మున్
దాఁ గనినట్టిదేమొ? విశ ♦ దంబుగఁ దెల్పున కాఁ దలంచుచున్. ౬౬౨

తే॥ పిలుచుకొని రండనుచుఁ ద్వార ♦ విభుఁడు పలుక, నసుర లేగిపిల్చిన యంత ♦ నతనికులము
దుంపతోఁ ద్రెంపఁ బుట్టిన ♦ ధూర్తురాలు, మరునికాఁకతో నచటికిఁ ♦ దెరలి వచ్చె.

ఉ॥ కల్లలు నిండు మానసము ♦ కంటె భయంకర రీతిఁ గ్రాలు నా
చెల్లెలిఁ గాంచి దైత్యకుల ♦ శేఖరుఁ డీఁటెలఁ బోలి కాటుకన్
నల్లలితంబుగా నిడిన ♦ చక్షులతోడ మయూరి పోల్కి స్త్రీ
తల్లజ కానవచ్చునది ♦ ధారణి జాతమె? యన్న దైత్యయున్. ౬౬౪

శా॥ చెందమ్మిన్ హసియించు నేత్రములతోఁ ♦ జెల్వొంపుఁ గెమ్మోవితో
నందంబై తగు దీర్ఘ బాహువులతో ♦ హస్తాస్యైన కంఠంబుతోఁ
బొందంగోరు విశాలమా నురముతోఁ ♦ బొల్పైన నీలాద్రి యన్
చందం బొందిన ధన్వి యాతఁడె ఘన ♦ శ్యాముండు రాముండనన్. ౬౬౫

మ॥ తరుణీ రూపము నాకుఁ గానఁబడఁగాఁ ♦ దన్వంగి! నీకేదియో
పురుషాకారము గానవచ్చె ననుచుం ♦ బొంకాడుచున్నావె? య
చ్చెరువయ్యెన్ మనయొద్దనే మనుజు లీ ♦ జిత్తుల్ ప్రసారింతురే?
యురగశ్రేష్ఠుని యొద్దనే యెలుక మా ♦ యోపాయముల్ సాగునే? ౬౬౬

చ॥ అనవుడు నుల్కి యామెయను ♦ నన్న! మహీజ పయిం హృదబ్జముం
జొనిపితి వంత మోహమతిఁ ♦ జొక్కితి కావున నద్ది గాంచినన్
వనితగ నీకుఁ గానఁబడు ♦ వైఖరినైజము నీమనంబునం
బనుపడు కాంతయే యిపుడు ♦ భ్రాంతిని యెల్లెడఁ దోఁచు నావుడున్.

చ॥ చెలియల! ముమ్మరంపు వల ♦ చే నని పల్కితి వొప్పుకొంటి నీ
వల రఘువల్లభున్ గనెదు ♦ నగ్గలపుం బనియేమి? యన్న నా
పొలఁతియు వాఁడు నాకు నుడి ♦ వోవని దుఃఖము గల్గఁ జేయుటన్
మలఁగుదు నాఁటనుండి యవ ♦ మానము నోర్వమిచేఁ గదా యనెన్.

చ॥ నిజమొకదా! యటంచు రజ ♦ నీచర నాథుఁడు చూచి నామనో
రుజ కిఁక నేదిమందు? నను ♦ క్రూరుఁడు మారుఁడు వేఁచుచున్నవాఁ
డజితుఁడె యన్న శూర్పణఖ ♦ యన్న! కుమారిలనేల? పోయి భూ
మిజఁ గొని తెచ్చుకొమ్మిటు ప్ర ♦ మింపఁగ నేటికి నంచుఁ బల్కుచున్.

తే॥ వెడల రావణుఁ డొడలెల్ల ♦ నుడికి తెలివి, నందకుండ మూర్ఛను పొంద ♦ నచటివారు
వడఁకి రింకను మనుగడ ♦ వఱలుకతన, మరణమందఁడు నిర్జర ♦ మర్దనుండు. ౬౭౦

### రావణుఁడు శశికాంత శిలామంటపంబు చేరుట.

తే॥ చచ్చివాతఁడు బ్రదికిన ♦ చందమొంది, తెలివినంది యందున్న దై ♦ తేయులఁ గని
పితుకు పాలట్లు నీరు ద్ర ♦ వించునట్టి, చంద్రకాంతమండప మొండు ♦ నలుపుఁ డనియె.

తే॥ మయుఁడుసను దెంచియాపితా ♦ మహుఁడుసిగ్గు, పడఁగ నూహించి శిల్పంబు♦పరిఢవిల్ల
వేయి కంబముల్ నడుమను♦ వెలయునట్లు, మేటి రత్నమండపము ని♦ర్మించె నపుడు.

తే॥ కాలమున కనువయి చంద్ర♦కాంతి లేక, చెమ్మ గ్రమ్మెడు నెలఱాల ♦ చేత మీఁదఁ
గ్రిందఁ గప్పి తెమ్మెర కిటి♦కీల నుంచి, యీవిభ్రమాఁకుల యుద్యాన♦మేర్పఱిచె. ౬౨౩

తే॥ స్వర్ణమణిమయ కాంతుల ♦ జాలువాఱు, దీపములు చీఁకటులఁ ద్రోల ♦ దేవసతుల
నగల కాంతులు ప్రక్కల ♦ సొగసునింప, వచ్చె నసురేంద్రుఁ డమ్మండ♦పంబుచూడ.

తే॥ పెక్కుకోట్ల చీఁకట్లాగిఁ ♦ బేర్చినట్లు, గలిగియున్నను చెలువల ♦ చలువ గలుగు
బహుతరాస్యసుధాంశు బిం♦బంబు లచట, వెలయు కతన నా చీఁకట్లు♦ విరిసిపోయె.

తే॥ క్షోణి నిల్చిన కల్పక ♦ జ్యోతి రంగ, తరుమహోద్యుతిఁ గెంపు ర ♦ త్నముల శోభ
వలనఁ జీఁకటి మాసె ది ♦ వాకరుండు, పోయియును రేయి కాదయ్యె ♦ భూరికాంతి.

తే॥ అవయవంబులు వివశత్వ♦మంది తన్నె, యటకుఁ గొనివచ్చు చేష్టల ♦ నరయలేక
పూర్వభవ వాంఛ తజ్జన్మ♦మునను పడయు, రహిని నూత్నస్థితిం బొందె♦ రావణుండు.

తే॥ జగముఁజల్లఁజేయఁగఁగోరి♦జలధికిదిగు, మొగులుగములపోల్కిఁ దెంట్లు♦ముసరుచున్న
పసిఁడి తరువుల చివుళులఁ♦బ్రసవములను, పఱచు పానుపుపైఁ జేరెఁ♦బంక్తిముఖుఁడు

తే॥ అందు మదనుండు తనకు ద♦శాస్యుఁ బట్టి, విందుగాఁ బెట్ట నమృతంబు ♦ విధిని వెడలి
యసువు లొసఁగు నేరుపరి మం♦దానిలుండు, కోమల కొప్పుల విరితావిఁ♦గూడివచ్చె

ఆ॥ కాపురించు నింటఁ♦గాల సర్పము చేరు, పగిది వచ్చు మంద ♦ పవనుఁ గాంచి
కోప చండరక్త ♦ ఘూర్ణ నేత్రుండయి, సేవకులను పిలిచి ♦ చీఁదఱగొని. ౬౩౦

ఆ॥ పొంగి కూప జలము ♦ భువనంబులను ముంచి, నట్లు నన్ను పవనుఁ ♦ డలఁచె నిటకు
నేలవచ్చె నాజ్ఞ ♦ నెనయక? వానిని, పట్టి తెండటంచుఁ ♦ బదరి పలికె. ౬౩౧

తే॥ వారు వాయుదేవుని గొని♦వచ్చు నంతఁ, బండ్లు గొఱుకు చుఱిమి మంద♦పవనమునకు
మేలి గుణమేల యీవన ♦ మీఱలిట్టి, తగవు నొంది దానిని తిట్టఁ ♦ దగవె? యనుడు.

తే॥ వాయుదేవుని కోపించి ♦ ఫలములేదు, సీతకృప నొందనేని ప ♦ రేతరాజు
చేరుఁ గానఁ గష్టవిముక్తి ♦ చెప్పఁ గలుగు, ననుఁగుమంత్రులఁబిలుఁడని♦ యాజ్ఞచేసె.

క॥ వారలు పిలిచిన వెంటనె, వారణములఁ బల్లకీల ♦ వాగువములఁ బెం
దేరుల నెక్కి భువిం దివి, వారలు శంకింప వచ్చి ♦ వ్రాలిగి పెలుచన్. ౬౩౪

## రావణుఁడు మారీచుఁ గాన నేగుట

క॥ వచ్చిన మంత్రులతోఁ దగఁ, జెచ్చెర యోచించి తెలిపి ♦ చెడి మారీచుం
డచ్చుగఁ దప మొనరించెడు, నచ్చటికి దశాస్యుఁ డరిగి ♦ యతనిం గాంచెన్. ౬౮౫
తే॥ పంక్తి వదనుఁడు రాఁగాంచి ♦ భయము వలన, వడఁకి కొంకుచు నెదురేగి ♦ వానిఁదోడి
తెచ్చి మర్యాద గావించి ♦ తెలచి యతని, వదనమునఁ జూడ్కి నిల్పి తాఁ ♦ బలికెనిట్లు
తే॥ కల్ప వృక్షంబు నీడను ♦ కాంతుఁ దిరుగు, నింద్రునకు యమునకు నోట ♦ యెదుగునట్లు
పాలనము సేయు దేవ! యీ ♦ వనికిఁ బేద, కిరణి నరుదుగ వచ్చిన ♦ కార్యమేది? ౬౮౬
చ॥ అనవ్రుడు రాగఁ దగ్గ యవి ♦ యైనవి ప్రాణముతోడ నుండియుం
బనవెడఁ గిరితోఁ బరువు ♦ మాసెను వేల్పులఁగాంచి యింక సి
గ్గునఁ దల వంపఁగా వలసె ♦ ఘోరతరంబగు నింద నేఁటికిన్
మనుజులవల్ల వచ్చె నిఁక ♦ మానము వోనది యెట్లు చెప్పుదున్? ౬౮౭
చ॥ బలయుతులైన మానవులు ♦ బాహుమదంబున ఖడ్గమూని య
మ్ముల చెలు నీదు కోడలికి ♦ ముక్కు సెవుల్ మొదలంటఁ గోసి రి
ట్లలమిన నిందకంటె ఘన ♦ మా నపదూఱు మఱొండు గల్గునే?
యిలను ప్రసిద్ధమైన మన ♦ యిద్దఱ యన్వయ శీలముల్ చెడెన్. ౬౮౮
చ॥ ఒక మనుజుండు చేత ధను ♦ వూని రుషా విపరీత చిత్తుఁడై
యకట! నిశాచరావళుల ♦ నాయువు ద్రుంగి ఖరాదులన్ సుర
ప్రకర జయేందిరా కచభ ♦ రంబు గ్రహించిన యానరాదులన్
గకవికఁ చేసి చంపె ననఁ ♦ గా మన జన్మము లేల కాల్పనే? ౬౮౯
ఉ॥ కాఁక యడంప లేక మది ♦ గాసిలి దూపిలుచున్న నేను నా
కాఁక యడంగ నీచులను ♦ గ్రచ్చుఱఁ జంపఁగ సాటికామి య
ట్లూఁకువ సేయుకుంటిఁ దమ ♦ యొద్ద వసించు మడంతి మిన్నఁ గొం
చాఁక నడంచి నిందను న ♦ యంబునఁ ద్రోవఁ దలంచి వచ్చితిన్. ౬౯౦
చ॥ అని దనుజేంద్రుఁడాడఁ గొడు ♦ పగ్గిని గాల్చె దిటన్ శ్రవంబులం
జొనిపిన యట్లుగాఁగ మది ♦ స్రుక్కి యిసీ యని యాశ దొడ్డదే
యని విలయంబు తప్పదని ♦ హా వడిరా య్యని యోటలేక యి
ట్లని వచియించె నాతఁడు న ♦ యంబున మేను మనంబు కంపిలన్. ౬౯౧
ఉ॥ ఆయువు నొల్లవేమి? మతి ♦ నక్కట పంకము నందు ద్రొక్కితే?
యీ యపమార్గ మిట్లు వడి ♦ నెవ్వరు నీకనుకూలశత్రులై
తీయని పల్కులం గఱపి ♦ తీర్చిరి? నీ తలవ్రాఁతయే చుమీ
వేయున నేల? యేను బలు ♦ వీఁడెడి నె నను మేలు సెప్పుదన్. ౬౯౨

ఉ॥ త్రెంచిన చేతులం దలలఁ ♦ ద్రిక్కుటి చేతుల నందికొంచు హో
మాంచిత కుండమందిడి యు ♦ మాధిపుఁగూర్చి యనేకవత్సరాల్
కొంచక నిద్ర యోగిరము ♦ గోరక చేసి తపంబు సంపదం
గాంచితి లోకనింద గొని ♦ కాంచఁగ శక్యమె యిట్టి సంపదల్? ౧౯౪

ఉ॥ పాపగుణంబుచేన? మఱి ♦ పావనమైన గుణంబుచేతనా?
యీపగిదిం దపంబు ఫలి ♦ యింప సు సంపద నీవు పొందుటల్?
కోపము మాని పల్కు మిది ♦ క్రూరగుణంబున నొంది తేమి? యు
ల్లోపునఁ గీడు చేసికొని ♦ యెల్ల నశింపఁ దలంపు గొంటివే?. ౧౯౫

చ॥ దుడుకున మిత్రరాజ్యమును ♦ దొడ్డ యొనర్చిన, ధర్మ మార్గముల్
చెడ వలపక్షమూని సభ ♦ చేసిన, మోసముతో గృహస్థులన్
గొడవల నొంచి తత్కుసుమ ♦ కోమలులం జెఱ గొన్న, ధర్మమే
మడియఁగఁ జేయు; నెవ్వరిల ♦ మాఁడక నిల్చిరి దుష్ట వర్తనుల్? ౧౯౬

ఉ॥ నాక విభుం డహల్య వల ♦ నం బడరాని యసహ్య దేహముం
జేకొనె నింద్రుఁ బోలిన ప్ర ♦ సిద్ధు లిఁకెందఱో కామపీడచేఁ
గైకొనినారు చేటులు ని ♦ కంబుగ లక్ష్మిని పోలి యెందఱో
నీకు సతుల్ గలారు వగ ♦ నెక్కొన నీ మతి మానె నేమనన్?. ౧౯౭

ఉ॥ కాదని పూనితేని చెడు ♦ కావలముల్ గడు దుఃఖు గాక వే
ఱేదియుఁ గాంచలేవ యెల ♦ యించి ఫలంబును పొందితేనియున్
సాదుల శాప సన్నిభ వృ ♦ షత్కములన్ రఘురామ భూవరుం
డే దమియించు నీదయిన ♦ యిద్ధ బలంబు కులంబు సర్వమున్. ౧౯౮

ఉ॥ నీదగు సేనకంటెఁ గడు ♦ నేర్పున లావున మేటి యంచు సం
పాదితకీర్తి మోచిన య ♦ వారణ సైన్యము తోడ నా ఖరున్
మేదినిఁగూల్చె నొక్కఁడె ని ♦ మేషము లోన, సమస్త దైత్యులన్
మోదముతో వధింప మదిఁ ♦ బూనిన వాఁడది నీ వెఱుంగవో?. ౧౯౯

ఉ॥ రావణ! నీయనుంగుల వి ♦ రాధునకంటెను శూరుఁడున్నె? వాఁ
డేవగ రామ బాణ హతి ♦ నీల్గె నెఱుంగవె? యింక నే విధిం
బోవఁగ వచ్చు నంచు మదిఁ ♦ బ్రుంగుచు నుండుఁ జెడంగనేల? నే
నే విధముల్ వచించినను ♦ వీనుల కెక్క దిదేమి తెల్వియో? ౨౦౦

చ॥ మడిసిరి నిన్ను మించిన స ♦ మానులు దైత్యులు చావఁగోరి చే
సెడి పనిచేయఁ బూనకుము ♦ చేసిన నాయువు మాయు టబ్రమే?

పుడమి మఱెందఱెందఱొ ప్ర ♦ పూర్ణ బలంబున నేలినారు పెం
దుడుకులు చేసి భూస్థలిని ♦ ద్రుంగిరి వారలఁ బల్కు మొక్కరీ. ౭౦౧

శా॥ తమ్ముం డైన సుబాహువుం జనని దో ♦ ర్దండ ప్రభావుండు నా
కమ్ముం గూర్చినదాది దైత్యబలముల్ ♦ గగ్గోలుగా వారి నా
మమ్ము ల్విన్నపుడెల్ల నామనము కం ♦ పంబొందుఁ గాఁబట్టి యే
నిమ్మార్గంబునఁ గుందుచుందు దనుజా ♦ధీశా! పరీక్షించితే? ౭౦౨

తే॥ భువిఁ జరాచరములు నిల్క ♦ బొందవనుచు, నిజము దెలిసితి మసురేంద్ర! నీవు దుష్ట
చేష్టలను మాని యున్నట్టి ♦ శ్రేష్ఠమైన, సంపదలఁ బొందు నామాట ♦ చక్కవినుము

మ॥ అన దైత్యేంద్రుఁడు శంభుఁ దారగిరి లీ ♦ లాంకంబుగా నొక్కచే
మొనయం దాల్చిన నాబలంబు చులుకం ♦ బోనాడుచుం మర్త్యు నొ
క్కని నాముందఱ నొప్పవాఁడనుచు నీఁ ♦ కం బల్కుచున్నాఁడవా?
యనుచుం భ్రూకుటి భీకరంబుగను మా ♦ యావిం విలోకించుచుం.

చ॥ నడచిన కార్యమింతయు మ ♦ నంబున నెంచవు నామనస్థితిం
బెడిసి పడంగఁ దిట్టితివి ♦ వీకునఁ జెల్లెలి ముక్కుగోయు నా .
దుడుకరుల న్నుతించితివి ♦ దోసము నొందని వారలంచు నీ
బుడి బుడి మాటలం సయిఁపఁ ♦ బోలునొకో మఱినీవ చెప్పుమా?

మారీచుఁడు రావణునకు నీతి కఱపుట

ఉ॥ అని లంకేశుఁడు కోపిమై పలుకు ప ♦ ల్కాలించి మారీచుఁ డిం
కను తాఁబల్కిన మండి దూఁకునని య ♦ ల్కంబోక తానిట్లనుం
నను కోపింపఁగ లేదు నిన్నును భవ ♦ న్నందరం భవద్వంశమున్
ఘన కోపంబునఁ ద్రుంగఁ జూచితి వపా ♦ ఖ్యం దాల్తువే నీతలం?. ౭౦౬

ఉ॥ ఎక్కడుమన్న భార్గవుని ♦ యేడ్తెఱఁ గ్రుంగఁగఁ వంచు శైలముం
బెక్కువ రాట్నభం విఱిచి ♦ పేర్చిన శైలము నెంచి చూడ నీ
వెక్కటి నెత్తినట్టి పర ♦ మేశ్వరు శైలమొ? మేరు శైలమే?
మిక్కిలి యాకసం బొరయ ♦ మీటిన వింధ్యమొ? నీవ చెప్పుమా?. ౭౦౭

ఉ॥ కానవు రాముసత్త్వమును ♦ కాంచి వచించిన నా నయోక్తులం
వీనులఁ జొన్పవుం జెడెదు ♦ వీరవరేణ్యుఁడు కేలఁ జాపముం
బూనక మున్నె ప్రాణములు ♦ పోవుట నిక్కము మూర్ఖబుద్ధిచే
జానకిఁ గాంతఁగాఁ దలఁతు ♦ జానుగ రాక్షస పాప రూపమా. ౭౦౮

ఉ॥ చుట్టలతోడ నంయమనిఁ ♦ జొచ్చుట నిక్కవమంచుఁ దప్పెటం
గొట్టిన రీతి గుండియలు ♦ గోడుగఁ బాడుగఁ గొట్టుకొంట నీ

పట్టునఁ గానవేమి? విష ♦ పానముచేసెడు వారిఁ గాంచి యు
స్పట్టున నున్న వారదియు ♦ భావ్యమెయంచు వచింపఁ బోలునే?. ౧౯౯

ఉ॥ భూపకుమారకుం బ్రియము ♦ పొందునఁ గౌశిక మౌని మెచ్చి నా
గోపమమైన దివ్య విశి ♦ ఖోత్కర మిచ్చెఁ దదస్త్రజాలముల్
లోపము లేని కోపమునఁ ♦ లోఁగొనఁ జాలు క్షణంబులోన న
ప్రోపరిలోకముల్ మహిమ ♦ నున్నతి నొందిన యా త్రిమూర్తులన్. ౨౦౦

చ॥ అమిత బలంబునం జయము ♦ నందిన యర్జును వేయి చేతులన్
సమితిని ద్రుంచి కూలిచిన ♦ క్షత్రియ భీకరు జామదగ్న్యు చా
పమును జగంబు జేయఁగ ♦ వంచిన రాము నమోఘబాహు న
త్త్వము మన చేతులం గలదె? ♦ తత్త్వమెఱుంగక మాటలాడెదే? ౨౦౧

ఉ॥ కామవిషంబు దేహమును - గాసిలఁజేయఁగ బుద్ధిమాలి నీ
వీమెయి దుష్టవాక్కు-వచి - యించితి చేటును దెచ్చు నాయనా!
మామను నీకులంబునకు - మాన్యతఁ గూర్చెడువాఁడ నీతలం
పోమక యద్దు పల్కెనని - యుగ్రత నొందక వీడు మీ పనిన్. ౨౦౨

ఉ॥ నీచపథంబు మాను రఘు - నేతృబలంబు దలంపుమన్న మా
రీచుఁ దిరస్కరించి వల - రెక్కను రావణుఁ డిట్లు పల్కె నో
యీ! చతురాగ్రగణ్య! జన ♦ యిత్రి వధించిన మానిసీనికిన్
శోచితరీతి జంకు నిను - శూరుఁడవంచుఁ దలంపఁ జెల్లునే? ౨౦౩

। దిక్కరు లొగ్గి డాఁగికొన - దివ్యులు నిల్కడఁ దక్కి పాటి లో
స్రుక్కఁగ ధూమధామముగఁ - జుమ్మలు చుట్ట దివంబుఁ గాల్చి పే
రుక్కున ముజ్జగంబుల మ - హోన్నతి నాజ్ఞలఁ జెల్లనిచ్చు నే
నెక్కడ? తుచ్ఛులౌ మనుజు - లెక్కడ? నన్ను జయించువాఁడనో? ౨౦౪

। త్రిజగము లందు నన్నెదురు - ధీరులు లేరటు గల్గిరేని నా
భుజముల తీఁటవో నడుతు - మోదము దీనికి మించి కల్గునే?
గుజగుజ పోక నాముదలఁ - గూర్చెడు మంత్రుల ధర్మపద్ధతుల్
నిజముగ దాఁటిపోవుటయు - నీతియె? చెప్పిన యట్లు చేయవో? ౨౦౫

త్రోసి తొలంగి పోయినను ♦ ద్రోవక నీశిర ముత్తరించి నా
యాసను నేనె పూర్తిగ ర ♦ యంబునఁ గాంచెదఁ గాక మాన మ
న్నాన వహించితేని బదు ♦ లాడక ప్రాణము నోలుపోక యు
ల్లాసముతోడ నాదగు త ♦ లంపు ఫలింపఁగ నిల్చుమా యటన్: ౨౦౬

చ॥ కరఁగిన రాగిపైఁ జిలుకు ♦ కంబుకణంబన క్రుక్కిక్రుంగి ట
క్కరియగు తాటకేయుఁ డెద ♦ గర్వము నిండిన వారు నాశముం
బొరయుట నిక్కువంబు తమ ♦ పొందఁగఁ గోరిన కార్యమెల్ల నా
గరువము చేతనే ఫలము ♦ గాంచెద మంచుఁ దలంతు రిమ్మగన్. ౭౧౭

ఉ॥ నీపని చూచి యే నిచట - నిక్కపు సంస్థితి చెప్పఁ బూనితిన్
నాపని గాంచి యే భయము - నం బడి పల్కఁగ లేదు నాశమే
చేపడువేళ మంచియును - చెడ్డఁగఁ దోఁచుట నిక్కమల్ప బు
ద్ధీ! పనియేమి సత్వరము - తెల్పుమ యంచు వచింప నుబ్బునన్. ౭౧౮

చ॥ కవుఁగిలి గొంచు రావణుఁడు - కాఁకఁ తొలంగఁగ నోయి మామ! నేఁ
డిపిరి యనంగు నస్త్రమునఁ - బ్రెల్లటకంటెను రాము తూపుచే
భువిఁ బడుటెన్న భావ్యమని - పూనితి మందసమీర వైరమున్
దవిలిచి నట్టి సీతను ము - దంబుగ నాకు నొసంగుమా యనన్. ౭౧౯

తే॥ సిగ్గు చెడఁగఁ దపోవనిఁ - జేరి మున్ను, రామ దివ్యాస్త్రనితతిచే - రాక్షసులును
సోదరుఁడు చావ భయమున-సురిఁగి పాఱి, వచ్చినట్టి నేనిప్పుడే-పని యొనర్తు? ౭౨౦

చ॥ అని మరణంబు నోటమియు ♦ నప్పుడ పొందిన యట్లు తాటకా
తనయుఁడు పల్క రావణుఁడు ♦ తత్తఱ నిట్లనుఁ జింతయేల? నీ
జననిని చంపు దుర్జనుని ♦ చంపఁగ నాయిత మైతి మేటి వం
చనమున సీతఁగైకొనుటె ♦ సమ్మత మిప్పటి కార్యమా నన్. ౭౨౧

చ॥ వెనుకను పోవుటేమి? బల ♦ వీరుని రాముని సుందరిం దురం
బున విజయంబు నంది కొను ♦ పోఁడిమి మెచ్చుగుఁ గాక వంచనన్
గొనుటది యెల్లిదంబుగద ♦ ఘోరరణంబున నీ పరాక్రమం
బును వెలయింపుమా యశము ♦ భూమిని నింపుము యన్న నవ్వుచున్

తే॥ వారల జయింప సేనలు - వలయునేమి?, ప్రస్ఫుతచంద్రహాసముచాలు-వారుమడియఁ
దెలివయునుచచ్చుఁగాన నా- తెఱఁగువీడి, మాయఁగైకొంధమనిదైత్య-మల్లుఁడనుడు

మ॥ ఇనవంశోత్తము దారఁ దాఁకుటకు ము - న్నే వీని మూర్ధంబు లా
తని బాణంబులఁ ద్రెవ్వకున్నె? యనునా - తత్త్వంబు యోచింప నా
కును తద్భూమికిఁ నేగి క్రమ్మఱుడు ల - గ్నం గలునో? కల్గదో?
ఘనమా నావిధి యెట్టిదో? యనుచుఁదాఁ - గర్తవ్య మూహించుచున్.

మారీచుండు మాయా కురంగమై చనుట

తే॥ ఆజ్ఞ యేమని మారీచుఁ - డడుగ దైత్య, విభుఁడు బంగారు జింకవై - వెడలి సీత
యాస పడఁ జేయుమని పల్క - నతఁడు వోయె;వింశతిభుజుండు వెడలెను- వేఱుత్రోవ.

తే॥ మునుపు రామబాణబలంబు-గనుటవలనఁ, దానుగాఁగాక ప్రభుని ప్రోత్సాహమునను
జింకరూపొంది పోవఁ ద-చ్చిత్తవృత్తి, యెట్టులున్నొ? యూహించియు-నెఱుఁగుటరిది.

క॥ కల బంధువులను చావం, గల వీరులఁ దలఁచి క్రొంకి కళవళపడుచున్
మిలు విషజలములఁ దెరలెడు, లలిఁ దెరలుచు మేనువడఁక లావటి క్రుంగున్. ౨౨౭

తే॥ మునిముఖంబును చెఱుపంగఁ-బోవునాఁటి, నుండి శోకించి నిలుకడ - నొందలేక
మూఁడవ తడవ మరణింపఁ - బూనిరాముఁ, జేరె సింగంపుగుహ దంతి-చేరునట్లు. ౨౨౮

క॥ మెఱుపులు భువిదివిఁ దోఁపఁగఁ, బారి నభిమానంబులేని - భూరిమయంబౌ
హారిణాకృతిఁ గొనిసీతా, హారిణాక్షి చరించుతావు - నరయుచుఁబోయెన్. ౨౨౯

తే॥ జింకలను గన్నవారలు - జింకకంటె, నరయుబంగరు జింకసౌ - ర్రరసి యెడఁద
లఁటులేని వేశ్యల చూపు-లనెడివలలఁ, బడినవడువునఁబడ జింక-వచ్చె నటకు. ౨౩౦

తే॥ అసదు లేనడు మల్లల - నాడుచుండ, శ్రమను నడచుచు మృదులహ- స్తంబులనెడు
కోయఁబడనిపుష్పములతోఁ-గుసుమచయము, గోయుచుండెజానకియటఁ-గూర్మితోడ

తే॥ తలఁపఁ దరమయ్యెఁగాని చం - దంపురూపు, చెన్నఁటులునిద్రలోఁగాంచి-రన్నపగిదిఁ
నెన్నరాని దుఃఖములోంద - నున్న సీత, గాంచె నచ్చెరువందె బం - గారు జింక.

మ॥ దశకంఠుండును వాని జీవితము ను - ద్యద్భోగ భాగ్యంబులున్
నశియింపం దఱియౌట ధర్మము ప్రస - న్నత్వంబు కా నుండుటన్
విశదప్రేక్షణ సీత మున్నెపుడుఁ బ్రా - ర్థింం గాన కున్నట్టి రూ
పశరీరంబుల నొప్పు జింకను మదిన్ - వాంఛించెఁ దా బేలయై.

క॥ తరళాక్షి ముదురు టాసను, హారిణంబును పట్టి యీయ - నడిగెద ననుచుం
ద్వరపడి పూవులు చిందఁగఁ, బరువున రాఘవుని కడకు - వచ్చె నయము మై. ౨౩౪

తే॥ కాళ్లు చెవులును మాణిక్య - కాంతి గలిగి, మేను బంగరు చాయయై - మెఱుఁగుచేత
గగనము వెలుంగఁ జేసెడి - సొగసు గులుకు, లేడిగలదు కాంతురు రండు -లీలననఁగ.

క॥ సీత యిటుపలుక నదియే, జాతిది యటువంటి లేడి - జగమునఁ గలదే?
భ్రాంతి యని తలఁపకెంతయు, నేతేరఁ దలంచె రాముఁ - డింతి పిఱుందన్ ౨౩౬

ఆ॥ సీతయాస గొనిన - చేష్టచే నాజింక, యెల్లబోఁటి గామి - యెఱుఁగకుండ
వెడలఁ దలఁచుచున్న - విమలాత్ము రాముని, లక్షణంబుగాంచి - లక్ష్మణుండు. ౨౩౭

## లక్ష్మణుఁ డది రాక్షస మాయ యనుట

క॥ కరచరణంబులు వాలము, నరుదగు రత్నములఁబోలి - హైమాంగంబౌ
హారిణంబు గలదె ధరణిని, సురవైరుల మాయయనుచుఁ - జూచెద ననుచున్. ౨౩౮

క॥ రాముండిట్లను లక్ష్మణ!, భూమిని పలుకోట్లు రూప - ములు పలుతీరుల్
నేమమున సకలమెఱుఁగఁగ, లేమిటు లననేల? వింత ♦ లేదనఁదగునే? ౨౩౯

తే॥ ఏమితలఁచి తో కేరీతి ♦ నెనయుచుండు, నవయవంబుల సూటిగా ♦ నరయు దేని
సూక్ష్మభేదముల్ దెలియుట ♦ చూడలేవె?, యేడు పైఁడిహంసలుపుట్టు ♦ టెఱుఁగవేమి?

తే॥ లెక్కలేని ప్రాణులలోన ♦ నొక్కతీరు, నొక్క యంతంబు లేదను ♦ చుండు నంత
మీఱు మాటాడుచుండ బం ♦ గారు జింక, దూరమేగునో యని సీత ♦ తొట్రుపడియె.

చ॥ అటువలెఁ ద త్తఱిల్లు జన ♦ కాత్మజ చిత్తమెఱింగి రాముఁ డం
తటఁ గుటిలాలకా! పడుము ♦ తక్కక కాంతమ యంచు నేగ సం
కటమున లక్ష్మణుండు వెను ♦ కం జన దాఁటఁగ రాని దయ్యమై
తటుకున వచ్చి యెట్టెదుట ♦ దంభముతోఁ గనుపట్టె లేటియై. ౨౪౨

ఉ॥ తమ్మునె కాంచు జింకఁ గని ♦ తామరసాక్షిరో! దీనిఁ జూడఁ జి
త్తమ్మున నేమియుం బలుక ♦ దాకొన దియ్యది మంచిదే యనెన్
వమ్మగు నేమి? దేవతల ♦ ప్రార్థనముల్ సుకృతమ్ము శేష త
ల్పమ్మును వీడి యీధరణి ♦ భారము దీర్పఁ దలంచి వచ్చుటల్. ౨౪౩

ఉ॥ దీనిని చూడు వత్స! యిది ♦ దేనిని పోలును? ధాత్రి సాటియే
గానము ముత్తెమట్లు రద ♦ కాంతులు గ్రమ్మను శాద్వలంబుపై
నానెడు నాల్క మించు దొర ♦ యం దగు దేహము మేలి హేమముం
బోనిది మచ్చలెన్నఁ గవి ♦ పుత్త్రిని జోతి సధఃకరించెడిన్. ౨౪౪

ఉ॥ ఈ హరిణంబుఁ దేఱి కను ♦ నింతులకున్ మగవారి కింత సం
దేహము లేక డెందములు ♦ దీనిపయిం జొరఁ బాఱకుండునే?
యూహలు లేచుచున్ మిడుత ♦ లేపున దీపముఁ జేరు పోలికన్
దోహలమందుచున్ వడిగ ♦ దొర్లుచుఁ బోవుచునుంటఁ జూచితే? ౨౪౫

ఆ॥ అన్న యట్లు పలుక ♦ నాజింకఁ గని యిది, మంచి గాదటంచు ♦ మదినెఱింగి
తమ్ముఁడనియె దీనఁ ♦ దనరు ఫలంబేమి?, మరలి చనుట యింక ♦ మంచిదనుచు.

ఉ॥ లక్ష్మణుఁ డిట్లు పల్క శుభ ♦ లక్షణ లక్షిత సీత, యీ లస
ల్లక్ష్మము లొప్పు లేడిఁ బది ♦ లంబుగఁ బట్టి యొసంగఁ జూప జి
త్వక్ష్మలులైన సోదరుల ♦ భావము లూర నయోధ్య కేగి యో
సూక్ష్మమతీ! విరామముల ♦ సొంపుగ నాడుకొనంగ నిమ్మగున్. ౨౪౬

చ॥ అనవుడు నట్టి తెత్తు నను ♦ నంత విచక్షణ దక్షుఁడైన ల
క్ష్మణుఁడు వచించు నార్య! యది ♦ కర్బుర మాయ దురాత్ములైన యా

దనుజులు ధర్మపద్ధతిని ♦ తప్పి చరింతురు వారి మాయలం
దున నిదియొక్కటి యనుచుఁ ♦ దుట్టతుదం దెలియం గలారనన్. ౨౪౮

ఉ॥ తమ్ముఁడ కన్న యిట్టులను ♦ దైత్యుల మాయయయైన మేలె యీ
క్కమ్మనఁ గూల్చి వచ్చెద ర ♦ యమ్మునఁ బట్టిన ధర్మమున్ ఫలం
బిమ్మెగఁ గాంచు నిక్కముగ ♦ నేనమయుని గ్రహించి తెత్తు రెం
టమ్మన కేమియుం జెడుగు ♦ డాయదు నీవ తలంపుమా యనన్. ౨౪౯

ఉ॥ దీనిని మున్నుగాఁ బనిపి ♦ దీని పిఱుందన నిల్చువారలే
వైనము వారలో? మఱియు ♦ వారల మోసములెట్టివో? యిటుల్
దీనిని పంప నేలొకో? మ ♦ దిం దలపోయ నశక్యమయ్యె దు
ర్మానులు రోయు వేట కొల ♦ మాత్రమ కా దగచాట్ల నిచ్చునా. ౨౫౦

చ॥ దనుజులు వైరులంచు బహు ♦ ధర్మవిదూరులె యంచు మాయలం
బనుపడు వారలంచుఁ దగఁ ♦ బల్కుచుఁ బూను వ్రతంబు వీడఁగా
జనములు నవ్వరేమి? యిటు ♦ జంకుట త్వాత్కుల ధర్మమేమి? యి
ట్లును బలు మంచిదే యగు వి ♦ లోలత తోలని రాముఁ డాడఁగన్. ౨౫౧

ఉ॥ డాసిన కార్యముల్ తగ నె ♦ డంద విచారణచేసి చేతయు
ద్భాసిత రీతిఁ గాలు రఘు ♦ వర్య! మృగంబు పిఱుంద నెట్టి రా
క్షసులు నున్న మచ్చర వి ♦ ఘర్షణ వారల యుక్కడంతు నా
శ్వాసము చెందుఁ డీ రది ని ♦ జంబగు లేడియయేని తెచ్చెదన్. ౨౫౨

మ॥ అని సౌమిత్త్రి వచించుచుండ నమృతం ♦ బంగారఁగా నొల్కుఁ ప
ల్కున ముద్దై తగు చిల్కవోలె వదరెం ♦ గొంచించుచున్ సీత యి
ట్లనుమానించుచుఁ బట్టి యీయరు గదా ♦ యంచున్ విమోదంబుతోఁ
గనులన్ ముత్తెము లట్లు బాష్పకణముల్ ♦ గ్రమ్మన్ వెనన్ గ్రమ్మతెన్.

రాముఁడు మాయాహరిణము వెంట నంటుట.

చ॥ చనవు మెయిం గనుంగొనుచు ♦ సాగిన జానకిఁ గాంచి రాఘవుం
డను ననుజా! కురంగమిపు ♦ డయ్యలివేణికి నేనె నెవ్విధిం
గొని చనుదెంతు నిచ్చటనె ♦ కూరిమితో సతిఁ గాచియుండు మం
చు నిశిత బాణముల్ ధనువు ♦ సొంపుగఁ దాల్చిచనెన్ వడిన్ వడిన్. ౨౫౪

తే॥ మున్ను వేల్మిఁ జెఱుపవచ్చు ♦ మువ్వురంము, తప్పిపోయిన ♦ వాఁడని తలఁతు వీని
మొగిని గమనింపు మని శేలు ♦ మోడ్చి పలికి, లక్ష్మణుఁడు పర్ణశాల వెలుపలనె నిల్చె.

తే॥ అరసి లక్ష్మణుఁ డనుమాట ♦ నాదరమునఁ, గొనక జానకి కై కొన్న ♦ కోపమునకు
మందహాసంబు గొని మఱు ♦ మాయజింక, వెంబడించెను సుందర ♦ వీరవరుఁడు.

మ॥ నేలను నిల్చుఁ జింక మెడ ♦ నిక్కఁ జివుక్కున దాఁటు నింగికిన్
లీలను నేలఁ ద్రవ్వు ఖుర ♦ ళించిన తీరున దూఁకు డాయఁ బెన్
గాలి మనంబు వేగిరము ♦ గాఁ జను రీతికిఁ గ్రొత్తమార్గము
వ్వేళను నేర్పఁ బాదములు ♦ పేరురముం దగులంగఁ బర్విడున్. ౭౫౮

ఉ॥ చాఁచుచు నెత్తి యీభువన ♦ జాలముఁ గొల్చిన పాదసత్త్వముల్
భూఁచి వచింప వేఱొక యి - పూర్వ భగోళము గల్గునేమొ? తా
నేఁచఁగ నేగినంత వడి - నేగెను జింకయు నింతమాత్రమే
తోఁచును నాఁటి వేగమున - తోరము దెల్ప నశక్యమేరికిన్. ౭౫౯

తే॥ కొండలెక్కు మేఘంబులఁ - గ్రుంకువెంటఁ, జేర దూరమేగును తామ - సింప డాయ
నిలిచి యున్నట్లు కనఁబడి - తొలఁగిపోవు, పైఁడి యాన వేళ్యల మది - పాఱు నట్లు.

చ॥ తొడఁగిన దొక్కచో తుదిని - దోఁచిన దొక్కటి యయ్యో మున్ను త
మ్ముఁడు తలపోసినట్టి తలఁపుల్ తగ నామదిఁ దోఁచియున్న ని
క్కడ కిటురాను వట్టిశ్రమఁ - గర్బుర మాయలఁ జిక్కి పొందితిన్
దడయఁగ నేలొకో సదమ - దం బొనరించుట మేలు చూడఁగన్. ౭౬౦

తే॥ వీఁడు మాయావి చేపడు ♦ వాఁడు కాఁడు, చెండుటే కార్యమనుచు నం♦సిద్ధుఁడైన
రాము మదినెఱిఁగిన వాఁడు♦రయముమీఱ,మాయ నెగిరెను నింగిని♦మఱుఁగుపడఁగ

తే॥ రాముఁడాక్షణమందె చ ♦ క్రంబు రహిన, మోఘశరమొండు సంధించి♦మోసగాఁడు
పోవుచోటికి వెంటాడి ♦ పొరిగొనుమని, నారి తెగ దీసి పఱపె న ♦ న్నారసంబు. ౭౬౧

తే॥ ఆ శరంబు మాయావి యు ♦ ర్మ్మంటఁ దాఁకెఁ, దాఁకినంత నోరు దెఱచి♦దశదశలను
దాఁటిచన లక్ష్మణా! యంచుఁ♦దద్ద యఱచి, ప్రాణములువీడి మారీచుఁ♦డవనిఁగూలె

తే॥ నిక్కువపు రూపమునపోఁకు♦నీల్గఁగాంచి, తమ్ముఁడలఁచినయాతఁడు జాణ♦తారకముగ
వెంట వచ్చునతఁడు ప్రోడ♦వేయునేల, ప్రాణసముఁడు నేర్పరి యని♦హర్ష మొందె.

తే॥ దిక్కులదరంగ నఱచుచుఁ ♦ దీఱె కూలు, నీచుదేహంబు నచ్చట ♦ నిలిచిచూచి
మున్ను కౌశిక యాగంబు ♦ పూనిచెఱుప, నరుగుదెంచు మారీచుఁడే♦యని వెలింగె

తే॥ శరముఱొమ్మునఁనాటఁగ ♦ శ్రమమునొంది, మడియుచోదైత్యుఁడొసరించు ♦మాయ
నాదు కంఠంబుతో లక్ష్మ♦ణాయటంచుఁ,బిలిచె నదివిని మైథిలి♦కలఁగునేమొ?.[యందు

చ॥ పిలుపు నిజంబు కాదనుచు ♦ వీఁడెడి దైత్యుఁడు పల్కెనంచు పల్కు
దెలివిని నాకు హెచ్చరిక ♦ దెల్పిన తమ్ముఁడెఱింగి తెల్పఁగా

నలమట వీడి సీత హృద ♦ యంబున నూఱట చెందు నంచుఁ దాఁ
దెలిసి యొకింత నెమ్మది గ ♦ దించె మదిన్ రఘురాముఁ డయ్యెడన్. ౭౬౭

ఉ॥ చావఁదలంచి వచ్చిన ని ♦ శాచరుఁ డీతఁడు గాఁడు మద్గళా
రావము వోలెఁ గూసిన వి ♦ రావము నందు తలంచిచూడ న
ర్థావహ మొందుఁ గల్గు నది ♦ యారటపెట్టక మున్నె వెన్కకుం
బోవుట మంచిదంచుఁ దల ♦ పోసి బిరానఁ జనంగఁ గ్రమ్మఱెన్. ౭౬౮

౮. జటాయు మోక్షణ పటలము. (౨౨౫)

తే॥ రాముఁడట్లు మారీచుని ♦ నాము మడఁచి, వడిగ వచ్చుచు నుండంగఁ ♦ బర్ణశాల
నున్న సీత యా దీనంపు ♦ టులివు విన్న, యంత దిగులునఁ గళవళ ♦ మందె మదిని.

తే॥ పరభృతంబు వృక్షము నుండి ♦ పదరి జాతి, పడిన వడువునఁ బుసమిని ♦ పడుచు లేచి
కడుపు చెయివెట్టి కలఁచిన ♦ కరణిగాఁగ, విభ్రమము నొంది విలపించె ♦ వివిధగతుల

తే॥ ఏల యజ్ఞానమునఁ బట్టి ♦ యిమ్మటంచుఁ, గోరి యాజీవితము చెడఁ ♦ గొట్టికొంటి
నేదిగతి? ముందు వెన్కల ♦ నెఱుఁగనైతి, యేమి చెడుగుల దుర్విధి ♦ యోచఁగలదొ?

లక్ష్మణుఁడు సీతకు ధైర్యవాక్కులాడుట.

తే॥ వత్స! లక్ష్మణా! సద్గుణ ♦ వార్ధియైన, యన్న రాక్షసమాయచే ♦ నలుగుల పడి
పృథివిఁ దూలె ననుచు నీవు ♦ వినియు నింక, నిచటనే నిలుచుంటివా ♦ యెడఁదఁగొనక

తే॥ అనుడు లక్ష్మణుఁ డిట్లను ♦ నమ్మ! యీ జ, గమున రాముని కంటెను ♦ కడిమియందు
మించు శూరు లున్నారని ♦ యెంచఁదగునె?, ఆఁడుఁదనమున నరయక ♦ ట్లంటి గాక.

క॥ జలధులు నిఖిల జగంబులు, కులశైలము లొక్కటగుచు ♦ ఘోరరణంబున్
జలిపిన రాఘువు బలముం, జలియింపం జేయఁ గలవె? చింతింపు మెదన్. ౭౭౪

క॥ పుడమియు జలమును వహ్నియుఁ, గడలును రాఘవుఁడు తెలిసి ♦ కాంచనయోనిన్
ఘాడియై నీత్ర పోవవె? తడఁబడి యెవ్వనిగ నతనిఁ ♦ దలఁచితొ తెలియన్. ౭౭౫

తే॥ రక్కసున కోడి కష్టించి ♦ రామదేవుఁ, డిట్లు పిలుచునె? పిలిచినే ♦ నెల్ల జగము
లట్టె నిలువునఁ గూలవె? యఖిల జీవు, లింతకే మండి మాఁడి ల ♦ యింప కున్నె?

క॥ పలుమాట లేల? దివి భువిఁ, గలవారు నుతించు గరళ ♦ కంఠు ధనువు ము
క్కలుగా విఱిచిన శ్యామల, జలద నిభు నెదుర్చువారు ♦ జగములఁ గలరే? ౭౭౭

క॥ పతియే నొవ్వియుఁ బొరయఁడు, హతుఁడగుటా? త్రిభువనంబు ♦ లడఁగవ్వు రవియున్
గతిదప్పఁ దుదధి యింకదు, మతిమాల్పిన చింత నొంది ♦ ఘణుఁగం దగునే? ౭౭౮

తే॥ ధర్మమున్నది దివ్యులు ♦ తనియఁగలరు, వచ్చు రాముఁడు వైళంబ ♦ వంత వలదు
చచ్చునపుడు రక్కసుఁడట్లు ♦ చావు కేఁక, వైచె నదివిని విభ్రాంతి ♦ పడకు తల్లి!

తే॥ అనుడు మిక్కిలి కోపంబు ♦ నతలు మనము, చంపి నంతటి వేదన ♦ చండ దృష్టి
గలుగు సీత నీ విచ్చట ♦ నిలిచి యుంట, నీతిమంతము గాదని ♦ నెట్టనాడి. ౨౯౦

చ॥ ఒకపరి మైత్రి గూర్చికొను ♦ నుత్తము లక్కట ప్రాణమైన దాఁ
పక యిడువారు చేవచెడి ♦ ప్రార్థన చేసిన యన్న కోరికం
గకపిక చేయు తమ్ముఁడిఁకఁ ♦ గల్గునె నీవలె? దిక్కు లేదు నా
యకుని తలంచుచున్ విడుతు ♦ నగ్నిని జీవము లిప్పుడే వడిన్. ౨౯౧

మ॥ అని చెందమ్మి వనమ్ముకై వెదకు చ ♦ క్రాంగిం బలెం గిక్కమై
ఘన ధూమావృత దావ వహ్ని వెదకం ♦ గాంతారముం గూర్చి యే
గిన వైదేహికి నడ్డు వచ్చి వినతిం ♦ గేల్మోడ్చి యో తల్లిరో!
నను మన్నింపు చలంబు వీడుమని దై ♦ న్యం బంది తా నిట్లనున్ ౨౯౨

లక్ష్మణుఁడు రాముని కడ కేగుట

చ॥ మరణము నొందనేల? యను ♦ మానము మానుము నీప్రతిజ్ఞకున్
వెఱతు మఱేమియుం బలుక ♦ వెక్కసముం ద్యజియించి యుండె యే
మఱక వసింపుమమ్మ బలు ♦ మాయవిధిం గెలువం గలారమే?
యిరవున నిల్మ సేవకుఁడ ♦ నేగుచునుంటిఁ గలంక వీడుమా. ౨౯౩

తే॥ అదను గని యాపదలు వచ్చు ♦ నమ్మ! మీరు, ప్రభునియాజ్ఞ నాక్షేపించి ♦ పలుకుచుండ
వెనుక నూయి ముందుగ గోయి ♦ విధమునొందె, మదిఁ దపించెదనని యేగె ♦ ముదలనొంది.

చ॥ నిలిచితి నేని యీయమయు ♦ నిప్పున దూఁకక మానదంచు నే
వెలలితినేని రక్షణము ♦ వీడ మహాపద చెందు నంచుఁ జం
చలుఁ డయి కార్యమేది యని ♦ చానల పల్కుల కుల్కి యిట్లు రాఁ
దలఁచుట పాడిదే యనఁ బ ♦ దంపడి యేమని యందు నన్నకున్. ౨౯౪

ఉ॥ పాడి దలంతు నేని యది ♦ భావ్యము భవ్యము గాని, యీమె యె
గ్గాడి మరించు దీనిఁ గను ♦ లారఁగఁ గాంచుట కంటెఁ గర్మచే
నాడికఁ బుట్టి కొందలము ♦ నందెదు వెంగలి యే మఱేమియుం
జూడక యిచ్చటున్ వదలి ♦ నూటిగ నేగుటె చాల యుక్తమా

ఉ॥ ఏసిదె పోవుచుంటి నెది ♦ యేని యవాంత్రము వచ్చునేని స
మ్మానిత రీతి నెల్లపుడు ♦ మమ్ము భరించు జటాయు వున్న వాఁ
డానిక వచ్చి త్రోవఁగలఁ ♦ డంచును పల్మఱు వెన్కఁ జూచుచున్
జానలు వొందుచుం జనె సు ♦ పర్వుల పుణ్యము పండు పండఁగన్. ౨౯౫

## రావణుఁడు తాపసియై సీత కడకు వచ్చుట

తే॥ అదను గనిపెట్టుచున్న ద ♦ శాస్యుఁడంత, వంచనముసేయమదినెంచి♦వాటమగు త్రి
దండమును నారలును జడల్ ♦ దాల్చి జనము, గౌరవించు తాపసి రూపు♦కడఁకనందె.

తే॥ కార్శ్యమును మేని బడలిక ♦ గానఁబడఁగఁ, బాట గతిదప్పక నటించు ♦ వాని మాడ్కి
వీణవంటి కంఠంబును ♦ వేదములను, స్వరము చెడక పల్కుచు ఘన ♦ సరణి తోడ.

చ॥ మెలఁకువఁ బూలు విచ్చుగతి ♦ మెల్లన నేగెడు వాఁడు భూమిఁ జి
చ్చులమిన చోటఁ గాలిడిన ♦ యంగముతో నడతెంచు వాఁడు న
గ్గలమగు వేపనం బలము ♦ కాళ్లు కరంబులు గల్గువాఁడు ని
య్యల జరయుక్ వరించుటకు ♦ నేవపడం దగునట్టి వృద్ధతన్. ౭౯౦

చ॥ నలినముఁ బోలు తేట నయ ♦ నమ్ములు కచ్ఛపలీల నింద్రియ
మ్ముల యడకమ్ము గూనియును ♦ పొల్పగు జన్నిదమొప్ప నొక్క ని
శ్చల ముని వోలె దైత్యకుల ♦ జాల్ముఁ డరుంధతిఁ బోలు జానకీ
నిలయము చేరె దిక్కులను ♦ నిక్కి కనుంగొని మాటిమాటికిన్. ౭౯౧

క॥ త్రిదశులును భ్రమయునట్లుగఁ, ద్రిదండి యయి రావణుఁడు వి ♦ దేహతనయ యు
న్నదెసఁగని వా తడఁబడఁ, గదిసి యెవరు మీరలనుచుఁ ♦ గడఁకం బలుకన్ ౭౯౨

క॥ సాదగు యోగి యితండని, మోదంబున జనకరాజ♦ పుత్త్రి యతని న
త్యాదరమునఁ గాంచుచు సుమ్మృ, దూదార వచోభిరామ ♦ యొద్దకు వచ్చెన్. ౭౯౩

తే॥మదజలముగాఱునట్లుచె♦మ్మటలుగ్రమ్మఁ,దొలఁకువలపునదైత్యుండు♦తోడవుతోడవు
ప్రణుతి పాత్ర పతివ్రతా ♦ రత్నమైన, సీత సుపిమ సుషమ కనుల్ ♦ చెలఁగఁగాంచె.

తే॥ వ్యసనమున వాడియున్న యా♦వామ ముఖము,సురసతీ ముఖంబులకంటె♦సొబగుమెఱసె
తన్ముఖమ్మును చూచి నం ♦ తనె సురారి, రెట్ట లుప్పొంగి కృశియించె ♦ హృదికలంగి

ఉ॥ వాని కనుంగవల్ విరిసి ♦ పార్థివ పుత్త్రి మనోజ్ఞకంబునం
దాని ప్రసూన మాక్షికము ♦ నాని మదంబునఁ గ్రాలుపుప్పలి
ట్రేఁణివలెన్ బ్రమోదమును ♦ చెందిన వంచు వచింపనేల? య
వ్వాని మనంబువోలె ముద ♦ పాన్నిధి మున్గి తరింప వక్షముల్. ౭౯౪

మ॥ వనజావాసము పీడి భూస్థలికి దీ ♦ ప్యద్రత్న సంకాశమౌ
తను వల్లం గొని వచ్చినట్టి చెలి సౌం ♦ దర్యంబు వీక్షింప నా
కను లొక్కిర్వది చాలునే? తలఁపఁ బ్రా ♦ క ద్వేషి చందాన నా
కనిమేషస్థితి నొందు నేత్రములు వే ♦ యైనం గనంబాలునే? ౭౯౬

క॥ తరమణి తోడి సుఖ మను, వారిధి దాఁటంగఁ దపము - ఫలముగ నజుచేఁ
గూరిన యాయువు చాలునె, సొరగు మూఁడు నఱకోటి - సంవత్సరముల్? ౭౯౮

చ॥ దివిజులు దిఙ్మహీశులు త - దీయసతుల్ రజనీ చరావళుల్
తవిలి భయంబునం గొలువఁ - దక్కక యీ భువన త్రయంబు ని
య్యువతిరొ యేల నేనును న - యోక్తుల నీయమ కాలఁ జూప గా
రవమునఁ జేయఁ బూనుదు శి - రంబున జీవితమే తరింపఁగన్. ౭౯౯

ఉ॥ వేదన తోడి క్లేశమున ♦ వెల్వెఁ నైన ముఖస్థ శోభయే
యీదివి భూమి గెల్చునన - నించు స్మితంబునఁ గూడియున్నచోఁ
బైదలి మోము గోము గరు - వం బది యెంతగ నొప్పునో కదా?
సోదెగ నీచెలిం దెలుపు - సోదరి కిత్తు సమస్త రాజ్యమున్. ౮౦౦

తే॥ ఇట్టు లవినీతుఁడై మది ♦ నెంచుచున్న, కపటమునిఁ గాంచినంతనే ♦ కనులవారిఁ
జేతఁదుడిచికొనుచు దయ ♦ సేయుఁడనుచు, సీత యుపచారవాక్య - వ ♦ చించియంత.

తే॥ డాసినం గని యామె వే ♦ త్రాసనంబు, చూపికూర్చుండుఁడన మాయ ♦ తాపసుండు
జింకతోలు త్రిదండంబు ♦ చెంతనునిచి, కొంచుఁ గేశవాయంచును ♦ గూరుచుండె ౮౦౨

క॥ వృక్షములు గిరులు మృగములు, పక్షులు భయమంది వడఁకి ♦ పాఱె దెసల కా
రాక్షస వరుఁ గాంచి హరిణు, లక్షమమునఁ జెదరి కొందరి ♦ యదరుచుఁ దొలఁగెన్. ౮౦౩

తే॥ ఎవరిదీపర్ణశాల? మీ ♦ రెవ్వరిందు, గలుగు మునియెవ్వఁడనిదశ ♦ కంఠుఁ డడుగ
నితఁడు వెరవిడి యని సీత ♦ యెదఁదలంచి, పలుకఁ దొడఁగె మహాదర ♦ భావమెసఁగ.

తే॥ ఓమహాత్మక! కోసల ♦ భూమిపాలు, దశరథేశసుతుఁడు పిన ♦ తల్లికోర్కి
వెలయఁ దమ్ముతో నీయట ♦ వీస్థలమునఁ, గొలుచున్నాఁడతని నెఱుం ♦ గుదురె? యనిన.

తే॥ ఔనవును వినియున్నాఁడ ♦ నరయ లేదు, గంగ ప్రవహించు కోసలఁ ♦ గంటి నొకట
నరిదియగు కాల మడవిలో ♦ జరపుచున్న, వారు మీరేరి తనయులో ♦ పలుక వలతు ౮౦౬

చ॥ అనుకపటంపు మౌనికి ధ ♦ రాత్మజ యిట్లను మౌనిచంద్రమా!
అనఘులు సచ్చరిత్రులు మ ♦ హాత్ములు మీవలెనున్న పుణ్యులౌ
మునులయెడన్ మహాదరము ♦ పూను విదేహ ధరాతలేంద్రుఁడౌ
జనకుని ప్రేమపుత్త్రి నను ♦ జానకి యందురు రామగేహినిన్ ౮౦౭

తే॥ కఠినపథముల నడచి వి ♦ క్లమము నొంది, నారు వృద్ధులు ద్వంద్వముల్ ♦ పాఱఁదోలఁ
దలఁచినారలు మీరలే ♦ స్థలమునుండి, వచ్చినారల నిట్లురా ♦ వణుఁడుపలికె ౮౦౮

సీ॥ త్రావాయనలపికాని ♦ వరతనుభాసితుఁ, డింద్రునకింద్రుండు ♦ సాంద్రయశుఁడు
బ్రహ్మవంశజుఁడును ♦ స్వర్గమ్ముతోడ స, మస్తలోకము లేలు ♦ మహితగుణుఁడు

వేదవేది రజత ♦ పృథ్వీధరము లీలఁ, బెల్లగించిన భుజ ♦ భీమ బలుఁడు
చౌదంతి కొమ్ము వ ♦ క్షమునకుఁ దొడవుగాఁ, బొసఁగఁ బల్చిన లోక ♦ వీరవరుఁడు
తే॥ అతనివీథి వాకిట నిల్చు ♦ నట్టివారు, వేలుపులెసుమ్మి యారామ ♦ వీథులందు
తరువులెల్లను కల్పక ♦ తరువులెయగుఁ, గాపురంబా ప్రభునిది లం ♦ కాపురంబు. ౧౦౯

సీ॥ పాదంబులొత్తుట ♦ పాదరక్షలుమోచు, పనులు రంభాదుల ♦ పనులె ముగుద!
అడపకత్తెలు పాఁప ♦ పడఁతుకల్ కాళంజి, గొనువారు గంధర్వ ♦ వనజముఖులు
తన చండశాసన ♦ మున భానుచంద్రముల్, శీలముల్ మార్పడఁ ♦ జెలఁగువారు
ఇంద్రాది దేవత ♦ లెల్లరు తనయింటి, కావలివాండ్రయి ♦ క్రాలువారు
తే॥ నాకమునయందు భూమిని ♦ నాగమందు,గల యపూర్వ వస్తువులెల్లఁ♦గడమలేక
యుండునాతని నగరాన♦యువతి! యేమి,చెప్పనేర్తును? విభవ మొ♦చ్చెంబులేదు.౧౧౦

తే॥ అజుఁడొసంగిన యమితాయు♦వందువాఁడు,భవునిచేఁ జంద్రహాసంబు♦ పడసినాఁడు
గ్రహములంబట్టి చెఱలోనఁ♦గట్టినాఁడు,సకలసద్గుణవంతుండు♦సన్నుతాంగి!. ౧౧౧

తే॥ మంచినడవడి గలవాఁడు - మహితధర్మ, శాస్త్రవేత్త కందర్పుఁడా - శ్చర్యపడఁగఁ
దగిన పరువంబుగలవాఁడు - తప్పులెన్ని, యజహరాదుల గౌరవ - మడఁచువాఁడు.

తే॥ సకలలోకంబు లందున్న - సన్నుతాంగు, లెందఱోవాని దయగోరి - మెలయువారు
వారికోర్కులఁదాఁ దీర్చి-వైచి యొక్క, కాంతఁ బ్రేమించి యామెకై - కాచినాఁడు.

తే॥ అతఁడు పాలించు లంకయం - దాసమెయిని, కొంతకాలంబు వసియింపఁ-గోరి చాల
కాలముండి క్రమ్మఱినాఁడ-లోలనేత్ర!,యనుచుఁ బల్కి యాయమ తలం-పరయఁదలఁచె

తే॥ తనువె భారమంచుఁదలంచు - తాపసేంద్ర!, తపసు లార్యులు కోరంగఁ -దగనిహింస
సేయు నసురల నగర వ- సించుచుండ, వలసినంత కారణమేమి - వచ్చెమీకు?. ౧౧౫

చ॥ వనముల నిష్టమైఁ దపము - వారకచేసెడివారి చెంతలన్
మొనసి వసింప కార్యజన - పూజ్యులు రాజులు గల్గు చోటులన్
దనిని వహించియుండ కిటు - దర్పితులై బహు దుష్టకార్యముల్
పొనరుచు క్రూరదానవ స - సమూహములోఁ బనియేమినిల్వఁగన్?. ౧౧౬

చ॥ అనివచియించు సీతఁగని - యంతటఁ గ్రైతవమౌని యిట్లు ప
ల్కును మృగనేత్ర! యీ రసము - క్రూరపథంబునఁ బోక హింసయున్
దనుజుల యొద్దనుండునని - తప్పుగ నెంచితి నిర్జరాళికిం
జను దనుజుల్ దురాత్మలెటు-లిందిగ యోగ్యులు మమ్ముబోంట్లకున్.౧౧౭

ఉ॥ రావణుఁడిట్లు పల్క రఘు ♦ రాముని దేవి తపోధికుల్ సదా
పావనులైన వారు చెడు ♦ పాపులఁ జేరఁగ రాదయంచు నూ

యాత్రులు రక్కసుల్ దలఁచి ♦ సట్టి స్వరూపము దాల్చువారలన్
భావన లేని దాటనటు ♦ పల్కఁగ నించుక వాఁడు కొంకుచున్. ౮౧౮

ఉ॥ ఈయమ శంకనొందెనని ♦ యెంచుచు దానిని కప్పి పుచ్చఁగాఁ
దోయము మార్చి యిట్టులనుఁ ♦ దోయజనేత్ర! బలిష్ఠులైన దై
తేయులు వారికిం బరులు ♦ దెప్పరముల్ పొనరింపకున్నచో
న్యాయము దప్పి లోకముల ♦ కాపద గూర్పరు వారలెన్నఁడున్. ౮౧౯

ఉ॥ ఆమె మనస్థిరత్వము సు ♦ రారి యెఱుంగఁగఁ గోరి యిట్లనన్
భూమిజ యిట్లు పల్కు రఘు ♦ ముఖ్యుఁడు కానల నున్న యప్పుడే
యా మనుజాశనావళుల ♦ నందఱఁబట్టి వధించుఁ బిమ్మటన్
క్షేమము చిత్తశాంతి ముని ♦ సింహులు చెందెద రెల్లకాలమున్. ౮౨౦

ఉ॥ నావుడు రావణుండు సుమ ♦ నస్విని! మర్త్యులు రాక్షసాళికిన్
హావడి గూర్చి కూల్తురన ♦ నౌర! శశంబు గజంబుఁ జంపదే?
వావిరి జింక చంపదె య ♦ వారణ ధీరత వారణ ద్విషున్
జేవచెడన్ ఖగాధిపుని ♦ జిహ్మగముల్ వధియింపవే యనన్. ౮౨౨

తే॥ క్రూర ఖర దూషణాదుల♦బారి సమరు, టీరు వినియుండ లేదొ ము♦నీంద్ర! యనియె
వాఁడు రామునకైన బ♦న్నంబు దలఁచి, వెడలు దుఃఖాశ్రుకణములఁ♦దుడిచికొనుచు.

ఉ॥ పుణ్యచరిత్ర! శూరులయి ♦ పొల్చు దినేశ కులేశ ధర్మనై
పుణ్యముచేత లంకఁగల ♦ పుణ్యజనుల్ నశియింప నక్షజి
ద్గణ్యులు సజ్జనుల్ శ్రమలు ♦ దక్కి సుఖించుట నేఁట రేపటన్
నాణ్యము గాఁగ జూచెదరు ♦ న్యాయ మధర్మ తతిన్ జయింపదే?. ౮౨౩

తే॥ చక్కెరయుఁ దేనె యమృతంబు-చిక్కఁగలిపి, సట్లు సీత పల్కఁగ ముద-మందుచున్న
యసుర మనుజులు గెలిచెద-రన్నమాట, విని సహింపక గరువంపుఁ-గినుకఁ దాల్చె.

చ॥ కినియుచు నొక్కమానవుని - కిన్ సరిగాక సమర్థులైన య
ద్దనుజులు గూలిరందువు గ - దా! దశకంధరు బాహు మారుతం
బున నరుఁడొక్క యూఁపుననె - బూరుగ దూదియుఁ బోలెఁ దూలి యే
వననిధిఁ గూలువాఁడొ కన - వచ్చును రేపె వరాంగనామణీ! ౮౨౪

చ॥ చదురులు పల్కుచున్న వన - జాత ముఖీ! దశకంఠు వేనిగా
నెదఁ దలపోసి యిట్లు వచి - యించితి మేరువు నెత్తఁ గోరినన్
త్రిదివము గూలఁద్రోయఁగ స - రిత్పతి సంక్షుభితంబుసేయ నొ
ర్వదహాను నార్పివేయఁగ ధ - రం వహ్నిఁ గ్రిందుగఁ జేయ వర్హుఁడొ. ౮౨౫

ఉ॥ ఈ కరణిన్ వచించు దను ♦ జేశ్వరుతో నృపపుత్త్రి పల్కెనా •
నాకవిరోధిఁ బట్టి చెర ♦ ణంబులఁ గట్టి యడంచి బందిలో
నూకిన కార్తవీర్యుని య ♦ నూన భుజంబులు వేయి, నొక్క రెం
డే కరముల్ గలట్టి మను ♦ జేంద్ర విరోధియె త్రుంచివేయఁడే?

రావణుఁడు కోపముతో నిజరూపము చూపుట.

ఉ॥ జానకి యిట్లు పల్కఁగ ని ♦ శాచరు కన్నుల విస్ఫులింగముల్
వానగఁ జిందె దిక్కులకుఁ ♦ బర్వ భుజంబు లొకళ్లొకళ్లతో
నూనిక మోఁదె బొమ్మికము ♦ లుప్పరమంటెఁ బయోధరావమ
ట్లానికఁ బఁడ్లుగీఁటె ముని ♦ యాకృతివోయెఁ జలంబు పెంపునన్. ౨౨౮

చ॥ ఇతఁడు తపస్వి గాఁడనుచు ♦ నెంచి కలంక వహించి యెవ్వఁడీ
మతకరియంచు లోన లవ ♦ మాత్రమెఱుంగ నశక్యమైన దు
స్స్థితి గొనునట్లు క్రూర విష - జిహ్మగ మల్క ఫణంబు విప్పి వి
ద్రుతగతిఁ బైఁబడం దొడరు - తోఁపిక నొప్పద శాస్యుఁడయ్యెడన్. ౨౨౯

మ॥ అనిరోధుండు యముండుపట్టుకొన స - హ్యంబెంతయున్ లేని జీ
వునిచందంబునఁ గంపమొంది సురిఁగెన్ - భూపుత్త్రియచ్ఛోభయం
బును పోఁకార్పఁగ నేరెఁ బిల్చు? నుడువం - బోనేమి గల్గున్? వెసం
బొనరింపంగ మతేమియుండును? తలం - పుంబోవ దేత్రోవకున్ ౨౨౩౦

మ॥ అమరేంద్రాదులు సేవలంజలుపు బా - హాశక్తిసామర్థ్యముల్
తమినీక్షింపుము యంచు రావణుఁడు దై - త్యశ్రేణి నిందించెదే
ప్రమదారత్నము గాన మానితిఁగృపా - భావంబునం గానిచో
దెమలంబట్టి కఱుక్కనం గొఱికి యేఁ - దిందున్ రుషాశాంతికిన్. ౨౨౩౧

మ॥ జలజాతేక్షణ! వంగ కెచ్చిరిలు శ్రీ - ర్లక్ష్మిశ్రేణిపై శీర్షకం
బుల చందంబున భక్తిపూర్వకముగాఁ - బొంకంబుగాఁ దాల్తు వే
ల్పుల చెల్వాళ్ భవదీయ పాదరజముల్ - పోఁకార్చి సేవింప రం
జిలి పద్నాలుగు లోకముల్ సుఖముమైఁ - జెన్నారఁ బాలింపుమా!. ౨౨౩౨

సీత రావణుం బదరుట.

శా॥ ఆమాట ల్విని శ్రోత్రయుగ్మకముఁ దా - హస్తంబులన్ మూసి కాం
తామతల్లిక సీత, కుర్కురము పూ - తంబౌ హవిర్భాగముం
బ్రేమం గోరిన రీతిఁ బుణ్యచరితన్ - శ్రీరాము సత్పత్ని న
న్నే మనాస్మపుర దుష్ట! బాలిశ! నరా - శీ! ద్రోహి! పోఁగాలమే?. ౨౨౩౩

చ॥ తృణమున నిల్చు కంకణము - తీరగు ప్రాణము కోసమాసమై
గుణవతులైన వారు కుల - కోమల ధర్మములం ద్యజింతురే?
ఫణులను పోలు రాఘవుని - బాణకదంబము నీ శిరంబులం
గణఁకను ద్రుంచుమున్న బడు - కం దలఁతేని తొలంగి పొలుమా?. ౬౩౪

తే॥ అనుడు రావణుఁడనుఁ గరు-బ్బ స్తిరదన,కిణము లొప్పు వక్షమున నీ-యినుఁడు వైచు
విశిఖములు కొండపైఁ బడు ♦ విరుల కరణి, వ్యర్థములు గాక యేమేని♦ఫలముగనునె?

ఉ॥ ఓ వరవర్ణినీ! మదనుఁ ♦ దుత్కట బాధలఁ బెట్టుచుండె నా
యాయి కృశింపసాగె నిఁకఁ ♦ బ్రాణము నీయఱచేత నిల్చె న
న్నోషధినైనఁ గావు మమ ♦ రేశ్వర కాంతలకున్ దురాసదం
బై విలసిల్లు భోగముల ♦ నందుమ యంచుఁ బదంబులం బడెన్. ౬౩౫

తే॥ కత్తిపోటుచేఁ బ్రాణము ♦ లలఁగినట్లు, తనువునుండి జీవంబులు ♦ తరలినట్లు
లార్తినొంది జానకి లక్ష్మ♦ణా! యటంచు, నార్య! యంచు నాక్రందింప♦నయ్యదనుస

రావణుఁడు సీతం గొనిపోవుట.

తే॥ తొంటి శాపంబుఁ దలఁచి యా♦ దుష్టదైత్యుఁ, డురుభుజంబుల నానేల♦నొక్క పెట్టఁ
బెల్లగించి నేలను దాఁటి ♦ వెడల నీక, చేతులంబట్టి రథమునఁ ♦ జేర్చిపెట్టె

తే॥ ఉరముపై భయమునఁ జేతు♦లుంచుకొనిన, చెలువతన ప్రాణములఁ గూడఁ♦ దెలియదయ్యె
మట్టితో నామె మెఱపులో ♦ మఱఁగిపోయె, రావణుం డాకసంబున ♦ రథముఁదోలె.

తే॥ అనలమునఁ బడ్డపూఁగొమ్మ♦యట్లునేల, వాడుఁదపియించు దారలును ♦ వసటుఁగుందుఁ
ద్రుళ్లిపడి లేమఁగాలుసేఁతులు విసుర్చు, దిక్కులం జూచు వెఱగొందు♦దిక్కుమాలి

సీ॥ ధర్మమా! యీ యాప ♦ దను తొలఁగింపవే, యిదిగదా రక్షింప ♦ నదను నీకుఁ
బావనివమ్మ గో ♦ దావరీ దేవి! నీ, వేని దెల్పఁగదె యి ♦ య్యెడరు పతికి
వనదైవతములార! వందనములు మీకు, నాస్థితిఁ దెల్పరే ♦ నావిభునకు
శైలంబులార! వృ ♦ క్షములార! పిక మయూ, రములార! మృగ నిక ♦ రంబులార!

తే॥ మొగుళులార! మీకును దయ ♦ పుట్టదేమి?, ఓదినేశ! భవత్కులా♦మోదకరుఁడు
రామునకు నీవు చెప్పఁగా ♦ రాదె? నీకు, లనుపకీయ్యది యొక్క క♦లంకు కాదె?

శా॥ అన్నా! లక్ష్మణ! యాపదల్ తలఁగ రా ♦ వన్నా! గురు జ్ఞాన సం
పన్నా! నిన్ననిసీతిమైఁ బనిపితిన్ ♦ మన్నించి వేరమ్ము యా
పన్నన్ రక్షణ సేయుభారమది నీ ♦ పై నుండెఁగాదే? దురా
త్మున్నిచుం బరిమార్పరే భరత శ ♦ త్రుఘ్నుల్ కృపాపూర్ణులై. ౬౪౭

మ॥ భ్రమ గొన్నావు కలంగినావు సుడియన్ ♦ వత్సంబు గోల్పోయి దుః
ఖమునం గుందెడు ధేనువట్లు మిగులం ♦ గ్రందిల్లు చున్నావు గౌ
తమి! నీనెంజిలి చూడఁగా నెఱుఁగు మ ♦ త్ప్రాణేశుతో నీదు పు
ణ్యము పెంపారఁగ గొబ్బునం దెలుపవే ♦ నాదుష్ట కర్మస్థితిన్. ౮౪౩

తే॥ ఎదురుపడు దొనలార! మృ♦గేంద్రులార!, పక్షులార! యీభూమిఁగో ♦ వ్రచ్చినన్ను
పట్టు నిరువది చేతులు ♦ పది శిరములు, బ్రుంగి ధరఁబడఁ గాంచిన ♦ ప్పుడుకు గాక.

మ॥ ఉరుదుఃఖంబున సీత యిట్టులన నా ♦ యుష్కాలముం గోలుపో
వు రహింబూనిన రావణుండు తరుణీ! పూఁబోణి! సింగారి! చ
క్కెర బొమ్మా! నను మానవుల్ గదిసి యా ♦ క్షేపించి గెల్పొంది నిన్
వెరవారన్ విడిపించు వారె? యని న ♦ వ్వెం జేతులం దట్టుచున్. ౮౪౫

ఉ॥ రావణు పల్కులన్ వినిన ♦ రాముని దేవి దురాత్మ! నీచ! మా
యావి మృగంబుఁ బంపి భవ ♦ దంతకు రాఘవు దవ్వుచేసి యే
యావల నన్ను పట్టితి కు ♦ లాపశదా! యనిసేయు తెంపు నీ
కావిధినున్నఁదోలకు శ ♦ తాంగము నిల్పుము మాటలేటికిన్?. ౮౪౬

ఉ॥ వీరుఁడవై తివేని పెను ♦ భీతిని దొంగిలనేల? పంద! నీ
వారలు రోషమూనఁగ భ ♦ వత్సహజాతకు ముక్కుగోసి యా
తీరున వారిఁజంపు రణ ♦ ధీరులు కానన వీథియందె యు
న్నారని గాక కుక్కర గు ♦ ణంబున వచ్చితివేల? బాలిశా! ౮౪౭

చ॥ అనుటయు దైత్యుఁడిట్టులను ♦ నబ్జముఖీ! విను నన్ను బోఁటికిన్
మనుజులతోడ నాహవము ♦ మానక చేసిన నిందరాదె? రు
ద్రుని ఘనశైలమెత్తిన యు ♦ దూఢ భుజంబులు దొడ్డ న్యాయతం
జెనయవె? వంచనమ్మొ తగు ♦ చెద్దుము మానవపాళి పట్టునన్. ౮౪౮

చ॥ అది విని సీత నిర్దయత ♦ నావడి చేసెడి క్రూరదైత్య ఘు
ర్మదులకు శత్రుసమ్ముఖము ♦ క్రాలుట లోపము వారితోడ బె
ట్టిదపు దురంబు సేఁతయు బి ♦ డెంబగు సాధ్వుల మోసగించు టొ
ప్పిద మగు నిట్టిపాపులకు ♦ వీర్యము మాన మనంగ నున్నదే? ౮౪౯

జటాయువు రావణు నడ్డగించుట

సీ॥ అనునంత దుష్టాత్మ! యరిగెద వెచటికి?, నిలుమంచుఁ గాలాబ్ద - నినద లీల
గర్జించి నిప్పులు - గ్రక్కుకన్నులతోడఁ, బిడుగులఁ బోలిన - నుదులతోడ
మేరుగిరియె లేచి - మింటఁదిరుగుచున్న, దాయననొప్పు కా - యంబుతోడ
శంపాభమౌ బలి - ష్ఠంపుఁ జంచువుతోడఁ, గొండ కొండయు ధాఁకి - ఫిండిగాఁగ

తే॥ జలధి చెలరేఁగి భూమితోఁ - గలసిపోవ, నిలయవాయువుకై వడి - వీచుచున్న
పక్షమారుతమునఁదరు-వ్రజము విఱుగ, గరుడుఁడని పుట్టలనుభుజం-గములుదూరఁగ

క॥ ఱెక్కలఁ బుట్టిన కరువలి, నక్కజముగఁ బైకి నెగసి ♦ యాకసమందుం
గ్రిక్కిఱిసి తూలు మృగములు, మక్కెక్కఁగ మిన్ను మిగుల ♦ మూఱుపు చెందన్

క॥ అరదమున ధరణిజం గొని, యురవడి నెటకేగు వాఁడ ♦ వుండు నిలుము నీ
గరువం బడఁచెద నీచా!, తెరువు గలదె నీకుఁ బోవఁ ♦ దేఁకువ? ననుచున్. ౮౫౨

తే॥ ద్రోహిరావణుఁ దలలతోఁ ♦ ద్రుంపనెంచి, యెఱ్ఱకాళ్ళులు మస్తక ♦ మెఱ్ఱకుతిక
తోడఁగైలాసగిరి వోలె ♦ దొడ్డ తెల్ల, తనువుతోడ జటాయువ ♦ త్తఱిని వచ్చె.

క॥ బిడ్డా! భయపడకు మనుచు, నడ్డముగా నిలిచి యసుర ♦ నదలించుచు వీఁ
డెడ్డెతనమూని తాఁకం, దొడ్డాడెన యనుచు నుంత ♦ యూఱట పడుచున్. ౮౫౩

చ॥ చెడితివి నీవు బంధులకుఁ ♦ జేటొనరించితి దైత్యనాథ! యీ
పుడమి కుమారి సీత నిటు ♦ మోఱకు బుద్ధిని పట్టి తెచ్చితే?
విడువుము వీడవే నసువు ♦ వీడుట నిక్కము జీవితంబు గో
రెడు జనులెవ్వరేనియుఁ జ ♦ రింతురె యిట్టి కుమార్గ వర్తనన్?. ౮౫౬

క॥ ఖరదూషణాది వీరుల, దురమునఁ బొలియించి పితర ♦ దొరకుఁ దనియ విం
దురవుగఁ బెట్టఁగ నాతఁడు, నరుసముతోఁ గొనుట యెఱుఁగ ♦ వా? యవివేకీ!

తే॥ కోప ఘూర్ణిత మదకరి ♦ కొప్పరింప, శిలలు వైవఁ దలంచితే? చెనఁటి! పక్షి
యేడ? నను చంపుటేడని ♦ యెంచితేమి? విసము మ్రింగియు బ్రదుకును ♦ విశ్వసింతె?

క॥ హరిణములు పులులఁ గాంచిన, కరణిని దిక్పతులు జనులు ♦ కాలుండును దా.
శరధులఁ జూచుచు నుందురు, వెరవేఁకివి నీవు బ్రతుకు ♦ వెంటయుఁ గలదే?

క॥ సుతసోదర సహితముగా, హతమాటకు నింతకంటె ♦ నధికమగు దురా
గతమును కలదే? కుగతికిఁ, గతమిది, యే జన్మమునకుఁ ♦ గలుగవు శుభముల్. ౮౫౮

క॥ ఈ నరవరులు త్రిమూర్తుల, లో నగ్రియు లాత్మలగుట ♦ లోకములో నె
వ్వానికిఁ బోల్పఁగ నగు? నిది, మానుగఁ దెలియంగలేక ♦ మత్తుఁడవైతే? ౮౬౦

క॥ అమరులఁ గాచిన నరవరు, కొమరుఁడు కోదండ ధరుఁడు ♦ కోల్తల నడరన్
నమయించుఁ దప్పదీ వీ, యమ విడి పరుగిడుము నేనె ♦ యతనిం జేర్తున్. ౮౬౧

తే॥ బ్రహ్మయిచ్చినయాయువు♦ భర్గుఁడొసఁగు,ఖడ్గమునుమాయమంత్రముల్ ♦కడఁకతెల్ల
సత్యవంతుఁడౌ రాఘవు ♦ సాయకములు,బయలు వెడలు నంతవఱకె♦ బలయుతములు

తే॥ అనిన విని దైత్యవల్లభుఁ ♦ డౌఁధు గఱచి, కనుల నిప్పు లురలఁ జూచి ♦ గ్రద్ద! నీవు

త్రోవ వీడుము కాదేని ♦ యీవు పోగదు, వారిఁ జూపుము తలగిల్లి ♦ వైచు వాఁడ
తే॥ శిత శరాళిచే సీతామ్మ ♦ చీల్చికొనక- త్వరగఁ దొలఁగుము నిలువకు ♦ తప్తలోహ
గత జలం బది క్రక్కినఁ ♦ గ్రక్కుఁ గాక, యీమధురవాణి మీకడ ♦ కింక రాదు.
తే॥ ఇట్టు లసుర పల్కఁగఁ గోప ♦ మినుమడించి, సీతఁ గని జటాయువు, తల్లి ! చెనఁటియొడలు
ఖండ తుండ ములగు; మహా ♦ క్రందనంబు, వలను మనవారు లేరను ♦ వంత వలదు.
ఉ॥ కన్నుల నీరు ముత్యముల ♦ కైవడి బొమ్మనఁ జింద నేడ్వ కో
యన్నుల రాణి! యీఅడిలి ♦ యారయు తాలఫలౌఘ గుచ్ఛమ
ట్టున్న శిరంబులీడ్చి పదిన ♦ ముష్టి తిరుగునిర్జితులై దిక్కులన్
భిన్నములై విరూపములఁ ♦ బేర్చి పడం గనుమంచు నుగ్రుఁడై. ౮౬౬
చ॥ ఎఱకల బల్మిచే నశని ♦ యేపునఁ జావఁ బడంగఁ ద్రోసి య
మ్మొఱకు తలల్ ధరం జదియ ♦ మోఁదుచు ముక్కునఁ గన్నులూడ్పఁగాఁ
బెఱుగు జటాయు వయ్యసుర ♦ పేరుని పెరిగి వీకి నెక్కెముల్
విఱుగఁగఁ దన్ని తోడ్తొలుత ♦ వేల్పుల దీవన లందె నత్తఱిన్. ౮౬౭
ఉ॥ ఎన్నఁడు నిట్టిభంగ మెఱి ♦ యింపని దైత్యమనంబు దిగ్గనన్
గన్నులు గ్రాఁగు లక్కవలెఁ ♦ గట్టలు పొందగ సర్వలోకముల్
క్రన్నన సంచలింప దశ ♦ కంధరుఁ డయ్యెడ బిట్టు నవ్వుచుం
బన్నుగ వంచె భ్రూకుటిల ♦ బంధము తోఁ దనదొడ్డచాపమున్
ఉ॥ క్రొన్నెలరేకవంటి నెఱి ♦ కోఁలు దైత్యుఁడు చిత్తజల్లుగాఁ
బన్నిన బాణజాలములఁ ♦ బక్షిమరుత్తుపఁ గొన్ని దూల్చుచుం
గొన్నిటి గోళ్లతోఁ జఱచెఁ ♦ గొన్ని యముండును భీతి నొందఁగా
భిన్నము చేసెఁ జంచువుల ♦ భీమబలుండు జటాయు వయ్యెడన్. ౮౬౯
ఉ॥ క్రూర భుజంగమంబులను ♦ గొబ్బునఁ గైకొన వచ్చు పక్షి రా
డ్ధిరుని వోలె గృధ్రపతి ♦ డీకొని రక్కసి బొమ్మిడీకముల్
తేరిపయిం బడం బద హ ♦ తిం దొరలించుచుఁ గర్ణకుండలాల్
పేరిమి డుల్చి పైకెగిరె ♦ వెక్కసమంది సురారి చూడఁగన్. ౮౭౦
చ॥ దనుజుఁడు పట్టరాని బెడి ♦ దంబగు కోపముఁతో బదేను మా
ర్గణముల నాజటాయువు ను ♦ రమ్మున నాటఁగఁ నేసి వెండియున్
ఘన రుచిరశిఖమ్ములం దనువు ♦ గాసిలఁ జేయ ఖగేంద్రుఁ డప్డు క్రుం
గెన యని వేలుపుల్ మిగుల ♦ ఖేదమునొందిరి పిచ్చలించుచున్. ౮౭౧
ఉ॥ గాయములందునుండి వడిఁ ♦ గారెడి శోణిత ధారతోడ న
త్యాయత సత్త్వయుక్తుఁడు జ ♦ టాయువు చూడఁగ ముగ్ ఖరాద్యన్న

క్షీరోదధి నుండి తెల్లనగు ♦ తోయదమొండు ద్రవంబు గొంచు నా
ప్యాయముగా జడిం గురియు ♦ వైనము దోఁచె నభస్స్థలంబునన్. ౮౭౨

ఉ॥ ఊరుపు పుచ్చి కోపమున ♦ నుగ్రముఖుండయి పక్కిఱేఁడు దే
వారి భుజంబు లిర్వది న ♦ ఖావళి నక్కుచు దూఁటి ముక్కుతో
వారక చెక్కలం జఱచి ♦ వాని మహోజ్జ్వల తారహార యు
క్స్ఫార విశాల వక్షమునఁ ♦ బ్రబ్బిన కంకట మంటఁ జించఁగన్. ౮౭౩

చ॥ ఎరియుచు రావణుండు కరి ♦ నేషు శతంబునఁ బక్కిఱేని పే
రురమును గాఁడ నేసిన ముహూర్తము లోననె చింతనొందు ని
ర్జరులును మోదిలం బులుఁగు ♦ రాయఁడు దైత్యుని వింటినారి ని
బ్బరమునఁ బట్టి లాగెఁ దన ♦ బంధుర చంచువుతో బలంబునన్. ౮౭౪

తే॥ ఈశుతోడఁ గైలాసంబు ♦ నెత్తినట్టి, లావరి శరాసనము నోట ♦ లాగి కొంచు
నింద్ర ధనువుతోఁ దెల్లని ♦ సాంద్రమేఘు, మట్లు వెలసె; నాతని బల♦మరయ వశమె?

మ॥ వెను చూపింపని వక్షముం బొరయు నా ♦ వేగంటిఁ బాఱంగఁ జే
సిన దైత్యేంద్రుని విల్లు శూలిధనువుం ♦ జెండాడు శ్రీరామ చం
ద్రున కుం దండ్రిగ నొప్పి యాజికి సుమి ♦ త్రుంిండైన పక్షీంద్రుఁడు
క్కున నోటంగొని కాళ్లతో విఱిచె ది ♦ క్కుల్ చూచి మేల్మేలనన్. ౮౭౬

తే॥ లోక కంటకుఁడైన యా ♦ నాకవైరి, విల్లు ఏఱుగుట గని కోప ♦ వివశుఁడగుచుఁ
ద్రిపుర సంహారకారకో ♦ ద్దీప్తమైన, శరమువంటి శూలమువై చె ♦ జగము వడఁక.

ఉ॥ శూలము తన్ను చంపునని ♦ స్రుక్కక సీడజ రాజు కాంచి నా
మేలిమిఁ జూడుమంచుఁ గడు - మేకొని వక్షముతోడఁ దాఁకఁగా
వేలుపు లిద్ది సాహసము ♦ విస్మయ మంచు వచించి చేతులన్
బోలఁగఁ దట్టి కేఁకలిడి ♦ బోరన నార్చిరి మెచ్చులాడుచున్

చ॥ వెల చెలియింటికిం జనిన ♦ పేదను పోలె, సతీమతల్లి వ
ర్రిలని గృహంబునం దతిథి ♦ బృందమువోలెఁ, బరేశు చింతయే
చెలువము గాఁగ నొప్పు ముని ♦ సింహునిగాంచిన యొప్పులాఁడి చూ
పుల వలెఁ, గ్రమ్మఱిల్లెవ ♦ డిఁ బోయిన రావణు శూలము త్తఱిన్. ౮౭౮

చ॥ కినుకను వేఱుకై దువును ♦ కేలఁ గొనం గమకించు నంతలో
నన రథచోదకుం జదిపి ♦ నాలుక వెల్వడ మూర్ధ మూడ్చి రా
వణుఁడు కలంగి వందురఁగ ♦ వాని ముఖంబులు రక్తసిక్తమై

తే॥ విసరికొట్టిన తలఁగాంచి ♦ వెక్కసమగు, బిడియమును కక్కసంబును ♦ పెనఁగొనంగ
రావణుఁడు దండమునఁ బక్షి♦రాజుఁ గొట్టె, బర్వతమువలె భువిఁ బడెఁ♦బక్షిరేఁడు.

తే॥ అంతఁ దీక్ష్ణదృష్టియును వె♦న్నంటఁ జాల, నట్టి వేగంబుతోఁ దానె ♦ స్యందనంబు
నడపుకొని పోయె దానవ ♦ నాయకుండు, సీత పుంటిపై నిప్పించు ♦ చెన్నునొంద.

ఉ॥ ప్రుక్కడి దైత్యుఁ డేగుటయు ♦ భూమిజ దుఃఖముఁగాంచి చెచ్చెరన్
నిక్కమహోద్ధతిన్ మెఱవ ♦ ణించుచు శోకము నొందకమ్మ! యీ
టక్కరిఁ గూల్తు నే సని జ ♦ టాయువు దివ్యుల సంతసంబుతో
నెక్కడ కేగెదంచు దను ♦ జేంద్రు శతాంగము నడ్డగించుచున్. ౧౧౩

చ॥ బలమున వాని దండమును ♦ పట్టి తటాలున లాగివైచి వా
జులఁ దన శాత చంచువున ♦ జొత్తిలఁ బొడ్చి వధించె జీవితం
బులు గొను మృత్యుదేవతయు ♦ భూరిభయంబునఁ గేలుదోయి కం
పిలఁ గొసరెయున్ రథం బవల ♦ భిన్నము చేసెఁ దదున్నతుల్ సెడన్. ౧౧౪

చ॥ అరదము నుగ్గుచేసి భుజ ♦ హంకృతి మాపి శరాసనంబులన్
గరముల నూడ్చివైచి రణ ♦ కర్మము సాగక చేసి లోభులం
బొరసిన ద్రవ్యరాశి క్రియఁ ♦ బొల్చు నిషంగములన్ సరాలునన్
గెరలిపడంగ లాగికొని ♦ కీడ్పడఁ జేసె జటాయు వాలనిన్. ౧౧౫

చ॥ చలమున వాని శీర్షములఁ ♦ జక్కగ మోఁది శ్రమంబు గూర్చి బా
హులపయి ఱొమ్ముపై శితన ♦ ఖోత్కర శక్తిని ఱక్కిముక్కుతో
నలిగులిసేయ దైత్యకుల ♦ నాథుఁడు స్రుక్కుచు విహ్వలించుచున్
నిలిచినఁ గాంచి నీ బలము ♦ నేరుపు నింతయె యంచుఁ గేరఁగన్.

క॥ ఉగ్రుఁడయి దైత్యనాథుఁడు, దగ్రత హరుఁడిచ్చు చంద్ర ♦ హాసము పెలుచన్
వ్యగ్రమతిఁ బూని వానిని, నిగ్రహమున నేసె విబుధ ♦ నివహము బెదరన్. ౧౧౭

చ॥ అపజయ మెట్టిదో యెఱుఁగ ♦ నట్టి జటాయువు వృద్ధుఁడౌట మో
క్షపదము చేరువాఁడగుటఁ ♦ గ్రవ్య భుగీశ్వర చంద్రహాస సం
తపన మహోగ్రతన్ బలము ♦ దక్కి సురేంద్రుని వజ్రధారచే
విపుల గరుచ్ఛిదం బయిన ♦ పృథ్వీ ధరంబనఁ గూలె నేలపై. ౧౧౮

చ॥ ఎఱకలు త్రుంగి మేదిని ప ♦ యింబడె గృధ్రవిభుండు దేవతల్
పరుగులు వాఱి రెచ్చటికొ ♦ పార్థివనందన దిక్కులేనిదై
సురిఁగె నటంచుఁ జిత్తముల ♦ శోకము నందిరి తాపసేంద్రు ల
త్తఱిని సువర్ణ పుష్పములు ♦ దండడి రాలెను కంకరాజుపై. ౧౧౯

ఉ॥ రావణుఁడార్చి వాగుర ♦ నొంగి దగుల్కొను లేడివోలె భూ
దేవి తనూజ నివ్వాలత ♦ దీల్పడె నూర్చి వడంకె నొచ్చె దుః
ఖావిల తప్తచిత్తయయి ♦ యాదరువా కోమ ద్రుంగిపోవఁగాఁ
దీవియవోలె నేలఁబడి ♦ తేఱక మిక్కిలి కుంది దూపిలెన్. ౮౯౦

తే॥ నన్ను కాపాడ వచ్చిన ♦ నయగుణుండు, గృధ్రరాజు గతించె ది ♦ క్కెవ్వరింక
ననుచు జానకి మిక్కిలి ♦ యంగలార్చె, నాదరువువోవ వెల్లువ ♦ నలయుభంగి. ౮౯౧

చ॥ తెలివి యొకింత లేక గుణ ♦ ధీయుతు లక్ష్మణు పల్కులన్నిరా
కలనముచేసి కోపమునఁ ♦ గాఱులు పల్కితి సాగనంపి త
త్ఫల మిపు డొందితిం దవిలి ♦ బాసటయైన జటాయు వీల్గెఁ గా
వల మది యెట్టి కష్టముల ♦ పాల్పడఁ జేయునో! యేమి చేయుదుర్? ౮౯౨

చ॥ శరణ మొసంగి రక్షణము ♦ సల్పఁగ వచ్చిన యాతఁ డీల్గుటా?
నరకమునొందఁగాఁ దగిన ♦ ముంజుదుదిండి జయంబు నొందుటా?
కరకరిపాపమే జయము ♦ గాంచునె? ధర్మమె యోడిపోవునే?
ధరఁగల సర్వశాస్త్రములు ♦ దబ్బఱలే? సుకృతంబు వ్యర్థమే? ౮౯౩

ఉ॥ కొంకక యేను బేలనయి ♦ కోరుటఁ బట్టియె దూరమేగు వీ
రాంకవరేణ్యులార! తగు ♦ న్యాయపథంబున నేగువారికిం
బొంకపు మార్గదర్శియగు ♦ పూతచరిత్రుఁడు తండ్రికంటె ని
ర్వంకలఁ బ్రీతిశాలి యగు ♦ పక్షివరేణ్యుని చూడ రండటన్ ౮౯౪

తే॥ క్రొత్తడి తనంబు చెడఁగొట్టు ♦ కొనకయుంట, నాప్రయత్న మేమైన, వి ♦ న్నను వుసెందు
. రాముకోదండమునకు నే♦ రాణఁ జొచ్చు, వంశమునకచ్చె నాచేటు ♦ వలనఁ బ్రబ్బు. ౮౯౫

తే॥ కొడుకుకై ప్రాణములువీడు ♦ కోసలేంద్ర!, మైత్రికై ప్రాణములువీడు ♦ మాననీయు
నజ్జటాయువు దివిఁజరి ♦ ష్వంగసుఖము, గొనఁగఁబిలిచితే? తా నిన్ను ♦ గూడవచ్చె.

తే॥ ఒఱలుచిటులుండు జానకి ♦ నెఱకలు తెగి, పడు జటాయువుఁగని చేరి ♦ పయిని మట్టి
పెళ్లతో నంసమున నామెఁ ♦ బెట్టికొనుచు, గగనవీథిని పఱచె నా ♦ క్రవ్యభుజుఁడు ౮౯౭

తే॥ చెనఁటి యాకాశ వీథిని ♦ శీఘ్రగతిని, జరుగఁ గన్నులు మనసును ♦ గిరగిరమని
తిరుగ ధృతిచెడి ♦ దిక్కులు ♦ తెలియకుండ, తన్ను మఱచి జానకిచేష్ట ♦ దప్పియుండె. ౮౯౮

తే॥ పిదపనిసుమంత, తెప్పిఱి ♦ విహగవిభుఁడు, నింటిదెసఁ గాంచి దైత్యుండు ♦ మిగులవేగ
మునను జనకనందిని గొని ♦ పోవుటరసి, మనసు తపియింపఁగుంది యిట్లని యెఁ దుదకు.

క॥ లేరై రి తనయు లిచ్చట, రారై రి ధరాత్మజాత ♦ రావడి యుడుపం
గ్రూరాత్ముల రాకాసుల, నేరీతిం గూల్చు వారో? ♦ యెయ్యది తెరువో?. ౯౦౦

క॥ రాకాసులఁ బరిమార్పఁగఁ, గాకుత్స్థులు జగతిబద్ధ ♦ కంకణులగుచో
నీకరణితగునె సీతకుఁ, గైకేయి కడంక యెంత ♦ గావించెఁ దుదిన్?. ౯౦౧

క॥ పరమాత్ముఁడె రాఘవుఁడై, పరఁగె నసురవధముసేయఁ ♦ బాపాత్ముఁడు కా
వరమున నిటువంచించెను, పురుషోత్తము నెదుట నిలువఁ బోలియకయున్నె?. ౯౦౨

క॥ నాముద్దుల తనయుఁడు శ్రీ, రాముఁడు రక్కసులనెల్లఁ - గ్రచ్చఱఁజంపున్
దామరస జన్మశాపము, చే మానిని దాఁక నెఱచుఁ ♦ జెనటి యసురయున్. ౯౦౩

క॥ జనకజ రక్కసిచెఱఁబడె, ననిసేయఁగఁ దగినతెక్కు ♦ లఱువు ళ్లైనన్
వనితారత్న సతీత్వం, బనునెఱకలు త్రుంగవనుచు ♦ నారట మడిగెన్. ౯౦౪

ఉ॥ సత్తువ తగ్గి ఱెక్కలును ♦ జాఱఁగ సీత చెఱన్ వదల్పలే
కత్తిన సిగ్గు రాఘవుల ♦ యందలి ప్రేమయు మానసంబులోఁ
గ్రొత్తలువాఱ నిద్రగొను ♦ కోపునఁ గన్నులు మూసియుండె లో
నుత్తలపాటుతోఁ దెలివి ♦ యొయ్యనఁ దప్పకయుండె ధీరతన్. ౯౦౫

తే॥ త్వరగఁ బదిలంబుగాఁగ రా-వణుఁడుజనక,తనయఁగొనిపోయియామెను-తాఁక వెఱచి
విసమువంటి రాకాసుల - పెందుపదుమఁ, బాదినుంచె నశోకికా - వనమునందు. ౯౦౬

## లక్ష్మణుఁడు రాముఁ గానఁ బోవుట

తే॥ అచట హేమకురంగంబు - నంటిపోవు, ననఘురాఘవు క్షేమంబు - నరసిరాఁగ
సీతయంపిన సౌమిత్రి - చెలువునింక, నరయఁబోదము వారల - మఱవనగునె? ౯౦౭

క॥ జానకి నొంటిగ నిడుచుట, చే నేమగునో యటన్న - చింతను సీతా
జాని నిడఁ గాంతి మాసిన, యీనగరము వీడు - భరతు నంగముతోడన్. ౯౦౮

క॥ సాగరమున నొకంబలె, వేగిరమున నడచి రాము - వీక్షించి మన
స్సాగరము నడఁచి పరిపు, త్యాగిరమున మునిఁగెఁగనులు - తనివింబొందెన్. ౯౦౯

క॥ తడఁబడి భీతిం బొరయఁగ, నడమగు మారీచురవము - నెఱుఁగమి వలనన్
బుడమి తనయ బెగడెదునని,యెడఁదఁదలఁచు రాముఁడతని.నెలమింగనుచున్. ౯౧౦

ఉ॥ దేహముతోడ మానసముఁ ♦ దీఱని విక్లమమంది వచ్చె సం
దేహముతోడ మానసముఁ ♦ దీఱని విక్లమమందు నాకడన్
మోహముతోడ మానసము ♦ మూర్ఛిలఁ దొందఱ పెట్టి పంపవై
దేహియె కారణంబగు ని ♦ ధిం దొలఁగింప జనుల్ సమర్థులే? ౯౧౧

చ॥ అని తలపోయుచున్న తన ♦ యన్నను డాసి నమస్కరింపఁగా
ననుజుని కౌఁగిలించుకొని ♦ యుత్తరపాటుఁ వచ్చుటేలనన్

వినుటకు వింతయైన ధ్వని ♦ వీనులఁ జేరఁగ నుమ్మలించి మ
జ్జనని భయంబు నొందెఁ బలు ♦ చందములన్ దగవ్రాఁది పల్కెనన్.

ఉ॥ నీవరశక్తి ధైర్యముల ♦ నేనెఱిఁగింప వినంగ నొల్లకే
పోవక యుందువేని పడి ♦ పోయెదఁ జిచ్చున నంచుఁ గానలో
దావముఁ గూర్చి పోవునెడ ♦ ధర్మము కాదని యందు నిల్వలే
కీవగ నామెఁగావ మది - నెంచితి నంచనుజుండు పల్కెఁగన్. ౬౧౩

ఉ॥ చావఁగనున్నఁదప్పునొకొ? - సంకటముల్ దొలఁగంగ నూఁకు నే
ర్పేవిధి లేని దక్కటా! వి ♦ హీనమతిం బదరె న్నిజంబుగాఁ
గావలి లేనిచో నెడరు ♦ గల్గును వచ్చిన యాపదావళుల్
పోవవు వేఱుసేయుటకుఁ ♦ బూనిన సోఁకుల తంత్ర మియ్యదా. ౯౧౪

ఉ॥ నీయెడఁ దప్పులేదు గుణ ♦ నీరధి! ధీ రహితాత్మ సీత నీ
వాయెడఁ బల్కు పల్కుల న ♦ నాదృతి చేసెను నేఁదలంచి న
ల్లేయది పూని నన్ జెఱచె ♦ నే యని యెన్నఁడు నేని డెంద మ
త్యాయతమై కలంకమతి ♦ నందని రాముఁడు కుందె నెమ్మదిన్. ౯౧౫

ఉ॥ కాలము ౙ్రోవఁగా ఫలము ♦ గల్గను జానకిఁ గాంచు పిమ్మటన్
దూలును చింత వేఁ ౚొకట ♦ దొరదయంచు వచించి క్రంచరన్
జాలగ దవ్వు నారసము ♦ చందమున న్నడతెంచి లోల వ
క్రాలక సీతయుండిన మ ♦ హావనమున్ దరిసించి యయ్యెడన్. ౯౧౬

క్రీ రాముఁడు సీతలేమికిఁ జింతిలుట.

ఉ॥ శ్రీరఘువీర శేఖరుఁడు ♦ చింతను పర్ణకుటీరమందు కాం
తారమునందు నెచ్చటను ♦ ధారణి కన్యక జాడ గాన క
ట్లూరక ప్రమాప్పడ న్నిలిచె ♦ నొత్తిలి కాయము జీవువీడి ని
స్సారత నొంది పిమ్మటను ♦ సంకట మందుచు రోయు కైవడిన్. ౯౧౭

ఉ॥ జీవితవాంఛపై విసుగు ♦ చెందిన రాఘవ సార్వభౌముఁడ
ద్దేవిని కానమి న్నిలిచె ♦ దివ్యనిధిం దనకంచు డాఁపఁగాఁ
జేవిడఁ జోరుఁడొక్కరుఁడు ♦ చేరి ధరాస్థలిఁ గెల్లగించి కొం
పో వెతనొంది దిగ్భ్రమము ♦ పొంది యలంగెడు దీను కైవడిన్. ౯౧౮

చ॥ తిరుగఁగఁ జొచ్చె భూమియు న ♦ దీనదముల్ కడు సంచలించె సా
గరములు ఘూర్ణిలెన్ గిరులు ♦ క్రక్కదలెన్ దొలివేల్పు కన్నులుం
దిరిగెను సూర్యచంద్రులును ♦ దిక్కటి త్రోవలఁ దప్పినారు శ్రీ
వరుఁడు తపింప నెయ్యది ధ్రు ♦ వంబుగ నిల్వఁగఁ జాలుఁ జెప్పుమా?

శా॥ కోపంబూనునొ పాడిపైఁ? దనదయం ♦ గోపించునో? పాపముం
గోపంబారఁగఁ జూచునో? త్రిదశులం ♦ గోపించునో? మానులం
గోపమ్మూర్తిని కాంచునో? శ్రుతులపైఁ ♦ గోపించునో? వేనిపై
గోపంబూనునొ? యేమియౌనొ? యనుచుం ♦ గుందెన్ జగజ్జాలముల్.

చ॥ సకలము డిందె లోకవిభు - చక్కని గర్భము సొచ్చు వేళలోఁ
గకవికచెంది లోకములు - క్రన్న విపర్యయ మొందు కైవడిన్
సకల జగచ్ఛరణ్య గుణ - జాలుని రాము మనంబు వేఁగఁగా
మొకములు కొండలుం జనము - మేదిని నాకము చెందె దుఃఖమున్. ౯౨౦

ఉ॥ కాంచుము తేరి చక్రము ది - గంబడి పోయినదారి యియ్యెడన్
గాంచును దేనిఁ దాఁక భయ - కంపితుఁడై భువిఁ గెల్లగించుటల్
కాంచఁగరాదు కార్యమిటఁ - గాడ్పడి యజ్ఞులపొల్కి నిల్చినన్
కాంచఁగ నేను వారు దవ్వు - గాఁ జను ముందని లక్ష్మణుండనన్. ౯౨౧

రామలక్ష్మణులు సీతను వెదకుచుఁబోవుట.

చ॥ సరియని రామచంద్రుఁడును - చయ్యన నాయుధముల్ ధరించి పెం
దెరువును పట్టి క్రమ్మఁకు లవ - నీ ధరము ల్నలఁగంగ వేగమై
నరదము భూమిమీఁదఁ జని - నంతకు దుర్గమ కాననస్థలిన్
దరియుచు దాఁటుచుం గడఁక - తక్కక యేగె ననుంగుఁదమ్ముతో. ౯౨౩

చ॥ ధరణి శతాంగ చక్రముల - దారియు గుర్తులు తేలిపోయి యం
బరమున నేగినట్లు నడి - పాఱుటచే వ్రణమందు నీఁటె పో
టారసిన లీలఁ దోఁపఁ గన - నోపుట కెయ్యది మార్గమంచు నం
బురుహవిలోచనుం డనఁ బ్ర - పూర్ణ గుణాంబుధి లక్ష్మణుండనున్. ౯౨౪

శా॥ అన్నా! చూడుము తేరు దక్షిణదిశా - ప్రాంతానకుం బోయిన
ట్లెన్నంగాఁదగు నీశరంబు పోడవే - యీవ్యోమ మార్గంబు నీ
కన్నుల్ బాష్పము గార్చుచుండ నెదియుం - గాన్పించునే? పోదమీ
తెన్నుంబట్టి యుదంతముల్ తెలియనౌఁ - దెల్లంబుగా మీఁదటన్.

చ॥ అన నది యుక్తమంచు వను - ధాధిప వర్యుఁడు తమ్మతోడ యో
జనములు రెండు దాఁటిచని - చక్కటి నొక్కనగేంద్రమే ప్రభం
జనహతిఁ దల్లడిల్లిందులుగ - జాలిన కైవడి పీనొకొక్క మొం
డనువుగ ధారణిం బడుట - యల్లనఁ గాంచెను సంశయించుచున్. ౯౨౬

చ॥ కని జనకాత్మజాతకయి - కయ్యము గల్గిన దియ్యెడన్ భరం
బున దనుజాళితో విబుధ - ముఖ్యులకంచుఁ దలంచి తుండ ష్మ

ర్ధనమునడాలు ప్రీలఁగని - తద్దయుఁ గన్నుల బాష్పబిందువుల్
తొంగఁగ లక్షణుఁగని సు - దుఃఖముతో రఘురాముఁ డిట్లనున్. ౨౭

చ॥ అరయుము లక్ష్మణా! జనకుఁ - డైన జటాయు కరాళ తుండదు
ర్ధరహతిచేతఁ ద్రుంగినది - రాజిత సత్త్వముచే నెదుర్చు న
ప్పరమగుణాబ్ధి కేమిగతి - పాటిలెనో? యొకరుండు దేహముల్
వరలెను వార్ధకాసఁ బలు - వత్సరముల్ కడద్రోచె నావుడున్. ౨౮

ఉ॥ మంచిదె తండ్రి చాల మతి - మంతుఁడు వృద్ధుఁడు సత్త్వశాలియున్
గ్రంచరనేగి యాతనిని - కాంతము వారల నడ్డగించుచున్
మించి నిశాటులం దునిమి - మేలుగ సీతచెలున్ వదల్చు యో
చించుచు నిట్టులుంట సాగ-నే యని తమ్ముఁడు పల్క రాముఁడున్. ౨౯

ఉ॥ జాలమొనర్చ కేగుటయొ ♦ చక్కటియంచుఁ దలంచి భూమిపై
గాలివలెం జరించుచును ♦ గాలిపటంబు క్రియన్ భజించి జం
ఘాలురు రామలక్ష్మణులు ♦ కార్ముకమొక్కటి యింద్రచాపముం
బోలెఁ బయోధి వీచికయుఁ ♦ బోలెఁ దునుంగుట గాంచి రచ్చటన్. ౩౦

ఉ॥ తమ్ముఁడ! కాంచితే ధనువు ♦ ధారణిఁబడ్డది దేవదానవుల్
గ్రమ్మి పయోనిధిం జిలుకు ♦ కవ్వపుఁగొండను పోలు సత్త్వుఁడుం
దమ్ములపొందుఁ బోలిన ప్ర ♦ తాపము గల్గిన యజ్జటాయువే
యమ్మెయిఁ ద్రుంచెనంచు సమ ♦ రావనిఁజూచుచుఁ బోయిరిద్దఱున్. ౩౧

తే॥ మఱియుఁగొంతదూరముపోయి ♦ మరలఁగనిరి, శూలమొక్కండునారాచ ♦ జాలమున్న
తూణములు రెండు కొండల ♦ తుండులట్లు, పడి విరాజిలు టాశ్చర్య ♦ భరితులగుచు.

తే॥ మఱియుఁగొంతదూరముపోయి ♦ వెలుఁగుగొలుప, సూర్యచంద్రులురిక్కలు ♦ సారిదిఁజేరు
కరణినున్న బొందడమును ♦ కానయెల్లఁ, గ్రమ్ముకొనఁ జీల్చివైచుట ♦ గాంచిరచట. ౩౩

తే॥ పవన జవన తురంగముల్ ♦ పడినచోట్లు, సారథియుఁ దలదెగిపడి ♦ చచ్చుతావు
వానియనుచరుల్ కెడసిన ♦ తానములును, పంక్తికంఠుఁడు సోలిన ♦ పట్టుగనిరి. ౩౪

తే॥ ప్రళయవేళను భానుబిం ♦ బములు పెక్కు, లుర్విఁగూలిన కరణి ర ♦ త్నోజ్జ్వలత్ప్ర
శస్తకుండలములు విభూ ♦ షణచయంబు, తెరలుటంగని కేలువి ♦ దిర్చికొనిరి. ౩౫

తే॥ అంగదములు కుండలములు ♦ హారరత్న, మకుటములు పెక్కులున్నవి ♦ మనజనకుఁడు
వృద్ధుతోఁ బోర నిల్చిన ♦ వీరవరులు, శరభములఁ బోలు పెక్కండ్ర ♦ జాడ దోఁచె. ౩౬

తే॥ శ్రీశుఁడిట్లన లక్ష్మణ ♦ సింహమువిని, తలలుచేతులు పెక్కులై ♦ తనరుకతన
తండ్రితో ననిసేసిన ♦ దైత్యవరుఁడు, దశముఖుండని నామదిఁ ♦ దలఁతు ననియె

తే॥ తమ్ముపలుకులు నమ్మి డెం ♦ దమ్ముకనులు, నిప్పులురలంగఁ జూచుచు ♦ నెగచినడచు
రఘువరుండు రుధిర సాగ♦రమునఁదేలు, నురుతరాద్రినాఁ జను జటా♦యువునుఁ గాంచె.

## జటాయువుంగాంచి రాముఁడు చింతిలుట

ఉ॥ తత్తఱమంది రాఘవుఁడు ♦ తామరఱేకులవంటి కన్నులం
జొత్తిలు బాష్పముల్ తెరువు ♦ చూపఁగ నీయక యడ్డువెట్టఁ దా
నొత్తిలి తండ్రికై వడి స ♦ సూత్కార వైఖరి నొప్పు పక్షిరా
జోత్తముపైఁ బడెన్ భవుకి ♦ లోచ్చయమందొక యుంజనాద్రినాన్. ౯౩౯

తే॥ గడియసేపు రాముఁడు హమ్మ ♦ గాంచియుండె, లక్ష్మణుం డశ్రుమిళితజ♦ లంబుచల్ల
నలినదళలీల గల నయ ♦ నములుదెఱచి, మెల్లమెల్లన నిట్లని ♦ పల్కటిల్లె ౯౪౦

చ॥ పితరులఁ జంపుకొంచుఁ ♦ బృథివీస్థలి నెవ్వఁడు తొల్లి నావలెన్
బ్రతికెను? మున్ను కన్నపితృ ♦ పాదుని వీడితి మారుఁగాఁగ నీ
వతి నసువుల్ త్యజించితివి ♦ తండ్రివి నీవు నిఁకేది దిక్కు? దు
ష్కృతినగు నేను మీఱెడఁ బ ♦ రేతవిభుండనుగా జనించితిన్. ౯౪౧

చ॥ జననిని పోలు ప్రేమగుణ ♦ శాలిని భావి నెఱుంగ కిట్టులే
నవయము నొందితిన్ దెలివి ♦ నందని జానకి కీడు ద్రోవఁదో
డెనయక యొంటిమె నిడుమ ♦ నెన్నక మిత్రబుణంబు దీర్చితో
క్కనికిని గాని నేనిఁక వ ♦ గం గడియించుట యే ఫలంబుకై?. ౯౪౨

ఉ॥ ఏనును తుచ్ఛజీవనుల ♦ నీఁగియె యుందును చూడలేని స
న్మానుల దుఃఖముల్ దొలఁప ♦ మాటయొసంగితిఁ గాన జీవముల్
పూనినవాఁడ ప్రానివలెఁ ♦ బొల్చి సుకృత్యము చేయకున్నచో
నీనరజన్మమున్ నిలుప ♦ నిచ్ఛవహింప ధరాతలమ్మునన్ ౯౪౩

చ॥ తరుణి చెఱం దగుల్పడుట ♦ ధర్మగరిష్ఠుని నిన్ను చంపు ము
ష్కరుఁ డసువూని యుండుటయు ♦ గాదిలి తండ్రివి మమ్ము వీడుటల్
మెరమెరనింప హస్తమున ♦ మేరువువోలిన విల్లుపూని చి
త్తరువు క్రియం జలింపక వి ♦ తంబటి నిల్చిన వాఁడఁజెల్లరే!. ౯౪౪

మ॥ ననుపోల్కిరితిగల్లు వారు గలరే - నాకెంబుగాఁ బ్రాకృతం
బనుభోగించుచునున్న సీత గనుగో - నవ్యాహత స్థైర్యమున్
దనరంజూపి కృతార్థతంగొను మహా - త్మా! యొక్క నీచుండు ని
న్ననుమానింపక కూల్చిపోవ నిఁక శౌ - ర్యం బుండియుం గాల్పనే? ౯౪౫

తే॥ పలువితంబుల నృపుఁడిట్లు - పనవిచిత్త, వికలతం జెందె;సౌమిత్రి - వెగడుకుడిచె;
నపుడు సుంత తెలివినొంది-యండజేంద్రుఁ, డూర్పుపుచ్చుచు నిర్వార-నొగినిగాంచె.

తే॥ రాఘవులఁగని సమ్మోద - శ్రమములుగురియ, తెగినఱెక్కలు ప్రాణంబు - తివిరిన ప్ర
భువనములఁ బొందుపోలికఁ-బొంగినింద-పాపివై చిత్రిననియల్లఁ-బలుకఁదొడఁగె. ౯౪౭

జటాయువు రామలక్ష్మణులకుఁ గర్మప్రభావము దెలుపుట.

ఉ॥ పుణ్యచరిత్రులార! పొలి ♦ వోవు శరీరము వీడ నుంటి నా
పుణ్యవశంబునం దెలియం ♦ బొందితి మిమ్మని చేరఁ బిల్చి యా
పుణ్య జనేశు శీర్షములఁ ♦ బొడ్చిన ముక్కున భానువంశ రా
డ్గణ్యుల మస్తకంబుల రు ♦ టంబుగ మూర్కొని వెండి యిట్లనున్. ౯౪౮

ఉ॥ వంచనచేత జానకికి ♦ వచ్చె దొసంగని మున్న యెంచితిన్
జంచలనేత్ర నొంటి నుట ♦ జంబున వీడితిరేల? యన్న ధ
ర్మాంచిత మూర్తి లక్ష్మణుఁడు ♦ హావడి కారణమెల్లఁ దేటగా
వించి వచింప నాతఁడును ♦ వీనులు క్రుంగ వినంగ లేమికిన్. ౯౪౯

తే॥ వెండి మోమును గన రాము♦విభుఁ డెటెంగి, తెలుపఁ జెవికడ సౌమిత్రి♦ తెలియఁ బలుక
విని గ్రహించి కుమారులు♦వెగడు పడక,యుండునట్లు పల్కఁగ నెంచి♦యొయ్యననియె

తే॥ క్రొత్తగా నొక్కరెద్దియుఁ♦గూర్పలేరు, జన్మ సుఖ దుఃఖములు కర్మ♦సంచయమునఁ
గలుగు నని యెఱుంగక యున్నఁ ♦ గర్మములను, బుద్ధిచే జయించుట యెట్లు♦పొసఁగు

చ॥ విధి కృతమంచు నెంచఁదగు ♦ పీడలు గల్గినవేళ మానసం బెపుఁడు? ౯౫౦
బధికముగాఁగ నొవ్వఁ దన ♦ యక్కఱ మానుట ధీరధర్మమే?
బుధనుతమైన లోకమును ♦ పోఁడిమి సృష్టి యొనర్చి నట్టి యా
విధికిని మస్తకం బొకటి ♦ వీడఁగఁ జేసిన కర్మ మల్పమే?. ౯౫౧

మ॥ సుఖదుఃఖంబులు గల్గువేళ తొలఁగం ♦ జూడంగ నొనట్టిదే?
మఖ విద్వేషి కపాలియై తిరియఁగా ♦ మార్పించె రాహు గ్రహ
ప్రఖరాళీ గ్రసితుల్ రవీందులు, చెడున్ ♦ వర్ధిల్లు శుభ్రాంశుఁడీ
నిఖిలాండంబులు కర్మచేతఁ బొడముస్ ♦ నిల్చున్ నశించున్ దుదిన్.

క॥ చెడుగులు వచ్చుట తీఱుట, పుడమి జనుని పూర్వ కర్మ ♦ మున నగు నిక్కం
బిడుమల నింద్రుఁడు పెక్కులు, కుడువఁడె తొలి? మీరు వినరె♦గురుశాపమునన్?.

ఆ॥ సాటిలేని యోధ ♦ శంబరాసురునిచే, నిర్జరాధిపుండు ♦ నింద నొంద
నపుడు వానిఁ గూల్చె ♦ నజు పట్టి మీతండ్రి, కర్మవశమున యిన్ని ♦ గలుగుఁ జువ్వె.

ఉ॥ వీరవతంస! జానకిని ♦ వీడుటయుఁ దనుజాళి ధర్మవృఁ
మీఱి చరించి త్రెంచుటయు ♦ మిక్కిలి ఖేదము సంఘటించె నీ
ధారణి సజ్జనావళికి ♦ దానిఁ దొలంపుము క్రూరదైత్యులఁ
ధీరత సంహరింపుము క ♦ దింపుము కీర్తిని నిల్పు ధర్మముఁ. ౯౫౬

ఉ॥ భూమిఁ జెకల్చి యెత్తికొని ♦ భూమిజఁ గైకొని పోవు దైత్యు నా
స్థేమముఁ జూపి పోరితిఁ దు ♦ దిఁ దనుజేంద్రుఁడు శంభుఁ డిచ్చు ప్రో
ద్దామ కరాసిచే జతను ♦ వీసరవోవఁగ నిట్లు చేసె నా
కీ మరణార్తి గల్గినది ♦ యిప్పుడె రాజకులావతంసమా! ౯౫౭

## శ్రీరాముఁడు దివిజులపైఁ గినుకఁ గొనుట.

క॥ ఆమాటలు చెవిఁబడ శ్రీ, ధాముని కనుదోయి రక్త ♦ ధారలఁ గురిసెఁ
భీమముగ భ్రుకుటి ముడివడె, ధూమముతో నగ్ని లేచెఁ ♦ దొట్రిలె జగముల్. ౯౫౮

చ॥ నిలుకడ దప్పె ధాత్రి ధర ♦ సీధరముల్ పెటిలెఁ దినేశ చం
ద్రులు గ్రహముల్ గతుల్ బెడియఁ ♦ దోయజగర్భుఁడు లెక్కఁడెఁ జగ
ద్విలయము నాకము న్వడఁకె ♦ దిగ్గజముల్ బెదరెఁ సమస్తముం
దెలిసికొనెఁ రఘుప్రవరు ♦ దీపిత సత్త్వపరాక్రమ స్థితుల్. ౯౫౯

తే॥ ఎవరిపై వ్రాలునొక్కొ యీ ♦ యీర్ష్యయనుచు, జగములెల్లను బెగడొంది ♦ సంచలింపఁ
బొగయు నిప్పును వెలువడ ♦ భూరి భీక, రముగ నట్టహాసంబుతో ♦ రాముఁ డనియె.

చ॥ తెలివి యొకింత లేని యొక ♦ తెక్కలి దైత్యుఁడు నా సతీమణిఁ
బలమునఁ గొంచుఁ బోవ నొక ♦ పాటిగ మీరిటు గాఁగ నుంత ఛే
తిలని దిశావృతంబు జగ ♦ తీతలముం గని యూరకున్న ది
వ్యులఁ బరిమార్తు నిప్డె కని ♦ యూఱట నందుమ తండ్రి! యీయెడన్.

ఉ॥ రిక్కలు రాల సూర్యుఁడును ♦ ప్రేల సభస్థలి నిప్పు గ్రమ్మఁగా
నొక్కటఁ బంచ భూతములు ♦ నుర్వి చరాచర జీవ కోటులుఁ
ద్రుక్క సమస్తలోకములు ♦ చూర్ణముగా దిశలుం బగుల్లగా
నుక్కటి బ్రుంగుచుండఁగ స ♦ ముత్సుకతన్ గను తండ్రి! యిత్తఱిన్.

చ॥ అని రఘుపుంగవుం డదర ♦ సంబుజమిత్త్రుఁడు మేఘ మండలం
బున నడఁగారె దిక్కరులు ♦ పొక్కుచుఁ బొఱె జగంబులెల్ల జం
కెనయును బిమ్మిటిం గొనిన ♦ ఖేదము చెప్పఁగ నేల? దిట్ట ల
క్ష్మణుఁడును జంకెనన్న నుడి ♦ చాలదొ? తక్కటి యేల పల్కఁగన్?. ౯౬౩

## జటాయువు రామునకుఁ గర్తవ్యము దెలిపి ముక్తుఁడగుట.

ఉ॥ రాఘవుకోప జృంభణ భ ♦ రంబు జటాయువు గాంచి యిట్లనున్
నీ ఘనకోపమున్ విడుము ♦ నిర్జరులున్ ముని చంద్రులున్ వరా
మోఘ భవద్బలంబునన ♦ మోఁదరు పోఁకుల పోరునీఁగి దుః
ఖౌఘములం దృజింతురు దు ♦ రాత్ముల వేఱొక రీతి దోర్తురే?. ౯౬౪

చ॥ అజుని వరంబుచే మదము ♦ నంది దురాత్ముఁడు చేయు చేఁత ల
క్కజముగ నాయెడం దెలిసెఁ ♦ గాదె? మఱొక్కటి యేల చూపఁగన్?
భుజగులు వేల్పులు న్నరులు ♦ పూజ్యుఁడు బ్రహ్మయు వానిసేవలన్
గుజగుజవోవ, ధర్మువును ♦ కోరి చరించెడు వారలుందురే?. ౯౬౫

ఉ॥ వైరులయొద్ద సేవకుల ♦ వైఖరి స్త్రీలవలెం జరించుచున్
భూరి సుఖంబుల న్విడిచి ♦ పొక్కుచుఁజావక వేల్పులెల్ల మున్
శ్రీరమణుండు పాల్కడలిఁ ♦ జిక్కిన వేళ ననుగ్రహించి దే
వారుల నేమఱించుచు ద ♦ యన్ సుధ యీయఁగ నుండి రింతకున్.

ఉ॥ బాహు బలాఢ్యులార! వర ♦ వర్ణినిఁ గానల నొంటి డించి మా
యా హరిణంబు వెంటఁ జని ♦ యచ్చపు మీకులగౌరవంబు సం
దాహ మొనర్చినార లది ♦ తప్పక మీదగు తప్పుగాక సం
దేహములేల? మానవులు - దెప్పిన వారల నేరమౌనొకో? ౯౬

ఉ॥ కావునఁ గోప మందకుము - కాంత యరుంధతి వంటి సీత దుః
ఖావలిఁ బాపి వేలుపుల ♦ యంగద క్రుంగఁగఁ బాపి వర్ధిలన్
రావణుఁ గూల్చి లోకముల - రక్షణసేయుము యంచుఁబల్కి తా
పావిల మానసుండయి ద ♦ యాళు జటాయువు మూసెఁగన్నులన్. ౯౬౮

మ॥ విహగశ్రేష్ఠు వినీతి సంభృత వచో ♦ విన్యాసమున్ మూర్ధమం
దహరేశాన్వయుఁడూనె నాత్మ పితృవా ♦ క్యాళింబలెన్; ధర్మ సం
గ్రహమున్ దైత్య వధంబు ముఖ్యమగు నా ♦ కర్తవ్య మిచ్చోఁ గ్రుధా
బహుళ వ్యాహృతులేల యంచు నుడిగెన్ ♦ బ్రజ్ఞాయుతుండై వెసన్.

మ॥ శ్రమగొన్నారలు బాధ నొందితిరి వి ♦ శ్రాంతిం గొనుం డేను పోఁ
డిమి మీయాజ్ఞ శిరమ్మునం దునుచు కం ♦ టిన్ వేఱు నాకేది మో
దము గల్గించును? సీత నెచ్చటికి నా ♦ దైత్యుండు కొంపోయెఁ? ద
త్క్రమముం దెల్పుఁడు నా జటాయు వలసెన్ ♦ దప్పెన్ స్మృతిన్ మీఁదటన్.

మ॥ అరవిందాసన శంకరాదులును సర్వా ♦ మ్నాయముల్ వేని పా
దరజంబుం గనుఁగొంటకై శ్రమములన్ ♦ దైవాఱఁగా నోర్చియున్

బొరయం జాలవొ యట్టి రామ చరణాం ♦ బుల్ గాంచి ధన్యాత్ముఁడై
దొరసెఁ శాశ్వతమోక్ష లక్ష్మి విహగేం ♦ ద్రుం డాత్మ సాక్షాత్కృతిన్.

మ॥ అటఁ బక్షీంద్రుఁడు ముక్తినొందఁగ నిలిం ♦ పాదుల్ రఘుశ్రేష్ఠు లు
త్కట శోకావిలచిత్తులెరి యల కాం ♦ తార ప్రదేశంబు సం
కట పాటొందె మృగాళితోఁ దరులతో ♦ తత్త్వ భృత్సమూహంబుతో
బటు దుఃఖంబున శీర్షమందు కరముల్ ♦ బంధించె లోకావళుల్. ౯౨౨

మ॥ శ్రమలం బొందితి దుష్టరాక్షసునిచే ♦ శౌర్యంబు గోల్పోయితిన్
దమినై ఘోర తపంబు సేయుదున? దై ♦ త్యశ్రేణి మర్దింతునా?
యమినై ప్రాణములం దృజింతున? మహా ♦ యం బెయ్యదో తెల్పు శ్రే
యములం గూర్చెదు తండ్రిఁ గోలుపడి యె ♦ ట్లంకింతు జీవంబులన్?. ౯౨౩

మ॥ అను నన్నంగని తమ్ముఁడిట్లను మహా ♦ త్మా! నిత్యతేజా! పురా
తన కర్మంబుల నింద సేయఁ దగునే? దాయంబు రెచ్చెన్నఁ జిం
తను పొందన్ ఫలమున్నె? రక్కసులఁ గ్రో ♦ ధం బాఱఁ జక్కాడి యా
వెనుకన్ దుఃఖము నొందఁగాఁదగు మదిన్ ♦ వీక్షింపుమా తత్త్వముల్.

శా॥ అన్నా! మీరు మదిం గలంగి కడు దై ♦ న్యంబూని విభ్రాంతి నా
పన్నన్ మావదినెన్ విడన్ దలఁతురే ♦ బందీకృతన్? బుద్ధి సం
పన్నుండౌ మనతండ్రి గీటడఁచు క్ర ♦ వ్యాదున్ వడిం జంప కి
ట్లెన్నన్ శోక పయోధిఁ గ్రుంకుచుఁ దపం ♦ బీ కొంటయుం బోలునే?

మ॥ అనుజ శ్రేష్ఠుని వాక్కులొప్ప విని ♦ దైన్యంబున్ విసర్జించి యా
దనుజ శ్రేణి వధించుటే తగవుగాఁ ♦ దర్కించి సౌమిత్రితో
మనుజాధీశుఁడు పల్కె నీతనికి సం ♦ స్కారంబు గావింతమా
తనుజన్ముల్వలె నొర్ధ్వదైహికములం ♦ దాత్పర్యమేపారఁగన్. ౯౨౬

తే॥ అని యగురు చందనేంధనా ♦ లరసి తెచ్చి, పేర్చి దర్భలు పఱపి పై ♦ విరులు సల్లి
యరణి మథియించి యనలంబు ♦ నెరియఁజేసి, విమల జలమున స్నానాది ♦ విధులుదీర్చి

చ॥ కరములఁ బట్టి యెత్తి తగఁ ♦ గాష్ఠము పేర్పునఁ జేర్చి వేద వి
ద్వరుఁడు రఘూద్వహుండు శ్రుతి ♦ పద్ధతిఁ దక్కకచేసి యవ్వలన్
శిరము కెలంకునం గొఱవిఁ ♦ జేర్చి దహించి కొలంకులోనఁ గ్రుం
కి రహిని తర్పణాదులను ♦ గీష్పడ కుండఁగఁ జేసి నెమ్మదిన్. ౯౨౭

తే॥ పితరులకు నెల్లఁ దర్పణ ♦ విధులు తీర్చి, యించుక జలంబు తాఁ ద్రావి ♦ తృప్తిహొంద
బ్రహ్మ మొదలుగ నెల్ల జీ ♦ వ ప్రతాన, మును సంతృప్తివహియించె ♦ మోదమంది

మ॥ జయశీలుండగు రామ భూవరుఁడు శా ♦ స్త్ర ప్రక్రియల్ దీర్చి సం
శయముల్ మాని నిశాట మర్దన మహా ♦ సక్తిం బ్రకాశింప ని
శ్చయ సంతోషమునం దలిర్చెఁ గ్రతు భు ♦ క్సంఘంబు, భానుండుఁ ద
త్ప్రక్రియఁ దానుం బొనరింప నేగెననఁ గ్రుం ♦ కెం బశ్చిమాంభోనిధిన్. ౯౮౦

## ౯ అయోముఖి పటలము (౧౦౧)

చ॥ సరగున రామలక్ష్మణులు ♦ సంజను తత్థ్సలి వీడి కారు చి
చ్చు రవులు వెల్గుచేఁ దెరువు ♦ చొప్పు గనంబడ నొక్క నల్లనౌ
గిరివరమందు చేరి రటఁ ♦ గీల్కొనె నింద్రు జయించి రేఁగు రే
దిరుగుడు మూఁకలట్లు కడుఁ ♦ దెట్టియలై యిరు లగ్గలించుచున్. ౯౮౧

ఉ॥ అయ్యెడ కానలున్ గిరులు ♦ సన్నియుఁ దేనియ చింది వాఁగులన్
గ్రయ్యఁగ దుఃఖమొందు క్రియఁ ♦ గానఁగ నయ్యెను వారి చింతతో
నెయ్యు జటాయుపాతమును ♦ నిండిన కోపము నాన తెల్వియున్
డయ్యుటయుం బెనంగొని య ♦ డందల మిక్కిలి నొంచి యారిచెన్. ౯౮౨

మ॥ ఘన విజ్ఞానము లేని మూఢుఁడు తగం ♦ గర్మంబుచే నొందు సం
జననంబుం బలె రేయియున్, ఘృతము నో ♦ జం బోయ వగ్గిల్లు న
గ్నిని పోలెం గడు వేఁడి యూర్పులు పెరిం ♦ గెన్, నిద్రరాదయ్యె రా
ముసకు న్నిందిత రీతి దార జనకుల్ ♦ ఘోరాములం బొందుటన్. ౯౮౩

రాముఁడు సీతం దలంచికొని పరితపించుట.

రాము నేత్రపద్మంబులు ♦ రాత్రులందు, ముడుఁగకుండుట సీతయున్ ♦ జడధి కన్య
ఏడి యుంటకో? తన్ముఖ ♦ విధుని చూడ, కుంటవలననో? మది తన ♦ యొద్దలేదో?

తరల॥ అతని కన్నుల ద్రిమ్మరఁ గప్పడి ♦ నట్టులున్న వసుంధరా
సుత వరాకృతి కప్పు కుప్పలు ♦ శోషిలం బొలుపారెఁ దా
మతిని నిబ్బరమంది లక్ష్మణు ♦ మాడ్కి జెప్పలు వ్రాల్ప క
ట్లతివ రూపు నిమేషణ స్థితి ♦ నంది కాంచుచు నుండఁగన్. ౯౮౪

తే॥ మైథిలాత్మజా శోభాయ ♦ మానమైన, మోము గాంచితి నని తాను ♦ మురియుసట్లు
మలయపవనసర్పముప్రాఁకు♦మంచచక్షీయను, కాంతిగల చంద్రబింబంబు♦కానఁబడియె.

చ॥ అతనుఁడు పొంచియున్న తెర ♦ నవ్వలఁ ద్రోచి జగంబు లెల్ల నా
యతమతిఁ గాంచు నట్టులు ర ♦ యంబునఁ జేసిన చంద్రకాంతు లు
ద్ధతి భుజగంబు ఘోరవిష ♦ దంష్ట్రిలతోడ వియోగ బాధిత
ప్రపతిని కాటువైచి పలు ♦ వంతలు గూర్చెడు నట్టు లేసరెన్. ౯౮౫

చ॥ జనకజ లేని చింతయు వి ♦ సంబును చల్లెడు చంద్రుపీడయుఁ
బెనఁగొన నేమిదోఁచక వి ♦ భిన్నతనొంది ఫణీంద్రువంటి ప్ర
న్నని మృదురోమరాజి నలి ♦ సమ్మను మించిన మోము పాలఁ బో
లిన పలుకుల్ గలట్టి లవ ♦ లీ లలితాంగిఁ దలంచి కుందుచున్. ౬౫౫

క॥ పెదవులఁ గఱచుచు నిట్టూ, ర్పొదవ భుజము లదర నిన కు ♦ లోత్తముఁడు మదిఁ
మదగజము విఱిచివైచఁగఁ, గుదివడు లేఁ గొమ్మవంటి ♦ కోమలిఁ దలఁచుఁ. ౬౫౬

ఉ॥ వంచిన నింటితో వడిగ ♦ వచ్చును వచ్చునటంచు దిక్కులం
కించుచుఁ జూచె నేమొ కిల ♦ కించితవర్తన నంచు లోన భా
వించుచు వారిధిపై నిరియు ♦ వీచికలంబలె నెచ్చుతగ్గుగా
వించెడు నూర్పుతోడఁ బల ♦ వించె మదిం బయ లుబ్బకుండఁగన్. ౬౬౦

తరల॥ మెఱుపుఁ బోలిన వక్రదంష్ట్రిలు ♦ మీఱ భీకరరూపుఁడై
వెఱపు పుట్టఁగ నిల్కునిల్మని ♦ వెక్కసించుచుఁ బంక్తికం
ధరుఁడు డాసినవేళ జానకి ♦ తత్తఱించెనో? సోలెనో?
విరవిరం గొని విహ్వలించెనో? ♦ భీతి నన్ను తలంచెనో? ౬౬౧

తరల॥ విషధరంబు గ్రసించుచుండఁగ ♦ విన్ననౌ విధువై ఖరిఁ
విషమ సంస్థితినొందు మైథిలి ♦ వీరుఁడేలొకొ రాఁడు నా
విషయమే యుఁక విస్మరించునొ? - విశ్రవస్సుతు ధాటికిఁ
విషధరాభ శరీరుఁ డల్కియు ♦ వీడెనంచుఁ దలంచెనో? ౬౬౨

తే॥ అనుచుఁ బరువును ప్రేమంబుఁ ♦ దనకు జ్ఞప్తి, పఱుపఁ గష్టమునొందిజీ ♦ వములుకలఁగ
దైన్యమందిన శ్రీరామ ♦ ధాత్రివరుఁడు, తలరి నాకింక విల్లు కా ♦ వలెనె? యనును

తే॥ ధనువు నెగ దిగఁ జూచి మం ♦ దస్మితంబు, సేయు భుజగిరులం గాంచి ♦ చిన్నవోవుఁ
జెలువఁ గాపాడలేమికి ♦ సిగ్గునొందుఁ, గడకు రాఁగల నిందకుఁ ♦ గలఁగి జంకు. ౬౬౪

తే॥ మంద పవనునిచే మేను ♦ మలయుచుండ, నానరారోహ కులసతి ♦ నన్నుపాసి
పరితపించెనొ ప్రాణముల్ ♦ పాసె నేమొ, యనుచు నిట్టూర్పులొనరించు ♦ నటమటించు

క॥ జగములఁ గావఁగఁ బూనితి, మగువ నొకతెఁ గావలేక ♦ మఱుఁగుచు నుంటిఁ
జగజెట్టి గానె యేనని, నగు సిగ్గులు నలఁతనొందు ♦ నవయుం గుములుఁ. ౬౫౬

క॥ నుసలును తమ్ముఁడు పఱచిన, కిసలయములు మాఁడిపోవఁ ♦ గెడపును నూత్న
వ్యసనము వర్ధిల్లఁగ మా, నసముం దపియింప భ్రమయు ♦ నలఁకువ సెందుఁ. ౬౬౭

ఆ॥ కమలములను బోలు - కనుల తెప్పలు వ్రాల్చి, కల్పకాలములను - కడపు నతఁడు
నిసి ముగింపు గనఁడు - నేలఁతే లేమిరొయొ? యభి, మానమునవొ? క్షతము-కానరాదు,

క॥ అన్నా లక్ష్మణ! దివసము, లన్నియు ముషు సమములగుట - యరయుదు గద నే
డిన్నియమమ్మున నిన్నటి, కన్నను నిసి దీర్ఘమైన కత - మెయ్యదియో?. ౯౯౯

క॥ చెలి మోము సాటి నెనయమి, నలఁగుదు సిగ్గునను దిన ది - నంబు మలయుచుఁన్
నెలతేఁడా! నాసతి ముఖ, జలజము మఱుఁగగుడు నేఁ డె - సంగెదు కడిమిన్. ౧౦౦౦

క॥ గగనమున నుండి సూర్యుఁడు, పొగడొందిన తనకులంబు - పొలుపు సమసి నేఁ
డగడొందె ననుచుఁ జింతను, జగతీస్థలి దాఁటి యవలఁ - జని మరలండో? ౧౦౦౧

ఆ॥ ఇనుఁడు పుట్టకుండె ♦ నేల? వివస్వంతు, గుఱ్ఱములను రథముఁ ♦ గూడఁబట్టి
కట్టి రావణుండు ♦ కారాగృహంబున, నుంచఁబోలుఁ గాక ♦ యున్నరాఁడె? ౧౦౦౨

ఆ॥ ఉడుకఁబోలుఁ మధ్య ♦ మొప్పారు జానకి, కానకుండు పోడవు ♦ గలుగు రాత్రి
తోడ లోకలయము ♦ తోతెంచు జాడలే, యెఱుఁగనయ్య మదికి ♦ నింతనిజము. ౧౦౦౩

తే॥ తాపసులకుఁ గ్లేశముఁ గూర్చి ♦ ధాత్రిఁబంపు, ప్రాణులంజంపి తిను దైత్య ♦ వరులు బ్రతికి
యుందురేనియు ధర్మవు ♦ నూఁదియున్న, వారు నిల్తురే? తగవున ♦ వఱలునేది? ౧౦౦౪

ఆ॥ చెఱకు వింటఁ దేంట్ల ♦ శింజిని నెక్కించి, విరి శరములఁ బూని ♦ వేయఁ దొడఁగె
మారుఁ డంబరంబు ♦ మఱుఁగుననిల్చిరా, ఘువుని మనసు తలరి ♦ కలఁగిమలఁగ. ౧౦౦౫

ఉ॥ వీడిన దానిఁ గై కొనఁగ ♦ వీ లిసుమంత లభించునేని యా
పీడినదానికై జతను ♦ వేకొను మానవుపోల్కి రాముమై
పోఁడిమిఁ గాంచి మానసము ♦ పొక్కఁగ మారుఁడు కుందె మున్నుతా
నాడిక రుద్రుకంటి సెగఁ ♦ దాఱిన మేనిఁ దలంచి పొందఁగన్. ౧౦౦౬

తే॥ నీలనీరదశ్యాముని ♦ నెమ్మనమునఁ, దూఱె యారాత్రి శూలమై ♦ దూసిపోవఁ
గమల గర్భుని కల్పాంత ♦ కాలమట్లు, కడచెఁ జీఁకట్లు కొండల ♦ గవుల కేగ ౧౦౦౭

ఉ॥ క్షీరపయోధిఁ దా వలచు ♦ శేషుని శయ్యను నిద్రవీడి సీ
తారమణీ మణీ విరహ ♦ దాహ రసాంబుధి మున్గుచున్న యా
వీరుఁడు నీడజాది వన ♦ విశ్రుత నాదము తోడఁ దన్నిషం
గారవమొప్ప లేచె; నటు ♦ గల్గక జీవులకున్నె నిల్కడల్? ౧౦౦౮

చ॥ నెమిళులు జింకలున్ గరులు ♦ నెమ్మది జంటలుగాఁ జరించుటల్
తమకుచుఁ గాంచు రామునకు ♦ ధైర్యము నిల్చునె? తేనె కోకిలం
బమృతము వీణ వేణువు వ ♦ రాంగ రసాలముఁ గేరు క్రమ వా
క్యములు గలట్టి మైథిలిని ♦ కానలఁ గోల్పడి కుందకుండునే? ౧౦౦౯

చ॥ తెలతెలవాఱఁ గాంచియును ♦ తేఁకువ జానకి యించు పల్కులన్
దెలియని రామచంద్రునకు ♦ నిన్న జలేజముపై వసించు హం

సి లలి వహించు నమ్మగువ ♦ సీత నిజంబుగ నేఁడు లేమి ని
చ్చలముగ జూపురీతిఁ దోలి ♦ చక్కని భానుఁడు పుట్టె నయ్యెడన్ ౧౧౧౦

చ॥ అడవులఁ గాంచి యందు తిరు ♦ గాడెడు జక్కవజంటఁగాంచి నె
న్నడగల కేకులం గని వ ♦ నంబుల హంసలఁ బూలగుత్తులన్
బెడఁగగు నేణులం గని వి ♦ భీతమృగాక్షి వరాంగపాళిఁ దా
నెడఁదఁ దలంచి చింతగొను ♦ నిచ్చట నచ్చట నిల్చి నార్తిమై ౧౧౧౧

చ॥ ఇటులు తపించు నన్నఁ గని ♦ యెద్ద కలంగి సుమిత్రపట్టి సం
కటపడి లో నలందురి వి ♦ కారము వెల్వలఁ దోఁపనీక మీా
రిట నెతచెంది మూవదినె ♦ నేర్పడ రోయక నిల్వఁ బాడి గా
దట మనతండ్రి పల్కు దను ♦ జాధము తావును కాన లెండనన్ ౧౧౧౨

తే॥ సరి యనఁగ నిర్ఝరును కొండ ♦ సందులందు, తూటిపెక్కు వనంబులు♦దొడ్డగిరులు
నదులు దాఁటుచుఁ జనిచని ♦ నాఁడు పూర్తి, నడచి పదునెన్మి దామడల్♦కడచినారు.

తే॥ వసుమతీ తపఃఫల సంభ ♦ వంబు జాన, కీసతిం గానఁ జాలకుఁ ♦ గిన్కయడర
నిశ్వసించుచు వారలు ♦ నీడజాత, నాద మేదురమైన వ ♦ నంబుఁ జేర ౧౧౧౪

తే॥ తనకు లేశుల హృదయ చిం ♦ తనము లెఱిఁగి, యన్ని చోటుల జానకి ♦ నరసి యరసి
కనక మేరువు నపరభా ♦ గమున వెదకఁ, జనినతెఱఁగున భానుఁడ ♦ స్తమయ మందె

ఆ॥ జ్ఞానపక్కి నెఱుఁగఁ ♦ జాలని మూఢుల, మనసు కంటె మించి ♦ కనులు గాన
రాని రీతిఁ జెలఁగి ♦ రాముని తనుకాంతి, గెలువనేమొ దిశల ♦ నలమె నిరులు ౧౧౧౬

తే॥ వీణతంత్రులకును సొంపు ♦ నలయనేర్పు, శారికలు చిల్కలకు బడి ♦ చదువునేర్పు
వనమునం జంద్రమండల ♦ పక్కినున్న, పటికతా♦ మండపమున ని ♦ ల్వఁగఁ దలంచి

ఆ॥ కూరుచుండి రామ - ధారణీ నాథుండు, తమ్ముఁగాంచి యిచట - దాపునందు
నీరు గలుగునేని - నెమకి తెమ్మన లక్ష్మ, ణాఖ్యుఁడరిగె విల్లు - నమ్ములూని ౧౧౧౮

నీరు తేఁబోయిన లక్ష్మణుని అయోముఖికాంచి కామించుట

ఆ॥ జలము వెదకి వెదకి - తెలియక సౌమిత్రి, యొంటరిగ మృగేంద్రు - నొప్పునఁజను
నచట నెలవుకొన్న - యాది యయోముఖయను, కాంత గాంచె నతనిఁ - గాముకియయి

తే॥ మంత్రమునకు లొంగని పాము♦మాడ్కివెంట, నంటియసుర యా సౌమిత్రి♦నరసినంత
గర్వకోపమ్ములను ద్రోచి ♦ కడఁకనితఁడు, మరుఁడె నన్నిందు వెదకుచు♦మసలువాఁడు.

క॥ అనియంధకార మందున, ఘనతర మోహాంధకార ♦ కలిత హృదయమై
మనసిజుని కవయఁ గౌఁగిలి, గొనుటొప్పనుగాని భ్రమింగఁ♦గూడునె యనుచున్. ౧౧౨౧

ఆ॥ వేఁడుదాన వీఁడు ♦ వినఁడేని కడుదవ్వు, గొనుచుఁబోయి యచటఁ ♦ గుదురుపఱచి
యలమి యెడఁదఁగలుగు ♦ నలమట నెడలింతు, ననుచు నెదుట నిలిచె ♦ నసురవనిత.

సీ॥ నిట్టూర్పులందుడి ♦ నిప్పులు చల్లుచు, పెనుపండ్ల నిభముల ♦ విఱిచి నమలి
మ్రింగనుబ్బిన పొట్ట ♦ మీఁదఁజుట్టిన కొండ, చిలువల చనుకట్టు ♦ గలయఁజూచి
శరభ సింహముల దా ♦ సరి పాములంగట్టి, కాళుల నందెలు♦గా ధరించి
యన్ని వస్తువులఁ గ ♦ ల్పాంత మందున మ్రింగు, మిత్తిఁబోలిన మోము ♦ నెత్తి పైకి

తే॥ కడలి నీటినెల్లను ముంచు ♦ గరిఁబెపగిది, వెలయు నోటితో బడబాగ్ని ♦ విధమునొంది
విరిసియున్న వెంట్రుకలతోఁ♦బృథివిఁ దిరిగి,గొలుచునట్టిపాదములతోఁ♦ దలముమీఱి

సీ॥ రక్తమాంస క్రియల్ ♦ క్రమ్మి చాలుగఁ జిందు, ఘనకటి శవముల ♦ కాంచి యొప్పఁ
బ్రళయ కాలానల ♦ ప్రభనొప్పి మిడుఁగుఱుల్, చిటపట కన్నులఁ ♦ జెదరు చుండఁ
బాద సంఘట్టన ♦ మేదిని వణఁకుచు, జానయా యిదియని ♦ సంశయింప
వననిధి మోఁకాటి ♦ బంటిగాఁ గొండలు, తిప్పలై దొరలుచుఁ ♦ దెరలిపడఁగ

తే॥ పాఁప కడియముల్ ముంగేలఁ ♦ బరిఢవిల్లఁ, బులుఁ దండ లష్టాపద ♦ముల మినుకులు
సింహముల కుండలమ్ములు ♦ చెలఁగుచుండ, నడచె లక్ష్మణు నెదుటికి ♦ బెడిదురాలు.

తే॥ నిలిచి వలపున నానంద ♦ జలకణంబు, లెఱ్ఱ చిన్నకన్నులనుండి ♦ వఱ్ఱువాఱఁ
జూచెఁ దద్దంష్ట్రికాకాంతిఁ♦జొప్పడంగఁ,గాంచె లక్ష్మణుండును దాని♦కాయసుషమ.

తే॥ మునుపు ముక్కంటఁ దెగిన శూ♦ర్పణఖగుణము,తోడఁ దాటక గుణమును♦కూడినట్టి
యీచెడిపె దుష్టరాక్షస ♦ బృందమందు, తిరుగునొక కరాళికయని ♦ తెలిసె నతఁడు.

ఉ॥ వీరలు పాపవర్తనలు ♦ వీఱిఁడులుఁ బలుపాఱు స్వైరిణుల్
కారణమొండె మాకడకుఁ ♦ గ్రచ్చఱ వచ్చుటకంచు లక్ష్మణుం
డారసి ఘోరకాననము ♦ నందు నిసిం జనుదెంచితేల?సీ
వేరి పడంతివౌదు వచి ♦ యింపుమ వైళమ యన్న వెంబడిన్. ౧౦౨౭

తే॥ బిడెము లేనిది చలియించు ♦ నెడఁదగలది, యగు నయోముఖి యిట్లను ♦ నానతోడఁ
జాలకాలంబు నీయొద్దఁ ♦ జనవులేని, దాననై నను కాంచితిఁ ♦ దమి వహించి. ౧౦౨౮

క॥ సుందరవీరా! మున్నెవ, రుం దాఁకని నాసఖిత్వ ♦ రుక్మము నీకుం
జెందఁగఁ జేసితి సుఖముల,నొందుము తొలఁగింపు మరుని♦యాగాత్యంబుల్.౧౦౨౯

క॥ ఉపశమమున రక్కసి యిటు, లుపకంఠమునన్ వచింప ♦ నుడుకుచుఁ గినుకన్
జపలిని! యిఁకనిట నిలిచినఁ, గృపమాలిన నాశరములు ♦ గీటడఁచు నినున్. ౧౦౩౦

క॥ తొలఁగుమ యనిలక్ష్మణుఁడన, నలుగక రాకాసి యను న ♦ సంగ సుభగ!జో
తలు సేసెద నాప్రాణం, బుల నిలుపుము చెఱుగులేదు ♦ పుణ్యమె గలుగున్. ౧౦౩౧

క॥ అభయం బిచ్చితి ననుచో, రభసంబున గంగ పుష్క ♦ రమె తెచ్చెద నో
యిభజిద్విక్రమ! నిన్నును, నభమున గొనిపోదు తలఁపు ♦ నం గొనునెడకున్. ౧౦౩౨

క॥ అనుపలుకుల మన్నింపక, కనలున సౌమిత్రి నీదు ♦ కర్ణంబులతో
డను నాసిక తెగఁ గోయక, మునుపే, తొలఁగుట శుభంబు ♦ పొమ్మన నదియున్.

క॥ నే నీనిం గొని నాగుహ, లో వైచిన పిదప నాకు ♦ లొంగును సౌఖ్యం
బావహిల ననుచుఁ దలఁచుచుఁ, ద్రోవ విడిచి యొక్క ప్రక్కె ♦ తొలఁగుచు నిలిచెన్

క॥ మొదటన్ మోహనమంత్రము, కొదుకుచు లక్ష్మణుని వారు ♦ కొని గగనమునం
దెదగందు తోడఁ జను తో, యద మనఁ బఱచెన్ మనోజు ♦ నంగదవలనన్.

చ॥ కరతలమందు పెట్టుకొని ♦ కన్నుల నద్దుచు బొమ్మ చేర్పఁగా
సొరగు తొలంగి లక్ష్మణుఁడు ♦ జోటిక మూఁపున నిల్వ, నబ్ధి మం
దర మటు లుండె నింద్రుమద ♦ దంతిని పోలుచుఁ గుంత హస్తుఁడౌ
హరసుతుఁడెక్కు కేకివలె ♦ నయ్యెను రక్కసి లేమ యయ్యెడన్. ౧౦౩౬

తే॥ దాని కేలను బొమ్మనఁ ♦ దలను మెడను, నిలిచి సౌమిత్రి గజ చర్మ ♦ కలితుఁ డభవుఁ
డైన లయకాల రుద్రు మ ♦ హా సఖేశు, కొమరు విలసిల్లె జంకును ♦ కొంకు లేక.

## లక్ష్మణుఁడు రామికిఁ జింతిలి రాముఁడు వెదకఁబోవుట

ఆ॥ అటులు దైత్యకాంత ♦ యనుజుని గొనిపోవ, నిచట విరహ బాధ ♦ నెనయు చున్న
యిన కులుండు నీరు ♦ కొని తేరఁ బోయిన, తమ్ముఁ గుఱ్ఱ రామిఁ ♦ దత్తఱించె. ౧౦౩౮

శా॥ నీరంబుల్ లభియింపవో? తెరువునన్ ♦ విఘ్నంబు లేపారెనో?
నారామామణిఁ గొన్న వార లెదురై ♦ నారో? దురంబయ్యెనో?
క్రూరాత్ముండగు పంక్తి కంఠుఁ డితనిం ♦ గొంపోయెనో? యేమొకో?
మేరన్ మీఱఁడు వేగవచ్చు నతఁ డ ♦ మ్మేధావి రాఁడేలొకో?. ౧౦౩౯

శా॥ నాజీవంబును బోలు లక్ష్మణుని వి ♦ జ్ఞాన ప్రబోధంబులన్
రాజద్రీతి గణింపకే జనకజన్ ♦ రామామణిన్ మానమున్
దేజఃకాంతులు కోలుపోయి వనటన్ ♦ దీల్పాటు నొందంగఁ దా
నోజం గానఁగ లేక ప్రాణములనే ♦ యుజ్ఝింపఁగాఁ బూనెనో?. ౧౦౪౦

శా॥ దట్టంబయ్యెఁ దమంబు దగ్గఱి పదా ♦ ర్థంబుల్ గనన్ రావు నే
నెట్టే చీఁకటి నెందు రోయుదు మశ ♦ స్సే పుండుగా బాధ యాఁ
కట్టెన్ దోఁప దిఁకేమియున్ జెడితి నా ♦ కాయంబు భారంబుగాఁ
దట్టెన్ జీవితమేల నాకు నను జా ♦ తా! నీవు లేకుండఁగన్?. ౧౦౪౧

చ॥ ఎడ తెగకుండ యుద్ధముల ♦ నేపునఁ బూనిన నాకుఁ బ్రాణమై
యడరిన నీవుఁ గూడ మఱుఁ ♦ గైతివె? తమ్ముఁడ! అన్న! నాయనా!
విడిచెదఁ బ్రాణముల్ ధరణి ♦ వీఁడిడినై బ్రదుకంగ నేరునే?
కడుఁ జెడుగే యొనర్చితివి ♦ గావున నీపని యొప్పు నేరికిన్?. ౧౦౪౨

చ॥ తొలఁగని డెప్పరంబులను ♦ త్రోపుడు సేయఁగఁ జాలు తమ్ముఁడా!
తలఁగని చింత నామదికిఁ ♦ దాపము గూర్చితి బాహుశౌర్య వి
స్ఖలిత మహారివీర! యెద ♦ చంపి యిటుల్ నను వీడ న్యాయమే?
వెలుపల నింత కాల మిటు ♦ వీడి వసించుట నీకు నొప్పునే?. ౧౦౪౩

చ॥ ననుగను తల్లితండ్రులను - నర్మిలి సీతను వీడి జీవినై
చనుటయు నిన్ను బాయ మది ♦ చాలమిచేఁ గద! జానకీ వియో
గ నిభృత తాప కర్శితుని ♦ గ్రమ్మఱ నీవును వీడి నిన్ను రో
యను పని గూర్చి రెండవ మ ♦ హార్తిని నాకిట సంఘటించితే?. ౧౦౪౪

ఉ॥ తమ్ముఁడ నీవు క్రమ్మరిలు ♦ దారి వచించెడు వారు లేరు న
న్నిమ్ముగఁ జేరవేని త్యజి ♦ యించెద జీవము నిక్కువంబు న
న్నమ్మిన సీతయుం జెడును ♦ నాకము దప్పును తండ్రి కింకఁ బ
ట్టమ్మున నెల్ల రీల్గుదురు ♦ డబ్బఱ యింతకుఁ గూర్పఁ బోలునే? ౧౦౪౫

శా॥ మాంధాత్రాది మహీశ వంశమున సా ♦ మ్రాజ్యంబు గైకోక స
ద్బంధు ప్రేమను వీడి వచ్చు నను ని ♦ ర్బంధంబుతో నెల్ల స
ద్బంధుల్ వల్దన సర్వసౌఖ్యముల మ ♦ త్కైంకర్య సంసిద్ధికై
సంధర్షించు ప్రియానుజన్మ! యిట నీ ♦ చక్కిన్ విడంబాడియే?. ౧౦౪౬

తే॥ అనుచు లేచును ధరఁబడు♦సలయుసొలయు,మలయుఁదెలియునుమెఱుపైన♦మెలయ
నిట్టి చీఁకటు లలమె నిం ♦ కెట్టు లనును,నడచుఁబిలుచునుబమ్మెర♦వడలుబడలుఁ గుందు

తే॥ సీతతోడ నాప్రాణంబు ♦ చెలఁగి కావ, నిద్రసెతను వీడిన ♦ నిశ్చలుండు
రామికిం గతమేమి? భా ♦ రమగు పాప, కర్మి కాతనిఁగను నోము ♦ గలదె? యనును.

తే॥ ధర్మ మన్నది జగమునఁ ♦ దనరునేని, మాఱు జన్మంబునందు స ♦ మ్మాన్యుఁడగుచు
నన్నుయగుఁ గాక యతఁడు నా ♦ కనుచుఁగత్తి, దూసి ప్రాణముల్ పోకార్పఁ ♦ దొడఁగు నంత

తే॥ మాయనుండిమేల్కన్నల♦క్ష్మణుఁడుదాని,ముక్కుగోయఁగనొచ్చిన♦మొఱకుటసుర
వైచెఁ బెడబొబ్బ యదివిని ♦ పద్మనయనుఁ- డక్కజంపాటుతోఁ దమ్ము♦నిక్క వరసె

తే॥ గులకటాల యడవియందు ♦ గూడిదైత్య, సమితి లక్ష్మణుతో నని ♦ సలుపుచుండె
నాఁడు ముక్కుపోయిఁచుప్ప♦నాతియో మొ, నేఁడు పేరెలుఁగునఁ గూసె♦నిక్క మనుచు

క॥ నీలాబ్ద నిభుఁడు జ్వాలా, మాలా భీలంబుగలుగు ♦ మార్గణమును కెం
గేలం గీలింపఁ దమో, జాలంబులు తొలఁగి పగలు ♦ చందం బయ్యెన్. ౧౦౫౨

క॥ కొండలు నలఁగఁగ మ్రాఁకులు, తుండములుగ విఱుగ ధరణి ♦ తొడిఁబడ వాతో
ద్దండ గతి నడచె దిశలును, దండ ధరుఁడు పడల వడిగఁ ♦ దమ్ముని దెసకున్. ౧౦౫౩

ఆ॥ విలయకాల కాల ♦ జలధి భూస్థలి మీఁదఁ, దెరలివచ్చు కరణి ♦ సరవరుండు
సరగ రాఁగఁ జూచి ♦ సౌమిత్రి కష్టంబు, వలదు వలదటంచుఁ ♦ బలుకరించె. ౧౦౫౪

క॥ మీకృపచే మీ భృత్యుఁడు, మీకడ కేతెంచె ననుచు ♦ మిక్కిలిభ క్తిం
బై కొని మ్రొక్కుచుఁ గనఁబడె, పోకాడిన చూడ్కి మరల ♦ బొందు పగిది గాన్.

క॥ కన్నీరు దొరఁగ నిల్చిన, యన్నయుఁ దనలేఁగ వెదకి ♦ యలయుచుఁ జేఁపుం
గొన్న పసి కరణి లక్ష్మణు, పెన్నొడలిం దడవి తడవి ♦ విరవిర మూనెన్. ౧౦౫౬

చ॥ పలువఱు దేహము న్నిమిరి ♦ బాధముగాఁగఁ బరిష్వజించి య
శ్రుల ననుజన్ము మైరజము ♦ చొక్కముగాఁ దొలఁగించి తమ్ముఁడా!
తొలఁగితి వంచు నెంతయును ♦ దుఃఖము నొందితి నింతసేపు కా
సల నిటు రేయి తామసిల ♦ నామన మెట్లగునయ్య నాయనా! ౧౦౫౭

ఉ॥ కూరినదేమి తెల్పుమనఁ ♦ గూరిమి నన్నకుఁ దమ్ముఁ డయ్యెడన్
దారిఁగఁ దెల్ప రాఘవుఁడు ♦ తాపము మోదము నంది యిట్లనున్
దోరపు జన్మకారఁబడి ♦ దుఃఖములం గశియింపఁబోలునే?
వారిధిఁబడ్డ వాఁడలల ♦ పాటునకుం జడియంగఁబోలునే?. ౧౦౫౮

తే॥ మూఁడు జగము లొక్కుమ్మడి ♦ ముమ్మరించి, చెనకినను లెక్కసేయక ♦ చీల్చివైతు
నొక్కఁడవు నీవు నాయొద్ద ♦ నుందు వేని, చాలు; వేఱు రక్షణము నా ♦ కేల చెపుమ?

క॥ పోయెడి వెల్లను పోనీ, వేయాపదలైన వచ్చి ♦ విరియ విరియ నీ
నాయయ్యా! నీవున్నం, బాయును గా కడరి నన్ను ♦ పఱుపంగలవే? ౧౦౬౦

క॥ రాకాసిముక్కు గోసితి, నీకడకున్ మగిడితినని ♦ నిగదించితి వా
పోఁకును చంపవు గద కరు, ణాకర! యను రాఘవునకు ♦ నతఁ డిట్లనియెన్. ౧౦౬౧

క॥ చను కట్టుతోడఁ జనుగవ, దొనయుం బలె నున్న ముక్కు ♦ దొడ్డ మొరిఁ బలన్
జెనసెడు చెవుల నసింగొని, తునుమఁగ నేఁచ్చినది యనుచుఁ ♦ దుది నవ్వుటయున్.

క॥ మను వంశ సంభవా! కిను, కను నిను వెన్నంటు ననురఁ ♦ గనలి పయిం ద్రె
క్కొనక దయ తలఁచి విడిచితె, యని రాముఁడు తమ్ము నలమి ♦ యశ్రులు రాల్చెన్.

క॥ అంగదలు తొలఁగ వారలు - గంగాధరు వరుణుఁ దలఁచి ♦ కట్టియఁ బుష్పమిన్
రంగారఁ దొలిచి యంత, ర్గంగం గొని త్రాగి యచటఁ ♦ గడపిరి రేయిన్. ౧౦౬౪

క॥ అడవులఁ జివుళులు పూవులు, తో డరికఁగా లక్ష్మణుఁడు వి ♦ ద్రుచు మృదు శయ్యం
బడి రామవిభుఁడు తమ్ముం, డడుగుల నొత్తంగ రాత్రి ♦ యట శయనించెన్. ౧౦౬౫

క॥ జానకి చెఱ వడు పిమ్మట, మానము వేధించుచుండ ♦ మఱఁగి యొక ఫలం
బేని భుజింపని రాఘవుఁ, డానిక నిద్రింప కలఁగి ♦ యలయుచు నూర్చెన్. ౧౦౬౬

క॥ కన్న పెను కాన జానకి, కన్నులకుం గట్టినట్లు ♦ కానం బడుటల్
మన్నీఁడు మఱవమినో? లే, కున్నన్ రాక్షసుల మాయ ♦ యో? తెలియముగా!

క॥ జనకజ చెంతం దోఁపఁగఁ, దనుకుచు బయలలమి లజ్జఁ ♦ దలరును నన్నీ
వనితామణి డాయును మఱి, వెనుదీయును తనదు నడుము♦విధమున మఱుఁగున్ ౧౦౬౮

క॥ జానో వదనాంబుజమునఁ, దేనియఁ గల దొండపండు ♦ తీరగు నధరం
బానితి నిప్పుడు కనులం, బూనికఁ దెఱవంగ డాఁగుఁ♦ బో! నిదికలయో? ౧౦౬౯

తే॥ తలఁపుకంటెను పంచభూ ♦ తములకంఁటెు, బెద్దదగు దుఃఖ మీరాత్రి ♦ పీడసేసె
చలున తావియు నలుపును♦ వెలయు కురులు, గలుగు కలికి కన్నులకంటె ♦ఘనమెరేయి

చ॥ జలకణ కీర్ణ కారక వి ♦ సార విరాజిత వారిరాశిపై
నలమి విధుండు పుట్టి బడ ♦ బాగ్ని కరార్చులఁ జిమ్ముచుండ నూ
ష్మలత భజించి యాకసము ♦ మై సకలంబును బొబ్బలెక్కని
ట్టలముగ నన్న తీరునఁ గ ♦ డల్కొనెఁ జుక్కలు మిక్కుటంబుగన్ ౧౦౭౧

తే॥ పలువిధంబుల నీరీతిఁ ♦ బలవరించి, కార్శ్య మొంది రాముఁడు మదిఁ ♦ గలఁతఁ జెందఁ
గాంచి లోక బంధుఁడు కని ♦ కరముతోడ, వెలుఁగు తగ్గించి కొనె నన♦ మొలచి వచ్చె

౧౦ కబంధ పటలము (౫౮)

తే॥ ఉర్వికంటెను మిక్కిలి ♦ యోర్పుతోడి, క్రొత్తడితసంబు గల సీత ♦ కొఱకు వెదకఁ
బక్షులును పలవించిన♦ పగిదిఁ గూయు, వేకువను రాఘవులు లేచి♦ వెడలినారు ౧౦౭౩

తే॥ చాలదూరంబు రామల ♦ క్ష్మణులు నడచి, తమ్మినెచ్చెలి గగన మ ♦ ధ్యంబు చేరఁ
జేతులను చాఁచి ప్రాణులఁ ♦ జేర్చి ప్రమింగి, బ్రతుకుచుండు కబంధుని♦ వనము చొరఁగ

తే॥ ఆపిపీలికానేకప ♦ మైన జీవ, వితతి పరుగెత్తి యలసెను ♦ బెదరుచూపు
లొలయ జంకుచు నుండెను♦ వలను దగులు, కొన్న రీతిని విలవిల♦ కొనుచునుండె. ౧౦౭౫

సీ॥ ప్రజల కులాచార ♦ పద్ధతుల్ నెలకొల్ప, లేనివాఁడును కావ ♦ లేనివాఁడు
బలహీనుఁడగు నొక ♦ ప్రభు దేశమున జన, ప్రతతికై వడి భయ ♦ పడెడు నవియు
చెదరునవియు గుంపు ♦ చేరునవియుఁ బఱ, చునవియు విభ్రాంతి ♦ నెనయునవియు
పర్వతప్రియ దొర్లి ♦ వచ్చెడు భూజముల్, పెల్లగిల్లిన యేటి ♦ నెల్లువలును

తే॥ తిరిగిపడు మేఘములు పొంగి♦పొరలువార్ధి, గాఁగఁ గాలుసేతులు పెరుఁ♦గంగఁజాఁచి
సకల జీవులఁ గుప్పగా ♦ జవిరి నోట, వైచికొను కబంధునిచేతఁ ♦ బట్టువడిరి. ౧౦౭౬

చ॥ జనకజ కారణంబున ని ♦ జంబుగ రక్కసిదండు వచ్చి చు
ట్టినదని రామలక్ష్మణులు ♦ డెందములం దలపోయుచుండఁగాఁ
జనఁజనఁ జక్రవాళమను ♦ శైలము డాయుచుఁ జుట్టుచుండె నాఁ
జను బహుభు క్కబంధు కర ♦ సాలములోఁబడి చిక్కిరయ్యెడన్ ౧౦౭౭

తే॥ జానకిని దుఃఖమున ముంచు ♦ దానవేంద్రు, నగర మీమెల్లలోనిది ♦ నవయఁజేయు
మన మనోదుఃఖ మీనాఁడె ♦ మగ్గుననుచు, సన్నపల్కఁగ లక్ష్మణుఁ ♦ డనియె నిట్లు

తే॥ దనుజసైన్యమేమొనఁ జిం♦దముల తుముల, రవము దుందుభి పటహాది♦రావములును
గలుగ వియ్యెడఁ గావుసఁ♦దలఁచి చూడ, నేదియోయిది వేఱని♦యెంచువాఁడ ౧౦౭౯

తే॥ పాలసంద్రంబుఁ జిలుకంగఁ ♦ బాలుపడిన, వాసుకియొ? లేక మఱియొక ♦ పన్నగంబొ?
తలయుఁదోఁకయు వట్రువ♦గలుగఁ ద్రిప్పి,దొరకు వానిమ్రింగెడు చొప్పు♦దోఁచునాకు

ఆ॥ తమ్ముఁడనిన పలుకు ♦ తగియున్నదని రామ, ధరణివిభుఁడు మదిని ♦ తలఁచునంత
మూఁడు యోజనములు ♦ముందఱఁ జని కొండ,పగిదినున్న యాక♦బంధుఁజేరెఁ౧౦౮౧

సీ॥ ఇద్దఱు సూర్యుల ♦ నేక పర్వతమునఁ, బూడ్చిపెట్టిన యట్లు ♦పోలుచు కనులు
కడుపు మధ్యను నోరు ♦ కడలిగాఁ బండ్లసం,దులు యోజనాయతి ♦ యెలయుచుండ
దనుజులు సురలబ్ధిఁ ♦ దర్చుచోఁ జాఁగిన, యహిరాజుఁ బోలిన ♦ హస్తయుగము
కొలిమి తిత్తినిపోలె ♦ జ్వలన ధూమంబులఁ, జెదరఁ జిమ్మెడు ముక్కుఁ ♦ జెరమలొప్ప
తే॥ బాడబజ్వాలవంటి జి ♦ హ్వాయును చేతు, లనెడురాహుని కడలి న ♦ ల్లనిమహీధ్ర
గుహనుచేరిన చంద్రము ♦ గ్రొచ్చి రెండు,గాఁగఁజీల్చినట్లగు దంష్ట్ర♦కలును మెఱయ.

సీ॥ పంచ భూతములును ♦ పంచపాతకములు. కూడి రూపొందిన ♦ కొమరు మేను
కను లను రవి చంద్రు ♦ లను మిండ్రగ వచ్చి ప, క్ష్మలములన్ పాములఁ♦గాంచి రాహు
కేతు లాపనిమాని ♦ కేవల నలరారు, గుహల నిద్రిలి రనఁ ♦ గొఱలు చెవులు
కల్లసాక్ష్యమువల్కు ♦ కఱకరు లొందెడు, ఘన రౌరవముఁ బోలు ♦ గడ్డకడుపు
తే॥ కాల మాసన్నమగు ప్రాణి ♦ గణముఁబట్టి,పడవ వంటి చేతులజ రి ♦ కడుపునందు
వైచు కొనుటలో యమునింటి ♦ వాకిలివలె, నున్న కడుపెద్ద నోటితో♦నొప్పువాఁడు.

తే॥ వారిధింబలె ఘోషించు ♦ వాఁడు హాల, హలమువంటి నల్లనిమేను ♦ గలుగువాఁడు
చక్రమునఁ దలదెగి పడ♦స్రగ్గు కాల,నేమివలెఁ బెనుమొండెంబు♦నెగడువాఁడు.౧౦౮౪

తే॥ పంతమున శిఖరంబును ♦ పవనుఁడెగురఁ, వైవఁ దలలేని మేరువు ♦ వంటిమేను
గలుగువానిఁ గబంధుని ♦ గాంచినారు,రామలక్ష్మణు లిర్వు ర ♦ బ్రంబుతోడ.౧౦౮౫

మ॥ చతురంభోధి పరీతమైన జగతీ ♦ చక్రంబు సర్వంబు సం
గతమై తూఱఁగఁ దగ్గ నోరుగని యీ ♦ యూర్వీ భృద్గుహాద్వార ము
ద్ధత రక్షః పుర సాల మార్గమగు స ♦ త్త్వంబంచు సీతేశుఁ డు
ద్ధృతినుండం గని లక్ష్మణుండు కడు సం ♦ దేహంబుతోఁ గాంచుచున్. ౧౦౮౬

ఉ॥ క్రూర కరాళ భూతమిది ♦ ఘోరకరంబుల కబ్బు జీవులన్
వారి కుదించి నోటఁబడ ♦ వైచెడు నట్టిది దీని చేతులం
దారితి మింకఁ దప్పుకొను ♦ దారి గనంబడదన్న! చేయఁగాఁ
గారియ మేదియున్న దనఁ ♦ గా రఘువర్యుఁడు పల్కెఁ దమ్మతోన్. ౧౦౮౭

చ॥ కుతలము నుద్ధరించు వర ♦ ఘోణిని పోలిన లక్ష్మణా! వెసన్
గతుకఁగఁ జూచె భూతము; జ ♦ గంబున దీనికి నిల్వఁ దానమున్
వెతకిన లేదు దొడ్డ దిది ♦ పృథ్వి సమస్తము చుట్టివచ్చు దీ
ర్ఘతమ కరంబు లొప్పినది ♦ కాఁగల దెయ్యది యింకఁ దమ్ముఁడా!. ౧౦౮౮

తే॥ ధరణిజాతఁ గోల్పోయితిఁ ♦ దండ్రిపోయె, నిందమోచితి బ్రతుకంగ ♦ నేర నేను
దీని నోటను పడియెదఁ ♦ దృప్తితోడ, నీవు తప్పించుకొనిపొమ్ము ♦ నియతచరిత! ౧౦౮౯

ఉ॥ తల్లులు చింతమైఁ దలరఁ ♦ దమ్ములు వంతలనొంద వృద్ధులున్
దల్లడమంద లోకములు ♦ తప్పక దెప్పెడు జీవితంబు నే
నొల్లను సీత రాక్షసుని ♦ యొద్దఁ ద్యజించితి నంచు భూమిభృ
త్తల్లజుఁడైన యాజనక ♦ ధారణినాథు మొగంబుఁ గాంతునే?. ౧౦౯౦

క॥ సీతను కావఁగఁ జాలని, భూతలపతి లక్ష్మణుండు ♦ పొలుపుగఁ గావన్
బ్రీతిం బ్రతికెదు వాఁడన, నాతరమా యసువు నిలుప ♦ నయగుణ వర్యా!. ౧౦౯౧

ఉ॥ బమ్మెర రాముఁడీ కరణిఁ ♦ బల్కఁగఁ దమ్ముఁడు కాంచి యిట్లనున్
నెమ్మిని మీకు దాసుఁడయి ♦ నేఁజనుదెంచిన పిమ్మటం గదా
యిమ్ములు దప్పుచున్నయవి ♦ యే మరణింపక తప్పునేని వ్య
ర్థమ్మగుఁగాక యూడెము కృ ♦ తార్థత నొందునె యెన్నిభంగులన్?. ౧౦౯౨

కబంధుచేఁ జిక్కిన రామునకు లక్ష్మణుఁడు ధైర్యవాక్యములు పలుకుట

ఉ॥ వచ్చిన యాపదన్ గెలుచు ♦ వారలె శూరులు యుద్ధభూమిలోఁ
జచ్చెడు వారిఁ జంపుటలు ♦ సాహసకార్యము కాదు చూడఁగా
నచ్చెగఁ దల్లిదండ్రులకు ♦ నన్నలకున్ సిలుగొందు వేళఁ దాఁ
జచ్చినఁగాదె మున్ను తన ♦ జన్మము సార్థకమౌ ధరాస్థలిన్. ౧౦౯౩

మ॥ తరళాక్షిన్ జనకాత్మజన్ గొని మహో - దారుండు రాముండు డె
ప్పరమౌ కానల నంటఁగా నిదురయున్ - వర్జించి రక్షించె న

ప్పరమోదారుఁడు లక్ష్మణుం డనిసయూ - భవ్యాత్ములే వీఁడు ము
ష్కరుఁ డన్నన్ వదినెన్ త్యజించె ననిప - ల్కన్ సైఁపఁగా నేర్తునే?

మ॥ భవదీయాగ్రజు నాజ్ఞకున్ వశుఁడవై - భద్రంబులం గూర్పనీ
కవు దుఃఖంబుల లెక్కవెట్టకుము నీ - ప్రాణంబులన్ జానకీ
ధవుకై వీడఁగఁ గూడునేని యది మో - దంబారఁ గావింపు మం
చవధానంబుగఁ బల్కు తల్లిపలుకుల్ - వ్యర్థంబు గావింతునే? ౧౦౯౫

మ॥ నను గన్నట్టి సుమిత్ర యేనును భవ ♦ న్మాతన్ నినున్ గొల్చుచో
జనముల్ మెచ్చుచు సంస్తుతింపఁగ మన ♦ స్సంబంధముల్ మార్పులన్
గొన కిట్లెన్ని విధాల కష్టములు మా ♦ కుం గల్గినన్ మీకునై
తృణ కల్పంబుగఁ బ్రాణముల్ విడుతుము ♦ ర్వింగీర్తి సంలబ్ధికై

మ॥ ధర నామ్నాయములున్ సురేశ్వరులు నం ♦ తంబొందినన్ నాశమున్
బొరయంబోవని నీవు, దంతి నిచయం ♦ బుం దిన్చు నీ కానలో
గురువు ల్వాఱెడు భూత మొందు బలముం ♦ గ్రుంగించి హింసింపఁగా
నటుటల్ నమ్మఁగఁబోలునే? విను జనుల్ ♦ హాస్యంబు గావింపరే?

తే॥ సీత విడిపించి కీర్తిని ♦ చెందలేక, బవరముం జేయఁ జాలక ♦ భయము నొంది
ప్రాణములఁ బాసెనని లోకు ♦ లందురేని, దాని కంటె నపఖ్యాతి ♦ ధరణిఁ గలదె?

తే॥ లోకనాయక! యిది లెక్క ♦ లోని దగునె?, మనల లాగు నీచేతులఁ ♦ దునుకలుగను
ఖండనం బొనరించెదఁ ♦ గాంచు మిప్పు, డనుచు ననుజుండు ముందున ♦ కరుగునంత

తే॥ తమ్ము దాఁటి ముందున కేగె ♦ దాశరథియు, నతని వారించి సౌమిత్రి ♦ యరిగెమున్న
అన్యు లెవ్వరు లేరు వా ♦ దాట దీర్ప, ననుచుఁ గనిన సురలు చింత ♦ నందినారు.

చ॥ ఒకమొగ మందు కన్నదుగ ♦ యొప్పున నిర్వురు డాయునంతనే
మెకమెక పాటుతోఁ గినుక ♦ మీఱి కబంధుఁడు యుద్ధ వీర నా
యకులగు మీర లెవ్వరన ♦ నల్కయుఁ జింతయుఁ గల్గి త్రెప్ప వా
ల్పక నిలుచున్న వారిఁ గని ♦ లక్ష్యము చేయర యంచు నాతఁడున్. ౧౧౦౧

ఉ॥ రోష రుహాగ్నిచే నొడలి ♦ రోమము లెల్లను మాఁడుచుండ వి
ద్వేషము పెంచి వాఁడు కసి ♦ దీఱ గ్రసించి మెసంగువాఁడ భూ
రీషణతోడ నంచు గ్రహి ♦ యింపఁగ వాని భుజంబులన్ మహా
భీషణ ఖడ్గ ధారలను ♦ పీఁచ మడంగఁగఁ ద్రుంచి రొక్కటన్. ౧౧౦౨

తే॥ కేలు తెగి యొడలున నిరు ♦ క్రేవలందు, చిట్టుచిట్టున రక్తంబు ♦ చిమ్ముచుండ
పాడవు వెదుళ్ళులు తెగిపడఁ ♦ బొలుపు చెడిన, పర్వతంబుచందమునఁగ ♦ బంధుఁడుండె

## కబంధుఁడు శాప ముక్తుఁడై రాముని వినుతించుట

మ॥ తన హస్తంబును రాముఁ డంటు కతనన్ ♦ దత్పూర్వ శాపంబుతో
ఘన పాపంబులు దీఱిపోవ దనువన్ ♦ గంధర్వ వర్యుండు తొం
టి నిజాకారము దాల్చి పక్షివలె మిం ♦ టిం జేరి శ్రీరామ ల
క్ష్మణులం గాంచి భయంబు భక్తియు మదిన్ ♦ సంధిల్లఁ గేల్మోడ్చుచున్

శా॥ పుణ్యాత్ముండు గడించి యత్యధిక స ♦ మ్మోదంబు డెందంబునన్
గణ్యుం డీతఁ డజామరాధిపులకున్ ♦ గల్పింప విజ్ఞాన నై
పుణ్య ప్రక్రియఁ గానవచ్చెడు తపః ♦ పుణ్య స్వరూపంబు లా
వణ్య వ్యూహ మటంచు భక్తి వినుతిం ♦ పం జొచ్చె నుత్సాహియై.

శా॥ శ్రీకాంతా! బహు పాప సంచయముచేఁ ♦ జింతించుచున్నట్టి నా
యీ కాలుష్యముతోడ శాపమును పో ♦ యె న్నిన్ను గన్నంతనే
లోకేశుండవు ధర్మసాక్షి వికఁ జా ♦ లుం జాలు నీరూపమే
లాకై కొంటివి మమ్ము బోఁటులకు నె ♦ ల్లం దెల్పఁ గానేకదా!. ౧౧౦౬

ఉ॥ మూలములేని నీవు జగ ♦ ముల్ దగవ్రానఁగఁ జేయు వేయు వే
సాల నెఱుంగ నెవ్వనికి ♦ శక్యము? నీదగు లీలలెన్న నేఁ
జాలుదునయ్య! నీవు వట ♦ సాలమొ? పత్త్రిమొ? యందు పండు నం
శీలుఁడవో? ముకుందుఁడవో? శ్రీధుఁడవో? తెలియంగఁ బల్కవే. ౧౧౦౭

ఉ॥ కాంచెడు వాఁడవున్ దెలియు ♦ కాంచనమున్ గను కన్నులుం గనం
గాంచిన శక్తి నీవ యొడి ♦ కంబున దేనిని తాఁకకుండు నీ
వంచనయేల? యీభువన ♦ వర్గము గర్భమునం ధరించి వె
ళ్లించెడు నీవు పూరుషుఁడో? లేమవో? రెండునుగావో? తెల్పవే. ౧౧౦౮

ఉ॥ ఈవ విరించియున్ హరుఁడ ♦ నీవ జగంబులు నీవ వస్తువుల్
నీవ శ్రుతుల్ తదర్థమును ♦ నీవ యనంతుఁడ నీవ సర్వరూ
పావలి కావలన్ వెలుఁగు ♦ నాదిమ తత్త్వమునీవ సర్వము
న్నీవ యటన్న తక్కుఁగల ♦ నిర్జరు లల్క వహింపనేర్తురే?. ౧౧౦౯

చ॥ ఎనిమిది దిక్కులే బిగి వ ♦ హించిన గోడలు గాఁగ లోకముల్
పెనుగదులై రహించు ఘన ♦ వేశ్మమునందున మూఁడు త్రోవలం
బనుపడు చోట నిచ్చ విరి ♦ వాఱని సారస కర్ణికాంతరం
బున వసియించు జ్యోతిమయ ♦ మూర్తివి నిన్నెఱుఁగంగ శక్యమే?

ఉ॥ ఎల్ల యెఱుంగ లేని దెస ♦ లెన్మిది లోపలనున్న భూమిపై
మొల్లముగా దివౌకసులు ♦ మోదము నంద నొనర్చువేల్మలం

దెల్ల హావిస్సు నీవ భుజి ♦ యింతువు దివ్యులకిత్తు రెండు నీ
యుల్ల సితంపు వేడ్కలని ♦ యుల్లమునం గనువార లెవ్వరో?. ౧౧౧౧

ఉ॥ ఓయి సనాతనా! జలధి ♦ యుబ్బుచుఁ దగ్గుచు నుండునట్లు త
త్ప్రాయిక బుద్బుద ప్రకర ♦ భంగి జగంబులు పుట్టి పొల్చుచున్
నీయుదరంబునం దడఁగు ♦ నీదగు లీల లెఱుంగలేము నీ
మాయను దాఁటి నిన్ను గన ♦ మాటలఁకో యది మమ్ము బోంట్లకున్?

ఉ॥ నీదగు లీలలం దెలియ ♦ నిర్జర వర్యులు నేర్చినారలో?
వేదము లట్లు పల్కినవొ? ♦ విస్ఫుగ మేమెఱుఁగంగలేము బ్ర
హ్మాదులు వొందఁగా నరిది ♦ యైన మహోదయ మొందినాఁడ నా
మాదిరి భాగ్యమెవ్వరు స ♦ మంచిత రీతి భజింప రెయ్యెడన్. ౧౧౧౩

చ॥ సిలుగుల కాలవాలముగఁ ♦ జిక్కిన జన్మ పరంపరల్ తెగం
దొలఁచితి దుష్టదేహమును ♦ దోర్చితి సుందర దేహమిచ్చి బు
ద్ధి లవము గూర్చి మోద జల ♦ ధిన్ మునిఁగించితి మోహ దుఃఖముల్
తొలఁగిన వెట్టి సత్కృతులు ♦ తూకొని చేసితి నిట్టి సిద్ధికై ?. ౧౧౧౪

ఉ॥ అంతయు నీ యపార కరు ♦ ణాకర తత్త్వముఁ గాంచి పొందితిం
జింతలు దక్కినాఁడ నని ♦ చింతన సేయుచు వీరి పుట్టువుల్
సుంత వచించినన్ సుమన ♦ సుల్ తలపోసిన వెంట కెగ్గు యో
చింతుఁ గదా యటంచుఁ బసి ♦ చెంగటి లేఁగ విధాన నిల్వఁగన్. ౧౧౧౫

ఉ॥ శ్రీరఘురామచంద్రముఁడు ♦ చిత్తము రంజిలఁగాంచి లక్ష్మణా!
తా రజనీచరత్వమును ♦ తక్కిమహోజ్జ్వల దేహమంది పెం
పారఁగ నిల్చినాఁడితని ♦ నారసితే యన లక్ష్మణాఖ్యుఁడున్
గారవ మారఁ గాంచి యడు ♦ గన్ దను విట్లని పల్కె వారికిన్. ౧౧౧౬

కబంధుఁడు కర్తవ్యము తెలుపుట

సీ॥ దనువను పేరిగం ♦ ధర్వుండ వర తపో, బలమునఁ గామ రూ ♦ పంబు వడసి
యొక్క రక్కసిరూపు ♦ నొంది వేడుకస్థూల, కేశుఁడన్ మునిఁజేరి ♦ కేరినంత
నాతఁడీ రూపె నీ ♦ కగుఁగాక యన వేఁడి, శాపమోక్షము తీరు ♦ చక్కనెఱిగి
యింద్రునితోఁ బోరి ♦ యిట్టిరూపము గొంటి, మీహాస్త్రములు దాఁక ♦ మేలుగంటి

తే॥ లోకరక్షణ వినుత సు ♦ శ్లోకులీరు, మిమ్ము పొడగంటి సుఖముల ♦ మీఱుచుంటిఁ
దంద్రులకుఁదంద్రులగుమిమ్ము ♦ ధాత్రిఁగాచు, నారుసోకైన నాకూర్చు ♦ పల్కువినుఁడు

తే॥ తరణిలేని వారికి సము ♦ ద్రంబు దాఁట, నరిదియగు పగిదిని సీత ♦ నరయు కొఱకుఁ
దోడు లేనట్టి మీకు శ ♦ త్రువుల గెలువ, దుష్కరం బగుఁ గావునఁ ♦ దోడుగొనుఁడు.

ఉ॥ లోపము లేని మీస్థితిని ♦ లోఁకువ యంచు వచింపఁ జాల మీ
చాప శరంబులే గెలువఁ ♦ జాలు జగత్త్రియు, మైన లోక సం
తాపము గూర్చు వేళ నగ-ధన్వి వెసం బ్రమథాళిఁ గూడియే
యేపు వహించుఁ గాదె యటు ♦ లే యిపు డీరును కొండు బాసటన్.

చ॥ కుజనుల మైత్రి గొన్నఁ దమ ♦ కుం గడగండ్లు లభించు టబ్రమే?
సుజనుల గూడువారలకు ♦ శోభనముల్ పురణించుచుండు స
క్కజముగ జీవరాసులను ♦ గాదిలి తల్లి నిపోలెఁ గాంచు చా
రజమున మిమ్ము గాంచు రహి ♦ రాజిలు నాశబరిం గనుండొగిన్. ౧౧౨౦

ఉ॥ ఆవల సూర్యపుత్త్రుఁడు మ ♦ హాగుణశాలి కపీంద్రుఁడైన సు
గ్రీవుని ఋశ్యమూకమున ♦ క్షీరజలంబులఁ బోలెఁ గూడి మీ
దేవిని గాంచు యత్నమును ♦ తేర్చుట మేలని పల్కి మ్రొక్కి సు
శ్రీ విలసిల్ల పీడుకొని ♦ చెచ్చెర నేగె వియత్పథంబునన్. ౧౧౨౦

తే॥ దనువు పల్కిన మార్గానఁ ♦ జనుచు వారు, శైలకాననముల దాఁటి ♦ సంజవేళ
రెండు మాతంగములు చేరు ♦ క్రియ మతంగ, మౌని యాశ్రమస్థలికి స ♦ మ్మతిని చనిరి.

౧౧ శబరీ మోక్షణ పటలము (౯)

ఉ॥ కోరిన వారి కోరికలఁ ♦ గొంచక యిచ్చెడు కల్పశాఖులన్
తీరున నందఱుం గొనఁగఁ ♦ దియ్యని పండ్లను తావి పూవులన్
మీఱి యొసంగు నాశ్రమము ♦ మేదిని వారల స్వర్గ భూమియన్
పేరున ధర్మయుక్తులకు ♦ సమ్మద మోక్షమనంగ నొప్పఁగన్. ౧౧౨౩

చ॥ కని ముదమంది రాఘవుఁడు ♦ కల్గు పథిశ్రమమెల్లఁ ద్రోచి నె
మ్మనమునఁ దన్ను తాఁ దలఁచి ♦ మాన్యతపం బొనరించుచున్న వృ
ద్ధను శబరిన్ సమంచిత ము ♦ దంబునఁ గాంచి మహాత్మురాల! యో
జనని! యనామయంబె? యన ♦ సంభ్రమ హర్షము లుల్లసిల్లఁగన్. ౧౧౨౪

ఉ॥ రామ! రమాభిరామ! జయ ♦ రామ! శుభావహనామ! సద్గుణ
స్తోమ! యవిద్య మాసె మన ♦ సుం దపసుం బరిపక్వమందె నా
కామము కృతార్థమయ్యెను కృ ♦ పామయ! నీవిట కేగుదేరఁగా
నీముఖ పంకజంబు గని ♦ నేఁ దనువందు ఫలంబు గాంచితిన్. ౧౧౨౫

ఉ॥ ఆఁకలి గొంటివయ్య నడ ♦ యాడి శ్రమంబు వహించితయ్య నే
నీకొని నీకుగా ఫలము ♦ లేఱిచి యుంచితి నానుమయ్య నీ
యాఁకలి దీఱ లోకములు ♦ హర్షము నందవె యంచు మున్నుగా
మేకొని పండ్లు ద్రుంచి చవి ♦ మిక్కిలు వాని నొసంగె బ్రాఁతిమై. ౧౨౬

ఉ॥ ఆతఁడు ప్రేమమైఁ గొని ఫ ♦ లావళి నానుచునుండ నింద్రుఁడుఁన్
ధాతయు శంభుఁడున్ సురలు ♦ తత్పరులై చనుదెంచి నీదు వి
ఖ్యాత తపంబు సత్ఫలము ♦ నందెడు వేళ సమీపమయ్యె నీ
తా తరుణీపతిం దనిపి ♦ తక్కక మాయెడఁ జేరుమా యనన్. ౧౨౭

ఉ॥ నీవిట కేగుదెంతువని ♦ నిర్మల భక్తిని యున్నినాళ్లుగా
భావమునందు నిన్నె బహు ♦ భంగుల సంస్తుతి సేయుచుంటిఁ బ్రా
ణావలి నిల్పియుంటి ఫల ♦ మందెను పుణ్యచయంబు తండ్రి! నేఁ
డీవిహీనన్న, వారు జన ♦ యిత్రి! శుభంబుల నొందుమా వెసన్. ౧౨౮

ఉ॥ నీవలనన్ శ్రమంబులను ♦ నీఁగితి మమ్మరో! దుఃఖ సంతతుల్
ద్రోవఁగఁ గంటి మిందు తలి ♦ తోఁపఁగఁ బుత్త్రిలకున్న యెల్లకే
శావిల పంకముల్ తొలఁగ ♦ నా? యని యచ్చట నిల్చిరానిసిన్
వేసిన ఋశ్యమూక పద ♦ విం దగఁ జూపె నిషాది ప్రీతిమై. ౧౨౯

ఉ॥ మోక్షము చేరఁదగ్గ పథ ♦ ముల్ వివరించెదు జ్ఞానికై వడిన్
శిక్షితరీతి నాశబరి ♦ చెప్పిన పల్కులు శాస్త్రరీతులన్
సుక్షములై నవారు విని ♦ సూటిగ జ్ఞాన సుధం గ్రహించి ప్ర
త్యక్షిత తత్త్వులై యలరు ♦ నందమునన్ విని రా రఘుప్రభుల్ ౧౩౦

తే॥ శబరి యవ్వేళఁ దన యోగ ♦ శక్తివలన, శాశ్వతంబగు ముక్తిక ♦ శాశ్వతంపు
తనువు విడువఁగఁ గని చోద్య ♦ మనుభవించి, యామె తెలిపిన త్రోవనే ♦ యరిగినారు.

తే॥ వనులు కొండలు నదులును ♦ వెనుకఁ బడఁగ, నడచు జనులెల్లఁ జేయు స్నా ♦ నంబుకతనఁ
బాపమను నగ్ని చల్లాఱి ♦ పాడి కరఁగి, పరవి నట్లున్న పంపను ♦ తటిసినారు. ౧౩౨

అరణ్యకాండము సంపూర్ణము.

శ్రీ రామచంద్రార్పణమస్తు.

ఓమ్ తత్ సత్.

శ్రీరామ.

# కంబ రామాయణము. ❀ కిష్కింధా కాండము.

## ౧ పంపా పటలము. (౪౨)

మ॥ సృజన ధ్యేయ విధానమై శుభదమై ♦ సుజ్ఞేయమై మూలతో
యజమై వ్యక్త గుణాత్మకంబునయి జ్ఞా ♦ నానంద తత్త్వంబునై
త్రిజగత్కారణమై చరాచర సుహృ ♦ త్స్థితస్థ హంసంబునై
యజముఖ్యార్థిత జన్మమై వెలయు బ్ర ♦ హ్మంబంద్రు సీతావిభున్. ౧

మ॥ మకరందంబులఁ జిందు తామరలచే ♦ మాన్యంబయై మత్తదం
తి కదంబంబులు స్నానమాడఁదగి, నీ ♦ తిం బోతె లోఁతై, సితో
దక పూర్ణంబయి వార్ధినా, మెఱుపు ల ♦ బ్దంబుల్ పురాణింప ద్యో
తకమౌ నంబరమట్లు, పంప వెలసెన్ ♦ దద్జ్ఞుల్ ప్రశంసింపఁగన్ ౨

చ॥ మలిచిన నిద్దపుం బటిక ♦ మాడికి నొప్పెడు స్వచ్ఛ పుష్కరం
బులు తెర లుప్పతిల్లఁ బోలు ♦ పుం గొను వన్నెల తాల మెట్లకుం
దలకొని పెక్కు రంగులను ♦ తాల్చి, బహుశ్రుతుఁడయ్యుఁ దత్త్వముం
దెలియని యజ్ఞు మానసము ♦ తీరునఁ గానఁగవచ్చె నయ్యెడన్. ౩

ఉ॥ ముత్తెపుఁ గుప్ప లెల్లెడలఁ ♦ బోల్చు తటాకము విద్రుమప్రభో
ద్వృత్తతిఁ బోలు పాదరుచి ♦ యందిన హంసము హంసఘూఁకతోఁ
జిత్తము రంజిలం దిరుగు ♦ చెన్ను రహించెను ఋక్షసంతతుల్
మొత్తము చుట్టి రా నడుమఁ ♦ బూర్ణ శశాంకుఁడు క్రాలు మిన్ను నాన్. ౪

చ॥ అసమ తపస్వి గాధిసుతుఁ ♦ డబ్ధి పరీత మహీతలంబు జీ
వ సమితి వేద పారగుల ♦ బ్రహ్మకు మాఱుగ సృష్టిసేయఁగా
నసమునఁ బూను కాలమున ♦ సంబుధి మాఱుగ శుద్ధ తోయధిన్
వెస సృజియించె నొక్కొ యనఁ ♦ బెంపయి యొప్పెఁ దటాక మయ్యెడన్.

చ॥ రవి నెదిరించు తేజమునఁ ♦ గ్రాలు ఫణామణు లొప్ప పన్నగుల్
తవిలి వసించు లోకమిది ♦ తక్కక చూడుఁడి యంచుఁ జూపు లోఁ
తు వఱలి యుండియున్ వెలసె ♦ దోష నిహీంప విభాసి సత్కవి
ప్రవరుని కావ్య భావ రస ♦ పద్ధతిఁ బ్రస్ఫుటమై ప్రమేయమై. ౬

చ॥ జలవిహగంబులందు ♦ పలు ♦ చందములన్ విహరించు చీవలా
వలకును పాఱు చస్ఫుట ర ♦ వంబులు సేయుచునుంట పెక్కు భా
షలు గల పెక్కు దేశముల ♦ జానపదావళి యొక్క పట్టన
స్థలి నౌక వీథిలోఁ దిరుగు ♦ చాడ్పు వహించె వినోద పద్ధతిన్. ౭

చ॥ సరసున రక్త తామరస ♦ షండమునన్ వసియించు హంస లా
సరసిజవాసినిన్ ధరణి ♦ జాతను గూర్చి వచింపలేమి ను
చ్చిరుచును రాము నెమ్మొగము ♦ చేరికఁ జూడఁగలేక ఖిన్నతం
బొరయుచు వహ్నిలోఁ బడెడు ♦ వైనమునం గనుపట్టె నయ్యెడన్. ౮

చ॥ ఎఱుకువ నిర్మలంబయిన ♦ యేపున నుండియు నప్పు డప్పు డు
స్తరమగు మాయ గప్పఁగ ని ♦ జస్థితి గానక పోవు రీతిఁ బు
ష్కరిణిని గల్గు ముత్తెములు ♦ గట్టు నశిల్చి పరీక్ష సేయఁగా
మఱుఁగగుచుండు నందు జల ♦ మధ్యమునం గల నాచు మొక్కలన్. ౯

ఉ॥ మోదములేని రామ జన ♦ ముఖ్యుఁడు చూచినచో సతీత్వమున్
సాదుగుణంబు రూపమగు ♦ జానకి కన్నుల చుట్టలంచుఁ బెం
పేదఁ దలంచి బాష్పజల ♦ మీఁడని కన్నుల నీరు గార్చి వి
చ్ఛేద మనస్కుఁడై ననుచుఁ ♦ జింతిలి లోన నడంగ వాలుగల్. ౧౦

చ॥ వెదురుల నుండి పంక మద ♦ విశ్రుత వారణ మస్తకంబులన్
జెదరిన ముత్తెముల్ మఱియుఁ ♦ జెన్నగు పెక్కు వినూత్న రత్నముల్
మెదలుచు మీఁద రాజిలఁగ ♦ మించుచు వచ్చెడు వాఁగు వెల్లువల్
మదవతు లుల్లసిల్లి చనః ♦ మాడ్కిఁ గనంబడుచుండు నయ్యెడన్. ౧౧

చ॥ మదకరు లుల్లసిల్లి జల ♦ మధ్యముచేరి కలంపఁ బుష్కరా
స్పదము భుజంగ పుంగవులః ♦ నల్పిన దర్పక సంగరంబుచే
నదవదయై శ్రమం బతిశ ♦ యంబుగ నొందిన వారకాంత యొ
ప్పిదమున నుండె; స్వార్థపర ♦ వీరుల కార్యము లిట్టివే కదా?. ౧౨

చ॥ కొదరుచు నింగి రాయు పెను ♦ గొండలనుండి స్రవించు తేనెయున్
మద గజ ధారలున్ గుసుమ ♦ మంజరులన్ భ్రమరంబు లూడ్చు పె
ల్లిదపు మధుద్రవంబు నట ♦ లీనముగా జలపాయు లెల్ల రు
న్మదితులై యాట నయ్యదొక ♦ మానిని యోష్ఠనమం బనం దగెన్. ౧౩

ఉ॥ బాసలయందు బంధురత ♦ భాసిలు లక్షణ లక్ష్యజాలమున్
వీస మెఱుంగకుండు పెను ♦ వేఱిఁడు లొక్కటఁ గూడి వేడ్కమైఁ

గానటబీసటం బలుకు ♦ కై వడి నన్వయ బంధ శూన్య ని
ష్కాసిత వాగ్వినోదములఁ ♦ గ్రాలు విహంగచయంబు లయ్యెడిన్. ౧౪

ఉ॥ ప్రాణసమంబుగాఁ దలఁచి ♦ వాలిని కౌఁగిలి గాంచు హంసికల్
ప్రాణములన్ గళేబరము ♦ పాసిన కై వడిఁ బాయు హంస గీ
ర్వాణ పదంబునుండి యల ♦ రన్ మునుఁగం జను వేల్పుబోట్ల శిం
జాన మృదుస్వనంబు తన ♦ జాయ యెలుంగని సంభ్రమించెడున్. ౧౫

చ॥ పెను గిరులందు నుండి బహు ♦ వేగముగాఁ బ్రవహించుచుండు వా
హినులు సుగంధ వృక్షముల ♦ నీడిచి తేచుచుఁ దెచ్చి నింపఁ బ
త్తన జను లిమ్ముమై నొరసి ♦ దండిగఁ బాత్రను నించు గందమ
స్సనువున నొప్పు వర్షబుతు ♦ వందలి యయ్యమృతాలయాంబువుల్. ౧౬

ఉ॥ సాంకవగంధి మోవికిని ♦ సాటి వహించెడు హల్లకంబులం
బొంకముగా స్రవించు మధు ♦ వుం దగఁ గ్రోలి మదించు నక్రముల్;
సంకెలలం బలెన్ సొరిది ♦ జన్మ మృతుల్ వహియించు లీల ను
ల్లంకు లొక ల్లొకల్లుగ మి ♦ లం గొన మున్గుచుఁ దేలుచుండెడున్. ౧౭

ఉ॥ ఇంచుగ రామభద్రునకు ♦ నిందిర జానకిఁ దెచ్చి యిచ్చు నే
ర్పంచిత శక్తి లేమిఁ దమ ♦ కైన తెఱంగున మేలు గూర్ప యో
చించి మరాళముల్ నడకఁ ♦ జెంగలువల్ కనులన్ బ్రవాళముల్
కాంచనదేహ యోష్ఠమును ♦ కానఁగఁ జేయుచు నుండె నత్తఱిన్. ౧౮

చ॥ తొడవులకాంతి దిక్కులను ♦ దూఁటఁగ నిత్యముఁ దానమాడ నం
దడిఁ జనుదెంచు నిర్జర మ ♦ దావళ యానలు చేతి హంసలన్
గడఁగుచు నందియాయఁ జెలి ♦ కత్తెలు త తట మందు నిల్చు కై
వడిని సర స్తటస్థ సుమ ♦ వల్లులు హంసలతోడ నొప్పెడున్. ౧౯

ఉ॥ మేటి తటాక నీరమున ♦ మీఱు బక ప్రతిబింబ దృశ్యముల్
స్ఫాటిక కాంతులం గులుకు ♦ స్వచ్ఛ జలంబుల నుండు మత్స్యముల్
పాటిలఁ గాంచి భీతిలుచుఁ ♦ బాఱుచు దాఁగ బకోట ఝాటముల్
నీటుగఁ జెట్లకొమ్మలను ♦ నిల్చి విదుల్చుచునుండు తెక్కలన్. ౨౦

ఉ॥ తీరమునం దొకొక్కెడను ♦ దీరిచి చెక్కిన యట్టులున్న జం
భారి వినీల రత్న రుచి ♦ యంతటఁ బర్వ నొకొక్క ప్రక్కఁ బెం
పారిన పద్మరాగముల ♦ యంచిత కాంతులు పర్వ, జక్కవల్
నేరక రేవగల్లు తరు ♦ ణీ కుచ యుగ్మముఁ బోలు నిచ్చలున్. ౨౧

ఉ॥ వాలముఁ బోలు మీలు కర - వాలము ద్రిప్పిన రీతి నాడఁగా
వాలు తరంగ మధ్యముల - వారి శకునీ తతి గజ్జెగట్టి యు
ల్లీల నటించు గారడి వ - లె న్నటనంబు బెడంగు సేయ భే
కాలప మద్దిగాంచి యహా - హా! భళిరా! యను పోల్కిఁ గ్రాలెడిన్. ౨౨

శ్రీరాముఁడు జలపక్షుల తిరుగని సీతం దలంచికొని చింతిలుట.

ఉ॥ సుందరమై మనోజ్ఞగతి - శోభిలుచుండు సరోవరంబు రా
మేందుఁడు డాసి యందుగల - యింబగు హంసలఁ దమ్మిపూల నిం
దిందిర వారముం గని వి - దేహ తనూభవ యొద్దలేమి నా
నందము రోయు బుద్ధియును - నాశిల మిక్కిలి చింతనొందుచున్. ౨౩

సీ॥ కవ వీడకుండు జక్కవలార! యందంపు, టంస మెత్తిన మేటి - హంసలార!
ఎడఁబాయ నొల్లని - యిల్లాలు చెఱవోయెఁ, జిక్కి సోలుచునుంటిఁ - జింత మునిఁగి
ఇయ్యెడనైన మీ - రెదుట నిల్వరదేల? యెడయిక వంత న - న్నేఁచు చుండఁ
గరుణించి నిల్చిపఁ - గొఱయూనె మీకీర్తి?, మిముగాంచి యూఱట - మెలయరాదె?
తే॥ ఎన్నఁడు వియోగ బాధల - నెఱయకుండు, నాకు మది సుంతనెమ్మది - సోఁకునట్లు
చెవుల కింపగు పల్కొండు - దవ్వులఁ బలుకఁ, గీడు మూడునే? యాడిక - కిట్టునేమి?

చ॥ వికచ జలేజముల్ సురభి - వీచెడు కైరవముల్ చెలంగ జా
నకి నెడఁబాసి కుందెడు మ - నంబున కౌషధమా తటాకమా!
సకియ మొగంబుఁ గన్నులును - చక్కగఁ జూపెదు నీవు పూర్తిమై
సుకముగఁ జూపు; మేల్సరఁ - జూడని లోభులు కీర్తిఁ గాంతురే?. ౨౪

చ॥ కమలినిఁ బద్మకోకనద - కైరవ హల్లక వల్లులన్ దరం
గములను శైవలంబులను - గందు మిలం గని, యోసరంబ! నా
రమణిని పట్టి వ్యోమమున - రావణ హంసకుఁ డాహరించుచో
భ్రమయఁగ నంగముల్ చెదరి - పడ్డవె? యంచదుగున్ భ్రమంబునన్. ౨౫

చ॥ ఉదుటున నాడుచున్ ముదము - నొందుచు నిక్కెడు కేకి! నామన
స్సదనకు నాఁడె యోడితి వ - సంబున నిప్పుడు తృప్తిపొందితే?
సుదతిని గాంచలేక యిటు - స్రుక్కెడు నాపయి జాలి గల్గదో?
కొదుకక చెప్పవేమి వెయి - గొప్ప కనుల్గల నీవు కానవో?. ౨౬

చ॥ అలుకక రండు మీ యెఱుఁగు - నర్థము దెల్పుఁడు హంసులార! నా
వలన దొసంగు లేదు మద - వారణ యానఁదగు మిమ్ము గెల్చె నా
కలికి పయిం బగం గొలుపఁ - గాఁ దగుఁ గాని నమానదృష్టితో
నలువురఁ గాంచి సంతసిలు - నాయెడ మీరలు కోపగింతురే?. ౨౭

దేవిని గాంచి వచ్చుట కు - దీర్ఘ బలంబు జవంబు లేదు నే
నేవిధిఁ బోవనేర్తు నని - యిమ్మగ నంగదుఁ గాంచి యిట్లనున్. ౯౫౧

ఉ॥ రాజవు నీవు కానఁ జన - రాదిఁక నెవ్వరి వేఁడువారమీ
యోజఁ దలంచుచుండుటయు - నొప్పదు తొల్త దినేశసూతికిన్
రాజిత కీర్తిశాలి యగు - రాముని చెల్మి ఘటించి యున్న యు
త్తేజిత మూర్తి యుండఁ దెక - తేరకుఁ జింత వహింపనేటికిన్? ౯౫౨

ఉ॥ నెయ్యము గూర్చినాఁడు రఘు - నేతృ పదంబులఁ గొల్చినాఁడు తాఁ
దియ్యము మీఱ నంగరముఁ - దెచ్చినవాఁడు యశంబు గూర్చు వాఁ
డెయ్యెడనేని హెచ్చరిక - నేఁడెఱఁ గార్యమొనర్చువాఁడు జో
డియ్యల లేనివాఁడు కలఁ - డియ్యెడ మారుతి చింతయేటికిన్? ౯౫౩

సీ॥ పవననందన! నీవు- పరమేష్ఠి పొందని, చిర జీవితమ్మును - చెందియుంటి
సకల శాస్త్రంబులు - శ్రద్ధమైఁ బఠియించి, యంచితార్థమ్ము గ్ర - హించియుంటి
వివరింప వలసిన - విషయమ్ము లనువొందఁ, దెలుపు వక్తృత్వానఁ - దేటియుంటి
కర్తవ్యములఁ బూర్తి - గావించు సుస్థిర, సంకల్పుఁ డంచుఁ బ్ర - శస్తిగంటి

తే॥ జముఁడు శంకించునంతటి - శక్తిగంటి, బుద్ధి నపర విధాత యన్ - పొలుపుగంటి
రణమునందు రుద్రుఁడె యను - గణుతిగంటి, మేమెఱుంగమె నిన్ను స-మీరతనయ!

చ॥ అనిలమునందుగాని మఱి - యంబువులందునఁగాని యుగ్రపా
వనలమునందుగాని మృతి - నందవు దివ్యశరాళు లేవియున్
జెనకి వధింపఁజాలవు వి - శిష్ట గుణుండవు నీకు నీవ కా
కెవ మఱి లేరు దాఁట రహి - యించిన నండము దాఁటఁజాలెదున్. ౯౫౫

చ॥ సులువుగ మంచి చెడ్డలను - శోధన చేసి వచింపనేర్తు వి
య్యల ననహాయ శూరుఁడవు - నేఁడెఱ శత్రుల గెల్వనేర్తు వ
గ్గలికను లంకకేగి మఱి - క్రమ్మఱనేర్తు దురంబునందు దో
ర్బలము నశింపకుండెడు స్వ - భావము గల్గినవాఁడ వయ్యరే!. ౯౫౬

ఉ॥ మేరువుకంటె దొడ్డదగు - మేను ధరింతువు కార్య మేర్పడన్
వారిధరంబునుండి పడు - వర్షకణంబులలోనఁ బిన్న యా
కారము నూని తూఱుదువు - గ్రక్కున లీలగ నెత్తనేర్తు నీ
ధారిణి నర్వమును గదిసి - తాఁకఁగ నోపుదు చిన్ని చేతులన్. ౯౫౭

మ॥ మఱియుం బెక్కు వరంబులందియును సం - భావింతు శీలంబ యే
ర్పడ బాగోగు లెఱింగి యేర్పఱతు వృ - థ్వీపాల ధర్మంబులన్

హరిచే నేర్చి దినేంద్రవంశజునిచే - సద్వాలిఁ జంపింపవే
పురుహూతాశని బాల్య రోషమొకఁడేఁ - బోఁగొట్ట మున్నోపెనే? ౯౫౮

మ॥ రణరంగమ్మునఁ దాఁకునేనియు జగ - ద్ద్రావితమ్ము లొక్కుమ్మడిన్
తృణకల్పమ్ముగఁ జూచువాఁడ వౌరు లూ - హింపంగరానట్టి భీ
షణ నిస్తుల్య బలుండ వర్కుని రథ - స్ఫారోగ్ర వేగంబుతోఁ
గణఁకం బోవుచు నేర్చినాఁడవు కదా - గాంక్షించి సద్విద్యలన్ ౯౫౯

ఉ॥ నీతిపథంబునన్ దిటగ - నిల్చినవాఁడవు సత్యశీలివిన్
నాతిసుఖంబు చిత్తమున - నాటని ధీర జితేంద్రియుండవున్
ఖ్యాతిగ వేదముల్ చదివి - యందలి మర్మ మెఱింగినాఁడవున్
ధాతవు కాఁగలాఁడవని - ధారణిఁ బేరు వహించినాఁడవున్. ౯౬౦

శా॥ సీతాన్వేషణ కీవ యర్హుఁడని రా ♦ జీవాక్షు సుగ్రీవులే
ప్రీతిం బ్రేరణసేయ మేలనుచు నా - రీకారము దెల్పుటల్
చేతంబందున నుంచినాఁడ నది నీ - చేఁ దీరు నిక్కంబు నీ
చేతల్ ధాత్రిని సుస్థిరంబు లయి భా - సిల్లున్ మరున్నందనా! ౯౬౧

ఉ॥ కాలముకానిచో నణఁగి ♦ కాలము పుచ్చఁగ నేర్తువయ్యా! పే
రాలము కూరెనేని కడు - నాగ్రహ మందిన సింగముంబలెన్
వాలుదు వెల్ల కార్యములఁ - బట్టి సమగ్రముగా నొనర్తు వి
ఘ్నాలి నెదిర్చి త్రోచుచు మ - హాఫలసిద్ధిని గాంచు టబ్రమే? ౯౬౨

మ॥ అమరేంద్రాదులకైన నాదరణమై - యాదర్శమై యొప్పు శీ
లముచే సుక్షమచేతఁ గామిత విధుల్ - సాధించు ధీశక్తిచే
విమలాత్మీయక! నీకుఁ గానిపనులీ - పృథ్విస్థలిం గల్గునే?
యమరం దెల్పఁగఁదగ్గ దొండుగలదే - యర్థంబు? వాతాత్మజా! ౯౬౩

శా॥ నీవే వారిధి దాఁటి మైథిలిని స - న్నీతిం బరీక్షించి దే
వీ వృత్తాంతము దెల్పఁగాఁగల మహా - వీరుండవై యుంటి మా
జీవంబుల్ భవదీయ హస్తగతమై - చెల్వారు మాకింక నే
త్రోవం జూపెదొ యంచు విశ్వసృజు పు - త్త్రుం డర్థి వాక్రువ్వఁగన్. ౯౬౪

తే॥ అవనత ముఖాబ్జమం దొక్క-యంబుజంబు, మొలచు పోలికనవ్వి కేల్మొగిచి హనుమ
వానరావలి యుల్లముల్ - పల్లవింప, దెలిపె నీరీతిఁ దనమది - తేటపడఁగ. ౯౬౫

మ॥ త్రుటిలో సప్త సముద్రముల్ కడచి యు - ద్యోగించి లోకంబులన్
జటుల స్థితినడంచి గెల్చు చతురుల్ - చర్చింప మీరిట్లు వి

ప్లుతల శ్రావణుల నాజ్ఞ యిచ్చుటలు మ - త్పూర్వార్జితంబైన యు
ప్లుతి భాగ్యంబుగ సెంచెదర్ దృఢమతిన్ - భావింప నల్పజ్ఞులన్. ౯౬౬

శా॥ లంకాపట్టణ మద్దులోఁ బెటికి లే - లందెత్తునా? కొత్త్యులన్
బింకంబుల్ చెడఁగూల్చి రాఘవుని దే - విం దెత్తునా? వాలుతో
లంకాధీశుని గట్టి యీడ్చికొని పో - లన్ వత్తునా? యేది మీ
పొంకంబైన మనోరథంబు వడిఁ జె - ల్పుం డిప్డె కావించెదన్. ౯౬౭

శా॥ వెన్నుం జేపున నొక్క పాదమునఁ బృ - థ్విం గొల్చు చందంబునన్
గ్రన్నం గొల్చెద నీసముద్రమును ర - క్షశ్శ్రేణికిం దోడుగా
నెన్నన్ వేల్పులు వచ్చినన్ నలఁచి మీ - యిష్టంబు గావింతు ని
ష్ఖిన్నత్వంబున నుండుఁడీ సమద సం - శ్లిష్టాత్ములై వానరుల్! ౯౬౮

శా॥ భూభాగంబును ముంచఁగాఁ దొడరి యం - భోధుల్ విజృంభించినన్
భూభాగంబె పటాలునం బగిలి పై - వ్యోమంబుతోఁ గూడినన్
శ్రీభూనాయకు నాజ్ఞ పక్షములుగాఁ - జెన్నార సేవాబల
శ్రీభాసిల్లఁ దరింతుఁ దార్క్ష్యనిక్రియన్ - గ్రీడావిధిన్ వారిధిన్. ౯౬౯

మ॥ త్వరగా నుత్తరు విందు క్రమ్మతిలు నం - దాఁకన్ సుఖంబుండుఁడీ
ధరణీపుత్త్రికఁ గాంచి వచ్చెదను వ్య - ర్థప్రక్రియన్ రానటం
చుటిదిన్ మారుతి యెక్కెఁ బచ్చిఖర ము - ద్యోగంబునన్ లేచి వా
నరు లాశీస్సులు సేయ వేల్పులు ప్రసూ - న వ్రాతముల్ నల్లఁగన్. ౯౭౦

మ॥ జలధిం దాఁటఁ గుతూహలుం డయిన యా - సామీరి దైవాఱ స్వ
స్థలముం గొల్వఁగ నెత్తినట్టి హరి పా - దంబట్లు తద్గాత్రమున్
గలయం బెంచెను శ్రీపదుండను సమా - ఖ్యా స్ఫూర్తి సార్థంబుగా
నల శ్రీపాదమె సాటియౌ ననుచు బ్ర - హ్మాదుల్ ప్రశంసింపఁగన్

మ॥ రణ తేజోధిక విక్రమంబు దిశలం ♦ భ్రాజిల్లుచున్న ప్లవా
రణ తేజోధిక విక్రమంబు దిశలన్ ♦ రాజిల్ల నాకాశ చా
రణ తేజోధికుఁ డ న్నమించు మునుపే ♦ రక్షోగణాధీశ రా
వణ తేజోధిక పట్టణంబు వడిఁ బో ♦ వంగన్ సముద్యుక్తుఁడై. ౯౭౧

శా॥ పంచాస్యంబు లనేకపంబులును కం ♦ పం బొందఁ బంచాస్యు నం
శాంచత్పుణ్యుని భారమోర్వక గిరీం ♦ ద్రాగ్రంబు క్రుంగార ని
ష్కుంచద్వాలము మేనఁ జుట్టికొని య ♦ చ్చో నాది కూర్మంబుపై
సంచై నిల్చిన మందరంబుకరణిన్ ♦ సామీరి విభ్రాజిలెన్. ౯౨౩

శా॥ శంపా యుక్త పయోదముల్ చరణ శిం ♦ జా నాదముల్ సేయ వ
ర్ణింపన్ లేక నిలింపు లాతనువు ని ♦ర్ణిద్రాత్ములై కాంచ గో
శంపుం గంబము క్రింది టాయి యన శై ♦ లం బొప్పఁగా నందుపైఁ
జాంపేయాద్రి విధమ్మున న్నిలిచె నా ♦ సామీరి గంభీరుఁడై. ౯౨౪

కిష్కింధా కాండము సంపూర్ణము.

శ్రీ రామచంద్రార్పణ మస్తు.



శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు. 14-7-50. కా. 1000.